# థాయిస్

మూలం:

అనాటోల్ ఫ్రాంస్.

అనువాదం:

రెంటాల గోపాలకృష్ణ.



నవోదయ పబ్లిషర్స్

విజయవాడ-2.



# ఒకటవ భాగము

ఆ రోజుల్లో అనేకమంది యతీశ్వరులు, సన్యాసులు ఎడారిలో నివసిస్తూ వచ్చారు. వీరు నైల్ నదికి ఇరుదరులా ఎన్నో పర్ణకుటీరాలు కట్టుకున్నారు. తమ ఏకాంతానికి భంగం కలుగకుండా కుటీరాలు ఎడ ఎడంగా కట్టుకున్నారు. అయినా అవసరమైనప్పుడు ఒకరి కొకరు తోడు నీడగా ఉంటున్నారు. ఈ పర్ణకుటీరాల నడుమ అక్కడక్కడ క్రైస్తవ దేవాలయాలున్నాయి. ప్రతి గుడికీ పైన-ఎత్తుగా ఒక శిలువ గుర్తు ఉన్నది. ప్రతి పండుగనాడూ పర్వదినాన [illegible] ఈ గుళ్ళ దగ్గర గుమికూడతారు. అంతా కలిసి అర్చనలూ ఆరాధనలూ జరుపుకుంటారు. దైవ ప్రసాదం స్వీకరిస్తారు. ఈ దేవాలయాలే కాక, నదికి ఇరుప్రక్కలా అక్కడక్కడ క్రైస్తవ మఠాలు కూడా ఉన్నాయి. ఈ మఠాల్లో అనేక గుహలు, బిలాలు ఉన్నాయి. ఒక్కొక్క గుహలో ఒక్కొక్క సన్యాసి ఉంటూ దైవచింతతో కాలం గడుపుతున్నాడు.

ఈ సన్యాసులు, తాపసులు మితాహారులు. ప్రొద్దు వాలేవరకూ ఆహారం ముట్టరు. ఆ తరువాత నయినా ఏదో కాస్త రొట్టె—ఉప్పులోనో ఉల్లగడ్డలోనో నంచుకుని తిం

టారు. వీరిలో మరికొంద రున్నారు. వారు కేవలం ఎడారి లోనే ఉండిపోయారు. అక్కడ ఏ గుహాల్లోనో గోరీల్లోనో ఇంకా చిత్రమైన జీవితం గడుపుతున్నారు.

వీరందరూ ఇంద్రియ నిగ్రహం కలవారు. పవిత్రంగా బ్రతుకు సాగిస్తున్నారు. వంటికి ఒక నారచొక్కా, నెత్తికి ఒక కుళ్ళాయి; ఇవే వీరు ధరించే దుస్తులు. కటిక నేలమీద పడు కుంటారు. రాత్రిళ్ళు కూడా కన్నుమూయరు. ప్రార్థనలు చేసుకుంటారు. భజనకీర్తనలు పాడుకుంటారు. చివర కే రాత్రివేళనో ఒక కునుకు తీస్తారు. ఒక్కమాటలో చెప్పాలంటే వీరంతా ఆ పతితపావనుని భజిస్తూ, పశ్చాత్తపిస్తూ, పవిత్ర కార్యాలు కావిస్తూ కాలం వెళ్ళబుచ్చుతున్నారు. దేహాన్ని ఐహికసుఖాలకు దూరంచేశారు. మనస్సును విషయవాంఛల నుంచి మళ్ళించారు. ఈ జాగ్రత్తలు, కట్టుబాట్లు ఈ వయ స్సులో కూడా వీరికి ఎంతో అవసరమైనాయి. తమ వ్యాధులే తమ ఆత్మలను పరిశుద్ధం కావిస్తాయని వీరి నమ్మకం. దేహాన్ని ఎంత బాధపెడితే అంత మంచిది. ఎంత కృశింపచేస్తే అంత పుణ్యం. బాధలూ, వేధలూ దేహానికి దివ్యమైన అలం కారాలు. ఇదీ వీరి భావన. "ఎండిన ఎడారే ఎర్రగులాబీలా పూచి ముదమును చేకూరుస్తుంది!" అన్న ప్రవక్త వచనా లను ఈ విధంగా సఫలత కావిస్తున్నామని వీరు అనుకున్నారు.

థెబాయిడ్ ప్రాంతం ఒక దివ్యస్థలంగా రూపొం దింది. ఇక్కడ ఉండే సన్యాసులు, తాపసులు, పూర్తిగా విరాగులై, విమల మనస్కులై, చిత్తం ఈశ్వరాయత్తం చేసి

కాలం వెళ్లబుచ్చుతున్నారు. మరికొద్ది మంది మాత్రం తాటినారతో తాళ్ళు అల్లుకుంటూనో లేదా ఆ చుట్టు ప్రక్కల రైతులకు పంటల తరుణంలో పనులు చేసి పెడుతూనో జీవయాత్ర సాగిస్తున్నారు. కాని ఒక పుకారు పుట్టింది. ఆరోజుల్లో అరబ్బులు వర్తకులను, బాటసారులను కొల్లగొట్టి పొట్టపోసుకుంటున్నారు. ఈ బైరాగులు కూడా వాళ్ళతో పొత్తుకలిశారన్న అపవాదు ఒకటి పుట్టింది. క్రైస్తవులు కానివారు కొందరు ఈ ప్రచారం చేయసాగారు. నిజానికిది తప్పుడు ప్రచారం. ఈ సన్యాసులు అలాంటి వాళ్లుకాదు. సర్వసంగ పరిత్యాగం చేసిన సత్పురుషులు వీళ్లు. వీళ్లు అలాంటి పాపాలకు ఒడిగట్టరు. వీళ్ళ సద్బుద్ధికి ఆ సర్వేశ్వరుడే సాక్షి.

దేవతలు మారువేషాలు ధరించి ఈ మునుల ఆశ్రమాలు దర్శించడానికి వస్తారు. ఇహ రాక్షసులుకూడా రకరకాల రూపాల్లో ఇక్కడ ప్రత్యక్ష మవుతారు. ఒకమాటు మృగంగాను, మరొకమాటు మనిషిగాను వస్తారు. సన్యాసుల చిత్తస్థైర్యాన్ని చెదరగొట్టి చెడుత్రోవలవైపు మళ్ళించడానికి రకరకాల ప్రయత్నాలు చేస్తారు. ఉదయాన్నే సన్యాసులంతా తమ దండ కమండలాలు చేతబూని నీళ్ళకు బుగ్గ దగ్గరికి వెడతారు. అప్పుడు వీరికి ఇసుకలో రకరకాల అడుగుల జాడలు—రాక్షసులవి, జంతువులవి, చిత్ర విచిత్రంగా అగుపిస్తాయి. నిజంగా ఈ థెబాయిడ్ ప్రాంతం ఉన్నదే, ఇదొక సమరభూమి! ఇక్కడ అహర్నిశలూ ఆధ్యాత్మిక సమ

రం!—ముఖ్యంగా రాత్రివేళ స్వర్గ నరకాల మధ్య భీషణ సంగ్రామం సాగుతుంటుంది.

పాపులు పనిగట్టుకుని వచ్చి ఈ సన్యాసులను వివిధ విధాల వేధిస్తారు. వీళ్ళ జీవితాలను పెడత్రోవల పట్టించ డానికి ప్రయత్నిస్తారు. వీళ్ల మనస్సుకు క్షణం శాంతిలేకుండా చేస్తారు. అయినా ఈ తాపసులు లక్ష్యపెట్టరు. వీళ్ళ తపో బలం గొప్పది. వీళ్లకు ఈశ్వరుడి అండ, దేవతల దయ ఉన్నాయి. ఎవరెన్ని బాధలు పెట్టినా తమ ఉపాసనాబలం వల్ల, తపశ్శక్తివల్ల తమ్ము తాము కాపాడుకుంటూవచ్చారు. అయినప్పటికీ అప్పుడప్పుడు వీరు ఆత్మనిగ్రహం కోల్పో తుంటారు. తీవ్రమైన విషయవాంఛలకు లొంగుతుంటారు. ఆ సమయాల్లో వీరు విపరీతంగా వేదన పొందుతారు. విల విల తన్నుకుని విలపిస్తారు. వీరి మనస్సులు విషయాసక్త మైనాయని గ్రహించి, సరిగ్గా ఆ తరుణంలో రాక్షసులు ప్రత్యక్ష మవుతారు. కామరూపధారులై వస్తారు. చక్కని కన్యలుగా కంటపడతారు. ఈ మోహనాంగులను చూచే సరికి ఇంత నిగ్రహంకల సన్యాసులకు కూడా చిత్తం ఇట్టే చెదరి పోతుంది. తమ గుహలముందు, కుటీరాలముందు ఈ-చూడచక్కని సుందరాంగులు పొడసూపేసరికి వారిలో ఎక్కడలేని కామవికారాలు పుట్టుకొస్తాయి. అయితే ఏం? వారికి ఆ సర్వేశ్వరుడి ఆశ్రయం ఉన్నది. శిలువగుర్తు సర్వ దా వారిని కాపాడుతున్నది. అందుచేత స్త్రీ వ్యామోహంలో పడకుండా ఎప్పటికప్పుడు తప్పించుకో గలుగుతున్నారు.

ఒక్క స్త్రీ వ్యామోహమే కాదు; ఏ దుర్వ్యసనానికీ దాసులు కాకుండా వారిని దైవం వేయికళ్లతో కాపాడుతున్నాడు.

రాక్షసుల మాయ లేవీ వీరిముందు సాగవు. వీరి ప్రభావం ముందు రాక్షసుల మాయలన్నీ గాలికి మబ్బులు చెదిరి పోయినట్లు చెదిరి పోతాయి. మాయ రూపాలుపోయి రాక్షసులకు మళ్ళీ మామూలు రూపాలు వస్తాయి. ఇహ వాళ్లు చేసేదేమీ లేక, తెల తెలవారు తుండగా అక్కడ నుంచి పారిపోతారు. అలా పోతూ పోతూ ఏ సన్యాసి కంట నో పడడం పరిపాటి అయిపోయింది.

"ఎందుకే రాక్షసీ అలా ఏడుస్తున్నావు? ఏమిటా భయం? ఎందుకలా పారిపోతున్నావు?" అని సన్యాసులు అడుగుతారు. అప్పుడా రక్కసి "ఇక్కడ ఎవడో క్రైస్తవ వుడు నన్ను బెత్తాలతో చావగొట్టాడు. అవమానించి వెళ్ల గొట్టాడు. అంచాత ఏడుస్తూ పారిపోతున్నాను." అని సమా ధానం చెబుతుంది.

ఈ ఎడారి ఒక పుణ్యభూమి. పూర్వం ఎందరో పుణ్య పురుషులు ఇక్కడ తపస్సు కావించారు. ఆ తపశ్శక్తి ఇక్కడ అంతటా, నిండిఉన్నది. తాపసులలోను, సన్యాసుల లోను ఆరని అగ్నిహోత్రంలా జ్వలిస్తున్నది. వీరి శక్తికి ఎదురులేదు. వీరు ఏది పలికితే అది శాసనం. ఆ శాసనం అమలు జరిగితీరాల్సిందే; ఇహ దానికి తిరుగులేదు. ఈశ్వ రుడి పట్ల అపచారం చేసినవాణ్ణి ఏమాత్రం దయతలచరు ఈ సన్యాసులు. తక్షణమే కఠిన దండన విధిస్తారు. అలా

తీర్పుఇచ్చే అధికారం వీరికి ఉన్నది. అవును, వీరంతా క్రీస్తు శిష్యులు. వీరు చెప్పిన తీర్పుకు ఇహ ఈ భూమండలంలో పై విచారణ అంటూ లేదు. దాని నెవరు మార్చనూలేరు. అదలా అమలు జరిగితీరవలసిందే.

వీరిని గురించి చిత్రవిచిత్రమైన కథలల్లి చెప్పుకుంటారు జనం. ఆఖరుకు మహానగరాలలో సయితం, అలెగ్జాండ్రియాలోకూడా వీరి మహత్తును గురించి ఎన్నో తమాషా అయిన గాథలు అల్లుకపోయాయి. ఈ తాపసోత్తములలో ఎవరో ఒకాయన కొందరు దుర్మార్గులను శిక్షించాడట. అప్పుడు భూదేవత బ్రద్దలుగా పగిలి ఆదుష్టులను కబళించిందట! ఇలా ఎన్నో కథలు, గాథలు ఉన్నాయి. అంచాత ఈ తాపసుల పేరు చెబితే చాలు; దుష్టులు, పాపులు—అందరూకూడా భయకంపితులవుతారు. ముఖ్యంగా హాస్యగాళ్ళు, వేషగాళ్ళు, మోసగాళ్ళు, పెళ్ళిళ్ళు చేసుకున్న మతబోధకులు, స్త్రీ వ్యామోహంలో చిక్కుకున్న మతగురువులు, పతితలు, పడుపుకత్తెలు; వీరంతా ఈ సన్యాసులకు మరీ హడలిపోతారు.

అంతేకాదు. వీరి తపోబలానికి క్రూరమృగాలు సయితం లొంగిపోయాయి. వీరి చెప్పుచేతుల్లో ఉన్నాయి. ఎవరైనా ఒక సన్యాసికి చావు సమీపించిందనుకోండి. అప్పుడొక సింహం అక్కడికి వస్తుంది. పంజాలతో మట్టిని పెళ్ళగించి సన్యాసిని సమాధిచేయడం కోసం ఒక గుంట తయారు చేసి పెడుతుంది. దానిని పట్టి ఆ బైరాగి భగవంతుడివద్ద

నుంచి తనకు పిలుపు వచ్చిందని తెలుసుకుంటాడు. వెంటనే తన సోదరులందరి దగ్గరికీ వెడతాడు. వారిచెక్కిళ్ళు ముద్దాడి కడసారి సెలవుతీసుకుని వస్తాడు. నిశ్చింతగా ఆ సమాధిలో పడుకుని భగవధ్యానంలో కన్నుమూస్తాడు. ఇలా ఈ సన్యాసు లందరికీ జరుగుతూ ఉంటుంది.

ఇప్పుడు ఆంథోనీ అనే ఒక సన్యాసి ఉన్నాడు. నూరేండ్లు నిండి పండిపోయిన వృద్ధుడాయన. మకరియస్, అమథస్ అనేవారలు ఆయన శిష్యులు. ఇప్పు డాయన తన శిష్యులతోకూడా కాల్జిక్ కొండమీద ఉంటున్నాడు. ఇహ పోతే థెబాయిడ్‌లోకల్లా ప్రసిద్ధికెక్కిన సన్యాసి పఫ్నూటి యస్. ఆయన ఆంటినోయ్ మఠానికి అధిపతి. మఠాధిపతిగా ఉంటూ ఆయన చేసిన మహత్కార్యాలు అన్నీ ఇన్నీ కావు. అంతటి మహనీయుడు థెబాయిడ్‌లో లేడని ప్రతి ఒక్కరూ చెప్పుకుంటారు. మరో ఇరువురు మహాత్ములున్నారు. వారు ఎఫ్రేమ్, సెరపియన్‌లు. వారి శిష్యకోటి చాలా పెద్దది. వారి వ్రతాలు మహోత్కృష్టమైనవి. వారు కావించే ఐహికకర్మలు, దైవకార్యాలు ఎంతో ఘనమైనవి. అయితే ఏం? ఎంతమంది మఠాధిపతులయినా పఫ్నూటియస్‌కు సాటిరారు. ఎవరెన్ని ఘనకార్యాలు కావించినా, ఆయన సద్బుద్ధికీ, సత్ప్రవర్త నకూ సరితూగవు. ఆయనకు ఆయనే సాటి! ఆయన క్రైస్తవ సన్యాసులందరిలోకీ, మఠాధిపతులందరిలోకీ మేటి. ఆయన అన్నకణం ముట్టకుండా కటికి ఉపవాసాలు చేస్తాడు. ఒకరోజు కాదు, రెండురోజులు కాదు; వరసాగ్గా వారం రోజులు!

ముతకనార అంగీ ఒకటి తొడుక్కుంటాడు. రాత్రింబగళ్ళు దేహాన్ని శుష్కింప చేసుకుంటూ అలా కటిక నేలమీద పడి ఉంటాడు.

పఫ్నూటియస్‌కు శిష్యులు ఇరవైనలుగురు. ఆ ఇరవై నలుగురూ ఆయన ఆశ్రమం దగ్గరే తమ ఆశ్రమాలు నిర్మించుకుని అక్కడే ఉంటున్నారు. ఆయన ఏం చెబితే అదే వారు చెబుతారు. ఆయన ఏంచేస్తే అదే వారుచేస్తారు. శిష్యులంటే ఆయనకు పంచప్రాణాలు. వాళ్ళందరిలోనూ ఆయన ఆ ఏసుక్రీస్తును దర్శిస్తాడు. నిరంతరం వాళ్ళకు ఉపదేశాలు చేస్తాడు. క్రీస్తు బోధనలు వినిపిస్తాడు. వాళ్ళ మనస్సులను మంచి కార్యాలవైపు మళ్ళిస్తాడు. ఇదే ఆయన పని. ఆయన శిష్యుల్లో ఎటువంటి వాళ్ళున్నారని! వాళ్ళలో కొందరు దొంగలున్నారు, దోపిడిగాండ్రున్నారు! అవును, ఒకప్పుడు వాళ్ళు దొంగలు, దోపిడిగాండ్రు. అనేక సంవత్సరాలు ఆ పాపపు జీవితంలో మునిగి తేలారు. కాని మఠాధిపతి వాళ్ళకు జ్ఞానోదయం కలిగించాడు. పదేపదే హితబోధ చేసి వాళ్ళను మంచిమార్గాన మళ్ళించాడు. ఆ పాపపంకిలం నుంచి వెలికితీసి ఉద్ధరించాడు. వాళ్ళంతా మతం పుచ్చుకున్నారు. సన్యసించి ఆయనకు శిష్యులయ్యారు. ఇప్పుడు ఉత్తమ జీవితాన్ని గడుపుతున్నారు. మరొక శిష్యుడున్నాడు. అతను పూర్వం అబిస్సీనియాదేశపు రాణిదగ్గర వంటవాడు. తరువాత మఠాధిపతి అతనికి మతం ఇచ్చి తన శిష్యకోటిలో చేర్చుకున్నాడు. పాపం ఇప్పటికీ అతను తను పూర్వంచేసిన పాపాలు తలుచుకొని అనుక్షణం వాపోతుంటాడు. వేరొక

శిష్యు డున్నాడు. అతను పురాణేతిహాసాలన్నీ క్షుణ్ణంగా చదివినవాడు. చక్కగా మాట్లాడ నేర్చినవాడు. కాని పఫ్నూటియస్ శిష్యులలో అందరినీ మించిన వా డొకడు న్నాడు. అతను యువకుడు; కాపువాళ్ళ కుర్రవాడు. అతని పేరు పాల్. కాని ఎవరూ అతన్ని అసలు పేరుతో పిలవరు. అతన్ని వెఱ్ఱివాడికింద కట్టారు. 'వెర్రివాడు, వెర్రివాడు!' అనే అంతా పిలుస్తారు. వాళ్ళు అన్నట్టే పాపమా కుర్రవాడు వట్టితిక్కలవాడిలా కనుపిస్తాడు. కాని అతని హృదయం స్ఫటికంలా స్వచ్ఛమైనది. మనిషి చాలా నిరాడంబరంగా ఉంటాడు. మనుష్యు లెంతమంది అతన్నిచూచి హేళనచేస్తే ఏం? ఆ ఈశ్వరు డతన్ని కరుణించాడు. అతని హృదయంలో ప్రవేశించాడు. పాల్ భవిష్యం తెలిసిన దైవజ్ఞుడు. అతను ఏది పలికితే అది సత్యమై ఊరుకుంటుంది.

పఫ్నూటియస్ తన శిష్యులకు బోధలు కావిస్తూ, సన్యాసాశ్రమంలో నియమాలన్నీ సక్రమంగాపాటిస్తూ కాలం వెళ్ళబుచ్చుతున్నాడు. ఎక్కువకాలం ఈశ్వర ధ్యానంలో గడుపుతున్నాడు. నిరంతరం శ్రుతులు, దైవసూక్తులు మననం చేసుకుంటున్నాడు.

ఆయన ఇంకా లేత వయస్సులోనే ఉన్నాడు. అయినా ఆయనకు మనస్సు కుదిరింది. మంచి పనులు చేస్తున్నాడు. మంచిమార్గాన నడుస్తున్నాడు. సాధారణంగా రాక్షసులు, భూతప్రేత పిశాచాలు మునులను, తాపసులను, సన్యాసులను పట్టి పీడిస్తుంటాయి. నిశ్చలంగా, నిగ్రహంతో

ఉన్నకొద్దీ వాళ్ళను చెడగొట్టాలని చూస్తుంటాయి. కాని భూతకోటి, రాక్షసకోటి పఫ్నూటియస్ దరిచేరలేవు. ఆయన్ను చూచి అల్లంతదూరాన కట్టేసినట్టు ఉండిపోతాయి. ఆయన తపోమహిమ అలాంటిది. రాత్రివేళ ఆయన ఆశ్రమం వెలుపల వెన్నెట్లో ఏడు గుంటనక్కలు కదలక మెదలక కట్టేసినట్లు కూచుంటాయి. ఆఏడూ, ఏడు భూతాలట! ఆరూపంలో వచ్చి ఉన్నాయట ! ఆయన వాటికి ఆనకట్టు కట్టి ఉంటాడు! అంచాతనే అవి గిరిగీసినట్టు వెలుపల ఉండిపోతాయి, కాని ఆశ్రమంలో అడుగు పెట్టలేవు.

పఫ్నూటియస్ అలెగ్జాండ్రియాలో ఒక కులీన కుటుంబంలో జన్మించాడు. బాగా ఉన్నవాళ్ళు కావడంవల్ల తల్లిదండ్రులు ఈ పిల్లవాణ్ణి ఇష్టంవచ్చినట్లు పెంచారు. ఇహనేం? ఇతగాడికి చిన్నప్పుడే అవలక్షణాలన్నీ అంటుకున్నాయి. దైవదూషణ, దుర్నడత; ఇత్యాదులన్నీ అలవడ్డాయి. మీసకట్టు రాకముందే మిడిమేలంగా తిరిగాడు. తనతో చదువుకునే విద్యార్థులతోటి, పాఠాలు చెప్పే పంతుళ్ళతోటీ తప్పుడు వాదనలు చేశాడు. వెర్రి మొర్రి సిద్ధాంతాలు, విడ్డూరమైన పద్ధతులు లేవదీశాడు. జలప్రళయం వచ్చి భూమండలమంతా మునిగిపోతుం దన్నాడు. అసలు దేవు డనేవాడే లేడన్నాడు. ఇలాంటి ధోరణిలో పడి పఫ్నూటియస్ తుదకు చాలా అధ్వాన్నమైన జీవితం గడిపాడు.

పూర్వం తాను గడిపిన జీవితం అప్పుడప్పుడు స్ఫురణకు తెచ్చుకుని వాపోతుంటాడు పఫ్నూటియస్. అది జ్ఞాప

కం వచ్చేసరికి ఆయనకు ఎక్కడలేని భయం ఆవహిస్తుంది. లజ్జ, అవమానం ముంచుకొస్తాయి. మనస్సంతా అల్లకల్లోల మవుతుంది.

"ఆరోజుల్లో నేను తుచ్ఛమైన ఆనందంలో ఈదు లాడాను" అంటాడాయన, వెనుకటి జీవితం జ్ఞాపకం వచ్చి నప్పుడల్లా.

అంటే అర్థం మరేమీకాదు. ఆరోజుల్లో తానూ అందరిలాగే తిని తిరిగాడు. లౌకికమైన జీవితం గడిపాడు. నిజానికి ఇరవై ఏండ్ల వరకూ లోకంలో సామాన్యంగా అందరూ ఎలాంటి బ్రతుకు బ్రతుకుతారో ఆయనా ఆలాంటి బ్రతుకే బ్రతికాడు. అంతకుమిక్కిలి ఆయన చేసిన పాపాలు, ఘోరకృత్యాలు ఏమీలేవు. అయినా ఆజీవితం ఇప్పుడు స్ఫురణకు తెచ్చుకుంటే ఆయనకు వళ్ళు కంపరమెక్కుతుంది. 'అది బ్రతుకుకాదు, చావు!' అంటాడాయన.

తరువాత ఆయన మక్రినస్ అనే మతగురువు బోధ నలు విని పూర్తిగా మారిపోయాడు. అప్పటినుంచి ఆయన కొత్తమనిషి అయినాడు. మళ్ళీజన్మ వచ్చినట్లయింది. సత్యం ఆయన ఆత్మలోకి క్రమక్రమంగా కత్తిలా చొచ్చుక పోసాగింది. జీవిత పరమార్థం ఏమిటో అవగతం కావడం మొదలుపెట్టింది. ఆయనకు మనస్సు కుదిరింది. మతం పుచ్చు కున్నాడు. జీసస్ క్రైస్టును ఆరాధించాడు. శిలువగుర్తును ఆశ్రయించాడు. అవుతే మతం పుచ్చుకున్న ఒక ఏడాది వరకు కూడా ఆయన వెనుకటి బంధాలను పూర్తిగా త్రెంపుకో

లేకపోయాడు. పాత అలవాట్లు వదిలించుకోలేకపోయాడు. య్యాదులతోనే ఉంటూవచ్చాడు. కాని ఉన్నట్టుండి ఒక నాడు ఆయన దేవాలయంలోకి వెళ్ళడం తటస్థించింది. అక్కడ మతగురువు బైబిల్ చదివి చెబుతున్నాడు. "నీవు పరిపూర్ణమైన భగవత్సేవకుడవు కాదలుచుకుంటే తక్షణం వెళ్ళు— వెళ్ళి నీకున్న యావదాస్తి, పూచిక పుడకయినా దాచకుండా తెగనమ్ము— అమ్మి ఆడబ్బు పేదలకు పంచి పెట్టు." ఇది విన్నతక్షణం ఆయన గిరుక్కున వెనక్కు తిరి గాడు. ఉన్నదంతా అమ్మి లేనివాళ్ళకు పెట్టాడు. అంతే. ఆపాటున వచ్చి బైరాగుల్లో కలిశాడు. నాటినుంచి నేటి దాకా అదే జీవితం. ఏ పాపమూ ఎరుగని జీవితం. ఆయ నేమో, ఆయన భగవత్ప్రార్థనలేమో. మన లోకంతో సంబంధం లేదు. ఇలా పదేండ్లపాటు అచ్ఛమైన, స్వచ్ఛ మైన ఈశ్వర సేవకుడుగా జీవించాడు.

ఇలా ఉంటూ ఒకనాడాయన తన పూర్వపు జీవితం స్ఫురణకు తెచ్చుకోసాగాడు. తాను పాపకూపంలో పడి కొట్టుకపోయిన రోజులు జ్ఞాపకం చేసుకోవడం మొదలు పెట్టాడు. ఇలా చేసిన పాపాలు తలుచుకుని పశ్చాత్తాపించడం ఆయనకు అలవాటు. అదొక పవిత్రకార్యంగా భావిస్తా డాయన.

గతమంతా ఆయన కళ్ళముందు పొడగట్టింది. ఒక్కొక్క సంఘటనే వచ్చి స్మృతిపథంలో మెరిసింది— తాను అలెగ్జాండ్రియాలో ఉన్నప్పుడు, అక్కడ నాటక

మందిరం దగ్గర ఒక అందమైన అమ్మాయిని చూచాడు. ఆ పిల్లపేరు థాయిస్. ఆటా పాటా నేర్చిన అందాలరాణి. ఆ పిల్లకు నదురూ బెదురూ లేదు. సిగ్గూ ఎగ్గూలేదు. నగరపు నడివీధుల్లో కాలికి గజ్జెకట్టి అందరూ చూడండన్నట్లు ఆడేది. అందరినీ పిలుస్తున్నట్లు పాడేది. అందరికళ్ళకూ ఒక గంధర్వ కన్యలా కనుపించేది. ఆటలో పాటలో అప్సరసలను మరపించేది. ఒక్క యువకులే కాదు. వృద్ధులు సయితం ఆమె సౌందర్యానికి ముగ్ధులై పోయేవారు. అందరూ ఆ పిల్ల వెంట పడేవారు. అందరినీ ఆవిడ నవ్వించేది, కవ్వించేది, మోహంలో ముంచేది. ప్రతిమగవాడికీ వెర్రెత్తేటట్లు చేసేది. వయసు కుర్రవాళ్ళంతా ఆ వన్నెల చిన్నెల వయారి భామ ప్రేమభిక్ష కోసం ఆవిడ ఇంటిచుట్టూ గుమికూడేవారు. శ్రీమంతులు, సిరిగల స్వాములు, వయసుమళ్ళిన వాళ్ళు సయితం ఆ చక్కని చుక్క పొందుగోరి ముందు నేనంటే నేనని పోటాపోటీలు పడి ఆవిడ వాకిటిముందు పడిగాపులు కాచేవారు. ఆ అందాలరాణి వాళ్ళందరినీ ఆహ్వానించేది. వాళ్ళు సిరులు విరజిమ్మేవాళ్ళు. ఆవిడ స్వీకరించేది. వాళ్ళు మోహాల మైకంలో తూగేవాళ్ళు. ఆవిడ తన వలపంతా ఒలకపోసేది. వాళ్ళు ఆవిడ పొందు కోరేవాళ్ళు. ఆవిడ తన తనువు సర్వస్వం అర్పించి ఊరుకునేది. ఇలా ఆవిడ ఒక పాపాల వలయం అల్లింది. తను అందులో పడి ఈదుతున్నది. తనతోపాటు అనేకమంది మానవులను ఆ వలయంలోకి ఈడుస్తున్నది.

ఆవిడ పఫ్నూటియస్‌ను కూడా పాపంలోకి దింపింది. అతనిలో పశువాంఛని తట్టిలేపింది. అతను ఆవిడ మోహంలో పడిపోయాడు. ఒకమాటు ఆవేశ్యఇంటికి వెళ్ళాడు. కాని వీధి వాకిట్లోనే ఆగిపోయాడు. అతనికి చచ్చేటంత సిగ్గువేసింది. అవును పాపం! అప్పు డతనికి నిండా పదహారేండ్లు లేవు. ఆ వయస్సులో ఉన్న పసివాడికి ఒక భోగందాని కొంపలో అడుగు పెట్టాలంటే ఎలా ఉంటుంది? సహజమయిన సిగ్గు, బిడియం, భయం అతన్ని ఆవరించాయి. అంతేకాదు. అప్పుడతని దగ్గర చాలినంత డబ్బుకూడా లేదు. దుబారా ఖర్చు చేస్తాడని, దుర్వ్యసనాలకు లోనవుతాడని తల్లి దండ్రులతనికి పుష్కలంగా డబ్బు ఇవ్వడంలేదు.

అంతా భగవంతుడి దయ. ఏమయితేనేం? ఆపై రెండు ఆటంకాలవల్ల అతనాతడవకు ఆవిడ కొంపకు పోవడం తటస్థించలేదు. ఆపాపకూపంలో పడకుండా తప్పింది. కాని ఇలా జరిగినందుకు పఫ్నూటియస్ సంతోషించలేదు. అవును; అప్పు డతను అంధకారంలో ఉన్నాడు. మోహాల మైకంలో పడి కొట్టుకుంటున్నాడు. తాను పాపాలకు ఒడికట్టుతున్నానన్న విషయం అతనికి తేలీలేదు.

ఇప్పుడాయన తన ఆశ్రమంలో కూచుని పూర్వం జరిగిన ఈ సంఘటనలన్నీ స్ఫురణకు తెచ్చుకుంటున్నాడు. థాయిస్‌నుగురించి తలపోస్తున్నాడు. ఎంచాతనంటే తనకు దుర్బుద్ధి పుట్టడానికి కారణం థాయిస్. ఆవిడమూలంగానే తను చిన్నతనంలో భ్రష్టుడయి పాపపుజీవితాన్ని గడిపాడు. తనను అజ్ఞానంలోను, అంధకారంలోను పడేసింది ఆవిడే.

శిలువగుర్తుముందు సాగిలపడి పఫ్నూటియస్ చాలా సేపు ధ్యానంలో ఉండిపోయాడు. అలా కొన్నిగంటలు గడిచాయి. అప్పుడాయన కనులముందు థాయిస్‌రూపు పొడగట్టింది. సాక్షాత్తూ ఆవిడేవచ్చి తనముందు నిలుచునన్నట్లనిపించింది. ఆవిడే! సందేహంలేదు. లోకంలో అందమంతా మూటకట్టి మోసుకొచ్చింది. ఆహా! ఏమి ఆ మోహనరూపం! ఏమి ఆ మిసమిసలాడే యౌవనం. స్వర్గం నుంచి దేవకన్య దిగివచ్చిందా? రంభా? ఊర్వశా? లేక రంగురంగుల పూలపానుపుపయిన పవళించిఉన్న రతీదేవా ఏమిటి? ఆవిడ తలవాల్చుకున్నది. కనులు చెమ్మగిలి ఉన్నాయి. ఏదో వింతవింత కాంతులు ప్రసరిస్తున్నాయి. నాసికాపుటాలు అల్లలాడుతున్నాయి. అరవిచ్చిన ఆవిడ పెదవులు అదురుతున్నాయి. కుచాలు రెండూ, రెండు పూగుత్తుల్లా ఉన్నాయి. నున్నగా, నిగనిగలాడుతూ, పొడుగ్గా వ్రేలాడుతున్న ఆవిడ రెండుచేతులూ, రెండు సెల యేటి ప్రవాహాల్లా అగుపిస్తున్నాయి. ఇలాటి సుందరాంగి రూపం కళ్ళముందు సాక్షాత్కరించేసరికి పఫ్నూటియస్ భయవిచలితుడయినాడు. గుండెలపయి గ్రుద్దుకున్నాడు:

"ప్రభూ! ఈశ్వరా! నేను మహాపాపిని, నన్ను కరుణించుస్వామీ!" అని ప్రార్థించుకున్నాడు.

క్రమక్రమంగా ఆయన కనులముందు రూపం కదలసాగింది. ఆ కదలికరూపంలో రకరకాల మార్పు తెచ్చిస్తున్నట్టింది. థాయిస్ పెదవులిప్పుడు మరింతగా కంపించ

సాగాయి. చంద్రబింబంలాంటి ఆవిడ ముఖంలో ఏవో బాధలనీడలు వచ్చిపడుతున్నాయి. కమలాలవంటి ఆ కనులలో ఏవో కారుచీకట్లు కమ్ముకుంటున్నాయి. ఆ నేత్రాలు అశ్రుపూరితాలయినాయి. ఆవిడ బరువుగా నిశ్వసిస్తున్నది. ఆవిడ ఉన్నతవక్షోజాలు పైకీ క్రిందికీ ఊగుతున్నాయి ఏదో పెనుగాలివచ్చి ఎగరగొడుతున్నట్లు. ఈ దృశ్యం చూచేసరికి పఫ్నూటియస్ హృదయాంతరాళంలో ఏదో వేదన చెలరేగింది. మళ్ళీ ప్రార్థన చేయసాగాడు;

"ఓ ఈశ్వరా! దయామయా! ఆకులపయి మంచు బిందువులున్నట్లు మానవులమయిన మా హృదయాలలో కరుణ ఉన్నది. నీవు కరుణామయుడవు. మమ్ములను కనికరించు ప్రభూ! మమ్ములను కాపాడు ప్రభూ! నిన్ను వేయి విధాల వేడుకుంటున్నాను. నీ పాదదాసి అయిన ఆ అమ్మాయి పతితురాలయిపోయింది ప్రభూ! ఆమె తుచ్ఛమైన కామవాంఛకు గురిఅయిపోయింది. వేలాది పురుషులతో వ్యభిచరిస్తున్నది. ఆ పిల్లను పాపపంకిలంనుండి వెలికితీయి. ఆమెను ఉద్ధరించు. ఆవిడపట్ల నాకెంతో జాలి, దయ, సానుభూతి, ప్రేమ ఉన్నాయి. ఆమె నీసృష్టి ప్రభూ! ఆమెలో నేను నీరూపం చూడగలుగుతున్నాను ప్రభూ! అంచాతనే ఆమెను అంతగా ప్రేమిస్తున్నాను. ఆవిడ పరిస్థితి ఎంత దారుణంగా ఉన్నదో ఒక్కమాటు చూడు ప్రభూ! ఆవిడ చేస్తున్న పాపం ఇంతా అంతాకాదు. నేను సహించలేకపోతున్నాను. నా హృదయం బ్రద్దలయిపోతున్నది. నా నరనరాలు తెగి

పోతున్నాయి. కాని ఆవిడ ఎంతఎక్కువ పాపానికి ఒడికట్టు తుంటే నాకు అంతఎక్కువ దుఃఖంవస్తున్నది. ఈ చేసిన పాపఫలితమంతా ఆమె ఆ నరకంలో ఎంత భయంకరంగా అనుభవించవలసివస్తుందో అని విచారిస్తున్నాను ప్రభూ !"

ఆయన ఇలా ప్రార్థిస్తుండగా ఒక చిన్ననక్క వచ్చి ఆయన కాళ్ళదగ్గర కూచున్నది. ఆయన చూచాడు. ఆ ఉదయంనుంచీ ఆశ్రమం తలుపు వేసింది వేసినట్లే ఉన్నది. మరి ఆ నక్క లోపలికెలావచ్చిందా అని ఆశ్చర్యపోయాడు. అది తన మనోభావాలను గ్రహిస్తున్నట్లు కనుపిస్తున్నది. కుక్కలా తోక ఆడిస్తూ దగ్గర కూచున్నది. పఫ్నూటియస్ శిలువగుర్తు (క్రాస్) చేసుకుని ఈశ్వరుణ్ణి ధ్యానించాడు. తక్షణమే ఆ నక్క అక్కడనుంచి మాయమైపోయింది. అప్పుడాయనకు అవగతమయింది. భూతం ఆ నక్కరూపంలో వచ్చింది. ఇలా భూతం తన ఆశ్రమంలో అడుగుపెట్టడం ఇదే తొలిసారి !

ఆయన మళ్ళీ కొంచెంసేపు దైవప్రార్థన కావించాడు. తిరిగీ థాయిస్‌నుగురించి తలుచుకున్నాడు.

"నేనామెను రక్షించితీరాలి. ఆ ఈశ్వరుడే నాకు అండ" అనుకున్నాడు తనలో.

ఆ మరుసటిరోజు ఉదయాన్నే మామూలుగా తన ప్రార్థనలు ముగించుకున్నాడు. తరువాత పాల్‌మన్ అనే ఒక మహాత్ముణ్ణి దర్శించడానికి వెళ్ళాడు. ఆయన చాల గొప్ప ముని. అక్కడికి కొంతదూరంలో ఆశ్రమం వేసుకుని ఉంటు

న్నాడు. పఫ్నూటియస్ ఆయనదగ్గరికి వెళ్ళాడు. ఆయన వృద్ధుడు. ఒక చిన్నతోట సేద్యం చేసుకుంటున్నాడు. ఆయన మహాత్ముడు. క్రూరమృగాలు సయితం ఆయనజోలికి రావు. భూతప్రేత పిశాచాదులు ఎన్నడూ ఆయనదరికి చేరవు.

పఫ్నూటియస్ వెళ్ళేసరికి పాల్‌మన్ తన మామూలు ప్రకారం తోట త్రవ్వుకుంటున్నాడు. ఆయనముఖంలో చిరునవ్వు తాండవిస్తున్నది.

"నమస్కారం స్వామీ" అన్నాడు పఫ్నూటియస్.

"నమస్కారం. రా నాయనా, రా. కూచో. కులాసాగా ఉన్నావా? ఆ ఈశ్వరకటాక్షంవల్ల శాంతిగా ఉంటున్నావా?" అన్నాడు వృద్ధుడు, చేతిలో పార అవతలపెట్టి.

"ఆ, అంతా ఆయనకృప. మరి మీరూ? మీ తపస్సు ఫలిస్తున్నదనుకుంటాను."

"అవును నాయనా. అంతా ఆ సర్వేశ్వరుడి కృపాకటాక్షం" అన్నాడు వృద్ధుడు, నుదుటిమీది చెమట తుడుచుకుంటూ.

"స్వామీ! మీరైనా, నేనైనా కేవలం నిమిత్త మాత్రులమేకదా. అన్నిటికీ ఆ ఈశ్వరుడే కర్త. మనం—తపోవృత్తిలో తనువు గడుపుతున్నవాళ్ళం, ఒకరి నొకరం కలుసుకున్నప్పుడల్లా ఆ ప్రభువు నామం నోరారా ఉచ్చరించడం, ఆయనకు ప్రీతికరమైన పనులనుగురించి ముచ్చటించడం — అంతేకదా మనం చేయవలసింది. అందుకే

నేనిప్పుడు మీదగ్గరికి వచ్చానుస్వామీ. ఆ ఈశ్వరుడి పేరు మీద మనస్సులో ఒక సంకల్పం పెట్టుకుని వచ్చాను'' అన్నాడు పఫ్నూటియస్.

“నీ సంకల్పం ఆ సర్వేశ్వరుడు సఫలీకృతం కావించు గాక! నాయనా, పఫ్నూటియస్! సర్వకాల సర్వావస్థ యందూ నన్నా సర్వేశ్వరుడు కాపాడుతున్నాడు. ఆయన కృపవల్లనే నిత్యం నా తోటలో ప్రతి ఆకుమీదా, ప్రతి పువ్వుమీద మంచుబిందువులు వర్షిస్తున్నాయి. ఈ దోస పండ్లు, కర్బూజాపండ్లు పండుతున్నాయి. సర్వదా శాంతి ప్రసాదించమని మనం ఆయన్ను ప్రార్థనచేద్దాం. ఏ విషయ వాంఛలూ మనలను చుట్టిముట్టి పాపపంకిలంలో పడేయకుండ ఉండేందుకు మనం ఆయన్ను వేడుకుందాం. మన హృదయాలు మలినం కాకుండా చూచుకుందాం. అన్నిటి మూలం కోరికలు. కోరికలు కోసివేసినవాడే ధన్యుడు నాయనా, లౌకికమైన భోగాలు, ఆనందాలు ఎన్ని అయినా మాత్రం, ఆ సర్వేశ్వరుణ్ణి ఒక్కసారి ప్రార్థించడంలో కలిగే ఆనందంతో, హాయితో సరితూగుతాయా! నాయనా! నేను మహాపాపిని. కాని ఆ ప్రభువు నన్ను కాపాడుతున్నాడు నాకు ఇన్నేండ్లు వచ్చాయి. ఇంతకాలం ఈ సన్యాసాశ్రమంలో గడిపాను. నాకు కనుపించిన గొప్ప సత్యం చెప్తాను విను. విచారం! విచారం ఉన్నదే అది మనకు బద్ధ విరోధి. అంటే నేననేది దుఃఖాన్నిగురించి. ఆ దుఃఖం— విష విషాదం ఒక పొగమంచులా ఆవరించి మన ఆత్మలను కప్పివేస్తుంది. మనం ఆ ఈశ్వరుణ్ణి - ఆ పరంజ్యోతిని చూ

కుండా చేస్తుంది. ముక్తికి ఆటంకం ఇదేనాయనా. మంచివాళ్ళ హృదయాల్లో విష విషాదపు విత్తనాలు నాటాలని భూతాలు నిరంతరం ప్రయత్నిస్తుంటాయి. మనం వాటికి లొంగకూడదు నాయనా, లొంగితిమా మనం పాపకూపంలో పడిపోయి నట్లే. ఇది నేను అనుభవంమీద చెబుతున్నాను. నేనేకాదు, మన తండ్రి, గురువు అయిన ఆంథోనీ ఉన్నాడే— ఆయన ఇదేమాట చెప్పాడు. ఆ మహాత్ముడు మనమధ్య నివసించడం నేను బాగా ఎరుగుదును. ఎప్పుడూ ఆయన మందహాసంతో ఉండేవాడు. విచారంఅంటే ఏమిటో ఎరగ డాయన. శిష్యులతో ఎల్లప్పుడూ ఉల్లాసంగా ఉండేవాడు. సరే, నాయనా. నీవేదో మనస్సులో సంకల్పంపెట్టుకుని వచ్చావనన్నావు. అదేమిటో నాకు చెప్పు. ఆ ఈశ్వరుడి పేరుమీద నీవు చేయనున్న పనేమిటో తెలుసుకుని సంతోషిస్తాను నాయనా."

"స్వామీ! నిజంగా నేను తలపెట్టినకార్యం ఆ ఈశ్వరుడు మెచ్చుకుంటాడు. మీరూ మీసలహా ఇవ్వండిస్వామీ. ఇచ్చి నా సంకల్పానికి దోహదం చెయ్యండి. మీరు ఎన్నో విషయాలు తెలిసినవారు. ఏపాపం అంటనివారు. మీ హృదయం నిర్మలమైనది స్వామీ" అన్నాడు పఫ్నూటియస్.

"నాయనా, పఫ్నూటియస్! అలా అనకు. నేను నీ పాదరక్షలు మోయడానికైనా తగను. నేను మహా పాపాలు చేశాను నాయనా. కాని వయస్సులో నీకంటె చాలా పెద్దవాణ్ణి. అనేకం అనుభవించినవాణ్ణి. నాకు తోచిన సలహా ఇస్తాను. అదేమిటోచెప్పు నాయనా."

"స్వామీ! చెబుతాను వినండి. అలెగ్జాండ్రియాలో ఒక నర్తకి ఉన్నది. ఆవిడపేరు థాయిస్. ఆవిడను తలుచుకుంటే నా మనస్సు వికల శకలాలయిపోతుంది స్వామీ. పాప పంకిలంలోపడి కొట్టుకుంటున్నదా పిల్ల. పడుపువృత్తి సాగిస్తున్నది స్వామీ."

"నాయనా, పఫ్నూటియస్! నిజంగా ఇది దారుణమైన విషయం. కాని ఇలాంటి జీవితం గడిపే స్త్రీలు యూదులలో అనేకమంది ఉన్నారు నాయనా. మానవజాతికి ఘోరమైన అనర్థం ఇది. దీన్ని పోగొట్టేమార్గం ఏమైనా ఆలోచించావా?" అని అడిగాడు వృద్ధుడు.

"స్వామీ! నేను అలెగ్జాండ్రియా వెడతాను. ఆ అమ్మాయి ఎక్కడ ఉన్నదో వెదికి పట్టుకుంటాను. జ్ఞానబోధ చేస్తాను. ఆవిడను మారుస్తాను. ఇదీ నా సంకల్పం. దీనికి మీ రేమంటారు స్వామీ?" అన్నాడు పఫ్నూటియస్.

"నాయనా, పఫ్నూటియస్! నేను పాపాత్ముణ్ణి, ఏం చెప్పను? కాని మన గురువు ఉన్నాడే, ఆంథోనీ 'ఉన్న చోటు వదలి లేనిచోటుకు వెళ్ళకు' అని చెబుతుండేవాడు."

"అవుతే నేను తలపెట్టినకార్యం మీ కిష్టంకాదా స్వామీ?"

"నాయనా! నీవు నా సోదరుడివి. నేను నిన్ను శంకించడంలేదు. కాని మన పెద్దలు చెప్పిన మాట చెబుతున్నాను. 'చేప నీళ్ళలో బ్రతుకుతుంది కాని నేలమీద బ్రతకలేదు. అలాగే మహర్షి అయినవాడు మనుష్యులకు దూరంగా

ఉండాలి. మనుష్యులలో మంచిలేదు. మనుష్యు లున్నచోట మంచిరాదు.' ఇది సత్యం నాయనా."

ఇలా చెప్పి ఆ వృద్ధుడు ఒక రావిచెట్టుచుట్టూ తవ్వి పాదు చేయసాగాడు. ఆయన ఇలా తనపనిలో నిమగ్నుడయి ఉండగా ప్రక్కన పొదలలోనుంచి ఆకులు కదిలిన అలికిడి అయింది. ఒక చిన్న లేడిపిల్ల చెంగు చెంగున దూకుతూ ఇవతలికి వచ్చింది. అకస్మాత్తుగా ఆగిపోయి, బెదురు బెదురుగా నలు కెలంకులకు చూచింది. సన్నగా, సుతిమెత్తనగా ఉన్న దాని చిన్నారి కాళ్ళు గజగజ వణకుతున్నాయి. అంతట ఆ భీతహరిణము చెంగున దూకుతూ వృద్ధుడిచెంతకు వెళ్ళింది. తన ముద్దులు మూటకట్టే తల ఆయన వక్షస్థలానికి ఆనించి, ఆయన ఒడిలో వాలిపోయింది.

"ఏం చిట్టితల్లీ ! బెదిరిపోయావా ?" అంటూవృద్ధుడు లేడిపిల్లశిరస్సు నిమిరాడు.

తరువాత మెల్లగా లేచి ఆశ్రమంలోకి వెళ్ళాడు. ఒక రొట్టెముక్క తెచ్చి దానికి అందించాడు.

పఫ్నూటియస్ కొంతసేపు ఆలోచిస్తూ అలాగే నిలు చుండిపోయాడు. ఆయన చూపులు క్రింద ఉన్న రాళ్ళ మీద లగ్నమై ఉన్నాయి. తరువాత మెల్లగా వెనక్కుతిరిగి తన ఆశ్రమంవైపు నడవసాగాడు. వృద్ధుడుచెప్పిన మాటలు ఆయనను ఆలోచనల్లోకి దింపాయి. ఆయన మనస్సు అల్లకల్లోల మయింది.

"ఆయన మంచిసలహా ఇస్తాడు. అవును, ఆయన అనుభవశాలి." అనుకున్నాడు తనలో అనేకసార్లు. తిరిగీ "కాని నా వివేకాన్ని, చిత్తస్థైర్యాన్ని ఆయన శంకించాడు. అవుతే గానీ. ఇహ ఆ అమ్మాయినిమాత్రం నేనలా వదిలేసి ఊరుకోలేను. థాయిస్‌ను భూతం ఆవేశించింది. ఆ భూతంనుంచి ఆమెను విడుదల చేస్తాను. ఆ ఈశ్వరుడే నాకు అండగా ఉండి మార్గం చూపిస్తాడు" అని నిశ్చయించుకున్నాడు.

పఫ్నూటియస్ అలా నడిచి వెడుతోంటే ఒకదృశ్యం అగుపించింది. ఒకచోట ఇసుకమీద వేటగాడు ఒక వలపన్ని ఉంచాడు. ఆ వలలో ఒక పిట్ట చిక్కుకొన్నది. అది ఆడపిట్ట. ఇవతల మగపిట్ట కిచకిచలాడుతూ, వల దారాలను ముక్కుతో పొడిచి కొరకడానికి ప్రయత్నిస్తున్నది. చివరకెలాగయితే నేం కాస్త సందుచేసింది. ఆడపిట్ట ఆసందులోనుంచి తప్పించుకోవచ్చు. ఈ దృశ్యం చూచేసరికి పఫ్నూటియస్‌కు దానిలోని అంతరార్థం బోధపడింది. ఆ ఆడపిట్ట థాయిస్. పాపం అనే వలలో చిక్కుఉన్నది. ఇవతల ఉన్న మగపిట్ట తాను. దానిలాగానే తను ఆ బంధాలు తెంపి ఆమెను విడుదల చేయడానికి ప్రయత్నిస్తున్నాడు. ఇలా ఊహించుకునేసరికి ఆయనకెంతో సంతోషం కలిగింది. ఈశ్వరుణ్ణే స్తుతించుకున్నాడు మనస్సులో. కాని ఇంతలో చిత్రం జరిగింది. వలలో చిక్కిన ఆడపిట్ట, మగపిట్ట చేసిన సందులోనుంచి ఇవతలికి రావడానికి ప్రయత్నించింది. కాని పాపం దాని కాళ్ళుమాత్రం వలదారాలకు చిక్కుకుని ఇవతలికి రాలేక

తన్నుకో సాగింది. ఇది చూచేసరికి మళ్ళీ పఫ్నూటియస్ మనస్సు ఆందోళనతోను, అనిశ్చితంగాను ఊగిసలాడడం మొదలు పెట్టింది.

ఆరాత్రంతా ఆయనకు కన్ను మూతపడలేదు. తీరా తెల్లవారగట్ల ఆయన కొక కలవచ్చింది. కలలో మళ్ళీ థాయిస్ కనుపించింది. కాని యిప్పుడామె ముఖంలో కళ-కాంతులు లేవు. మామూలుగా వళ్ళు కనపడేటట్లు వలి పెపు దుస్తులు కూడా ధరించలేదు. ముఖానికి, వంటికి నల్లటి ముసుగు కప్పుకున్నది. మిలమిల మెరిసే ఆవిడకళ్ళు తప్ప ఆయన కింకేమీ కనుపించలేదు. ఆ కనులనుండి ధారాపాతంగా నీరు కారుతున్నది.

ఈ కల కని పఫ్నూటియస్ దుఃఖించసాగాడు. ఆ భగవంతుడే తనకు ఈ కల రూపంలో వచ్చి కర్తవ్యం బోధించాడని నమ్మాడు. వెంటనే నిశ్చిత మనస్కుడై లేచాడు. క్రైస్తవధర్మానికి చిహ్నమైన ముళ్లకర్ర చేతబుచ్చుకున్నాడు. తన ఆశ్రమాన్ని, అందులో ఉన్న పవిత్ర మత గ్రంథాలను వదిలి బయటికి వచ్చాడు. మెల్లగా ఆశ్రమం తలుపు మూశాడు. ఫ్లావియన్ అనే తన తరువాత మత గురువును పిలిచాడు. తాను కార్యార్థం వెడుతున్నానని ఆయనతో చెప్పాడు. తాను తిరిగివచ్చేంత వరకూ పీఠాధిపతిగా ఉండి తక్కిన ఇరవై ముగ్గురు శిష్యులపైనా అధికారం స్వీకరించ వలసిందని చెప్పాడు. తరువాత పైనుంచి క్రింది దాకా ఉన్న పొడుగు అంగరఖా ఒకటి ధరించాడు. మెల్లగా నైల్ నది వైపుకు నడకసాగించాడు.

అలా పఫ్నూటియస్ ఉదయం నుంచి సాయంత్ర వరకూ నడిచాడు. అన్నం, నీళ్ళు ముట్టలేదు. అలుపు, ఆయాసం లెక్కచెయ్యలేదు. ప్రొద్దు వాటవాలిపోయింది. అప్పటి కాయన లిబియన్ తీరానికి చేరుకున్నాడు. నదీ జలాలు ఎర్రగా, నెత్తుటేరులా ప్రవహిస్తున్నాయి. పెద్ద పెద్ద బండల మధ్యనుంచి, రాళ్ల సందుల్లోనుంచి జలజలమని పారుతున్నది నది. నీళ్లు బంగారం లాగాను, నిప్పులాగాను తళతళ మెరుస్తున్నాయి.

ఆయన నది ఒడ్డున నే నడిచి వెడుతున్నాడు. ఒడ్డున నే వరుసగా ఉన్న కుటీరాలముందు ఆగి భిక్ష అడుగుతున్నాడు. ఆయన భవతీభిక్షాందేహి అని అడుగుతూంటే, కుటీరాల్లో జనం కొందరు ఆయన్ను పొమ్మని వెళ్ళగొడుతున్నారు. ఒక అయ్య 'ఛీ అనీ, ఛా అనీ' కసురుకుంటున్నాడు. ఒక అమ్మ 'లేదనీ, కాదనీ' గభీలున తలుపులు మూస్తున్నది. ఇలా గృహస్థులు తన్ను అవమానించినా, తిట్టినా, కొట్టినా, శాపనార్థాలు పెట్టినా, అవన్నీ ఆయన చిరునవ్వుతో స్వీకరిస్తున్నాడు. దొంగలన్నా, దోపిడిగాండ్రన్నా, కూరమృగాలన్నా వేటికీ ఆయన భయపడడంలేదు; కాని ఊళ్ళు, జనం, వీటికిమాత్రం జంకుతున్నాడు. సాధ్యమైనంతవరకు తన మార్గంలో బస్తీలు, పల్లెటూళ్లు తగలకుండాను, జనానికి కనుపించకుండాను ప్రయాణం సాగిస్తున్నాడు. మారుత్రోవన, ఒంటరిగా వెడుతున్నాడు. అయినప్పటికీ ఎక్కడో ఒకచోట, ఎప్పుడో ఒకప్పుడు ఎవరో మనిషి ఆయనకు తటస్థపడుతూనే

ఉన్నాడు. దూరంనుంచి నీళ్లు తెచ్చుకుంటున్న ఆడవాళ్లో, ఎక్కడో చెట్టుదగ్గర పుట్టదగ్గర ఆడుకుంటున్న కుర్రవాళ్లో ఆయనకు తారసపడుతున్నారు. వీళ్ళందరినీ తప్పించుకుని, దూరంగా తొలిగిపోతున్నా డాయన. అవును, యతీశ్వరుడైన వాడికి ఇవన్నీ ప్రమాదాలే !

ఇలా ఆయన శీతవాతతపాలు – వేటికీ లక్ష్యపెట్ట కుండా ఏడు పగళ్లు, ఏడు రాత్రిళ్ళు ప్రయాణం సాగించాడు. రాత్రి అయ్యేసరికి విపరీతంగా ఈదురుగాలికొట్టి, చలివేసేది. నెత్తికి పెట్టుకున్న కుల్లాయి ముఖంమీదికి లాక్కొని అలాగే చలిబాధ భరించేవాడు. చివర కాయన ఏడవరోజు సిల్ సైల్ అనే ప్రదేశం చేరుకున్నాడు. ఇక్కడ అటూఇటూ రెండు ఎత్తయిన కొండలున్నాయి. నడుమ సన్నటి లోయఉన్నది. లోయలోనుంచి నది ప్రవహిస్తున్నది. పూర్వం ఈజిప్టు దేశస్థులు దయ్యాలను, పిశాచాలను పూజించే రోజుల్లో ఈ కొండలలోనే విగ్రహాలుచెక్కారు.

ఒక కొండలో ఒక పెద్ద బ్రహ్మరాక్షసిబొమ్మ చెక్కి ఉండడం చూచాడు పఖ్నూటియస్. దాని ప్రభావం ఇంకా ఉన్నదేమో నన్నభయంతో ఆయన ఆ రాక్షసిబొమ్మను చూడగానే శిలువ గుర్తు చేసుకుని— జీసస్ క్రైస్టును స్మరించుకున్నాడు. వెంటనే ఆరాక్షసి చెవుల్లోనుంచి ఒక గబ్బిలం లేచి బయటికొచ్చింది. అదిచూచి ఆయన "ఇన్నే ళ్ళుగా ఈ బ్రహ్మరాక్షసిలో దాగిఉన్న మాయ, మంత్రం ఇప్పుడీ గబ్బలం రూపంలో బయటి కొచ్చింది. ఎలాగయితే

నేం, దీని సత్తా నశించేటట్లు చేయగలిగాను నేను''అను కున్నాడు.

ఆయన కింకా ఉత్సాహం పుట్టుకొచ్చింది. ఆరాక్షసి బొమ్మను ధ్వంసం చేయాలకున్నాడు. ఒక పెద్దరాయి అందు కున్నాడు. విగ్రహం ముఖానికేసి కొట్టాడు. అప్పుడా రాక్షసి ముఖంలో ఏవేవో అద్భుతమైన కవళికలు కనుపించాయి. ఏదో అగాధమైన విచారం, దైన్యం అగుపించాయి. అది చూచేసరికి పఫ్నూటియస్ హృదయం ద్రవించింది. ఇలా అన్నాడు :

"ఓరీ రాక్షసుడా! ఇహనయినా మానవుల మనస్సును కలుషితం కావించకు. పో! ఆ సర్వేశ్వరుడైన జీసస్ క్రైస్ట్ పేరుమీద, నాకు తండ్రి, గురువు అయిన మహాత్ముడు ఆంథోనీ పేరుమీద నిన్ను ఆశీర్వదిస్తున్నాను!"

ఆయన ఇలా అనేసరికి విగ్రహం కనులలో ఏదో కాంతి వచ్చినట్లు కనుపించింది. ఆ కనుగ్రుడ్లు కదిలినట్లు, ఆ పెదవులు కంపించినట్లు అనిపించింది. ఆయన పలికిన మాట కొండంతా ప్రతిధ్వనించింది. ఆయన తన కుడిచెయ్యి చాచి మరోమాటు రాక్షసిని ఆశీర్వదించాడు. తిరిగీ అక్కడనుంచి నడక సాగించాడు.

కొండలోయలో పోగాపోగా విశాలమైన ప్రదేశాలు వచ్చాయి. అక్కడ శిథిలమైన నగరపు చిహ్నాలు అగు పించాయి. అక్కడక్కడ పాడుపడిన దేవాలయాలు, విగ్రహాలు కనుపించాయి. చిత్రవిచిత్రమైన శిలావిగ్రహాలు అవి.

కొన్ని వళ్ళంతా మగవాడు, తలమాత్రం ఆడది. ఇంకా కొన్నిటికి తలమీద ఎద్దుకొమ్ము లున్నాయి. కొన్ని విరిగిన తలలు, కొన్ని మొండేలు; ఇలా ఛిన్నాభిన్నంగా పడి ఉన్నాయి. పఫ్నూటియస్ ఇవన్నీ పరికించిచూస్తూ తన ప్రయాణం సాగిస్తున్నాడు. ఇలా ఆయన పదిహేడు రోజులు ప్రయాణం చేశాడు. ఈ పదిహేడురోజులూ ఆయనకు అన్నం, నీళ్ళు లేవు. ఏదో కాస్త ఆకు, అలం తిన్నాడు. భయంకరమైన జంతువులకు, కొండచిలువలకు స్థావరాలయిన చీకటి గుహల్లోనూ, గబ్బిలాలతో, కంపు కొడుతూ, పాడుకొట్లాడుతూ ఉండే దేవాలయాల్లోనూ పడుకున్నాడు. తుదకు పద్దెనిమిదవనాడు ఒక నిర్జనప్రదేశంలో ఆయన కొక పర్ణకుటీరం కనుపించింది. ఆ చుట్టుప్రక్కల ఎక్కడా ఊరన్నమాట లేదు. 'చూద్దామన్నా పుట్టపురుగు లేదు— అంతా నిర్మానుష్యం. ఆ ఒక్క పర్ణకుటీరంమాత్రం అక్కడ ఉన్నది. అదికూడా ఇసుకలో సగపడ పూడిపోయింది. బహుశా అది ఒక ముని ఆశ్రమం అయి ఉంటుందనుకున్నాడు పఫ్నూటియస్. వెళ్ళి ఆయన్ను దర్శించి ఆశీస్సులు పొందుదామనుకున్నాడు. పర్ణశాలచెంతకు వెళ్ళి చూచాడు. పర్ణశాలకు వాకిలిలేదు. లోపల ఒక కమండలం, చిన్న కుప్పగా పోసిన ఉర్లగడ్డలు, ఆకులతో ఏర్పరచిన ఒక ఆసనం అగుపించాయి. ఎక్కడా మనిషి అలికిడి లేదు. అది ముని ఆశ్రమమే అని నిర్ధారణ చేసుకున్నాడు పఫ్నూటియస్.

"అవును. ఇక్కడ ఎవరో ఒక మునీశ్వరుడు తపస్సు చేసుకుంటున్నట్లున్నది. కాని ఏడీ ఆయన? ఎక్కడికి వెళ్ళి ఉంటాడు? ఒక్కసారి ఆయన్ను దర్శిస్తే నా జన్మ ధన్యమవుతుంది" అనుకున్నాడు తనలో.

మునికోసం ఆ చుట్టుప్రక్కల అంతా వెదికిచూచాడు. ఎక్కడా కనుపించలేదు. చివరకు ఆ చేరువనే ఉన్న ఏటి ఒడ్డున ఒక వృద్ధుడు అగుపించాడు. పద్మాసనం వేసుకుని కూచున్నాడు. ఆయనే ముని అయి ఉంటాడని అనుకున్నాడు పఫ్నూటియస్. దగ్గరికి వెళ్ళి చూచాడు. ఆ వృద్ధుడికి మొల మీద గుడ్డలేదు. దిగంబరిగా కూచున్నాడు. గడ్డం, తల వెంట్రుకలు తెల్లగా నెరిసిపోయి,. జడలు అల్లుకపోయాయి. ఆయన దేహం పండి, ఎండి, వరుగయిపోయి ఉన్నది. పఫ్నూటియస్ ఆయనకు మరింత చేరువగా వెళ్ళి నమస్కారం చేశాడు.

"నమస్కారం స్వామీ."

కాని, ఆ వృద్ధుడు జవాబు చెప్పలేదు. సైగకూడా చేయలేదు. ప్రతిమలా కూచున్నాడు. అసలా మాట విన్నట్లే లేదాయన. అదిచూచి పఫ్నూటియస్ మునీశ్వరుడు ధ్యాన సమాధిలో మునిగి ఉన్నాడని భావించాడు. అలాగే ఆయన ఎదుట చేతులుజోడించుకుని మోకాళ్ళపై కూచున్నాడు.

ప్రొద్దు కూకుతున్నది. అప్పటికీ వృద్ధుడు సమాధినుంచి లేవలేదు. అప్పుడు మళ్ళీ పఫ్నూటియస్ ఆయన్ను ఇలా పలకరించాడు:

"మాట్లాడరేంస్వామీ? కాస్త కళ్ళు తెరిచి చూడండి. ఆ జీసస్ పేరుమీద నన్నాశీర్వదించండి స్వామీ."

అప్పుడా ముని కళ్లు తెరిచాడు. కాని పఫ్నూటియస్ వంక చూడలేదు.

"ఎవరునాయనా నీవు? ఏమిటి నీవనేది? జీసస్ ఎవరు?" అని అడిగాడు.

"ఏమిటీ!" అన్నాడు పఫ్నూటియస్ నివ్వెరపోతూ. "మీరు జీసస్ క్రైస్ట్‌నే ఎరుగరా స్వామీ? మతంకోసం అసువులు కోల్పోయిన మహనీయు లందరూ ఆయన నామం స్మరించారే; ఆఖరుకు సీజర్ కూడా ఆయన్ను ఆరాధించాడే! అలాంటి జీసస్ క్రైస్ట్‌నే ఎరుగరాస్వామీ మీరు?" అని అడిగాడు.

"నాయనా, ఇందులో వింత ఏమీ లేదు. నేను ఆయన్ను ఎరుగనిమాట వాస్తవం" అన్నాడు వృద్ధుడు నింపాదిగా.

"అవుతే, చెబుతున్నాను వినండిస్వామీ. మీకు నిజంగా జీసస్ క్రైస్ట్‌నుగురించి తెలీనట్లయితే—మీరు చేసే ఏ పనికీ అర్థంలేదన్నమాట! మీరు చేసే ఈ తపస్సంతా వ్యర్థం. మీ జీవితానికెన్నటికీ సార్థక్యంలేదు స్వామీ" అన్నాడు పఫ్నూటియస్.

"నాయనా! ఏ పనిచేసినా ఒకటే, చేయకపోయినా ఒకటే. ఒకపని చేసినందువల్ల ఉపయోగమూలేదు, చేయనందువల్ల నష్టమూలేదు. మనం బ్రతికినా చచ్చినా అట్టే

తేడా ఏమీలేదు నాయనా!" అని సమాధానం చెప్పాడు, ఆ వృద్ధుడు.

"ఏమిటిస్వామీ మీరంటున్నది? బ్రతికినా చచ్చినా ఒకటేనా! అదేమిటి స్వామీ? మీరు శాశ్వత బ్రహ్మ కల్పాంతం జీవించి ఉండాలని అనుకోవడంలేదా? చెప్పండి స్వామీ. అందరి మునీశ్వరులలాగా మీరు ఇక్కడ తపస్సు చేయడంలేదా?"

"చేస్తున్నట్లే."

"మీకు మొలమీద బట్టకూడా లేదు. మీరు సర్వం త్యజించారు. అవునా?"

"అవును. అలాగే కనుపిస్తున్నాను."

"మీరు ఆకూ అలం తింటున్నారు. పవిత్రంగా జీవిస్తున్నారు. అవునా?"

"అలాగే అగుపిస్తున్నాను."

"ప్రపంచంలోని భోగాలన్నీ మీరు త్యజించారు కదూ?"

"మనుష్యులు సాధారణంగా కొన్ని వ్యర్థమైన విషయాలను గురించి అతిశ్రద్ధ వహిస్తారు. వాటి నన్నిటినీ నేను త్యజించినమాట నిజమే" అన్నాడు వృద్ధుడు.

"అవుతే ఇంకేంస్వామీ, నాలాగే మీరూను. అన్నీ వదులుకున్నారు. అడవిలో తపస్సు చేసుకుంటున్నారు. నేనూ అంతే. కాని నాక్కు ఒక్కటే అవగతం కాకుండా

ఉన్నది. మీకు జీసస్ క్రైస్ట్‌మీద నమ్మకం లేకపోతే ఇవన్నీ ఎందుకు చేస్తున్నట్టు? ఇంత పవిత్రంగా ఎందుకు జీవిస్తున్నట్లు?'' అని అడిగాడు పఫ్నూటియస్.

"నాయనా! ఒక్కమాట చెబుతాను విను. పవిత్రమైన జీవితమనీ, భ్రష్టజీవితమనీ; జీవితంలో రెండురకాలు లేవు. మంచీ చెడూ, గొప్పా కొద్దీ, న్యాయం అన్యాయం, కష్టం సుఖం, సంతోషం దుఃఖం—అనే వేవీ లేవు నాయనా. ఇలా ప్రతిదాన్నీ రెండుగా భాగించుకోడం ఉన్నది చూచావూ? అది మన భావనలో ఉంటుంది. అంతకుతప్ప అక్కడ రెండనేవి ఏవీలేవు. అంతా ఒక్కటే. ఆ ఒక్కటీ నిర్గుణం. ఉప్పువల్ల కూరకు రుచికలిగినట్లు, ఆ ఒక్కదానికీ మనం ఒక అభిప్రాయం ఆపాదించుకుని—దానికొక గుణాన్ని కల్పిస్తాం. అది మంచిదనీ, లేక చెడ్డదనీ అనుకుంటాం."

"అవుతే—మీరు చెప్పేదాన్నిబట్టి శాశ్వతమైనదీ, నిశ్చితమైనదీ ఏదీలేదని తేలుతోంది. సత్యాన్నే మీరు త్రోసిపుచ్చుతున్నారేమిటి స్వామీ. మహాత్ములు అనేక మంది ఆరాధించిన ఈశ్వరుణ్ణే మీరు కాదంటున్నారు. మురికి గుంటలో కొట్టుకుంటున్న పురుగులాగా, మీరు అజ్ఞానంలో పడి ఉన్నారు'' అన్నాడు పఫ్నూటియస్, కొంచెం తీవ్రంగా.

"అబ్బాయి! పురుగులను నిందిస్తే ఏమిటి ప్రయోజనం? పురుగులకూ నీవు చెప్పే ఆ పుణ్య పురుషులకూ ఆట్టే తేడా లేదు విచారిస్తే! అయినా ఎందుకూ? పురుగులంటే ఏమిటివో

మనకు తెలీదు. మనం ఎవరమో కూడా మనకు తెలీదు. అసలు మనకేమి తెలీదు నాయనా !"

"ఏమయ్యా ! చూడబోతే నీవు నాస్తికుడివిలా ఉన్నావే, నీ సిద్ధాంతాలూ నీవూను. ఛీ, ఛీ ! నాస్తికుల ముఖంచూస్తే నరకాన్నపోతాం. వెలుగు, నీడ స్పష్టంగా అగుపిస్తోంటే చూడలేని అంధులూ, తెలుసుకోలేని అజ్ఞానులూ నాస్తికులు"—

"నాయనా! నీవన్నట్లు నిజంగా నేను నాస్తికుణ్ణే... నీవు అవహేళన చేసిన ఒక విషయం నాకు అద్భుతంగా అగుపించవచ్చు. ఎంచాతనంటే ప్రతివిషయమూ కూడా బహుముఖాలుగా ఉంటుంది. ప్రతి పనిషీ ఒకలా చూడలేడు. ఎవరిచూపునుబట్టి వాళ్ళకా రూపు గోచరమవుతుంది. సూర్యోదయమయ్యే టప్పుడు పిరమిడ్లు, గోపుచ్ఛాకృతిలో అతికోమలంగా, గులాబీరంగులు వెదజల్లుతూ అగుపిస్తాయి. అవే పిరమిడ్లు ప్రొద్దుక్రుంకేవేళ అరుణాంబరాన్ని చుంబిస్తూ త్రిభుజాకారంగా కనుపిస్తాయి. కాని వాటి నిజస్వరూపం ఏమిటో ఎవరు చెప్పగలరు? లోకాలను వెలిగిస్తూ, లోకబాంధవుడయి పయనించే సూర్యుడు నాకెంతో అద్భుతావహంగా అగుపిస్తాడు. కాని ఆయన అసలు ప్రకృతి ఏమిటో నాకు తెలీదు. నిప్పును తాకితే కాలుతుందని నాకు తెలుసు-కాని ఎందుకు కాలుతుందో, ఎలా కాలుతుందో నాకు తెలీదు. అబ్బాయీ! నీవు నన్ను తప్పుగా అర్థంగా చేసుకుంటు న్నావు. సరే, సరే. నీవు ఎలాఅర్థంచేసుకున్నా నాకు ఒకటే నాయనా."

"మళ్ళీ ఒకమాట అడుగుతాను చెప్పండి. ఇంతకూ మీరీ ఎడారిలో ఏకాంతంగా, అన్నం నీళ్ళు వర్జించి తపస్సు చేయడం దేనికి? నేనూ మీలాగే దేహాన్ని శుష్కింప చేసుకుంటూ తపస్సు కావిస్తున్నాను. కాని దేనికోసం? ఆ ఈశ్వరుణ్ణి తృప్తిపరచడం కోసం. శాశ్వతమైన ఆనం దాన్ని అనుభవించడం కోసం. నా తపస్సుకు ఒక లక్ష్యం ఉన్నది. ఒక పరమార్థం ఉన్నది. మరి మీకూ? మీధోరణి చూస్తే మీ కలాంటి వేవీ ఉన్నట్లు కనుపించడంలేదే— అర్థం పర్థం లేకుండా అజ్ఞానంలోపడి కొట్టుకపోతున్నారే మీరు! అజ్ఞానంతో ఇలా అలమటించే కంటే లోకంలో మనుష్యులందరిలాగే ఐహిక సుఖాలు అనుభవిస్తూ జీవించడం మంచిదయ్యా. నామటుకు నాకు నిజంగా ఆ ఈశ్వరుడి యందు నమ్మకం లేకపోతే ఈ బాధలు పడేవాణ్ణే కాదు. నా జీవితాన్ని ఇలా ఇడుమలపాలు చేసుకునేవాణ్ణే కాదు. మళ్ళీ హాయిగా మనుష్యుల మధ్యకు వెళ్ళేవాణ్ణి. అందరి లాగే లోకంలో ఆనందమంతాఅనుభవించేవాణ్ణి.నాకునచ్చిన సుందరాంగిని కట్టుకుని సర్వసౌఖ్యాలూ అనుభవించేవాణ్ణి - ఇల్లు, సంసారం, కొడుకులు, కుమార్తెలు, పరిచారికలు, పని వాళ్లు, ఓ! ఒక్కటేమిటి? అన్నీ నాకూ అబ్బేవి. అందరి లాగే నేనూ రెండుచేతులా డబ్బు సంపాయించి, కోరిన సుఖమల్లా కొని అనుభవించేవాణ్ణి. కనుపించిన సుందరాంగి నల్లా పట్టించి, తెప్పించి కాలికి గజ్జెకట్టి ఆడించేవాణ్ణి! 'రావే ప్రేయసీ! మధుకలశం అందించవే' అంటూ తాగి తూగి కులాసాలతో, విలాసాలతో హాయిగా కాలంగడిపేవాణ్ణి.

కాని ఆ ఈశ్వరుడికోసం సుఖాలన్నీ త్యజించాను. ఇలా మునివృత్తి అవలంబించాను. హు! మరి నీవూ? ఉన్నవాడివి లోకంలో ఉండి అందరిలాగా ఐహికసుఖాలు అనుభవించిన వాడివీ కావు; వదిలిపెట్టి వచ్చినవాడివి నాలాగా ఈశ్వరుణ్ణి నమ్ముకుని మోక్షం సాధిస్తున్న వాడివీకావు—నీవు ఇహానికీ పరానికీ—రెంటికీచెడ్డ రేవడివయ్యా. నీ బ్రతుకునకు అర్థం లేదు—నీవు వట్టి అజ్ఞానివి."

పఫ్నూటియస్ చాలా కటువుగాను, అలక్ష్యంగాను మాటాడాడు. ఐనా ఆ వృద్ధుడు కోపం తెచ్చుకోలేదు—ఏ మాత్రం చలించలేదు.

"నాయనా! జ్ఞానులు—అజ్ఞానులు; వెలుగులో విహరించేవారు—అంధకారంలో అలమటించేవారు;—ఒకవంక పురుగులు—మరోవంక పుణ్యపురుషులు; ఏమిటినాయనా! ఈ భేదం? దీనికి హేతువేమిటి? ఎక్కడున్నది ఈ తేడాలకు మూలం? కాస్త వివరించి చెప్పునాయనా" అన్నాడు తిరిగీ వృద్ధుడు శాంతంగా.

పఫ్నూటియస్‌కు నోట మాటరాలేదు. ఆయన కోపమంతా మటుమాయమైంది. మునీశ్వరుణ్ణి తొందరపడి తూలనాడినందుకు లజ్జించాడు. క్షమించమని వేడుకున్నాడు ఆయన్ను.

"నన్ను మన్నించండి స్వామీ. వేరే అభిప్రాయం నా కేకోశానా లేదు. దేవుడిమీద ఒట్టు! మీరు పరమేశ్వరుడికి దూరమౌతున్నారేమో నన్న బాధకొద్దీ అలా

మాట్లాడాను. ఎవరు చెడిపోతున్నా నేను చూచి సహించలేను స్వామీ. మీ మనస్సును ఈశ్వరుడిపైకి మళ్లించాలని ఆరాటపడ్డాను. అంతకన్నా మరేమీ లేదు. చెప్పండి స్వామీ, జ్ఞానానికి అజ్ఞానానికీ హేతువేమిటో చెప్పండి" అన్నాడు పఫ్నూటియస్ వినమ్రుడై.

అప్పుడు వృద్ధు డిలా చెప్పడం మొదలుపెట్టాడు :

"నాయనా! మాట్లాడినా లేక మౌనందాల్చినా నాకు ఒకటే. నీ అభిప్రాయా లేమిటో అడగకుండానే నేను నా అభిప్రాయాలు చెప్పదలుచుకున్నాను. కారణం? నీ మీద నా కేమాత్రం ఆసక్తి లేదు. నీ కష్టాలతోటీ సుఖాలతోటీ నాకు పనిలేదు. నీవు సుఖపడితే నా కెందుకు, కష్టపడితే నా కెందుకు? నీవు ఏ తీరుగా ఆలోచిస్తేమాత్రం నాకేం? నేను నిన్ను ఎందుకు ప్రేమించాలి, లేక ఎందుకు ద్వేషించాలి? నిన్ను ప్రేమించా ప్రేమించను; ద్వేషించా ద్వేషించను. ప్రేమ, ద్వేషం రెండూ నాకు ఒక్కటే. ఆసక్తి, అనాసక్తి రెండూ నాకు ఒకలాగే అగుపిస్తాయి. కాని నీవు నన్నుగురించి ఇంతగా ఆసక్తి తీసుకుని అడుగుతున్నావు కనుక చెబుతాను విను. నా పేరు తిమొక్లెస్. నా ఊరు కోస్. సంపన్న కుటుంబంలో జన్మించాను. నా తండ్రి ఒక పెద్ద పడవ వర్తకుడు. కావలసినంత డబ్బు గడించాడు. తెలివితేటల్లో ఆయనకు ఆయనే సాటి. అలెగ్జాండర్‌ను మించినవాడని అంతా చెప్పుకునేవారు. ఆయన్ను 'అలెగ్జాండర్ ది గ్రేట్' అని పిలుస్తుండేవారుకూడా. ఏమైనా ఆయన చులాగ్గా లక్షలు గడించి

పెట్టాడు. పోతే మేం ముగ్గురం అన్నదమ్ములం. నేను కడ గొట్టువాణ్ణి. మా పెద్దన్నయ్య, రెండో అన్నయ్యకూడా మా నాయనలాగానే పడవవర్తకం చేసి భాగ్యవంతు లయ్యారు. నేనుమాత్రం చదువుకుని వేదాంతంలో పడ్డాను. మా పెద్దన్నగారికి జీవితంలో మనశ్శాంతి లేకుండాపోయింది. పాపం! ఆయన మా నాయనగారి బలవంతంమీద ఒకామెను పెండ్లాడాడు. ఆవిడపేరు తిమాయిస్. కాని ఆమెగారికి మా పెద్దన్నయ్యంటే యిష్టంలేదు. ఆయన్ను నానాకష్టాలూ పెట్టి ఆయనతో కాపురం చెయ్యకుండా లేచిపోయింది. దాంతో మా పెద్దన్నగారి బ్రతుకు భరించరాని విషాదంలో మునిగిపోయింది. తరువాత మా చిన్నన్నగారు ఆ మాయ లాడి వల్లో పడ్డాడు. ఆమె ఆయన్ను మురిపించి మోహంలో ముంచింది. ఆయన వెర్రెత్తినట్లు, ఆమెతోటే లోక మన్నట్లు ప్రవర్తించాడు. చివర కా రంకులాడి మా పెద్దన్నగారిని మోసగించినట్లే చిన్నన్నగారినికూడా మాయచేసింది. ఒక గాయకుణ్ణి ప్రేమించి ఆతనితో రహస్యంగా రంకుతనం సాగించింది. రాత్రిళ్ళు అతన్ని తన గదికి రప్పించుకుంటూ కేళీవిలాసంగా గడపడం మొదలుపెట్టింది. చివర కొకనాడు యీ గుట్టు బైటపడింది. ఆ గాయక విటుడు తన తంబుర, పూలహారం మా వదినెగారి గదిలో మరచిపోయి పోయాడు. అవి మా అన్నయ్య లిద్దరికంటూ పడ్డాయి. దాంతో యిరు వురూ ఉద్రేకాలతో ఉడికిపోయారు. మాబదినతో సంబంధం పెట్టుకున్న ఆ గాయకుణ్ణి తల నరుకుతామని శపథంపట్టారు. ఆ ప్రకారం ఆ మరుసటిరోజు అతన్ని ఒక తోటలో పట్టు

కుని, అతను ఎంత యేడ్చి మొత్తుకుంటున్నా వినకుండా తల పగులగొట్టి చంపేశారు. తన ప్రియుడు చనిపోయాడన్న వార్త వినగానే మా వదినెకు పిచ్చెక్కింది. అది చూచి మా అన్నయ్యా లిరువురికీకూడా మతులు చెడిపోయాయి. అలా ఆ ముగ్గురూ పిచ్చివాళ్ళయి, బిచ్చగాళ్ళయి, పిలిచే దిక్కూ, తలిచే దిక్కూ లేకుండా కోస్ప్రాంతంలో ఊళ్ళూ నాళ్ళూ పట్టుకుని తిరిగారు. పిల్లలు వాళ్ళను ఆటలు పట్టించారు. పెద్దలు గేలిచేశారు. దుష్టులు, కొంటెకుర్రవాళ్లు వాళ్ళ వెంటపడి రాళ్లు, రప్పలు రువ్వి తరిమారు. పాపం ఆ ముగ్గురూ అలా నిలువనీడలేక నోటివెంట నురుగులు గ్రక్కుతూ వెర్రి కేకలు పెడుతూ పల్లెలూ, పట్నాలూ తిరిగి తిరిగి తుదకు ఈడ్చేదిక్కూ, ఏడ్చేదిక్కూ లేక ఒకచోట చనిపోయారు. అప్పటికి మా నాయనగారున్నారు. ఆయన కీ విషయం ఎలాగో తెలిసింది. వెంటనే ఆయన ఎంలో వ్యయప్రయాసలతో ఆ ముగ్గురి శవాలూ తెప్పించి తన చేతులతో వాళ్ళకు అంత్యక్రియలు జరిపాడు. తరువాత కొద్దికాలానికే మాతండ్రి గారికి కడుపుశూల రోగంవచ్చింది. ఎన్నిమందులు తిన్నా తగ్గలేదు. ఏంతిన్నా అరిగేదికాదు. చివరకు చివరకు అన్నం నీళ్ళు లేక వటించాడు. ఇంట్లో ఏ మూలబట్టివా ధనరాసులు మూలుగుతున్నాయి. అంతా తాను సంపాయించిన డబ్బు. కాని ఏం లాభం? చావుదలకు ఆయనకు పిడిచెడు మెతుకులు తినే ప్రాప్తం లేకపోయింది. కడుపులో ఏమీ ఇమడక ఆకలితో అలమటించి అలమటించి అలాగే కన్నుమూశాడు. ఆస్తి అంతటికీ నేనే అధికారినయ్యాను. ఆ ధనమంతా నేను

తీర్థయాత్రలకు ఖర్చుపెట్టుకున్నాను. ఇటలీ, గ్రీస్, ఆఫ్రికా, మొదలయిన దేశాలనేకం తిరిగి చూచాను. అనేక పుణ్య క్షేత్రాలు దర్శించాను. ఏథెన్సులోను, అలెగ్జాండ్రియాలోను అనేక సంవత్సరాలుండి తత్వశాస్త్రం అధ్యయనం చేశాను. అనేకమంది వేదాంతులను, మహాత్ములను కలుసుకున్నాను. తలా ఒకతీరుగా ఉన్నారు. ఒక్కొక్కరు ఒక్కొక్క తర హాగా చెప్పారు. ఒకరి వాదానికి మరొకరి వాదానికి నాకు ఎక్కడా పొత్తుకనుపించలేదు ఎన్ని దేశాలు తిరిగినా సుఖంగా తృప్తిగా ఉన్న వ్యక్తి ఒక్కడూ అగుపించలేదు. జ్ఞాని అయినవాడు ఒక్కడూ నాకు తటస్థపడలేదు. చివరకు విసు గెత్తి, భారతదేశానికి వెళ్ళాను. అక్కడ పావన గంగానదీ తీరంలో నాకొక పుణ్యపురుషుడు కనుపించాడు. మొలమీద బట్టలేని దిగంబరి ఆయన. పద్మాసనం వేసుకుని, కనులు మూసుకుని నిశ్చలంగా నిర్మలంగా ముప్ఫయి ఏండ్లబట్టీ తపస్సు చేసుకుంటున్నాడాయన. ఆయన వంటిమీద పుట్టలు మొలిచాయి. చుట్టూ తీగెలు అల్లుకొని పోయాయి. తలంతా బ్రహ్మాండంగా జడలుకట్టి పోయింది. ఆ జుట్టులో పిచ్చుకలు గూళ్ళు పెట్టాయి. ఇలా ఉండికూడా ఆయన జీవించేఉన్నాడు. ఆయన్ను చూడగానే నాకు మావదినె తిమాయిస్ జ్ఞాపకం వచ్చింది. తరువాత ఆవిడ ప్రియుడు గాయకుడు, మా అన్నయ్యలిద్దరు, మా నాయనగారు; వాళ్ళ జీవితాలు గుర్తు కొచ్చాయి. అందరిలోకీ ఈ హిందూదేశంలో ఉన్న ఈ ఋషి ఒక్కడే నిజమైన జ్ఞాని అని నాకు తోచింది. 'మాన వులు తాము మంచిగా ఉంటున్నామని విశ్వసిస్తారు. లేక

తమకుగల ఆ మంచితనం కాస్తా పోతుందేమోనని భయపడ తారు. తాము చెడిపోతున్నామని శంకిస్తారు. అసలీ అనవసర మైన నమ్మకాలన్నీ పోగొట్టుకుంటే గాని మనుష్యులు బాగు పడరు' అనుకున్నాను నాలో నేను. అంచాత అప్పటినుంచీ నేను వేటిమీదా నమ్మకం పెట్టుకోలేదు. నాకొక మంచీ లేదు, చెడ్డా లేదు. లోకానికి దూరంగా, ఒంటరిగా, నిశ్చ లంగా, నిర్మలంగా, హిందూదేశంలోని ఆ మునిలాగా జీవిస్తూవచ్చాను."

వృద్ధుడు చెప్పిన కథంతా శ్రద్ధగా విన్నాడు పఫ్నూ టియస్.

"అయ్యా, తిమొక్లెస్! తమరు లోకవ్యవహారాలన్ని టికీ దూరంగా ఉంటున్నారు, సర్వం త్యజించారు. అంత వరకూ నాకు బాగానే ఉంది. కాని శాశ్వతమైన ఆనందాన్ని మోక్షాన్ని, చేకూర్చే ఆ ఈశ్వరుడికి దూరంగా ఉండడం మాత్రం నేను సహించలేకుండా ఉన్నాను. అది కేవలం మీ అజ్ఞానం. మీకు మళ్ళీ చెప్తున్నాను. సర్వ జగత్తుకూ ఆధారభూతుడయిన భగవంతుడొకడున్నాడు. అతన్ని మీరు సేవించండి 'తిమొక్లెస్." అన్నాడు పఫ్నూటియస్.

"అబ్బాయీ! అనవసరంగా శ్రమపడకు. నీ సిద్ధాం తాలన్నీ నామీద రుద్దడానికి ప్రయత్నించకు. నీవు ఎన్ని వాదనలు చేసినా, ఎన్ని బోధనలు చేసినా నాదగ్గర నిరుప యోగం. నా అభిప్రాయమల్లా ఏ అభిప్రాయం లేకుండడమే! తెలిసిందా? వెళ్ళు. నీత్రోవన నీవు వెళ్ళు." అన్నాడు వృద్ధుడు.

ఇహ ఆ వృద్ధుడితో వాదించడం చెవుటివాడి ముందు శంఖం ఊదినట్లని గ్రహించాడు పఫ్నూటియస్. ఆ జీవుడికి విముక్తి లేదని అనుకున్నాడు. అతనలా నశించి పోవలసిందే నని నిశ్చయించుకున్నాడు. ఇహ తాను మాట్లాడ దలుచుకోలేదు.

"అవుతే తిమొక్లెస్! ఇహ నేవెళ్ళొస్తాను. అభాగ్యుడవు నీవు!" అంటూ పఫ్నూటియస్, దీర్ఘంగా నిశ్వసించాడు. అక్కడనుంచి కదిలి తిరిగీ తన ప్రయాణం సాగించాడు.

ఉదయాన్నే పఫ్నూటియస్ నదీతీరాన నడిచి వెడుతున్నాడు. నది నిర్మలంగా ప్రవహిస్తున్నది. నీటిఒడ్డున కొన్ని కొంగలు గుంపులు గుంపులుగా అగుపించాయి. ఒడ్డున పెద్ద పెద్ద చెట్లు విస్తృతమైన శాఖలతో నీళ్ళలోకి వంగి ఉన్నాయి. ఎక్కడో దూరంగా పక్షుల అరుపులు వినవస్తున్నాయి. నిర్మలమైన ప్రభాత కాంతిలో నదీజలాలు పచ్చగా తళ తళ మెరుస్తున్నాయి. ఒడ్డున అక్కడక్కడ ఒకటి రెండు పర్ణకుటీరాలు అగుపిస్తున్నాయి. నదికి ఇరుదరులా పల్చని పొగమంచు తెరలు తెరలుగా వ్యాపించిఉన్నది. నదిమధ్య అక్కడక్కడ చినచిన్న దీవులు ఏర్పడి ఉన్నాయి. ఆ దీవులలో నుంచి, గుంపులు గుంపులుగా ఉన్న ఎర్ర కొంగలు, బాతులు, రాజహంసలు వీటి అరుపులు చెవుల కింపుగా వినిపిస్తున్నాయి. ఎడమవైపున పచ్చని లోయ ఎడారివరకూ వ్యాపించి ఉన్నది. లోయలో గోధుమ పొలాలు, పండ్ల తోటలు కన్నుల పండువుగా కనుపిస్తున్నాయి. అంతటా చక్కదనాల ప్రభాతకాంతి పరుచుకుని ఉన్నది. ఏదో పరి

మళ భరితమైన చల్లనిగాలి వీస్తున్నది. సుందరమైన ఈ ప్రకృతి శోభను కనులార తిలకిస్తూ పఫ్నూటియస్ ఇలా భగవంతుణ్ణి ప్రార్థించుకున్నాడు.

"ఓ ప్రభూ, దయామయా! నీ కరుణవల్లనే నాకీ ప్రయాణం ఇంత చక్కగా సాగుతున్నది. నీ మహిమవల్లనే ఈ లోకమంతా ఇంత రమణీయంగా ఉన్నది. ఈ చక్కని పొలాలు, పూలమొక్కలు, పండ్లతోటలు, పరిమళాలు వెదజల్లుతున్న ఈ చల్లని గాలి; ఇవన్నీ నీ సృష్టి. బంగారు బొమ్మలాంటి థాయిస్‌ను నీవే సృష్టించావు. ఆమె నీ బిడ్డ. నీ బిడ్డపై కృప చూపవా స్వామీ! ఆమెను ఉద్ధరించవా ప్రభూ!"

పచ్చని కొమ్మలతో, రెమ్మలతో గుబురుగా పెరిగి ఉన్న ఒక చెట్టు కంటపడినా, చక్కని రంగురంగుల రెక్కలతో ఎగురుతూ పోతున్న ఒకపిట్ట కనుపించినా, వెంటనే ఆయనకు థాయిస్ జ్ఞాపకం వస్తున్నది. నదీతీరం వెంట అలా నడిచి నడిచి కొద్దిరోజులకు ఆయన నగరం — అలెగ్జాండ్రియానగరం చేరుకున్నాడు. అత్యంత రమణీయమైన పట్టణం అలెగ్జాండ్రియా. గ్రీకులా పట్టణాన్ని 'బంగారు నగరం' అని పిలుస్తారు.

ఆయన కొండమీదికి చేరుకుని, చూచేసరికి ఉదయకాంతిలో ఆ మహానగరం ఉజ్వలంగా ప్రకాశిస్తూ కనుపించింది. ఆయన అక్కడ ఆగాడు. చేతులు కట్టుకుని తనలో తాను ఇలా అనుకోసాగాడు.

"అదిగో! అదే అలెగ్జాండ్రియా! అక్కడే - ఆ పాప కూపంలోనే నేను జన్మించాను. అక్కడే విషతుల్యమైన భోగాలు అనుభవించాను. అక్కడే మరులు గొలిపే మగువల మధురగానం విన్నాను. అదే నా జన్మభూమి! సకల ఐశ్వర్యాలకూ ఆలవాలమై స్వర్గాన్ని తలదన్నుతున్న ఓ అలెగ్జాండ్రియా! నీవు నా తల్లివి! నీ వక్షస్థలంపై పవళించి, నీ స్తన్యం త్రాగి పెరిగానమ్మా నేను. కాని నేనిప్పుడు యతీశ్వరుణ్ణి. పుట్టిన ఊరు, పెరిగిన ప్రదేశాలు వదలి దూరంగా, తపస్సుకు వెళ్ళినవాణ్ణి. లోకవ్యవహారాల పట్ల విముఖుడనయినవాణ్ణి. సంసారం అంటే విరక్తి చెందినవాణ్ణి. అంచాత నీయెడల నాకిప్పుడు ప్రేమలేదు. అలెగ్జాండ్రియా, నిన్ను ద్వేషిస్తున్నాను! నీ వంటే అసహ్యించుకుంటున్నాను! నీ సౌందర్యాన్ని, నీవిజ్ఞానాన్ని, నీభోగభాగ్యాలను, హేయంగా చూస్తున్నాను! అవును. నాకు గురువులు, మహాత్ములు, పుణ్యపురుషులు అయినవా రనేకమందిని పూర్వం నీవు కలుషితం కావించావు. నీ భయంకర రాక్షసత్వం, దుష్టప్రవృత్తి వారికి శాంతి లేకుండా చేశాయి. ఇప్పుడూ నేను నీ ముందుకొచ్చాను! నీ పాపానికి బలికాబోతున్నాను అలెగ్జాండ్రియా!'

తరువాత పఫ్నూటియస్ మళ్ళీ తన ప్రయాణం సాగించాడు. అలెగ్జాండ్రియా నగర ద్వారాలు చేరుకున్నాడు.

ఆ ద్వారాన్ని సూర్యద్వారం అంటారు. సుందరమయిన పాలరాతి కట్టడం అది. శిల్ప సౌందర్యమంతా

అందులో ఉట్టిపడుతున్నది. ఆ ద్వారం ముంగిట కొందరు బిచ్చగాళ్ళు, బిచ్చగత్తెలు ఉన్నారు. వచ్చేపోయే జనాన్ని అడుక్కుంటున్నారు. కొందరు నీచజాతి స్త్రీలు, పురుషులు బుట్టలలో పండ్లు ఫలాలు, మిఠాయిలు పెట్టుకుని అమ్ము కుంటున్నారు. బిచ్చగాళ్ళ అరుపులు, ఏడుపులు, పండ్లు అమ్ముకునేవారి కేకలు దుర్భరంగా వినవస్తున్నాయి.

పీలికలయి నేల జీరాడుతున్న బట్టలతో ఒక వృద్ధు రాలు పఫ్నూటియస్‌ను చూచి ఆయన కాళ్ళమీద పడ్డది. ఆయన అంగరఖా చెంగులు పట్టుకుని ముద్దాడింది.

"స్వామీ! మీకు పుణ్యముంటుంది. ఈ దౌర్భాగ్యు రాలిని ఆశీర్వదించండిస్వామీ. నికృష్టంగా బ్రతుకుతున్నాను. నాకు చావు రాకుండా ఉన్నది. స్వామీ! నన్ను కనికరిం చండి. మీరు పుణ్యాత్ములు. మీ పాదధూళితో నన్ను పావ నం చెయ్యండి మహాత్మా! అంటూ ఆ వృద్ధురాలు ప్రాధేయపడింది.

"ఆ ఈశ్వరుడు నిన్ను కాపాడుగాక! లే అమ్మా, లే" అంటూ పఫ్నూటియస్ ఆమె శిరస్సును స్పృశిస్తూ ఆశీర్వ దించాడు.

తరువాత నగరద్వారం దాటి మరో పది అడుగులు ముందుకు నడిచాడు. కాని అలా వెళ్ళాడో లేదో, పిల్ల కాయల గుంపు ఒకటి ఆయన్ను చుట్టుముట్టింది. అరుస్తూ, కేకలు పెడుతూ, ఎగురుతూ, ఎగతాళిచేస్తూ, ఆయన్ను రాళ్ళతో కొట్టడం మొదలు పెట్టారు.

"ఒరేయ్ ! ఎవడో సన్యాసిరా ! చూడు చూడు! ఎలా ఉన్నాడో చూడు !......ఎలుగొడ్డులా ఉన్నాడు రా! అడివిలోనుంచివచ్చాడా,కొండల్లోనుంచి వచ్చాడా, అమ్మో, మంత్రం పెడతాడురా ! ......మాయచేస్తాడురా, మచ్చు మందు చల్లుతాడురా !..." ఇలా ఒకరితో ఒకరు చెప్పుకుని, కేకలు పెడుతూ పిల్లలంతా ఆయన్ను రాళ్లు తీసుకుని కొట్టారు.

"ప్రభూ ! అజ్ఞానులయిన ఈ బిడ్డలను కనికరించు!" అంటూ పఫ్నూటియస్ వాళ్ళను పట్టించుకోకుండా అక్కడి నుంచి కదిలి వెళ్లాడు. వెడుతూ ఇలా ఆలోచించుకోసాగాడు.

"ఆ వృద్ధురాలు నాకాళ్ళమీదపడి వేడుకున్నది. ఈ పిల్లకాయలు నన్ను రాళ్లతో కొట్టి బాధించారు. ఒక విషయాన్ని రెండు విధాలుగా చూస్తారు ప్రపంచంలో మనుష్యులు. ప్రేమించడం, ద్వేషించడం; ఆహా, ప్రభూ ! ఏమిటి నీ లీల !"

ఇలా అనుకుంటూ ఆయన నగరవీధులగుండా వేగంగా నడిచి వెళ్ళసాగాడు. ఆయన ఈనగరం వదలిపెట్టి వెళ్ళి పది ఏండ్లయింది. అయినా అక్కడ ప్రతి రాయి రప్పా, ప్రతి ఇల్లూ వాకిలీ ఆయనకు జ్ఞాపకం ఉన్నది. అక్కడ కనుపించే ప్రతిదీ ఆయనకు ఒకొక్క పాపాన్ని స్ఫురణకు తెస్తున్నది. కోపాన్ని, అసహ్యాన్ని పుట్టిస్తున్నది. నగరవీధులవెంట నడిచి వెడుతుంటే, రాళ్ళు రప్పలు ఆయన కాళ్ళకు ఎదురు దెబ్బలు తగులుతున్నాయి. ఆయనకు పాదరక్షలు లేవు. పాదాలకు దెబ్బలుతగిలి నెత్తురు కారుతున్నా ఆయన లక్ష్యపెట్టడం

లేదు. పైగా తన కిలా జరగవలసిందే నన్నట్లు సంతోషిస్తు న్నాడు. ఇలా నడిచినడిచి ఒక సుందరమైన దేవాలయం దగ్గరకి వచ్చాడు. అక్కడనుంచి వీధిమలుపు తిరిగి మరొక విశాలమైన వీధిగుండా వెళ్ళసాగాడు. వీధి కిరువైపులా సుందరమయిన భవనాలు చూడ ముచ్చటగా కనుపిస్తు న్నాయి. నలువైపులనుంచీ రకరకాల సుగంధ ద్రవ్యాల పరిమళం వచ్చి మత్తు కలిగిస్తున్నది. ప్రతి భవనంముందు ప్రహరీగోడను ఆనుకుని ఆకాశాన్ని అంటుతూ పెరిగిన దేవ దారుచెట్లు, గంగరావిచెట్లు కన్నులపండువుగా కనుపిస్తున్నవి. భవనాల వీధివాకిళ్ళు ఓరవాకిళ్ళుగా తీసి ఉన్నాయి. ముందర కడ నడవలన్నీ తళతళ మెరుస్తున్న పాలరాతి పరుపు— చుట్టూ పూలమొక్కలు, నడుమ అందమయిన కంచువిగ్రహాలు— వాటిలోనుంచి ఏర్పాటుచేసిన, నలుదిశలా నీళ్ళు చిమ్మే చక్కని జలయంత్రాలు; అన్నీ ఎంతో ఆకర్షణీ యంగా అగుపిస్తున్నాయి. ఏ భవనంలోనుంచికూడా శబ్దం అన్నమాట లేదు. అంతటా ప్రశాంతంగా ఉన్నది. అప్పు డప్పుడుమాత్రం భవనంలోపల ఏమూలనుంచో, మధుర మయిన వేణుగానం వినవస్తున్నది.

పఫ్నూటియస్ వెళ్ళివెళ్ళి ఒక భవనంముందు ఆగాడు. అది అంత పెద్దదికాదు. కాని ఉన్నంతలో ఎంతో ఆకర్షణీ యంగాఅగుపిస్తున్నది. వాకిలికి అటొకటి, ఇటొకటి వయ్యా రంగా బిందెలు బుజాన పెట్టుకున్న అమ్మాయిలబొమ్మలు రెండు ఉన్నాయి. వరండాలో అన్నీ స్తంభాలు. ప్రతిస్తంభానికి

ప్లేటో, సోక్రటీస్, అరిస్టాటిల్ మొదలయిన మహనీయుల చక్కని కంచువిగ్రహాలు అమర్చి ఉన్నాయి.

పఫ్నూటియస్ మెల్లగా ఆ భవనం వరండాలోకి వెళ్ళాడు. చేతిలో ఉన్న సన్యాసిదండంతో తలుపుతట్టాడు, తరువాత ఆ బొమ్మలను గురించి ఆలోచిస్తూ నిలుచుండిపోయాడు.

"కేవలం అజ్ఞానం, గర్వం, అహంకారం! కాకపోతే ఈ పిచ్చి బొమ్మలన్నీ ఏమిటి ఇంటినిండా? వీరంతా మహాత్ములా? పుణ్యపురుషులా? అబద్ధం! వీరిలో ఋషిఅనదగిన వాడు ఒక్కడూ లేడు. అందరిబోధనలూ అసత్యాలు. ఆఖరుకు ప్రఖ్యాతిగన్న ప్లేటోకూడా అలాంటివాడే."

ఆయన ఇలా తలపోస్తుండగా ఒక సేవకుడువచ్చి తలుపుతీశాడు. ఎదురుగా నిలుచునిఉన్న యతిని, ఆయన ఆకారాన్ని చూచాడు. భిక్షుకు వచ్చాడనుకున్నాడు.

"పోవయ్యా, పో, సన్యాసీ! ఇక్క డెవరూ నీకు ముష్టిపెట్టేవాళ్లు లేరు. వెళ్లు. వెళ్ళి ఎక్కడన్నా అడుక్కో, ఊ, కదులు! లేదా బడితె ప్రయోగంచేసి మరీ పంపిస్తాను" అన్నాడు సేవకుడు కర్కశంగా.

"నాయనా! నేను అడుక్కోడానికి రాలేదు. మీ యజమాని నిషియస్‌తో పనుండి వచ్చాను. నన్ను కొంచెం లోనికి వెళ్ళనీయి నాయనా" అన్నాడు పఫ్నూటియస్.

"నీవంటి బికార్లను చూడడు మా దొరగారు, పో, పో!" అని మరింత కోపంగా కసురుకున్నాడు సేవకుడు.

"అయ్యా! నీకు పుణ్యముంటుంది. మీ అయ్య గారిదగ్గరికి వెళ్ళి 'తమర్ని చూడడానికి ఎవరో వచ్చారని చెప్పునాయనా' అని అర్థించాడు తిరిగీ పఫ్నూటీయస్.

"ఛీ ఛీ! బుద్ధిలేదుట్రా నీకు బికారివెధవ? నీక్కాదూ చెప్పేది వెళ్ళమని?" అంటూ సేవకుడు ఉగ్రుడై లేచాడు. కొట్టడానికి కర్రఎత్తాడు. పఫ్నూటియస్ తన రెండుచేతులూ రొమ్ముకు అడ్డంపెట్టుకొని మౌనంగా నిలుచున్నాడు. సేవకుడు కొట్టిన కర్రదెబ్బ ఆయన ముఖానికి తాకింది. కాలు కదపకుండా ఆ దెబ్బ భరించాడు. తిరిగి మెల్లగా ఇలా అన్నాడు :

"నాయనా! నిన్ను వేడుకుంటున్నాను. వెళ్ళి చెప్పు నాయనా."

కొట్టినా, తిట్టినా లక్ష్యపెట్టక అలా నిశ్చలంగా నిల్చున్న యతీశ్వరుణ్ణి చూచేసరికి సేవకుడికి అదో రకమైన ఆశ్చర్యము, భయము కలిగాయి. "ఎవరీ మనిషి? కొట్టినా, తిట్టినా లెక్కచేయడంలేదు!" అని లోలోపల గొణుక్కున్నాడు. అతని శరీరం కంపించింది. గభాలున ఇంట్లోకి పరుగెత్తాడు యజమానితో చెప్పడానికి.

అప్పుడే నిషియస్ స్నానానికి లేచాడు. ఇరువురు అందమైన దాసీపిల్లలు ఆయనకు ఒళ్లు పడుతున్నారు. ఆయనకూడా చక్కనివాడే. ముఖంలో చిరునవ్వు తొణికిసలాడుతున్నది. సన్యాసిని చూడగానే గభాలున లేచి ఎదురేగి "ఓహో! పఫ్నూటియస్! నీవటోయ్! ఎన్నాళ్ళ కెన్నాళ్ళకు?

రావోయ్ స్నేహితుడా! రా, కూచో......అరె, ఆ గడ్డం అంటలుకట్టిన ఆ తల—నీవు మనిషిలా కనుపించడంలేదోయ్! అడవిజంతువులా అగుపిస్తున్నావు! ఏదీ, ఇలా రా! నన్ను కౌగలించుకో; మనం చిన్నతనంలో ఎట్లా ఉండేవాళ్ళమో నీకు జ్ఞాపకం ఉన్నదా! ఇరువురం ఒకచోట—ఒక బెంచీ మీద కూచుని చదువుకున్నాం కదూ? వ్యాకరణం, వేదాంతం, సాహిత్యం, అన్నీ చదువుకున్నాం కదూ? నీవు అప్పుడు కూడా ఇలాగే—దిగులుగా ఉండేవాడివి. మనిషివి దిబ్బ రొట్టెలా ఉండి, ఏమన్నా అంటే కలియపడడానికి వచ్చేవాడివి! అవునా? కాని అప్పటికీ ఇప్పటికీ నీవు కపటం లేని మనిషివి. అంచాతనే నీవంటే నాకిష్టంగా ఉండేది. నీవు చిన్నప్పటినుంచీ కూడా చిత్రమైన వాడివేనోయ్! డబ్బన్నా, ఆఖరుకు నీ ప్రాణమన్నా నీవు లెక్కచేసే వాడివికాదు. అతి చురుకయిన బుద్ధి నీది. నీ ఉద్రేకం పట్టశక్యం కాకపోయేది. ఇవన్నీ ఆ చిన్నతనంలో నన్నెంతో ఆకర్షించేవి. నీవంటే ప్రాణాలు విడిచేవాణ్ణి. సన్యాసులలో కలిసి పదేండ్ల క్రిందట అయిపు లేకుండా పోయావు. నీకు మతపిచ్చి పట్టిందిలే! ఇప్పుడా వేదాంతాలతో విసిగిపోయావా? మళ్ళీ ఇన్నాళ్లకు అవన్నీ వదిలి మామూలు జీవితంలోకి వచ్చావా? సరే, సరే. రావోయ్ స్నేహితుడా! ఈరోజు, మనచరిత్రలో ఒక చెరగని గుర్తు!". అంటూ ఎంతో సంతోషంతో స్నేహితుణ్ణి ఆహ్వానించాడు. తరువాత దాసీలకంక చూచి,

"ఒసేయ్, అమ్మాయిలూ! నా స్నేహితుడు—అతిథిగా వచ్చాడు. అతనికి కాళ్ళు కడగండి. ఒడలు తడవండి,

జుట్టు దువ్వండి. పన్నీరుచల్లి పరిమళ ద్రవ్యాలు ఒళ్లంతా పులమండి" అని ఆజ్ఞాపించాడు.

అది విని దాసీకన్యలు చిరునవ్వు నవ్వారు. కాళ్ళు కడగడానికి ఒక పళ్ళెం పట్టుకొచ్చారు. అద్దం, దువ్వెన, సుగంధద్రవ్యాలతో పఫ్నూటియస్ చెంతకు వెళ్ళారు. కాని ఆయన వారిని వారించాడు. వారిరువురూ వివస్త్రలయి ఉన్నందున వారివంక కన్నెత్తి అయినా చూడలేదు. తల వాల్చుకుని నిలుచున్నాడు. తరువాత నిషియస్, ఆయన్ను తన ప్రక్కన పట్టు పరుపుపయి, పట్టుదిండ్లకు ఆనించి కూచో బెట్టుకున్నాడు. రకరకాల మాంసంతోను, పిండివంటలతోను భోజనం తెప్పించి పెట్టాడు. త్రాగడానికి రకరకాల పానీయాలు అందించాడు. కాని పఫ్నూటియస్ అవేవీ ముట్టలేదు.

"నిషియస్ ! నేను సన్యాసాశ్రమం వదలివచ్చానను కుంటున్నావు కదూ ? లేదులేదు. ఆశ్రమాన్ని, మతాన్ని వదలిరాలేదు నేను. నా మతం మీద, వేదాంతం మీద నీకు నమ్మకం లేకపోవచ్చు అవి వట్టి మూఢ విశ్వాసాలని నీవు నిందించవచ్చు. అంతమాత్రం చేత అవి నిజాలు కాకపోవు. మొట్టమొదట శబ్దం పుట్టింది. ఆ శబ్దం తోటే ఈశ్వరుడు పుట్టాడు. ఆశబ్దమే ఈశ్వరుడుకూడా. ఇది ముమ్మాటికీ సత్యం. ప్రపంచమంతా ఆ ఈశ్వర సృష్టి. ఆయన లేకుండా ఏదీలేదు. ఆయనలోనే అంతా ఉన్నది" అన్నాడు పఫ్నూటియస్.

ఇప్పుడు నిషియస్ విలువైన పట్టుదుస్తులు ధరించాడు. అత్తరు రాచుకుని పన్నీరు చల్లుకున్నాడు :

"స్నేహితుడా! నీ విచిత్ర వేదాంతంతో నాకు భ్రాంతి కలిగిద్దామనుకుంటున్నావా? నీ సిద్ధాంతాలు, సూత్రాలు నాకడ వ్యర్థం. నేనూ అంతో ఇంతో వేదాంతం చదువుకున్నా నన్న విషయం నీకు తెలుసుకదా. నా అభిప్రాయాలు నాకు ఉండనే ఉన్నాయి. పూర్వం ఎవరో అవివేకంతో చెప్పిన సూక్తులు నాకడ వల్లెవేస్తున్నాయి. ఆ చెప్పినవాళ్ళు మహర్షులనీ. మహాత్ములనీ నన్ను నమ్మమంటున్నావు. లాభంలేదు స్నేహితుడా. ఈ వెర్రి మొర్రి సిద్ధాంతాలు విని చంటిపిల్లలు ఆనందిస్తారేమో కాని నావంటివాడు కాదు. వేదాంతంలో ఉన్న అన్నిశాఖలనూ నేను తరచి చూచాను. అన్నిపద్ధతులను, మార్గాలను అవగతం చేసుకున్నాను. అవన్నీకూడా మన అమ్మమ్మలూ నాయనమ్మలూ చెప్పే రాజు - రాణి, ఎలుక - పిల్లి, గాడిద - గుర్రంలాంటి కట్టుకథల్లా కనుపిస్తున్నాయి నాకు" అన్నాడు.

ఇలా అంటూ పఫ్నూటియస్‌ను రెక్క పుచ్చుకుని ఒక గదిలోకి తీసుకెళ్ళాడు. ఆ గదినిండా అనేక గ్రంథాలు - పురాతన గ్రంథాలు బుట్టలకు పెట్టిఉన్నాయి.

"చూడు స్నేహితుడా! ఇవన్నీ నేను చదివిన గ్రంథాలు. లోకంలోని అన్ని మతాలకూ, శాస్త్రాలకూ సంబంధించిన గ్రంథాలు వీటిల్లో ఉన్నాయి. కాని ఏంలాభం?

ఇవన్నీ పిచ్చివాళ్ళు వ్రాసిన వ్రాతలు! వ్యాధిగ్రస్థులు కన్న కలలు!" అన్నాడు నిషియస్.

పఫ్నూటియస్‌ను బలవంతాన ఒక విలువైన దంతపు కుర్చీమీద కూచోబెట్టాడు. తాను క్రింద కూచున్నాడు.

పఫ్నూటియస్ ఒకమాటు ఆ గదంతా కలయ చూచాడు. బుట్టలకు బుట్టలు పుస్తకాలు పేర్చిఉన్నాయి.

"ఈ పుస్తకాలన్నీ తగలబెట్టాలి!" అన్నాడు పఫ్నూటియస్.

"మంచిమాట అన్నావు స్నేహితుడా! కాని అప్పుడప్పుడు పిచ్చివాళ్ళ మాటలు మనకు సరదా పుట్టిస్తాయి. అలాగే అప్పుడప్పుడు ప్రొద్దుపుచ్చడానికి ఈ పిచ్చి వ్రాతలు అవసరం. అందుకని వీటిని అట్టిపెట్టి ఉంచాను" అన్నాడు నిషియస్.

పఫ్నూటియస్ మళ్ళీ తన వెనుకటిధోరణిలో "విగ్రహారాధకులు చెప్పిన సిద్ధాంతాలన్నికూడా అసత్యాలు. అవి అనుసరణీయాలుకావు. కాని ఈశ్వరుడున్నాడే— ఆయన సత్యస్వరూపుడు. అద్భుతాలు ప్రదర్శించడంద్వారా లోకానికి తనెవరో తెలియచేశాడు. అంతటా నిండి ఉన్నాడా ఈశ్వరుడు" అని చెప్పాడు.

"స్నేహితుడా! నీవెంతో చక్కగా మాట్లాడతావోయ్. నీవాగ్ధాటి గొప్పది. అందరినీ ఆకర్షించి ఆకట్టుకునే వాక్కు నీది. సరే, సరే, స్నేహితుడా! ఇంతకూ ఏమిటి విశేషం? చెప్పు? ఇక్కడికి ఏంపనిమీద వచ్చావు? నావల్ల నీకేం

కావాలో చెప్పు? తక్షణం చేస్తాను స్నేహితుడా" అన్నాడు నిసియస్.

అంతట పఫ్నాటియస్ "నేనొక సత్కార్యం కావించడానికి వచ్చాను. నీవల్ల నాకు కొన్నిపనులు కావాలి. నీ విలువైన ఉడుపులు నాకు ధరించడానికి ఇవ్వాలి. ఇదిగో, ఇప్పుడు నీవు తొడిగినటువంటి ఉడుపులు చాలు. పోతే వాటితోపాటు బంగారు పూలతో కట్టిన కాలిజోళ్లు ఇప్పించు. కొంచెం డబ్బుకూడా కావాలి. ఓ వెయ్యి*డ్రాచ్మాలుచాలు. ఒక సీసా తలనూనెకూడా ఇప్పించు. తలకు, గడ్డానికి రాచుకుంటాను. వీటికోసమే నీవద్దకు వచ్చాను స్నేహితుడా. ఇంతకన్నా నిన్ను అర్థించేదిలేదు. నీవు నా బాల్యస్నేహితుడవు. ఈ కాస్త సహాయం చేసిపెట్టు. నీకు పుణ్యం ఉంటుంది. సత్కార్యం యిది" అని చెప్పాడు.

దాసీలు వెళ్ళి విలువైన ఉడుపు తీసుకొచ్చారు. ఒంటికి ధరించే ఉడుపు అది. చాలా అందంగా ఉన్నది. చుట్టూ అంచులు బంగారు జలతారుతో కుట్టారు. మధ్య పూలు' లతలు, రకరకాల పిట్టల బొమ్మలు చక్కగా జలతారుతో అల్లారు. దాసీకన్యలు ఉడుపుపట్టుకుని అలా నిలుచున్నారు పఫ్నాటియస్ తాను తొడుక్కున్న అంగరఖా తీసిస్తాడేమో అని. కాని ఆయన అంగరఖా విడువనన్నాడు. దానిపైనే ఉడుపు వేసుకుంటానన్నాడు. అప్పుడు దాసీలిరువురూ కిలకిలనవ్వుతూ ఆయన కా ఉడుపు ధరింపచే

---

* గ్రీసుదేశపు నాణెముల పేరు.

శాను. ఆ దుస్తులలో ఆయన అతి విచిత్రంగా అగుపించడం చూచి వాళ్ళు మళ్ళీ పకపక నవ్వారు. ఆయన జుట్టును, గడ్డాన్ని సవరించారు. వయ్యారంగా ఆయన చెక్కిళ్ళను దువ్వి ముద్దాడారు. ఔను. వాళ్ళకు నదురూ బెదురూ లేదు. వాళ్లు దాసీపిల్లలు. ఇలాంటి వన్నీ వాళ్ళకు అలవాటే. ఆయనమాత్రం నిశ్చలంగా నిలుచున్నాడు. వాళ్ళను కన్నెత్తి అయినా చూడలేదు. తరువాత కాళ్ళకు జోళ్లు తొడుక్కున్నాడు. నిషియస్ యిచ్చిన డబ్బుసంచి మొలకు కట్టుకున్నాడు. అతనితో "స్నేహితుడా! నీవు యిచ్చిన ఈ వస్తువులన్నీ సద్వినియోగం చేస్తాను" అన్నాడు.

అప్పుడు నిషియస్ మందహాసం చేస్తూ "పఫ్నూటియస్! నిన్ను నేను శంకించడంలేదు. నీవు చెడుపని చెయ్యవని నాకు తెలుసు. మనుష్యులకు మంచిపని చెయ్యడం ఎంత కష్టమో చెడుపని చెయ్యడంకూడా అంతే కష్టం. వెళ్లిరా స్నేహితుడా!" అన్నాడు.

కాని పఫ్నూటియస్ తన స్నేహితుడికి తాను చేయనున్న కార్యాన్నిగురించి చెప్పాలనుకున్నాడు.

"నీవు థాయిస్‌ను ఎరుగుదువుకదూ? నాటకాల్లో వేషాలువేస్తూ ప్రదర్శనలు యిస్తుంటుందే, ఆ ఆమ్మాయి."

"అవును. చాలా అందమైనపిల్ల! ఒకప్పుడు నన్నుకూడా ఆపిల్ల మోహంలో ముంచింది. ఆవిడ వలపులో చిక్కి ఒకమిల్లు, రెండుపుట్ల ధాన్యం అమ్ముకున్నాను. మూడు పుస్తకాలు – బూతుపద్యాలు వ్రాసి ఆవిడకు అంకి

తం ఇచ్చాను! లోకంలో సౌందర్యం అనేది చాల బల వత్తరమయిన శక్తి స్నేహితుడా! మహర్షులు కూడా దానికి తల ఒగ్గారు. సరే, స్నేహితుడా! ఇంతకూ నీవు తపస్సంతా వదలిపెట్టి థాయిస్‌ను కలుసుకోడానికి వచ్చావన్న మాట?" అన్నాడు నిషియస్.

ఇలా అని బరువుగా నిశ్వసించాడు. పఫ్నూటియస్ అతని వంక భయ విచలితుడయి చూచాడు. కాలి క్రింది నేల తొలుచుకు పోతున్నట్లు తోచింది ఆయనకు. తను ఏదో పాతాళంలో పడిపోతున్నట్లు అనిపించింది. కాని ఏమీ జరగ లేదు. భూమి యథాస్థానంలోనే ఉన్నది. అలెగ్జాండ్రియా నగరం మామూలుగానే ఉన్నది. తాను తరుణ వయస్కు డుగా ఉన్నప్పటి సంఘటనలు జ్ఞాపకం చేసుకుని ఆయన విషవిషాద పూరిత మయిన మందహాసం కావించాడు. మెల్ల గా లేచి నిలుచుని ఇలా అన్నాడు.

"నిషియస్! ఈశ్వరకటాక్షం ఉంటే నేను ఆ అమ్మా యిని కాపాడతాను పతితురాలయిన ఆమెను ఉద్ధరిస్తాను. ఆవిడ ఆత్మను పరిశుద్ధం కావిస్తాను. ఆమెను ఈ నగరనరకం నుంచి బయటపడేస్తాను, తీసుకెళ్ళి మఠంలో చేరుస్తాను స్నేహితుడా! అందుకే ఇక్కడికి వచ్చాను."

"మన్మథుడికి కోపం వస్తుందేమో జాగర్తగా ఉండు పఫ్నూటియస్. మన్మథుడి పుష్పబాణం ఆ అమ్మాయి. ఆ పిల్లను నీవు తీసుకెళ్ళావూ అంటే మన్మథుడు ఊరుకోడు సుమా! జాగర్త!" అన్నాడు నిషియస్.

"ఆ ఈశ్వరుడు నా అండన ఉన్నాడు స్నేహితుడా. మరేం భయంలేదు. ఆయన కరుణఉంటే నీవుకూడా త్వర లోనే మారిపోతావు. ఈ పాపకూపంనుంచి బయటపడతావు. సరే, వెళ్ళొస్తాను స్నేహితుడా" అంటూ పఫ్నూటియస్ గదిలోనుంచి ఇవతలికి వచ్చాడు.

నిషియస్ ఆయన్ను సాగనంపడానికి వీధివాకిలిదాకా వచ్చాడు. మళ్ళీ ఒకమాటు ఆయన చెవిలో "జాగ్రత్త! అ పిల్లను ఎత్తుకపోయేవు! మన్మధుడికి కోపం వస్తుంది సుమా! అతనికి కోపంవస్తే ఏమైనా చేస్తాడు" అన్నాడు.

కాని పఫ్నూటియస్ ఆ మాటలు లక్ష్యపెట్టలేదు. తిరిగి చూడకుండా వీధిలోకి వెళ్ళిపోయాడు. ఆయనకు నిషి యస్ పట్ల అసహ్యభావం కలిగింది. పూర్వం అతనుకూడా థాయిస్‌తో సంబంధం పెట్టుకున్నాడని ఏవగించుకున్నాడు.

థాయిస్‌ను యూదుల బారినుండి తప్పించాలన్న బలీయమైన కాంక్ష ఒక్కటే పఫ్నూటియస్‌ను పట్టి కాలు స్తున్నది. అందు కాయన వేగిరపడుతున్నాడు. వెంటనే ఆ వేశ్యను, ఆ అభినేత్రిని కలుసుకోవాలని తహ తహ లాడు తున్నాడు: ఇంతకు ముందెన్నడూ తా నావిడ ఇంటికి వెళ్ళ నప్పటికీ, ఇప్పుడు ఇందు నిమిత్తం వెళ్ళ నిశ్చయించు కున్నాడు. ప్రొద్దుకూకిన తరువాత వెళ్లాలనుకున్నాడు. కాని ఇప్పు డింకా మధ్యాహ్నం అయినా కాలేదు. ఈ లోగా ఏమిటి చేయడం?

నగరమంతా ఊరికె తిరగసాగాడు. నగరంలో ప్రతి వీధి ఆయనకు చిరపరిచితమైనదే. ఆనాడు ఏమీ తినకుండా ఉపవాసం ఉండాలనుకున్నాడు. నగరంలో ఉన్న దేవాలయాలలోకి పోలే దాయన. ఈ క్రైస్తవ దేవాలయాలన్నీ చక్రవర్తి క్రింద ఉన్నాయి. వాటిపద్ధతులు వేరు. ఆ మతంవేరు. అది ఆయనకు గిట్టదు. అంచాత ఏ గుడికీ వెళ్లలేదు. ఎవరినీ కలుసుకోలేదు. అర్థంపర్థం లేకుండా, ఒంటిగా, వీధులవెంట తిరుగుతున్నాడు. ఆయన వదనంలో దైన్యం ప్రేలాడుతున్నది. తల వాల్చుకుని క్రిందచూస్తూ నడుస్తున్నాడు. మధ్య మధ్య ఏదో ఆనందం కలిగినట్లు తల ఎత్తి ఆకసంవంక వీక్షిస్తున్నాడు. అలా నడిచినడిచి ఓడరేవుకు చేరుకున్నాడు. పెద్దపెద్ద ఓడలువచ్చి రేవులో నిలిచి ఉన్నాయి. పడవ కూలీలు సామానులు దింపుతున్నారు. అవతల అగాధమైన సముద్రం కనిపిస్తున్నది. సముద్రజలాలు నీలిరంగులో తళతళలాడుతున్నాయి. ఒకవైపున శత సహస్ర తరంగాలు ఉవ్వెత్తుగా లేచి వస్తున్నాయి. ఒకతట్టు తెల్లటి నురుగు తెప్పలు తెప్పలుగా లేచి కొట్టుకొస్తున్నది. "ఆహా! ఏమిటీ సముద్రపు శోభ! ఒకప్పుడు నేనూ ఈ ప్రపంచములో, ఈ మనుష్యులమధ్య జీవించాలని కాంక్షించాను. కాని అలా జరగలేదు. నేను వేరైపోయాను" అని తలపోయసాగాడు పస్నూటియస్.

లంగరువేసి ఉన్న ఒక ఓడ తాటిని ఆనుకుని, చేరగిలబడ్డాడు. అంతులేని ఆలోచనలలో మునిగిపోయాడు. అలాగే ఆయనకు కన్ను మలిగింది. చిన్న కునుకుపట్టింది. ఒక కల

కన్నాడు. కలలో ఒక పెద్ద తప్పెట మ్రోత వినిపించింది. ఆకాశం అంతా రక్తవర్ణంగా మారింది. ప్రపంచానికి శిక్ష విధించేరోజు — ప్రజలను విచారించి తీర్పుచెప్పేరోజు వచ్చిం దని ఆయన అనుకున్నాడు. ఈశ్వరుణ్ణి ప్రార్థించసాగాడు. అప్పుడొక బ్రహ్మాండమైన రాక్షసుడు అగుపించాడు. తాను వచ్చేటప్పుడు లోయలో చూచిన రాక్షసుడే అతను. వాడు నోరుతెరిచి ఆయన్ను తన కోరలమధ్య చిక్కించు కున్నాడు. కాని మ్రింగెయ్యలేదు. పిల్లి, పిల్లికూనను నోట కరుచుకున్నట్లుగా ఆయన్ను నోటకరుచుకుని ఎక్కడికో తీసు కపోవడం మొదలు పెట్టాడు. అట్లా తీసుకపోయి సముద్రాలు, నదులు, కొండలు, గుహలు, అరణ్యాలు, వనాలు దాటి అనేక దేశాలు, దీవులు తిప్పాడు. చిట్టచివరకు ఒక ఎడారి ప్రాంతంలోకి తీసుకపోయాడు. ఆ ఎడారి యావత్తూ నిప్పులు చెరుగుతున్నది. పెద్దపెద్ద బండలు, రాళ్లు భయంకరంగా అగుపిస్తున్నాయి. నేల అనేకచోట్ల పగుళ్లు వాసి సొరంగాలు ఏర్పడ్డాయి. ఈ సొరంగాలలో నుంచి వెచ్చని పొగలు ఎగసి వస్తున్నాయి. రాక్షసుడు పఫ్నూటియస్‌ను మెల్లగా ఒక సొరంగం దగ్గర దించాడు.

"లోపలికి చూడు!" అని అరిచాడు.

పఫ్నూటియస్ సొరంగం అంచున నిలుచుని లోపలికి తొంగి చూచాడు. లోపల, పాతాళంలో రెండు పెద్ద ఎత్తయిన నల్లటి కొండరాళ్లమధ్య నుంచి ఒక నిప్పుఏరు ప్రవహిస్తున్నది. ఆ సొరంగం నరకలోకంగాను, లోపల ప్రవ

హించేది వైతరణిగాను కనుపించింది. అక్కడ అనేక జీవులను పట్టుకుని కింకరులు బాధిస్తున్నారు. జీవులందరూ ఏమాత్రం చింతపడకుండా ఆ యమయాతనలు అనుభవిస్తున్నారు. ఒక జీవుడు పొడుగ్గా ఉన్నాడు. చేతిలో ధర్మదండం ఉన్నది. దేవుళ్లను, పుణ్యపురుషులను ప్రార్థిస్తూ కీర్తనలు పాడు తున్నాడు. కింకరులు అతన్ని పట్టుకుని నానాయాతనలు పెడుతున్నారు. మరొక జీవుణ్ణి పట్టుకుని వాడిచెవిలో సల సల కాగే నూనె పోస్తున్నారు కింకరులు. ఇలా అనేక మంది పఫ్నొటియస్‌కు అగుపించారు. వారిలో చాలామంది మఠాధికారులు, సన్యాసులు, యతీశ్వరులు ఉన్నారు. వృద్ధుడైన తిమొక్లెస్ కూడా అగుపించాడు. తను ఈ యాతన అనుభవించవలసిన పనిలేదన్నట్లు, అందరికీ దూరంగాతొలిగి కూచున్నాడు. ఒక కింకరుడు వచ్చి ఆయన కళ్లముందు ఒక జ్యోతి పెట్టాడు. కాని ఆయన జ్యోతిని చూడలేదు, కింక రుణ్ణీ చూడలేదు.

ఈ దృశ్యం చూచి కళవళపడ్డాడు. పఫ్నొటియస్ తల ఎత్తి రాక్షసుడివంక చూచాడు. కాని రాక్షసుడు అక్కడ లేడు. అదృశ్యుడయి పోయాడు. అతనికి మారుగా, ఎదురుగా ఒక స్త్రీ అగుపించింది.

"ఇప్పుడు నీవు చూచినదంతా అర్థమైందా? ప్రపంచంలో పిచ్చిపిచ్చి భ్రమలు పెట్టుకున్న ప్రతిమనిషీ, నరకంలో అట్లా యమయాతన అనుభవించవలసిందే. మృత్యువు అందరినీ సమానంగా ఆదరిస్తుంది. మృత్యువు ఎవరినీ మోసం

చెయ్యను. దేవుడు దేవుడు అని కలవరించి, దేవుడికోసం అహర్నిశలు తపించి, చచ్చినాసరే, ఈ నరకబాధలు తప్పవు. బ్రతికి ఉన్నప్పుడు ఎవడైతే తన అజ్ఞానంవల్ల సత్యాన్ని తెలుసుకోలేడో, వాడు చచ్చిన తరువాత కూడా అంతే. ఎప్పటికీ తెలుసుకోలేడు. జీవులను బాధించే ఈ కింకరు లందరూ కూడా యమధర్మరాజు బంట్లు. ధర్మదేవత ఆదేశానుసారం జీవులనిట్లా బాధిస్తుంటారు. అంచాతనే జీవులు ఆ బాధలను అనుభవిస్తున్నట్లు తెలుసుకోనూ లేరు, వాటిని చూడనూలేరు. సత్యం గ్రహించలేని అజ్ఞానులు వాళ్లు. కను కనే ఈశ్వరుడు వాళ్లను అలా హింసల పాలుచేశాడు!" అన్నది ఆ స్త్రీ. "ఈశ్వరుడు ఏమైనా చెయ్యగలడు" అన్నాడు మఠాధిపతి పఫ్నూటియస్.

"ఏమైనా ఎందుకు చేస్తాడు? అసంగతమైన, విరుద్ధమైన పని ఎన్నడూ ఈశ్వరుడు చెయ్యడు. సత్యం అవగతం చేసుకున్నవాళ్లను అట్లా శిక్షించడు" అని చెప్పింది ఆ స్త్రీ.

పఫ్నూటియస్ మరింత కళవళపడ్డాడు. భయవిచలితుడైనాడు. మళ్లీ అగాధపు టంచుమీద వంగి లోపలికి చూచాడు. ఈ మాటు ఆయనకు నిషియస్ అగుపించాడు. అతను చిరునవ్వు నవ్వుతున్నాడు. తలకు పూలమాల చుట్టుకున్నాడు. కాలిపోయిన ఒక చెట్టుక్రింద కూచుని ఉన్నాడు. మరికొందరిని దగ్గర కూచోబెట్టుకుని వారితో వేదాంతాన్ని గురించి ప్రేమతత్వాన్ని గురించి ముచ్చటిస్తున్నాడు. అతనిపైన నిప్పులవాన కురుస్తున్నది. కాని ఆవాన అతనిపైన

మంచుజల్లులా పడుతున్నది. అతని కాళ్లు నిప్పుల కుప్పమీద ఉన్నాయి. కాని మెత్తని పచ్చిగడ్డిమీద ఉన్నట్లున్నది అతనికి. ఈ దృశ్యం చూచేసరికి పఫ్నూటియస్‌కు ఆగ్రహావేశాలు పుట్టుకొచ్చాయి.

"వాణ్ణి కొట్టండి, తన్నండి! ఈశ్వరా! వాణ్ణి శిక్షించు. వాడు నిషియస్. వాడు దుర్మార్గుడు. మహా పాపి. థాయిస్ అనే అమ్మాయితో వ్యభిచరించాడు!" అని అరిచాడు పఫ్నూటియస్.

ఇలా అరుస్తూ నిద్రనుండి మేల్కొన్నాడు. ఒక నావికుడు తనను పట్టుకుని ఉండటం గమనించాడు. ఏనుగంత మనిషి ఆ నావికుడు. పిల్లవాణ్ణి చేతుల్లో పెట్టుకున్నట్లుగా పఫ్నూటియస్‌ను పట్టుకుని ఆయనతో యిలా అన్నాడు నావికుడు :

"నిమ్మళం, నిమ్మళం! ఏమిటయ్యా ఆ కలవరింతలు? ఇట్లా తాటిని ఆనుకుని నిద్రపోతున్నావేమిటి? నేను పట్టుకోలేక పోయినట్లయితే ఈ పాటికి నీవు కాస్తా వెళ్లి అగాధంలో పడేవాడివి! నా తల్లిమీద ఒట్టువేసుకుని చెపుతున్నాను. నీ ప్రాణాలు కాపాడినవాణ్ణి నేను!

"అంతా ఆ ఈశ్వరుడిదయ. నీకు చాలా కృతజ్ఞుణ్ణి నాయనా." అన్నాడు పఫ్నూటియస్.

అక్కడనుంచి మెల్లగా లేచి నడవడం మొదలు పెట్టాడు. తాను కన్న కలను గురించి తలపోయసాగాడు :

"ఇది నిజంగా దుస్స్వప్నం. సందేహం లేదు. యమ లోకం కలలో కనుపించడం కీడు. ఇదేదో భూతం చేసిన పని!" అనుకున్నాడు.

ఈశ్వర కటాక్షంవల్ల వచ్చే కలలుఏమిటో, భూతాలు కల్పించే పీడకలలు ఏమిటో ఆయనకు బాగా తెలుసును. పూర్వం మహాత్ముడు ఆంథోనీకి, సెయింట్ జాన్‌కు వచ్చిన స్వప్నాలు ఆయన కిప్పుడు జ్ఞాపకం వచ్చాయి. సెయింట్ జాన్‌ను భూతాలు అరవై యేండ్లపాటు పీడకలలతో వెంటాడి వేధించాయి. ఒకనాడు భూతం మనిషిరూపంలో జాన్ దగ్గరికి వచ్చింది. "జాన్! నీవు రేపురాత్రి చంద్రోదయం అయ్యే వరకూ కటికి ఉపవాసం ఉండు" అని చెప్పి వెళ్లింది. భగ వంతుడు ఆ రూపంలోవచ్చి ఆజ్ఞయిచ్చాడని నమ్మాడు జాన్. ఆ మరుసటిరో జంతా అలాగే నిరాహారదీక్షతో ఉన్నాడు. కాని అది భూతం చేసిన మాయ అని తరువాత తెలుసుకున్నాడు.

ఇవన్నీ తెలిసిన పఫ్నూటియస్‌కు ఇప్పు డీ కల ఆశ్చ ర్యాన్ని కలిగించలేదు. ఆయన ఇలా ఆలోచిస్తూ నడిచి వెడు తున్నాడు. నగరవీధులలో నడవడం అలవాటు తప్పింది ఆయనకు. వీధుల్లో జనసమ్మర్దం మిక్కుటంగా ఉన్నది. వచ్చేపోయే జనాన్ని తప్పుకుని నడవలేకపోతున్నా డాయన. కొంద రాయన్ను తాకుతూ పోతున్నారు. కొందరు త్రోసి నెట్టి వెడుతున్నారు. కొందరు ఈ విచిత్రవ్యక్తి ఎవరా అని ఆయనవంక అదోలా చూస్తున్నారు.

ఇంతలో జనమంతా ఒకేవైపుకు పరుగులు తీస్తూ వెడుతుండడం ఆయనచూచాడు. ఓహో, ఏంజనం? గుంపులు గుంపులు జనం! ఏదో కొంప మునిగిపోతున్నట్లు అందరూ పరుగెడుతున్నారు. వాళ్ళంతా అలా ఎక్కడికి, ఎందు నిమిత్తం వెడుతున్నారో తెలుసుకోవాలనే కుతూహలం కలి గింది ఆయనకు. పోతున్నవారిలో ఒకర్ని పిలిచి "ఏమిటీ? జనమంతా ఇంత హడావుడిగా వెడుతున్నారు ఎందుకూ?" అని అడిగాడు.

"నీ వెవరో పరదేశివిలాగా ఉన్నావే? తెలీదుటయ్యా ఇవాళ నాటకంలో థాయిస్ వేషంవేస్తున్నది. వేషంలో ఆమెను చూచి తీరాలి! ఓహో, ఏమి ఆట, ఏంపాట! అభి నయంలో ఆవిడకు ఆవిడేసాటి! మేమంతా నాటకశాలకు వెడుతున్నామయ్యా" అని జవాబు చెప్పాడు ఆవ్యక్తి. "నీవు కూడా వస్తేరా, నాతో" అన్నాడు కూడా.

రంగస్థలం మీద థాయిస్ ఎలా నటిస్తుందో చూదా మనుకున్నాడు పఫ్నూటియస్. ఆ అపరిచితవ్యక్తివెంట నాటకశాలకు వెళ్ళాడు. నాటకశాల ద్వారమంటపం రంగు రంగుల గుడ్డలతో, కాగితాలతో అలంకరించారు. నాటక శాల వర్తులాకారంలో ఉన్నది. గోడలనిండా గొప్ప గొప్ప అందమైన ప్రతిమలు ఉన్నాయి. వారు ఒక సన్నని త్రోవ గుండా లోనికి వెళ్ళారు. లోపల, చిట్టచివర రంగస్థలం దీప కాంతులతో వెలుగుతున్నది. ఆ అపరిచితవ్యక్తితో పాటు పఫ్నూటియస్ వెళ్లి ఒక కుర్చీలో కూచున్నాడు రంగస్థల

శూన్యంగా ఉన్నది. కాని అద్భుతంగా అలంకరించారు. తెర గుడ్డ లేనందువల్ల రంగభూమి లోపలిభాగ మంతా కను పిస్తున్నది. ఒక పెద్ద గుడారం వేశారు. గుడారం మధ్యలో కథానాయకుడు ఆసీనుడు కావడానికి కాబోలు ఒక ఎత్తైన తిన్నె అమర్చారు. గుడారం మొదట్లో బంగారురంగు పూల మాలలతోను, రకరకాల ఆకుల తోరణాలతోను అలంకా రాలు చేశారు.

రంగస్థలం నిశ్శబ్దంగా ఉన్నది. నాటకశాల ప్రేక్ష కులతో నిండింది. ప్రేక్షకులలోనుంచి గుసగుసధ్వనులు ఒక సన్నని సంగీతంలా వినవస్తున్నవి.

పఫ్నూటియస్ లోలోపల దైవధ్యానం చేసుకుంటూ కదలక, మెదలక కూచున్నాడు. కాని ఆయనవెంట వచ్చిన అపరిచితవ్యక్తి ఉద్విగ్నుడై ఇలా మాట్లాడసాగాడు:

"వెనుకటి నాటకాలకూ ఇప్పటి నాటకాలకూ పోలికే లేదు. వెనుకటి నాటకాల్లో చక్కగా పాటలు, పద్యాలు పాడుతూ అభినయించేవారు. ఇప్పు డదంతా పోయింది. పాటలులేవు, పద్యాలులేవు. వట్టి మూకాభినయమే. ఓహో! ఆ నాటకాలెక్కడ, ఈ నాటకాలెక్కడ! ఆ నాటకాల్లో ఎంత మధురమైన సంగీతం వినేవాళ్ళం! కథానాయకుడు, కథానాయిక ఒక్కొక్క విషాదగీతం ఆలాపిస్తుంటే ఒడలు పులకరించిపోయేది. ఏలోకంలో ఉన్నామా అనిపించేది. కాలం గడిచినకొద్దీ మన నాటకకళ, సంగీతకళ పతనం కావడం మొదలుపెట్టాయి."

"తమ పేరేమిటి?" అని అడిగాడు పఫ్నూటియస్.

"నన్ను డోరియన్ అంటారు. నాటకాలు చూడడం నాకు అలవాటు. నా సిద్ధాంతాలు, అభిరుచులు వేరులెండి. మీకు నచ్చుతాయో, నచ్చవో! ఆడవాళ్ళంటే నాకు గిట్టదు. చూచారా? ఈ స్త్రీలే మనకు శత్రువులు! స్త్రీల వల్లనే మానవజాతి పతనమవుతున్నది." అన్నాడు కొత్తవ్యక్తి.

"మీరు చాలా బాగా మాట్లాడుతారు. మీరన్నది ముమ్మాటికీ నిజం." అన్నాడు పఫ్నూటియస్.

"అవునండీ. స్త్రీవల్ల మనకు కలిగేది ఆనందం కాదు, విషాదం! వాళ్ళ కులుకులు, పలుకులు, వాళ్ళ లాలింపులు, పాలింపులు — వీటన్నిట్లోనూ విషం, కాలకూట విషం ఉన్నదంటే నమ్మండి! ప్రేమ అనేది ఉన్నది చూచారా? అదే సర్వ అనర్థాలకు కారణం. చిన్నప్పుడు మా గురువుగారు చెప్పేవారు: "స్త్రీ వలలో చిక్కితే మరి జీవితాంతం బయట పడలేమని." అన్నాడు డోరియన్.

"అవుతే డోరియన్! మీకు ఇష్టమైన విషయాలేమిటి?" అని అడిగాడు పఫ్నూటియస్.

"నాకిష్టమైనది ఒకటే ఒకటి ఉన్నది. అదేమంత చెప్పుకోదగింది కాదులెండి; ధ్యానంలో ఉండడమంటే నాకెంతో ఇష్టం. ముందు మనస్సు కుదిరితే కదా మరేదైనా ఘనకార్యం సాధించడానికి" అన్నాడు డోరియన్.

దీన్ని అవకాశంగా తీసుకుని పఫ్నాటియస్ ఆత్మానం దాన్ని గురించి, ఈశ్వరతత్వాన్ని గురించి ఆ కొత్త స్నేహితుడితో చెప్పడం మొదలుపెట్టాడు:

"డోరియన్! ఆత్మానందం ఉన్నదే – అది...... ......" ఇలా ఆయన చెప్ప బూనుకున్నంతలోనే ప్రేక్షకులలో అనేకమంది తలలు త్రిప్పి ఆయనవంక చూచారు. మాట్లాడక, నిశ్శబ్దంగా ఉండవలసిందని సైగలుచేశారు. దాంతో ఆయన మాట్లాడక ఊరుకున్నాడు.

నాటకశాల అంతా నిశ్శబ్దమయింది. రంగస్థలంలో నుంచి సన్నని సంగీతం వినిపించసాగింది. ఆట మొదలయింది. గుడారం దృశ్యం అది. గుడారాలలోనుంచి సైనికులు మెల్ల మెల్లగా ఇవతలికొచ్చారు. ఎవరి త్రోవన వాళ్ళు వెళ్ళడానికి సన్నాహాలు చేసుకోవడం మొదలుపెట్టారు. గుడారం మధ్యన ఒక గోరీ కనుపిస్తున్నది. చనిపోయిన ఒక చక్రవర్తి గోరీ అది. సైనికులు అలా వెళ్ళబోతుండగా, చక్రవర్తి ఒక భూతం ఆకారంలో ప్రత్యక్షమైనాడు. సైనికులవంక తన దీర్ఘ బాహువులు చాచి "నాయనలారా! మీరు వెళ్ళిపోతున్నారా? ఇది మీకు న్యాయమేనా? మాతృదేశానికి ద్రోహం చెయ్యకండి. బందీగా ఉన్న మీ సోదరిని విడిపించండి!" అని చెపుతున్నట్లుగా కనుపించింది ఆ భూతం.

అంతట వెళ్ళిపోతున్న సైనికులు వెనక్కు మళ్ళారు. విలువైన దుస్తుల్లో మహావీరుడులా అగుపిస్తున్న సేనాపతి ముందుకు వచ్చాడు.

భూతం మాయమైంది. మరొక తెర లేచింది. లోపల్నుంచి ఒక వృద్ధురాలు ఇవతలికి వచ్చింది. తల విరియబోసుకున్నది. కట్టుబట్టలు పీలికలయి ఉన్నాయి. సేనాపతి చెంతకు వచ్చి ఆ వృద్ధురాలు గోడుగోడున దుఃఖించింది. తన కూతురు, అందాలకుప్ప శత్రువులచేతుల్లో బందీగా ఉన్నదని చెప్పింది. ఆవిడను విడిపించవలసిందని ప్రతిమాలుతూ పెద్దపెట్టున ఏడ్చింది. సేనాపతి ఆ వృద్ధురాలికి ధైర్యం చెప్పి ఓదార్చాడు.

ఈ దృశ్యం చూస్తూ ప్రేక్షకులంతా బరువుగా నిశ్వసించారు.

తరువాత లోపలి గుడారం తెర లేచింది. ఒక అప్సరస లాంటి అమ్మాయి మేఘంలోనుంచి మెరుపు వచ్చినట్లు రంగస్థలంమీదికి వచ్చింది. వెంటనే ప్రేక్షకుల్లో గుసగుసలు బయలుదేరాయి. ఒక సన్నని గాలితెరవంటి మర్మరధ్వని అంతటా వ్యాపించింది. "అదిగో థాయిస్! అదిగో థాయిస్!"

పఫ్నూటియస్, థాయిస్‌వంక తదేకంగా చూడసాగాడు. రెండుప్రక్కలా రెండు సెలయేళ్లు ప్రవహిస్తున్నట్లున్న ఆవిడ దీర్ఘ బాహువులు, తళతళ మెరుస్తున్న ఆవిడ నీలాల కళ్ళు – అప్సరసలను తలదన్నే ఆ సౌందర్యం– చూచి ఆయన ముగ్ధుడైపోయాడు.

ఒక మహా శిల్పి చేసిన శిలాప్రతిమలా థాయిస్ రంగస్థలంమీద నిలుచున్నది. ప్రేక్షకుల కళ్లకు ఒక మైకపుపొర లాంటిది వచ్చి కమ్మింది. ఒక క్షణికంసేపు అందరూ ఏదో

లోకంలో ఉన్నారు. తరువాత హర్షధ్వానాలతో నాటకశాల ఊగిపోయింది!

"భగవంతుడా! ఈ అమ్మాయికి ఇంత అందం, ఇంత ఆకర్షణ ఎందుకు ఇచ్చావు తండ్రీ!" అంటూ నిశ్వసించాడు పఫ్నూటియస్.

థాయిస్ విష విషాదగానాన్ని ఆలాపించింది. ఆవిడ గానం గంధర్వగానాన్ని మరపించింది. ఆటలో పాటలో అందె వేసిన చెయ్యి ఆమె. ఆవిడ అలా పాడుతూ ఆడుతూ అభినయిస్తుంటే ప్రేక్షకుల హృదయాలు ఊగిపోయినాయి, తూగిపోయినాయి. తమ్ము తాము మరిచి అందరూ ఒక మధుర జగత్తులో, ఒక స్వాప్నిక జగత్తులో మునిగిపోయారు.

అలా ఎంతసేపు గడిచిందో ఎవరికీ తెలీదు. థాయిస్ అలా ఎంతసేపు ఆడిందో, ఎంతసేపు పాడిందో ఎవ్వరూ ఎరుగరు.

నాటకం ముగిసింది. తెర వాలింది. ప్రేక్షకులకు తెలివి వచ్చింది. అందరూ లేచారు. గుంపులు గుంపులుగా ఇళ్లకు మళ్లారు. త్రోవలో అందరూ ఆవిడమాటే చెప్పుకున్నారు. ఆవిడ అంద చందాలను గురించి, ఆవిడ ఆటా పాటా, అభినయాలను గురించే;—ఎవరినోట విన్నా ఆవిడ మాటే!

నాటకశాలనుంచి బయటికి వచ్చాడు పఫ్నూటియస్. ఆ జనసందోహంనుంచి బయటపడి త్రోవపట్టాడు.

ఒక గంటతరువాత థాయిస్ గృహానికి వెళ్లాడు. అలెగ్జాండర్ సమాధివద్ద ఉన్న ఒక విలాసమందిరం అది! మందిరం చుట్టూ ఒక చక్కని ఉద్యానవనం ఉన్నది, వనంలో ఒక ఏరు జలజల ప్రవహిస్తున్నది. ఏటికి ఇరుదరులా ఎత్తుగా ఎదిగిన ఏపెచెట్లున్నాయి.

పఫ్నూటియస్ వెళ్లి తలుపు తట్టాడు. నల్లగా, కొరివి దయ్యంలా ఉన్న ఒక దాసీమనిషి వచ్చి తలుపుతీసింది.

"ఎవరికోసం ?" అని అడిగింది.

"థాయిస్‌తో పనుండి వచ్చాను. కొంచెం మాట్లాడాలి, దేవుడిమీాద ఒట్టు! మరో ఉద్దేశంతో రాలేదు!" అన్నాడు పఫ్నూటియస్.

ఆయన విలువైన ఉడుపులు ధరించి వుండడం, శాంత గంభీరవచనాలు పలకడం చూచి ఆదాసీది ఆయన్ను లోపలికి రానిచ్చింది.

"రండి, దొరసాని లోపల ఉన్నది" అంటూ ఆయన్ను భవనంలోకి తీసుకొనివెళ్లింది.



# రెండవ భాగము

థాయిస్ ఒక నిరుపేదల ఇంట పుట్టింది. అలగా జనం మధ్య అల్లరి – చిల్లరగా పెరిగింది. ఆవిడ తల్లి దండ్రులు విగ్రహారాధకులు. థాయిస్ పసి పిల్లగా ఉన్నప్పుడు, ఆమె తండ్రి అలగ్జాండ్రియా నగరంలో ఉండేవాడు. నగరంలో 'చంద్రమంటపం' దగ్గర ఒక ఇల్లు తీసుకొని వచ్చేపోయే జనానికి పూటకూళ్ళు పెడుతుండేవాడు. తరుచు నావికులు, పడవకూలీలు, యాత్రికులు అక్కడికి వస్తుండేవారు.

థాయిస్‌కు తన పసితనం అంతగా గుర్తులేదు. ఇప్పుడది తలుచుకొంటే ఆవిడకు ఏదో లీలగా జ్ఞాపకాలొస్తాయి. ఆవిడ తండ్రి పొడుగ్గా పీలగా ఉండేవాడు. చూస్తే భయం పుట్టేటట్లు ఉండేవాడు మనిషి. ఎప్పుడూ ఏదో ఆలోచిస్తూ అరుగుమీాద వక మూలన కూచునేవాడు. తల్లికూడా బక్కపలచగా ఉండేది. చిరిగిన బట్టలు, చింపిరితల, బిచ్చకత్తెకంటె హీనంగా ఉండేది. ప్రొద్దస్తమానం సివంగిలా జుట్టు విరియబోసుకొని ఊరంతా తిరిగేది. బ్రెగొంతు పెట్టుకొని అరుస్తుండేది. ఆ చుట్టు ప్రక్కన జనమంతా ఆమె ఒక మంత్రగత్తె అని చెప్పుకొనేవారు. మాయలకూ, మంత్రాలకూ ఆమెది పెట్టింది పేరట! రాత్రిళ్ళు గ్రుడ్లగూబగా మారుతుం

దనీ, అలా మారురూపు ధరించి తన మిండగాళ్ల దగ్గరికి పోతుందనీ అంతా అనుకొనేవారు. కాని అదంతా అబద్ధం. తన తల్లి ఎక్కడెక్కడ తిరిగేదీ, ఏమేమి చేసేదీ ఎప్పుడూ గమనిస్తూ ఉండేది థాయిస్. పాపం మాటలేకాని ఆ ముసలి దాని దగ్గర మంత్రాలూ లేవు, మాయలూ లేవు. అవుతే వఠి తిండిపోతు. ఎప్పుడూ తిండికి మొహంవాచినట్లుండేది. డబ్బంటే పడిచచ్చేది. ఆ వృద్ధురాలి ఆశకు అంతూ - పంతూ ఉండేదికాదు. ప్రతిరోజూ రాత్రిపూట డబ్బులన్నీ ముందు పోసుకొని లెక్కపెట్టుకుంటూ కూచునేది. తెల్లవార్లూ ఆమె కదే పని! తండ్రి సోమరిపోతు, తల్లి తిండిపోతు – ఇహనేం? థాయిస్‌కుకూడా చిన్నతనంనుంచే డబ్బుపిచ్చి పట్టుకుంది. సులువుగా, సుఖంగా ధనం ఆర్జించడంలో ఆరితేరింది ఆ పిల్ల!

మాటలయినా సరిగా రాని వయస్సులోనే ఆ అమ్మాయి ఇంటికి వచ్చినవారి దగ్గరికి తప్పటడుగులు వేస్తూ వెళ్లి, వాళ్ళ కొంగున కట్టుకొన్న బంగారు నాణాలు దొంగిలించి తేవడం నేర్చుకొన్నది. పూటకూళ్ల ఇల్లు కావడంవల్ల అక్కడికి తెరిపి లేకుండా జనం వస్తుండేవారు. వారంతాకూడా జూదానికీ, పానానికీ, చోరత్వానికీ, జారత్వానికీ అలవాటుపడిన ఒక అల్లరి - చిల్లరి మూక. ఈ మూకంతా ఆ ఇంట్లో పోగయి అహర్నిశలూ తిని, తాగి ఇష్టంవచ్చినట్లు పడి పొర్లుతుండేది. రాత్రిళ్ళు మరీ భయంకరంగా ఉండేది ఆ కొంప. తిన్నంత తిని, తాగినంత తాగి కక్కేవాళ్ళు, వళ్ళుమరచి వదరే వాళ్ళు, తాగుతూ తూగుతూ లల్లాయిపదాలు పాడేవాళ్ళు, చీట్లాడేవాళ్ళు, పోట్లాడేవాళ్ళు—ఓ! ఒక టేమిటి? నానా

అపభ్రంశమంతా ఆ కొంపలో కొట్టుమిట్టాడుతూ ఉండేది. ప్రతి రాత్రీ ఇంతే - ఇంట్లోవారికి నిద్దర్లు ఉండేవి కావు. ఒక్కొక్క రాత్రి థాయిస్‌కు అకస్మాత్తుగా మెలకువ వచ్చేది. చూడకూడని దృశ్యాలెన్నో ఆవిడ కళ్లతో చూచేది. వినకూడని విషయాలెన్నో ఆవిడ చెవులతో వినేది జూదగాళ్లు, త్రాగుబోతులు, ఒడలు తెలియని కోపావేశాలతో ఒకరి నొకరు తిట్టుకొనేవారు, కొట్టుకొనేవారు. బల్లలు, కుర్చీలు ఎత్తి ఒకరిపై ఒకరు విసురుకొనేవారు. బాకులు తీసుకొని భయంకరంగా పొడుచుకొనేవారు. గాజుగ్లాసులు, పానపాత్రలు పగిలిపోయేవి. బల్లలు, కుర్చీలు విరిగేవి. లాంతర్లు ముక్కలు ముక్కలు అయి ఇల్లంతా పొగ కమ్ముకునేది. ఆ కొట్లాటలో కొందరికి తలలు పగిలేవి. కొందరికి ఒళ్లంతా గాయాలయ్యేవి. నట్టింట నెత్తురు వరదలై పారేది!

పాపం, అశుభమూ-శుభమూ ఎరుగని పసిపిల్ల థాయిస్. ఆ పిల్లవిషయం ఎవరూ పట్టించుకునేవారు కాదు. ఒక పరిచారకుడు పసితనంలో ఆ పిల్లను ప్రేమతో దగ్గరికి తీసి పెంచాడు. అతని పేరు అమెస్. అతను మనిషి చాలా నెమ్మది. మనస్సు మెత్తనిది. అతను ఆ ఇంట్లోనే నౌకరుగా ఉంటుండేవాడు. మనిషి నల్లగా, కుమ్మరావం ఉన్నట్లుండేవాడు! పగలు చూస్తే రాత్రి కలలోకి వస్తాడా అనిపించేది. మనిషి ఎలా ఉంటేనేం? మనస్సు వెన్నపూస. చల్లని, మెల్లని చూపులతనివి. అతను థాయిస్‌ను దగ్గరికి తీసేవాడు. ఎత్తుకొని తిప్పేవాడు. ఒళ్లో కూచోబెట్టుకొని ఎన్నెన్నో పూర్వకాలపు కథలు, గాథలు చెప్పేవాడు. దురాశాపరులై రాజ్యాలను

కొల్లగొట్టిన రాజుల కథలు, అనేక సాహస కృత్యాలు చేసి రాకుమార్తెలను పెండ్లాడిన దొంగల గాథలు, ఎన్నెన్నో అద్భుతాలు చేసిన వేశ్యల కథలు, నాట్యకత్తెల గాథలు చెప్పేవాడు ఇంకా ప్రపంచంలో చిత్ర విచిత్రమైన విషయాలెన్నో కమ్మని కథలుగా అల్లి చెప్పేవాడు. థాయిస్ ఇవన్నీ ఎంతో ఆసక్తితో వినేది. అమెస్ అంటే ఆ పిల్లకు ఎంతో ఇష్టం. ఆ అమ్మాయికి తల్లి అయినా అతనే, తండ్రి అయినా అతనే, దాసీది అయినా అతనే, ఆఖరుకు ఆటవస్తువు అయినా అతనే! అహర్నిశలూ అతని చెంతనే ఉండేది. అతను ఏపని చేసుకొంటున్నా, వెంటవెళ్ళి కాళ్ళకాళ్ళకు చుట్టుకొనేది! పాపం, అమెస్‌కు క్షణం తీరుబడి ఉండేదికాదు. పగలంతా ఇంటిపనులు — వంటా, పెట్టూ, వీటితోనే సరిపోయ్యేదతనికి. ఇహ రాత్రిళ్ళు అంతా పడుకున్నా అతను కన్ను మూసేవాడు కాదు. థాయిస్‌ను ఎత్తుకొని గొడ్లను కట్టివేసే కొష్టంలోనికి వెళ్ళేవాడు. అక్కడ ఆ పిల్లను కూచోబెట్టుకొని రకరకాల బొమ్మలు, ఆటవస్తువులు చేసి యిచ్చేవాడు. కాగితపు పడవలు, యింకా చిత్ర విచిత్రాలయిన వస్తువులు చేసి ఆ పిల్లను ఆడించేవాడు.

అమెస్ జీవితం మహా దుర్భరంగా ఉండేది. యజమానులు ఆ సేవకుణ్ణి పశువుకంటె హీనంగా చూచేవారు. నానా తిట్లూ తిట్టేవారు. గొడ్డును మోదినట్లు చావమోదేవారు. అతని దేహంమీద గాయంకానిస్థలం లేదు. ఒక చెవి తెగిపోయిందికూడా! యజమానులు ఇంత క్రూరంగా హింసిస్తున్నా, అతను ఎప్పుడూ ఎదురుతిరిగేవాడు కాదు. పల్లెత్తు

మాట బదులు చెప్పేవాడు కాదు. అన్నీ సహించేవాడు. ఎప్పుడూ శాంతంగా, చిరునవ్వు నవ్వుతూ ఉండేవాడు. ఇంతటి సహనము, హాయి అతనికి ఎలా అలవడినాయో ఎవ్వరూ ఎరుగరు. శిశువుగా, అమాయకంగా ఉండేవాడు. బండచాకిరీ చేసేవాడు. అయినా అలసినట్టు అగుపించడు. ఎల్లప్పుడూ హాయిగా పాటలు, భజనకీర్తనలు పాడుకొంటూ ఉల్లాసంగా ఉండేవాడు.

"ఎక్కడున్నావు మేరీ మాతా
చిక్కుబాపవా సుజాతా!
దివ్య సమాధిలో దేవకన్యలూ
నృత్యము చేయగ సత్యము పాడగ
ఎక్కడున్నావు మేరీ మాతా!......"

ఇలా గానంచేసేవాడు అమెస్. ఇది విని థాయిస్, "నాన్నా! దేవకన్యలను గురించి పాడతావు దేనికినాన్నా?" అని అడిగేది.

"అవునమ్మా. మనలను పాలించే భగవంతుడు – ఆ ఏసుప్రభువున్నాడే – ఆయన దేవలోకంలోకి వెళ్లాడమ్మా. అందుకే ఇలా పాడుతున్నాను తల్లీ—" అని సమాధానం చెప్పేవాడు అమెస్.

అమెస్ అచ్ఛమైన, స్వచ్ఛమైన క్రైస్తవుడు. చిన్నప్పుడే మతం పుచ్చుకొన్నాడు. థియోడర్ అని పేరు పెట్టుకొన్నాడు. పగలంతా యజమాని ఇంట్లో పనిచేసి, రాత్రిళ్ళు

తనకు తీరిక చిక్కిన సమయంలో నిద్రకూడా మాని రహస్యంగా మతబోధలు వినడానికి వెడుతుండేవాడు.

ఆ కాలంలో క్రైస్తవ దేవాలయాలు అనేక కష్టనష్టాలకు గురి అవుతున్నాయి. దేవాలయాలన్నీ ధ్వంసం చెయ్యమని చక్రవర్తి వుత్తర్వులిచ్చాడు. ఆప్రకారం కనుపించిన ఆలయమల్లా పడగొట్టి ధ్వంస చేస్తున్నారు. పవిత్రమైన మత గ్రంధాలన్నీ ఎక్కడపడక్కడ తగులబెడుతున్నారు. దేవాలయాలలో దీపారాధనలు చెయ్యనివ్వడంలేదు. అర్చన పాత్రలు దోచుకపోతున్నారు. పూజాద్రవ్యాలు పాడుచేస్తున్నారు క్రైస్తవుడన్నవాడికి గతిలేదు, గౌరవంలేదు, నిలువ నీడలేదు, బ్రతికే తెరువులేదు — మరణంతప్ప మరేమీ శరణ్యంలేదు. అలగ్జాండ్రియా నగరంలోని క్రైస్తవులంతా భయాందోళనతో ఊగిపోతూ, ఊపిర్లు గుప్పిట పట్టుకొని ఉంటున్నారు. ఎప్పుడే ముసరు ముంచుకొస్తుందో ఎవ్వరికీ తెలియదు. కనుపించిన క్రైస్తవుణ్ణల్లా పట్టుకొని జైల్లో పెట్టుతున్నారు. ఈ జనంతో జైళ్ళన్నీ నిండిపోతున్నాయి. సిరియాలో, అరేబియాలో, మెసపటోమియాలో, కపాడోషియాలో — రాజ్యం అంతటా బిషప్‌లనూ క్రైస్తవ కన్యలనూ ఇష్టంవచ్చినట్లు కొరడాలతో కొడుతున్నారు. నానా హింసలు పెడుతున్నారు. కొరతగా వేస్తున్నారు. క్రూర మృగాలకు ఆహారంగా అప్పగిస్తున్నారు. ఎక్కడబట్టినా క్రైస్తవులంతా చెప్పుకొనే విషయం ఇదే. వారు ప్రాణాలు అరచేత పెట్టుకొని భయ విచలితులై పోతున్నారు. ప్రవక్త, ఈజిప్షియన్ క్రైస్తవులకు పెద్ద అయిన ఆంధోనీ — ఎడారులనుంచి అప్పుడే

తిరిగివచ్చాడు. అలగ్జాండ్రియా నగరంలో ప్రవేశించాడు. ప్రతి దేవాలయానికీ, వెళ్ళి తీవ్రమైన మతోద్రేకంతో, మతస్థు లందరిలోనూ ఆరిపోయిన అగ్నిహోత్రాలు తిరిగీజ్వలింప చేస్తున్నాడు. విగ్రహారాధకుల కంటపడకుండా క్రైస్తవ సభలు, సమావేశాలు జరుపుతున్నాడు. ఉద్రిక్తమైన ఉప న్యాసాలు కావిస్తున్నాడు

ఒకవంక పరిస్థితి ఇలా ఉండగా, మరొకవంక బానిస లయిన వారు నానా హింసలపాలవుతూ వచ్చారు. వారిలో చాలామంది మిక్కిలి భీతిల్లి క్రైస్తవ మతాన్ని నిరాక రించారు. ఇంకా అనేకమంది గుంపులు గుంపులుగా ఎడారులకు పారిపోయి అక్కడ సన్యాసులుగానూ, దోపిడీ దొంగలుగానూ మారిపోయారు. ఏమైనప్పటికీ అమెస్ మాత్రం క్రైస్తవ సభకూ హాజరవుతూ వచ్చాడు. జైళ్ళలో ఉన్నవారిని దర్శిస్తూ, చనిపోయినవారికి అంత్యక్రియలు చేయ డంలో సహాయపడుతూ వచ్చాడు. ఆవిధంగా అతను క్రైస్తవ మతంపై తనకుగల భక్తి ప్రపత్తులను ఆనందంతో వెలిబుచ్చసాగాడు. అతని అచంచలమైన దీక్ష, ఆత్మశక్తి చూచి మహనీయుడైన ఆంథొనీ ఎంతగానో మెచ్చుకున్నాడు. ఆయన తిరిగి ఎడారులకు వెళ్ళేముందు నల్లబానిస అయిన అమెస్‌ను ఆనందాతిరేకముతో ఆలింగనం చేసుకొని అతని చెక్కిళ్ళు ముద్దాడాడు.

థాయిస్ ఏడేండ్ల పిల్లగా ఉన్నప్పుడే అమెస్ ఆమెతో ఈశ్వరుణ్ణి గురించి మాట్లాడటం మొదలుపెట్టాడు.

"ఆ భగవంతుడు స్వర్గంలో ఉంటాడమ్మా. సుందర నందనోద్యానవనంలో దివ్యకాంతులు విరజిమ్ముతూ విహరిస్తుంటాడమ్మా. ఆయన ఆదిపురుషుడు. ఆద్యంతరహితుడు. ఆయనకొక కుమారుడున్నాడు. ఆయనే జీసస్ ప్రభువు. భగవంతునికి తన కుమారుడంటే అమితమైన ప్రేమ. దేవకన్యలకంటె, మన్మధునికంటె సుందరమూర్తిగా తన కుమారుణ్ణి సృష్టించాడు. కుమారుణ్ణి దగ్గరికి పిలచి ఇలా చెప్పాడు—

"నాయనా! నీవు ఈ స్వర్గాన్నీ, ఈ నా దివ్యసుందర భవనాలనూ, ఉద్యాన వనాలను దివ్య నదులనూ వదలివెళ్లు. మానవ క్షేమంకోసం పుడమిపై అవతరించు. అక్కడ పేదల్లో పేదగా జీవించు. కష్టాలనూ, కన్నీళ్లనూ, అన్నం - నీళ్లుగా చేసుకొని జీవించు. నీ కన్నీళ్లే గంగావాహినులయి ప్రవహిస్తాయి. పతితులు, బాధితులు ఆనదీజలాలలో స్నానాలాచరించి తమ పాపాలను క్షాళితం చేసుకొంటారు నాయనా వెళ్లు"

"జీసస్ రాకుమారుడు భగవదాజ్ఞను శిరసావహించాడు. భూమిమీద అవతరించాడు. జుడయాకు చెందిన బెత్లహేమ్ అనే ప్రదేశంలో అడుగుపెట్టాడు. అక్కడనుంచి అడవులు, వనాలు, నదీతీరాలు తిరిగాడు. తన అనుచరులకు ఇలా చెప్పాడు – 'ఆకలితో బాధపడుతున్నవారిని నా తండ్రి సాన్నిధ్యానికి చేరుస్తాను. అక్కడ వారికి షడ్రసోపేతమైన భోజనం లభిస్తుంది. దప్పిక గొన్నవారికి ఆ దివ్యలోకంలో అమృతం లభిస్తుంది. ఎవరు దుఃఖంతో కుమిలిపోతున్నారో, వారి దుఃఖాన్ని నేను పోగొడతాను–" ఇలా చెప్పడంవల్ల

నిరుపేద లాయనను ఆశ్రయించడం మొదలుపెట్టారు. ఆయ నను విశ్వసించసాగారు. కాని ధనికులు ఆయనను ద్వేషిం చారు. ఆయన పేదవాళ్లను తమకంటె భాగ్యవంతులుగా చేస్తాడని వారు భయపడ్డారు. ఆ సమయంలో క్లియోపాత్రా, సీజరు లోకంలో అధిక శక్తివంతులయి ఉన్నారు. వారు జీసస్‌ను ద్వేషించారు. ఆయనకు మరణశిక్ష విధించవలసిన దని న్యాయాధిపతులకు, మతాధికారులకు ఆజ్ఞలిచ్చారు. ఈజిప్టురాణి ఆజ్ఞను శిరసావహిస్తూ సిరియా రాకుమారుడు ఒక ఎత్తయిన పర్వతంపైన ఒక శిలువను నాటాడు. వారు జీసస్‌ను ఆ శిలువకు ఆనించి నిలుచోబెట్టారు. శరీరం నిండా మేకులు కొట్టి ఆయనను హింసించి చంపారు. కాని స్త్రీలు ఆయన దేహంపై గాయాలు కడిగి, శవాన్ని పూడ్చిపెట్టారు. అంతట జీసస్‌ప్రభువు పునర్జీవుడై, సమాధిని పగులగొట్టుకొని బయటికి వచ్చాడు. స్వర్గానికి ఎగిరిపోయి తిరిగీ తన తండ్రి అయిన భగవంతుని చేరుకొన్నాడు.

"అప్పటినుంచీ ఆయనను నమ్ముకొన్న వారంతా స్వర్గా నికి వెడుతూవచ్చారు. అక్కడ ఈశ్వరుడు వారిని ప్రేమతో ఆహ్వానించి 'మీరు నా కుమారుని ప్రేమించారు. కనుక రండి. వచ్చి నాతోపాటు స్వర్గసౌఖ్యాలన్నీ అనుభవించండి-' అని చెప్పాడు.

"ఆవిధంగా జీసస్‌ను నమ్మినవారంతా స్వర్గానికి వెళ్లి అక్కడ దివ్యనదీ తోయాలలో జలకాలాడి, ఎల్లప్పుడూ దివ్యగానాన్ని దేవకన్యల నాట్యాన్ని వింటూ-కంటూ అమృతం సేవిస్తూ ఎనలేని సౌఖ్యాలు అనుభవిస్తున్నారు.

ఇంకా వారి కథలు చెప్పాలంటే ఒక్కరోజు చాలదు. ఆ కథలు ఎంత విన్నా తనివితీరదు. వారంతా ఈశ్వరునికి ప్రియతములు, ప్రేమపాత్రులు. ఆ భగవంతుడు వారందరినీ తన కనులలో పెట్టుకొని కాపాడుతున్నాడు. వారంతా ఆయన దివ్యమందిరంలో తిరుగుతున్నారు. రత్నకంబళ్ళపై నడుస్తున్నారు నందన వనాలలో విహరిస్తున్నారు. అక్కడున్న అమృతఫలాలు ఆరగిస్తున్నారు—"

ఈవిధంగా అమెస్ ఎన్నో రాత్రిళ్ళు థాయిస్‌కు ఈశ్వర మహిమనుగూర్చి కథలు కథలుగా చెప్పాడు. ఈశ్వర తత్త్వాన్ని బోధించాడు. ఆ పసిపిల్ల ఇవన్నీ విని ఆశ్చర్యపోయేది. ఆనందించేది.

"నేనుకూడా స్వర్గానికి వెళ్ళి ఆ అమృతఫలాలు అందుకోవాలని ఉంది—" అనేది ఆ పిల్ల.

అప్పుడు అమెస్ — "మతం పుచ్చుకొన్న వారు మాత్రమే ఆ దివ్యఫలాలను చవిచూడగలరమ్మా—" అని చెప్పాడు.

అవుతే తానూ మతం పుచ్చుకుంటానన్నది థాయిస్. జీసస్‌పై ఆమెకుగల ప్రేమాభిమానాలకు సంతసించి అమెస్, ఆవిడకు మరింత ఎక్కువగా మతబోధ చెయ్యడం మొదలు పెట్టాడు. ఆవిడ మనస్సును పూర్తిగా మతంవైపు మళ్ళించి, ఆమెను తన పెంపుడు కూతురుగా, దేవుడు ప్రసాదించిన పుత్రికగా భావిస్తూ వచ్చాడు.

థాయిస్ అంటే తల్లిదండ్రులకు ఎంతమాత్రం ప్రేమ లేదు. ఆ పిల్లను పెంచాలి, పోషించాలి అన్న శ్రద్ధాసక్తులు

వారికి ఏకోశాన లేనేలేవు. వారా పిల్లవిషయం పట్టించుకునే వారేకాదు. ఇంట్లో పడుకోడానికి చారెడు జాగాకుకూడా ఆచిన్నది నోచుకోలేదు. ఆమెను పశువుల కొట్టంలో పడేసే వారు. రోజూ రాత్రిళ్ళు అమెస్ రహస్యంగా అక్కడికి వచ్చేవాడు.

చింకిచాపపై పడుకొన్న ఆ పసిదాని చెంతకు వెళ్ళి ప్రక్కన కూచునేవాడు. అసలే అతను కారునలుపు. దానికి తోడు నల్లటి దుస్తులు. పైగా చీకటి. ఆ చీకట్లో అతనిరూపు కలిసిపోయేది. విశాలంగావున్న అతని తెల్లని కనులుమాత్రం మిలమిల మెరుస్తూ కనుపించేవి. నల్లటి మేఘాలలో నుంచి విద్యుత్కాంతులు వెలువడినట్లు, ఆ కనులలోనుంచి అద్భుత కాంతికిరణాలు ప్రసరించి ఎంతటి వారినీ కట్టిపడేసేది. అమెస్ గద్గద స్వరంతో ఏవేవో మాట్లాడేవాడు. ఆనిశ్శబ్ద నిశీధిలో అతని ఒకొక్క పలుకు ఒక్కొక్క పాటగా, చల్లని మెల్లని స్వరమేళలా వినిపించేది. థాయిస్ అమాయకంగా అతనివంక చూస్తూ చిరునవ్వులు నవ్వేది. ఏవేవో అలలూ కలలూ చెదురు చెదురుగా లేచి ఆ చిన్నదాని హృదయాన్ని ఉయ్యాల లూగించేవి. ఆ అమ్మాయి అతని మాటలే వింటూ, అతని రూపునే కంటూ ఆకులో పిందెలా, అతని చల్లని ప్రేమలో ప్రశాంతంగా నిద్రపోయేది.

ఇలా ఒక ఏడు గడచింది. నిత్యం ఆమెకు అతను ఉప దేశం చేస్తూనేవచ్చాడు. అంతలో క్రైస్తవులకు అతి పవిత్ర మైన 'ఈస్టర్' పండుగరోజులు వచ్చాయి. ఒకనాటి రాత్రి అమెస్ తనను ఎత్తుకొని వెడుతుండగా థాయిస్‌కు మెలుకువ వచ్చింది. చీకట్లో అతని కనులు మిరుమిట్లు గొలుపుతూ కను

పించాయి. అతను మామూలుగా చిరిగిపోయిన నల్లటి లాగు, చొక్కా వేసుకొనిలేదు. అమెన్ ఇప్పుడు వంటినిండా తెల్లటి మేలిముసుగు ఒకటి ధరించాడు. బిడ్డను రొమ్ముకు అదుముకొని నిండా ముసుగు కప్పాడు.

"నా చిట్టితల్లీ! నా బంగారుపాపా! నా ముత్యాల మొలకా! రామ్మా, రా! నీకు మతం ఇప్పిస్తాను" అన్నాడు రహస్యంగా.

థాయిస్‌కు భయంపుట్టింది. విచిత్రంగా తోచింది కూడా. ఆ ముసుగులోనుంచి తల బయటికి వెళ్ళబెట్టి, రెండు చేతులనూ అమెన్ మెడచుట్టూ పెనవేసింది. ఆవిధంగా అమెన్ ఆపిల్లను ఎత్తుకొని చీకట్లో పరుగుతీశాడు. వారు చీకటిగానూ, ఇరుకుగాను ఉన్న గొందులు – సందులు దాటారు. యూదులు నివసించే ప్రదేశం దాటివెళ్లారు. ఒక స్మశానందగ్గరికి చేరుకొన్నారు. అక్కడ ఏదో భయంకరమైన పక్షి అరుపు వినిపించింది. ఒక బయలుప్రదేశంగుండా వారు వెడుతున్నారు. పాతిన శిలువలు, వాటికి వ్రేలాడుతున్న అమరులైనవారి కళేబరాలు, శిలువల అంచులపైన ముక్కులతో టకటకున పొడుస్తున్న రాబందులు, – వీటిమధ్యనుంచి వెళ్ళారు. థాయిస్, ఆబానిసమెడ కరుచుకొని ముసుగులో దాక్కొన్నది. భయంవల్ల, పోయినంతలెక్కా మళ్ళీ తల బయటికి వెళ్ళబెట్టలేదు. తరువాత తానొక భూగృహంలోనుంచి వెడుతున్నట్లామెకు అనిపించింది. ఆపిల్ల మళ్ళీ కళ్ళు తెరిచి చూచేటప్పటికి తానొక గుహలో ఉన్నానని తెలుసు

కొన్నది. ఆగుహాలో గుగ్గిలపు పొడితో ధగధగ వెలుగుతున్న కాగడాలు కనుపించాయి. గోడలనిండా నిలువబడి ఉన్న మనుష్యులబొమ్మలు ఎన్నో చెక్కి—ఉన్నాయి. ఆ దివిటీల వెలుతురులో ఆబొమ్మలు తళతళమెరుస్తూ, ప్రాణంతో ఉన్నట్లు, కదులుతున్నట్లు కనుపిస్తున్నాయి. పురుషుల బొమ్మ లవి. ఆబొమ్మలు పొడుగాటి ఉడుపులు ధరించి, తాటిమట్టలు మోసుకపోతున్నాయి. బొమ్మలచుట్టూ గొఱ్ఱెపిల్లలు, పావురాళ్ళు, ద్రాక్షతీగెలు—ఉన్నాయి.

ఆ బొమ్మలలో జీసస్ బొమ్మను గుర్తు పట్టింది థాయిస్. జీసస్ ప్రభువు పాదాలపై పూలు రాశిగా పోసి ఉన్నాయి. గుహ మధ్యభాగంలో ఒక పెద్ద బండదగ్గర, ఒక నీటిచెలమ ఉన్నది. చెలమప్రక్క—న ఒక వృద్ధుడు నిలబడి ఉన్నాడు. అతను బంగారు జలతారు గల ఒక పొడుగాటి సిందూరపు రంగు అంగరఖా ధరించాడు. శిరస్సున బిషప్‌లు ధరించే ఒక చిన్న కిరీటం పెట్టుకొన్నాడు. ఆయన గడ్డం పొడుగ్గా పెరిగిఉన్నది. అంతటి విలువైన దుస్తులు ధరించి ఉండికూడా ఆయన ఎంతో ప్రసన్నవదనుడై కనుపిస్తున్నాడు. ఆయన ఒక బిషప్. ఆయన పేరు వివాంటస్. 'సిరేన్' చర్చికి చెందిన మతాధికారి. కాని ఆయన దేశంనుండి వెళ్ళగొట్టబడినాడు. ఇప్పుడు ఉన్నివస్త్రాలు నేసుకుంటూ సాధారణమైన జీవితాన్ని గడుపుతున్నాడు. అనాధులైన పిల్లలు ఇరువురు ఆయన ప్రక్క—న ఉన్నారు. వారికి చేరువగా ఒక నీగ్రోజాతి స్త్రీ ఉన్నది. ఒక చిన్న తెల్లచొక్కా— చేతపట్టుకొని నిలు

చున్నది. అమెస్, థాయిస్‌ను క్రింద దించి, ఆ బిషప్ ముందు మోకరిల్లాడు.

"ఫాదర్! ఇదిగోండి పసిపిల్ల – నా పంచప్రాణాలూ ఈ పసిపిల్లమీద పెట్టుకొన్నాను. మీకు వాగ్దానం చేసిన ప్రకారం ఈ బిడ్డను మీ చెంతకు తీసుకొనివచ్చాను. ఈమెకు మతం ఇప్పించి దైవానుగ్రహాన్ని ప్రసాదించండి స్వామీ."– అన్నాడు అమెస్.

ఈమాటలు విని బిషప్, భగ్నములైన తన రెండు హస్తాలను చాచాడు. మతంకోసం ఎన్నెన్నో శిక్షలనుభవించి ఉన్నందున ఆయన మునివ్రేళ్ళు తెగిపోయి ఉన్నాయి. థాయిస్‌కు భయం పుట్టింది. గబుక్కున అమెస్ కౌగిట్లోకి వెళ్ళి దాక్కున్నది. కాని ఆ మతగురువు పలికిన దయాపూరితములగు పలుకులు ఆ పిల్ల భయాన్ని తీర్చాయి.

"నా చిన్నారి పాపా! భయపడకమ్మా, భయపడకు. అమెస్ ఇక్కడే ఉన్నారు. ఇతన్ని భగవంతుడు నీకు తండ్రిగా ప్రసాదించాడు. ఇతను మతం పుచ్చుకొని థియోడర్ అని పిలువబడుతున్నాడు. ఇదిగో, నీకు తల్లిగా ఉండడానికికూడా ఒక పుణ్యాత్మురాలు సిద్ధంగా ఉన్నదమ్మా"– అంటూ మతగురువు అక్కడున్న నీగ్రో స్త్రీవంక తిరిగి–"ఈమె పేరు నిటిడా. ఈమె ఈ లోకంలో ఒక బానిసగా ఉన్నది. కాని స్వర్గంలో ఒక దేవతగా ఉంటుంది"– అన్నాడు.

తరువాత మతం పుచ్చుకోనున్న థాయిస్‌ను – "థాయిస్! సర్వశక్తిసంపన్నుడైన ఆ భగవంతునిపై నీకు

నమ్మకం ఉన్నదా ? భగవంతుని కుమారుడు, ముక్తిని ప్రసాదించడంకోసం మృతుడైనవాడు అయిన ఏసుక్రీస్తుయందు, ఆయన శిష్యుడు బోధించిన బోధనలయందు నీకు విశ్వాసం ఉన్నదా తల్లీ?"– అని అడిగాడు.

అప్పుడు థాయిస్‌ను చేర్చి ఒక రెక్క పుచ్చుకొనిఉన్న అమెస్, నీగ్రోజాతి స్త్రీ "ఉన్నది స్వామీ."– అని ఆపిల్ల పక్షంగా సమాధానం చెప్పారు.

తరువాత బిషప్ చెప్పినప్రకారం నీగ్రోస్త్రీ, థాయిస్ వంటిమీద ఉన్న దుస్తులను తీసివేసింది. ఇప్పుడాపిల్ల బరివంట నిలబడి ఉన్నది. ఆమె మెడలో ఒక తాయెత్తుమాత్రం ఉంది. అప్పుడు మతగురువు అక్కడున్న పవిత్రమైన చెలమ నీటిలో ఆ అమ్మాయిని మూడు మునకలు వేయించి, జ్ఞానస్నానం చేయించాడు. ఆయన దగ్గర ఉండే ఉపగురువులు పవిత్రమైన తైలాన్ని పట్టుకొని ఉండగా దానిని ఆయన ఆ శిశువుదేహానికి పూసి, తైలం వంట ఇనికేటట్లు మర్దనచేశాడు. తరువాత ఉప్పును తైలంతో తడిపి ఆ పిల్ల నాలుకపై ఉంచాడు. పిమ్మట నిటిడా, ఆ అమ్మాయికి తెల్లటి ఉడుపు ధరింపచేసింది.

బిషప్ అక్కడున్న అందరినీ ప్రేమతో ముద్దాడాడు. ఆవిధంగా మత సంబంధమైన కర్మకాండ యావత్తూ పూర్తి అయిన తరువాత బిషప్ తన లాంఛనాలన్నీ తీసివేశాడు.

ఇక వారు ఆ స్మశానవాటికను వదలి వెడుతుండగా అమెస్, మతగురువుతో ఇలా అన్నాడు :

"స్వామీ! ఇవాళ మనం ఒక ఆత్మను భగవంతుని సాన్నిధ్యానికి తీసుకొనివచ్చాం, కనుక ఇహ మనం కాసేపు పవిత్రమైన తమ గృహానికి వెళ్ళి, ఈ తెల్లవార్లూ ఆనందంగా గడుపుదాం."

అందుకు మతగురువు- "నీవు చెప్పింది బాగున్నది థియోడర్" అని బదులుచెప్పాడు. తరువాత వారంతా అక్కడికి సమీపంలోనే ఉన్న మతగురువు ఇంటికి వెళ్ళారు.

మతగురువు ఉండేది ఒకేఒక గది. ఆగదిలో రెండు సాలెమగ్గాలు, ఒక పెద్దటేబిల్, చిరిగిపోయిన ఒకతివాసీ ఉన్నాయి.

లోనికి వెళ్ళగానే మతగురువు -"నిటిడా! స్టావున్నా, నూనెకూజా ఇలా పట్టుకురామ్మా- భోజనం తయారుచేసుకుందాం-" అని పిలిచి చెప్పాడు.

ఇలా చెప్పి ఆయన తన పొడుగాటి చొక్కాలోపల్నుంచి కొన్ని చేపపిల్లలను బయటికి తీశాడు. స్టౌను వెలిగించాడు. వాటిని నిప్పులమీద వేయించాడు. తరువాత బిషప్, థాయిస్, అమెస్, నిటిడా, మరో ఇరువురు పిల్లకాయలు- అందరూ తివాసీమీద గుండ్రంగా కూచుని వాటిని భక్షించారు. భగవంతుని ప్రార్థించారు. అంతట లివాంటన్ తాను ఎన్నెన్నికష్టాలు అనుభవించిందీ చెప్పాడు. త్వరలోనే క్రైస్తవమతానికి విజయం లభించగలదని జోస్యం చెప్పాడు కూడా. ఆయన తన ఉపన్యాసంలో విచిత్రమైన భాష ఉపయోగించాడు. ఎన్నెన్నో శబ్దాలను వాడాడు. ఆయన

వాక్కులు ఎంతో చమత్కారంగాను, అలంకారయుక్తం గాను ఉన్నాయి. ఎన్నెన్నో ఉపమానాలు చెప్పాడాయన.

"దివ్యాత్మ, జలాలపై తేలిపోతూ ఉంటుంది. అంచాతనే క్రైస్తవులు ఉదకంతో జ్ఞానంచేస్తున్నారు కాని జలాలలో రాక్షసులుకూడా ఉంటున్నారు. ప్రధానంగా జలకన్యలకోసం సృష్టింపబడిన జలాలు చాలా ప్రమాదకరమైనవి. ఇంకా కొన్నిజలా లున్నాయి. ఆనీరు ఆత్మకూ దేహానికీకూడా ఎన్నెన్నోరోగాలను కలిగిస్తుంది" అని చెప్పాడాయన. మధ్య మధ్య ఆయన గూఢార్థాలతో మాట్లాడాడు. థాయిన్ ఎంతో భయభక్తులతోను, ఆశ్చర్యంతో ఆయన చెప్పేది విన్నది. చివరకు బిషప్ తన అతిథులకు కొంచెం ద్రాక్షాసవం సేవించమని ఇచ్చాడు. వారు దానిని సేవించారు. దాంతో వారి ధోరణి మారింది పాటలు, కీర్తనలు పాడడం మొదలు పెట్టారు. అమెస్, నిటిడాలు లేచి, నృత్యం ప్రారంభించారు. ప్రేయసీ, ప్రియుడూ కలిసి చేసే నృత్యం అది. బాల్యంలోనే వారు దానిని నేర్చుకొన్నారు. ఆవిధంగా వారిరువురూ లయ తప్పకుండాను, అడుగులువేస్తూ, రకరకాల భంగిమలు చూపుతూ చక్కగా నృత్యం చేశారు.

ఈవిధంగా థాయిస్ మతం పుచ్చుకొన్నది. ఆరాత్రి ఆమె చెప్పనలవికానంత ఆనందం అనుభవించింది.

ఆవిధంగానే థాయిస్, చిన్నతనంనుంచీ ఆటా-పాటా అంటే అమితఇష్టంగా ఉంటూ వచ్చింది. వినోదాలంటే మోజు పడుతూ వచ్చింది. ఆ పిల్లమనస్సులో ఏవేవో అస్పష్టమైన

కోరికలు మొలకెత్తాయి. బజార్ల వెంట పిల్లలతో కలిసి ప్రొద్దస్తమానం ఆడుతూ ఉండేది, పాడుతూ ఉండేది. రాత్రి వేళకు కొంపకు చేరేది. మళ్ళీ ఇంట్లోకూడా పాటలే-ఆటలే!

"వంకర-టింకర దారాలు, పోతున్నయ్ మీ ప్రాణాలు!
తకిట తకిట ధోం, తాళాలు, దేవుడి గుళ్ళో మేళాలు!"

ఇలా ఏవో పిచ్చి పాటలు పాడుతుండేది.

ఇప్పు డా అమ్మాయి, అమెస్‌లాంటి సాధువులు, మెత్తనివారు అయిన ఆడపిల్లల స్నేహాన్ని ప్రధానంగా కోరుకోడం ప్రారంభించింది. తన అప్తుడైన అమెస్, ఇప్పుడు తరుచుగా తనవద్ద ఉండకపోవడం ఆమె చూస్తూనే ఉంది. క్రైస్తవులను నానావిధాల హింసించి ప్రాణాలు తీయడం ఇప్పుడు మరింత ఉధృతమైపోయింది. క్రైస్తవులంతా, ప్రతి నిత్యం తప్పకుండా సమావేశాలు జరుపుతున్నారు. అమెస్ ఈ సమావేశాలకు అత్యంత శ్రద్ధాసక్తులతో హాజరవుతున్నాడు. అతని ఉత్సాహం, అంతకంతకూ పట్టపగ్గాలు లేకుండా పోతున్నది. ఒకొక్కప్పుడు పరిస్థితులను తీవ్రంగా ఎదుర్కొంటున్నాడుకూడా. అతని ఉపన్యాసాలు విప్లవాత్మకంగా ఉంటున్నాయి- "ఈ శ్రీమంతులంతా తమ సిరిసంపదలతో కులుకుతూ ఉన్నారు. కాని, ఇది ఎంతోకాలం సాగదు. అతిత్వరలోనే వీరి ఆట కట్టుతుంది!" అని చెప్పతూ వచ్చాడు. అతను బహిరంగ ప్రదేశాలకు వెడుతున్నాడు. పతితులు, బాధితులు, పీడితులు, తాడితులు అయిన ప్రజానీకాన్ని పోగుచేస్తున్నాడు. గోడలక్రింద, చెట్లనీడలక్రింద పడి

ఉంటున్న పేద ప్రజలందరినీ కూడగట్టుకొని వస్తున్నాడు. బహిరంగంగా సభలూ, సమావేశాలూ పెట్టి ఉపన్యాసా లిస్తున్నాడు. "ఈ బానిసబంధాలనుంచి మీరూ త్వరలోనే ముక్తి పొందుతారు. అటువంటి ధర్మకాలం రాకతప్పదు- త్వరలోనే వస్తుంది" అని చెపుతూ వచ్చాడు-"భగవంతుని రాజ్యంలో బానిసలు భోగభాగ్యాలు అనుభవిస్తారు. శ్రీమంతులంతా, ఆ పేదవారి పాదాలచెంత కుక్కల్లాగా పడివుంటారు!" అని బోధిస్తూ వచ్చాడు.

ఆవిధంగా అమెస్ బానిసలైన క్రైస్తవ ప్రజలలో విప్లవాన్ని రేకెత్తించాడు. ఈ విప్లవం నగరం నలుమూలలా అల్లుకొన్నది. నగర పొలిమేరలు దాటి దేశమంతటాకూడా ప్రాకుతున్నది. యజమానులంతా భయవిచలితు లవుతూ వచ్చారు. బానిసలందరినీ అమెస్ తిరుగుబాటు చేయిస్తున్నాడని భావించసాగారు. అమెసెను పనిలో పెట్టుకొన్న పూటకూళ్ళ ఇంటి యజమాని అతనిని బుద్ధిపూర్వకంగా ద్వేషించడం మొదలుపెట్టాడు. అతనిపై పగ పట్టాడు. ఆ పగ తీర్చుకునేందుకు రహస్యంగా పన్నుగడలు పన్నుతున్నాడు.

పూటకూళ్ళ ఇంట్లో దేవుడి సాన్నిధ్యంలో ప్రత్యేకంగా ఉంచబడిన ఒక వెండిపాత్ర ఉన్నట్లుండి ఒకనాడు మటుమాయమైంది. దానిని అమెస్ దొంగిలించాడని అతనిపై నేరం మోపారు. యజమానిపై తనకుగల ద్వేషంవల్ల అత నా పని చేశాడని అన్నారు. కాని దానికి దాఖలా ఎంతమాత్రంలేదు. తాను ఏపాపమూ ఎరుగనని చెప్పాడు అమెస్. అయినప్పటికీ అతనిపై నేరం వేసి కోర్టుకు ఈడ్చారు. అతను ఎక్కడా

నౌకరుగా ఉండతగినవాడు కాదని అందరూ, తలా ఒక పాపపు మాట అన్నారు. చివరకు న్యాయమూర్తి అతనికి మరణశిక్ష విధించాడు.

"నీ చేతులను ఎలా సద్వినియోగం చేసుకోవాలో నీకు తెలీదు. కాబట్టి నీ చేతులు శిలువమీద పెట్టి మేకులు కొట్ట వలసి ఉంది"- అని చెప్పాడు న్యాయమూర్తి.

న్యాయమూర్తి ఇచ్చిన తీర్పు అమెస్ విన్నాడు. శాంతంగా ఉన్నాడు. పల్లెత్తుమాట మాట్లాడలేదు. న్యాయమూర్తికి సవినయంగా వంగి నమస్కరించాడు. మౌనముద్ర వహించి కారాగృహానికి వెళ్ళాడు. మూడురోజులలో అతను మృతి చెందనున్నాడు. అయినా, ఆ మూడురోజులుకూడా అతను మతబోధ మానలేదు. అక్కడున్న ఖైదీలందరికీ భగవంతుని సత్యసందేశాన్ని అందించాడు. వారందరికీ అతను ఆదర్శప్రాయుడైనాడు. చివరకు చెరసాలాధ్యక్షునికికూడా అమెస్ బోధనలు విన్నతరువాత భగవంతునిపై నమ్మకం కుదిరింది.

అప్పటికి ఇంచుమించు రెండేండ్లక్రితం ఒకనాటి అర్ధ రాత్రి తాను-తన ముద్దులబిడ్డ, తన ముత్యాలమొలక అయిన థాయిస్‌ను తీసుకొనివెళ్ళి ఎక్కడ మతం ఇప్పించి మహదానందంగా ఆరాత్రి గడిపాడో, అక్కడికే ఇప్పుడు అమెస్‌ను తీసుకొనివెళ్ళి కొఱతవేశారు. శిలువకు ఆనించి మేకులు కొడుతున్నప్పటికీ అతను ఎవ్వరినీ నిందించలేదు. కాని అనేక తడవలు నిశ్వసిస్తూ- "దాహం, దాహం" - అని మూలిగాడు.

అత నావిధంగా మూడు రాత్రిళ్ళు, మూడు పగళ్ళు-చిత్రహింసకు గురిఅయి యమయాతన అనుభవించాడు. ఇంతటి సుదీర్ఘమైన హింసను మానవదేహం భరించడం కష్టం. తాను చనిపోయానని మధ్యలో అనేకమారులు అనుకొన్నాడతను. అతని కనురెప్పలపై ఈగలు ముసురుకొన్నాయి! కాని అకస్మాత్తుగా అతను మళ్ళీ, రక్తం చిమ్ముతున్న కళ్ళను తెరిచేవాడు. నాలుగవనాటి ఉదయం అతను స్పష్టమైన, స్వచ్ఛమైన గొంతుతో పాటపాటాడు.

"ఎక్కడున్నావు మేరీమాతా!
చిక్కబాపవా సుజాతా!"-

ఇలా పాడి మందహాసం చేశాడు. తరువాత- "అరుగో! దేవదూతలు వచ్చారు. నాకోసం వంఝ్లూ, పానీయాలూ తెచ్చారు. రెక్కలతో విసిరి, నన్ను సేదతీరుస్తున్నారు!- ఎంత హాయిగా ఉన్నది!"- అని పలికి అమెస్ ఊపిరి విడిచాడు.

అతను చనిపోయినా చనిపోయినట్లు లేదు. అతని ముఖంలో కళ తప్పలేదు. ఏదో దివ్యకళ అతని ముఖంలో ఉట్టిపడుతూఉంది. అక్కడ కావలాఉన్న సైనికులుకూడా అతని మృతిని చూచి ఆశ్చర్య చకితులైనారు. మత గురువు వివాంటస్, మరికొందరు క్రైస్తవ సోదరులతో వచ్చి అమెస్ కళేబరం కావాలని కోరాడు. అనుమతి పొంది అతని శవాన్ని తీసుకొనివెళ్ళి సెయింట్ జాన్, బాప్టిస్టు చర్చి ప్రాంగణంలో తక్కిన అమరజీవులతోపాటు పూడ్చిపెట్టించాడు. బానిసగా పుట్టి పరమపావనుడైన థియోడర్ జ్ఞాపకార్థంగా ఆ చర్చి వెలసింది.

ఆతరువాత మూడేండ్లకు మాక్జింటియన్‌ను జయించిన రోమన్ చక్రవర్తి ఒక రాజశాసనాన్ని చేసి ప్రకటించాడు. దానివలన క్రైస్తవులందరికీ ముక్తికలిగింది. క్రైస్తవ మతంపట్ల విశ్వాసం కలవారిని భిన్నమతస్థులు తప్ప. ఇక మీదట హింసించడం ఉండదని ఆశాసనంలో తెలుపబడింది.

అమెస్ మరణించేటప్పటికి థాయిస్‌కు పదకొండేండ్లు నిండాయి. అతని మరణానికి ఆ పిల్ల నిర్ఘాంత పోయింది. ఎంతగానో దిగులుపడింది. బ్రతికినంతకాలం అమెస్ పవిత్రమైన కార్యాలు చేశాడనీ, వాటి నిమిత్తమే అసువులు వీడి అమర లోకంలో భగవంతుని సాన్నిధ్యానికి చేరుకొన్నాడనీ అర్థం చేసుకొనేటంత జ్ఞానం ఆ పిల్లకు లేదు. ఆపసిపిల్ల మనస్సులో ఒక ఆలోచన మొలకెత్తింది. ఈ ప్రపంచంలో మంచివాళ్ళకు స్థానం లేదనుకొన్నది. మంచివాళ్ళందరూ దారుణమైన బాధలకు గురికాక తప్ప దనిపించింది ఆ పిల్లకు. అందుకని తాను మంచిగా ఉండడానికి భయపడింది. "నా సుకుమారమైన శరీరం ఎంతమాత్రం బాధకు తట్టుకోలేదు. నేను మంచిగా ఉండి ఆ హింస పడలేను. కాబట్టి మంచిగా ఉండను"-అనుకొన్నది.

యౌవనం పొటకరిస్తున్న రోజులలోనే థాయిస్ తన శీలాన్ని అమ్ముకొన్నది. ఓడరేవులో ఉండే కుర్రాళ్ళకు తన శరీరం అప్పగించి అంతో-ఇంతో ఆర్జిస్తూ వచ్చింది. ప్రొద్దు కూకుమాట్ల వయసు మళ్ళిన పురుషులవెంటకూడా పడి తిరిగేది. వాళ్లూ కొద్దో - గొప్పో డబ్బు ఇచ్చేవారు. ఆవిధంగా

గడించిన డబ్బుతో ఆ థాయిస్ కేసులు, ఇంకా విలువైన చిన్న చిన్న నగలు, వస్తువులు కొనుక్కునేది.

తాను ఆర్జించిన డబ్బులో ఏమాత్రంకూడా థాయిస్ ఇంటికి తీసుకొని వెళ్ళేది కాదు. అంచాత వాళ్ళ అమ్మ ఆ పిల్లను ఎప్పుడూ కొడుతూ, తిడుతూ ఉండేది. తల్లి పోరును తట్టుకోలేక, ఆమె పెట్టే హింసలు భరించలేక థాయిస్ ఆమె కంటపడకుండా తరుచు పారిపోతూ ఉండేది. నగర ప్రాకారాల దగ్గరికి వెళ్ళి అక్కడ గోడలక్రింద బల్లిలా నేల కరుచుకొని ఉండేది. అప్పుడా మార్గాన వస్తూ పోతూ ఉండే అనేకమంది ఆడవాళ్ళను-రంగురంగుల బట్టలు కట్టుకొని, రకరకాల సొమ్ములు పెట్టుకొని, మహారాణులలాగా, మహావైభవంతో దాసీలు వెంటరాగా, పల్లకీలలో, మేనాలలో వస్తూ పోతూ ఉన్న అందగత్తెలను చూచి థాయిస్ అసూయపడసాగింది. ఆ పిల్ల మనస్సులో ఎన్నెన్నో ఆలోచనలు అంకురించాయి.

ఇలా ఉండగా ఒకనాడుతల్లి చేత చావు దెబ్బలు తిన్నది థాయిస్. అంతకుముం దెన్నడూ అటువంటి దెబ్బలు తినలేదు. ఆపిల్లతట్టుకోలేక ఇంటినుంచి పారిపోయి మామూలుగా నగర ద్వారాలచెంత నక్కింది. అప్పుడొక వృద్ధురాలు ఆ త్రోవన పోతూ, కదలకుండా, మెదలకుండా గ్రుడ్లనీళ్ళు కుక్కుకుంటూ కూచునిఉన్న థాయిస్‌ను చూచింది. పోతున్న మనిషల్లా తటాలున ఆగి కొద్దిక్షణాలపాటు థాయిస్‌వంక వళ్ళంతా కళ్ళు చేసుకొని చూచింది. ఆ వృద్ధురాలికి ఏం బుద్ధి పుట్టిందో ఏమో,

"అమ్మాయ్! ఎవరమ్మా నీవు? లోకంలోని అందమంతా నీలోనే ఉన్నదే పిల్లా! నిన్ను కన్న తల్లి దండ్రులు ఎంత పుణ్యం చేసుకున్నారే తల్లీ"– అని అడిగింది.

కాని థాయిస్ బదులు చెప్పలేదు. తల వాల్చుకుని నేలమీద చూస్తూ ఉన్నది. ఆ పిల్లకళ్లు జ్యోతుల్లా ఉన్నాయి. వెక్కి వెక్కి ఏడుస్తున్నది. తరువాత ఆ వృద్ధసిత మళ్ళీ ఇలా అడిగింది:

"ఎవరిపిల్లవే నీవు, నా బంగారుతల్లీ? నిన్ను కన్న తల్లిదండ్రులు ఎంతపూజ చేసుకున్నారే అమ్మా–"

అప్పుడు థాయిస్, తనలోతాను అనుకుంటున్నట్లుగా– "నా తల్లి తిండిపోతు, నా తండ్రి తాగుబోతు! అంతులేనిఆశ నాతల్లిది. ఆరని, తీరని దాహం నాతండ్రిది–"అన్నది.

తరువాత ఆవృద్ధురాలు ఆచుట్టుప్రక్కల ఎవరైనా ఉన్నారేమోఅని అటు– ఇటు చూచింది. పిమ్మట ఇలా ఇచ్చకాలు పలికింది:

"నా అందాలరాణీ! నా ముత్యాల మొలకా! నాతో వస్తావుటే? నీవు చిన్నమెత్తు పని చెయ్యక్కర్లేదు. నీవు నవ్వుతుంటే చాలు. నాట్యం చేస్తుంటే చాలు – నీకు కడుపు నిండా అన్నంపెడతాను. మాఅబ్బాయి–నాకొడుకున్నాడు. వయసు కుర్రాడు. చాలాచక్కనివాడు. నిన్ను పువ్వులలో పెట్టి పూజిస్తాడు. ఏమంటావే పిల్లా? వస్తావా మరి?–"

అందుకు థాయిస్ "అలాగేవస్తాను–"అని చెప్పింది.

ఇలా చెప్పి ఆవృద్ధురాలివెంట బయలుదేరింది. వృద్ధురాలు, థాయిన్‌ను తీసుకొని ఆనగరంనుంచి వెళ్ళిపోయింది.

ఆవృద్ధవనిత పేరు మోయిరోయీ. ఆమెదగ్గర ఒక గుంపు పిల్లలున్నారు. ఆడపిల్లలు, మగపిల్లలు. వారందరికీ నాట్యంనేర్పడం, వారిచేత నాట్యంచేయించి డబ్బుగడించడం, ఒకొక్కొక్క నాట్యప్రదర్శనానికి ఇంత అని ఒప్పుకొని శ్రీమంతుల ఇండ్లలో విందులలో, వేడుకలలో ప్రదర్శనాలివ్వడం– ఇదీ దాని వృత్తి.

"థాయిస్‌కు వయస్సు వస్తున్నది. వయస్సు వచ్చేసరికి చక్కనిచుక్కగా తయారవుతుంది ఈపిల్ల!"– అనుకొన్నది వృద్ధురాలు. 'దీనిచేత గజ్జకట్టిస్తే డబ్బు ఘల్లున రాలుతుంది!' అనుకొన్నది. ఇలా అనుకొని వృద్ధవేశ్య – థాయిస్‌కు ఆటా–పాటా నేర్పింది. "ఈపిల్లవి సుందరమైన చరణార విందాలు – అడుగువేస్తే, అప్సరసల నాట్యం! ఈ అందాల తార, సితారా వాయిస్తూ గానంచేస్తేగంధర్వులకు గర్వభంగం అవుతుంది!–" ఇలా అనుకొని ఆవృద్ధవనిత కొట్టి, తిట్టి థాయిస్‌కు ఆటా–పాటా అన్నీ నేర్పింది. ఆమె కొడుకు ఉండనే ఉన్నాడు. వాడు వయస్సుమళ్ళినవాడు. ఉత్సాహం ఉడిగినవాడు. వాడికి ఏకోశానా సౌకుమార్యం అన్నది లేదు. ఆడవాళ్ళ అందచందాలను అనుభవించి ఆనందించేయోగ్యత వాడి కెక్కడున్నది? ఆమూర్ఖుడుకూడా థాయిస్‌ను నానా హింసలు పెట్టాడు. వాడి కసలు ఆడవాళ్ళపొడ అంటేనే గిట్టదు. స్త్రీలంటే వాడి కెందుకో తగనిద్వేషం. అందమైన ఆడపిల్లలను చూస్తే మరీ ఓర్వలేడు.

కాని ఆటా-పాటా నేర్పడంలో గట్టివాడు. గురువుగా ఉండతగినవాడు. అతను థాయిస్‌కు అన్నీ నేర్పాడు. మూకాభినయం, హాస్యం, ఆంగిక, వాచిక, సాత్వికాభినయాలు, వీర, కరుణ, శృంగారాది రసాలు ఒప్పించి ఆయా ఘట్టాలలో రక్తికట్టేటట్లు అభినయించడం- వీటన్నింటిలో ఆమెకు చక్కని శిక్షణ ఇచ్చాడు. థాయిస్ సాటిలేని మేటి నటీమణి అయింది. ముఖ్యంగా శృంగారం అభినయించడంలో ఆమె అందరినీ మించింది. ఆ వృద్ధురాలి కొడుకు థాయిస్‌ను ఒక ఉత్తమ అభినేత్రిగా తయారుచేశాడు. కాని, తన వృత్తి మంచిదికాదని నిందించుకునేవాడు. పురుషులందరికీ ఆనందం అందివ్వడం కోసమే థాయిస్ పుట్టిందని అతను గ్రహించుకున్నాడు. అంతచక్కని చుక్కగా, ఆటకత్తెగా తయారైన థాయిస్‌ను చూచి కళ్ళలో సూదులుగుచ్చుకునేవాడు. కసి తీర్చుకుంటున్నట్లుగా ఆ పిల్ల బుగ్గలు గిల్లేవాడు. సుకుమారమైన ఆ అమ్మాయి వళ్ళంతా రక్కి పెట్టేవాడు. రాక్షసుడిలా ప్రవర్తించేవాడు. వాడు పాడుగాను, వాడు నానాహింసలు పెట్టినప్పటికీ, థాయిస్‌మాత్రం అచిరకాలంలోనే గానంలోనూ, నాట్యంలోనూ, అద్భుతమైన ప్రావీణ్యం సంపాదించింది. వృద్ధురాలున్నూ, ఆమె కుమారుడున్నూ తనను ఆవిధంగా నానాహింసలు పెడుతున్నప్పటికీ అందులకు థాయిస్ ఎంతమాత్రం నొచ్చుకోలేదు. ఇదేమిటని- ఆశ్చర్యపోనూలేదు. ఇది సహజమే అనుకొన్నది ఆపిల్ల. మనుష్యులంతా ఇలా వేపుకుతినడం మామూలే ననుకొన్నది. పైగా తన జన్మే కష్టపుజన్మ. తను కష్టాలలోనే పెరిగింది. కష్టాలలోనే తిరిగింది. కష్టాలు తనకు

అలవాటే! కాబట్టి ఆవిడ కిదొక కష్టంగా తోచలేదు. పైపెచ్చు, ఆ వృద్ధురాలన్నా, ఆమె కొడుకన్నా, థాయిస్ కొంతగౌరవం చూపుతూ వచ్చింది. మోయిరోయీ, తన శిష్యురాలైన థాయిస్‌ను చూచి మెచ్చుకొంది. ఆటలో - పాటలో ఆరితేరిన ఆ అందాలరాణిని ఆంటియోచ్‌లోని భాగ్యవంతు లందరికీ పరిచయం చేసింది. విందులలోనూ, వినోదాలలోనూ ఆఅమ్మాయిచేత నాట్యప్రదర్శనాలు ఇప్పించింది. నగరంలోని శ్రీమంతులంతా థాయిస్‌అంటే మోజు పడసాగారు. థాయిస్‌కుకూడా ఆడడం, పాడడం అంటే హాయిగానే ఉంది. విందు సమయాలలో అలా అలా ఆడి అలసిపోయి, తిని - తాగి తూగుతున్న కలవారి కౌగిళ్ళలో వాలిపోయేది. పెద్ద పెద్ద లతాధికారుల వెంట వెళ్ళి, నదీతీరాలలో విచ్చలవిడిగా విహరించేది. ఆవిధంగా ఆపిల్ల అందరికీ ఆనందం అందిస్తూ వచ్చింది. తన అందానికి విలువఎంతో థాయిస్‌కు తెలియలేదు. తన ప్రేమ ఎంత ఖరీదు చేస్తుందో ఆవిడకు అవగతం కాలేదు. కాని ఒకనాటి రాత్రి థాయిస్ నాట్యం చేసింది. నగరంలోని నవనాగరీకులయిన యువకులంతా అక్కడున్నారు. వారిలో గవర్నరు కొడుకుకూడా ఉన్నాడు. అతను మాంచి యౌవనంలో ఉన్నాడు. పడుచుతనం పరవళ్ళుతొక్కుతున్నది. సుఖాలకోసం అర్రులుచాస్తున్నాడు. ఆ అబ్బాయి థాయిస్ దగ్గరికివచ్చి-

"థాయిస్! నన్ను నీ దాసుణ్ణి చేసుకో. థాయిస్! నన్ను నీ కౌగిట్లోకి చేర్చుకో. థాయిస్! నీ అందం నన్ను అంధుణ్ణిగా చేస్తున్నది. మోహంలో మునిగి పోతున్నాను.

లోకంలో అందకత్తెలంతా నీ కొనగోటికి సరిరారు థాయిస్! తాపానికి తాళలేకుండా ఉన్నాను. ఓ అందాలరాణీ! రా, నాతో రా; మా యింటికి వెడదాం. ఏన ఇరువురం ఆనంద జలధిలో మునిగిపోదాం. ఈ ప్రపంచాన్నే మరచిపోదాం. రా, థాయిస్!" అని వేడుకొన్నాడు. మరులు గొన్నవాడై మోహాలమైకంలో అతను మాట్లాడుతున్న మాటలు థాయిస్ విన్నది. అతనివంక చూచింది. అతను అందమైన కుర్రవాడు. ఆ పిల్లమనస్సులో ఏదో తళుక్కుమన్నది. అకస్మాత్తుగా ఆవిడ ముఖాన చిరుచెమటలు పోశాయి. శరీరం మంచుగడ్డలా గడ్డకట్టుకపోతున్నట్లనిపించింది. మనిషి పచ్చని పసిడికలా మారింది. సోలి-తూలి పడబోయింది. ఆవిడ కనులముందు ఒక మబ్బుతెర దిగింది. ఆ అబ్బాయి మళ్ళీ ఆవిడను ప్రార్థించాడు. తన వెంట రమ్మని బ్రతిమాలుకొన్నాడు. థాయిస్ 'ఉహుం' రానన్నది. మన్మధుని తూపుల్లాంటి అతని చూపులకు థాయిస్ లొంగలేదు. మోహాతాపంతో కూడుకొన్న అతని మాటలు వృధా అయినాయి. చివరకా అబ్బాయి, థాయిస్‌ను బలాత్కారంగా తన కౌగిట్లోకి తీసుకోబోయాడు. పట్టుబలవంతానా లాక్కుపోదామని ప్రయత్నించాడు. కాని థాయిస్ అతన్ని అవతలికి నెట్టివేసింది. తరువాత అతను ఆవిడ కాళ్ళమీద పడ్డాడు. బ్రతిమాలుకొన్నాడు. బ్రతికలేనన్నాడు. కళ్ళనీళ్ళు పెట్టుకొన్నాడు. అయినా థాయిస్ మనస్సు కరగలేదు. ఏదో-అనూహ్యమైన శక్తి ఆపిల్లను

ఆవహించింది. అంతవరకూకూడా చిత్తం చెదరనీయక నిలవ త్రొక్కుకొని గలిగింది.

అక్కడ విందుకు వచ్చిన అతిథులంతా ఈ దృశ్యం చూశారు- "ఏమిటీ పిచ్చి?" అనుకొన్నారు- "లోలియస్ చక్కనివాడు. శ్రీమంతుడు. గౌరవంగల కుటుంబంలో పుట్టినవాడు. ఈ పిల్లవాడు ఆ ఆటకత్తెపై ఇంతగా మరులు గొన్నాడేమిటి? - ఆపిల్ల ఇతన్ని అవమానిస్తోంది!"- అనుకొన్నారు.

థాయిస్‌చేత తిరస్కృతుడై లోలియస్ ఆరాత్రి ఒంటిగా ఇంటికి వెళ్ళాడు. ఆ రాత్రంతా అతనికి కంటిమీద కునుకులేదు. మదనజ్వరంతో వేగిపోయినాడు. భల్లున తెల్లవారింది. మళ్ళీ, ఉదయాన్నే ఆపిల్లవాడు కళ్ళు జ్యోతుల్లా పెట్టుకొని వివశుడై నాట్యకత్తెఅయిన థాయిస్‌యింటికి వచ్చాడు. కాళ్ళూ - గడ్డాలూ పట్టుకొని ప్రాధేయపడ్డాడు. థాయిస్ భయంతో కంపించిపోయింది. ఆవిడమనస్సు చికాకుతో నిండిపోయింది. లోలియస్‌ను చెంతకు చేరనివ్వలేదు. అయినప్పటికీ అతను ఆపిల్లమనస్సులో నిరంతరం మెసులుతూనే వచ్చాడు. ఆవిడ హృదయంలో కల్లోలం బయలుదేరింది. కారణం తెలియదు. ఎంతో బాధపడింది. 'నాకింతదిగులు దేనికి? నేనెందుకిలా మారిపోయాను?_" అనుకొని థాయిస్ ఆశ్చర్యపోయింది. తనకు పూర్వంనుంచీ సంబంధంఉన్న పురుషులందరినీ తలుచుకొన్నది. వారంటే ఆవిడకు అసహ్యం పుట్టుకొచ్చింది. ఆవిధంగా థాయిస్ రాత్రింబవళ్ళు - ఒకటే దిగులుతో, ఒకటే చింతతో కుమిలిపోతూ

వచ్చింది. ప్రొద్దస్తమానం ప్రక్కమీద పడుకొని, తలఎత్తి చూడకుండా తనలో తాను కుళ్ళి కుళ్ళి ఏడుస్తూవచ్చింది. ఈలోగా లోలియస్ ఆవిడ ప్రాపకం సంపాయించుకోవాలనీ, ఆవిడహృదయంలో స్థానం ఏర్పరుచుకోవాలనీ నానాపాట్లూ పడ్డాడు మానవుడు. ఎన్నెన్నో ఎత్తులు వేశాడు. జిత్తులు పన్నాడు. కాని అతను చేతులుబట్టుక బ్రతిమాలినా, లేక శాపనార్థాలుపెట్టినా అవేవీ, కఠినమనస్సుకల థాయిస్‌ను ఏమాత్రం చలింపచెయ్యలేదు. అతని సమక్షంలో ఆవిడ-పరిశుద్ధమైన కన్యలా ప్రవర్తించేది.

"ఉఁహుఁ, నేను రాను, నేను రాను!"- అని ఈఒక్క మాటే ఎప్పుడూ సమాధానం చెప్పేది.

ఈవిధంగా ఒక పక్షం గడచింది. అప్పటికి థాయిస్ మెత్తబడింది. అతన్ని ప్రేమిస్తున్నానని ఆవిడకు తెలుసును. అందుకే అతనిని కాదనలేకపోయింది. ఆఖరుకు తనకైతానే లోలియస్ ఇంటికి వెళ్ళింది. అతనితో ఉంటూ వచ్చింది. థాయిస్, లోలియస్‌లు చాలా సుఖంగా గడుపుతూ వచ్చారు. వా రనుభవించిన సుఖం ఇంత-అంత కాదు. బయటి ప్రపంచమంటే ఎటువంటిదో తెలియకుండా, అంతఃపురంలాంటి గదులలో తలుపులు బిగించుకొని, సుఖించారు. ఒకరి కనులలోకి ఒకరు చూచుకుంటూ, కబుర్లాడుకుంటూ, ప్రక్కనా - పైనా పడుతూ కేళీవిలాసాలలో తేలియాడారు. ఒక్కక్షణమైనా ఒకరిని విడిచి ఒకరు ఉండరు. చల్లని సాయంసమయాలలో ఇసువుకూ చెట్టాపట్టాలు పట్టుకొని ఏకాంతంగా వన

తీరాన సంచరించేవారు. వనవిహారాలు సలిపేవారు. ఒక్కొక్కప్పుడు ప్రొద్దు ప్రొద్దునసే లేచి కొండలపైకి షికార్లు వెళ్ళేవారు. ఒకకంచంలో తింటూ, ఒకమంచంలో పండుతూ, యథేచ్ఛగా ఉండేవారు. ఒకరి ఎంగిలి ఒకరు తిని ఆనందించేవారు.

ఇలా వా రిరువురూ ఉంటూఉండగా థాయిస్ తనకు కాకుండా పోయిందని మోయిరోయీ చింతిల్లింది. లోలియస్ దగ్గరికి వచ్చి ఆపిల్లను తనకు అప్పచెప్పమని అనేక విధాల మొత్తుకొన్నది. "ఆ అమ్మాయి నా కూతురు. నా చిట్టి తల్లిని నాకు కాకుండా చెయ్యకు దొరా!" అని కాళ్లా – వేళ్లా పడి ప్రార్థించింది.

లోలియస్ ఆ వృద్ధురాలికి బోలెడంత డబ్బిచ్చి పంపించి వేశాడు. కాని ఆ ముసల్ది మళ్ళీ వచ్చింది. ఇంకా వరహాలు – మొహరీలు ఇవ్వమని అడిగింది. అప్పుడు లోలియస్ ఆమెను జైల్లో పెట్టించాడు. తరువాత మేజిస్ట్రేట్ ఆమెను విచారణ చేశాడు. ఆ ముసల్ది ఎన్నెన్నో ఘోరమైన నేరాలు చేసినట్లు బయటపడింది. దాంతో ఆమెకు ఉరిశిక్ష విధించారు. ఆవిధంగా వృద్ధురాలి జీవితం అంతమైంది.

థాయిస్, లోలియస్‌ను మనసారా ప్రేమించింది. ఏ కల్లా-కపటం ఎరుగని మనస్సు ఆ పిల్లది.

"లోలియస్! నీకు నిజం చెపుతున్నాను. నిన్ను నా ప్రాణానికి ప్రాణంగా ప్రేమిస్తున్నాను లోలియస్, నిన్ను తప్ప ఇంకెవ్వరినీ ప్రేమించి ఎరుగను." అనేది.

అందుకు లోలియస్–"థాయిస్! నీవు అందరు ఆడ వాళ్ళవంటి ఆడదానివి కాదు థాయిస్!–" అని బదులు చెప్పే వాడు.

ఆవిధంగా వారిరువురూ ఆరునెలలపాటు అనురాగంతో ఉన్నారు. కాని చివరి కది భగ్నమైంది. హఠాత్తుగా థాయిస్ హృదయం ఎడారిలా శూన్యమైంది. తన కిప్పుడు లోలియస్ పూర్వంమాదిరి కనుపించడంలేదు.

"ఏమిటిది? ఒక్క క్షణంలోనే నా మనస్సు మారి పోయిం దేమిటి? ఇన్నాళ్ళబట్టీ లోలియస్ నాకు అదోలా కనిపించాడు. అదోలా అనిపించాడు. కాని ఇప్పు డలా కను పించడంలేదు. అందరు మగవాళ్ళూ ఎంతో అతనూ అంతే అనిపిస్తున్నది నాకు" అనుకున్నది తనలో.

ఇలా అనుకొని థాయిస్ అతన్ని వదిలిపెట్టింది. మరొక పురుషుడితో రహస్యసంబంధం పెట్టుకోవాలన్న తలంపుతో ఆవిడ లోలియస్‌ను వదిలిపెట్టలేదు. తనకు లోలియస్‌పై వెనుకటి ప్రేమ నశించినందువనే అతన్ని విడిచి పెట్టింది. ఒక పురుషుడి ప్రేమ పోయినతరువాత వాడితో ఉండడంలో మజా లేదు. ఇక తను అంతవరకూ అసలు ప్రేమించని మరొకడితో ఉండడం అంతకంటే భరించరాని విషయం. ఇలా నిశ్చయించుకొని థాయిస్ అంతటితో లోలియస్ సంబంధాన్ని తెగతెంపులు చేసుకొన్నది. వెళ్ళి వేశ్యలగుంపులో కలిసింది. వారంతా రాయవేశ్యలు. రంగ రంగ వైభోగాలలో తేలియాడే రంగసానులు. పవిత్రమైన

పండుగదినాలందు దేవాలయాలలో భక్తిపారవశ్యంతోటి నగ్నంగా నాట్యాలు సలిపే దేవదాసీలు. థాయిస్ ఈగుంపులో చేరి తానూ ఒక దేవదాసీ అయింది. నదులు దాటి నగరాలకు వెళ్ళింది. నగరాలలోని నవనాగరికతకు దాసురా లయింది. నీతి-నియమాలు లేకుండా సాగే అన్నిరకాల కులాసాలలోను, విలాసాలలోను పాలుపంచుకొన్నది. సుఖాలు అందరికీ వంచి పెట్టింది. నాటకశాలలకు తరుచుగా వెడుతూ వచ్చింది. అక్కడ జరిగే రకరకాల నాటకాలనూ, నృత్యప్రదర్శనాలనూ ఎంతో శ్రద్ధాసక్తులతో తిలకిస్తూ వచ్చింది. అన్ని దేశాలనుండి నటులు, నటీమణులు, వచ్చి రంగస్థలంపై ప్రదర్శనా లిస్తున్నారు. ఆ ప్రదర్శనాలను తీర్థపు ప్రజలా జనం వచ్చి చూస్తున్నారు.

ఆవిధంగా థాయిస్, నగరంలో సాగే నాటకాలకూ, నాట్యప్రదర్శనాలకూ హాజరవుతూ వచ్చింది. నాట్యకత్తెలను, నటులను, హాస్యగాళ్ళను - అందరినీ పరిశీలిస్తూ వచ్చింది. ముఖ్యంగా స్త్రీలను, ఆటా-పాటా నేర్చిన అందకత్తెలను, విషాదపాత్రలను ధరించే అభినేత్రులను, కథానాయకి వేషం వేసి నాయకుడితో శృంగారం అభినయించే నటీమణులను, శ్రద్ధగా పరిశీలించి చూచింది. వారి నటనలో ఉండే కిటుకు లన్నీ ఇట్టే గ్రహించుకొన్నది. వారు ఏవిధంగా ప్రేక్షకుల మన్ననలను పొందగలుగుతున్నదీ బాగా అర్థం చేసుకొన్నది. తానుకూడా నాటక సమాజంలో చేరినట్లయితే వారందరికంటే బాగా నటించగలనని అనుకొన్నది. వారందరి కంటే తాను అందకత్తెనని భావించింది. తాను వేషం కట్టి రంగస్థలంమీాద నిలుచుంటే చాలు; ప్రేక్షకులు మంత్రముగ్ధు

లవుతారని తలపోసింది. ఇట్లా ఆలోచించుకొని థాయిస్ నాటక సమాజం మేనేజరుదగ్గరికి వెళ్ళింది. తననుకూడా నాటక సమాజంలో చేర్చుకోమని అడిగింది. ఆవిడ అంద చందాలు చూచి సమాజం మేనేజరు వెంటనే అంగీకరించాడు. థాయిస్ వేషం కట్టి రంగస్థలంపై ప్రత్యక్షమైంది.

కాని రంగస్థలంమీదికి రావడం అదే మొదటిసారి కావడంవల్ల, నటనలో అనుభవం లేకపోవడంవల్ల, థాయిస్ మొదట మొదట ప్రేక్షకులను అంతగా ఆకర్షించలేకపోయింది. సభాపిరికితనంవల్ల కొంచెం దెబ్బతిన్నది. అయినా ఆవిడ నిరుత్సాహపడలేదు. మొదట చిన్నచిన్న వేషాలే వేసింది. ఇలా కొన్నిమాసాలు గడిచేసరికి ఆవిడకు మంచి అనుభవం వచ్చింది. క్రమేణా థాయిస్, జనాన్ని ఆకర్షించగలిగింది. జగన్మోహనమైన ఆవిడ తారుణ్యం, లావణ్యం, ప్రజలను ఆకర్షించి ఆకట్టుకొన్నవి. ఆవిడ ప్రదర్శనాలకు ప్రేక్షకులు గంగవెర్రులెత్తినట్లు రాసాగారు. అచిరకాలంలోనే థాయిస్ కీర్తి అన్నివైపులా అల్లుకొన్నది. థాయిస్ పేరు నగరంఅంతటా మారుమ్రోగింది. నాటకంలో థాయిస్ వేషం వేస్తున్నదంటే చాలు – ఎక్కడెక్కడి జనం ఎగ్గబడుతూ వచ్చారు. ఆవిడ అందానికి లొంగనివాడు లేడు. ఆవిడ ఆటన్నా, పాటన్నా పర వశుడుకాని ప్రేక్షకుడు లేడు. ఆఖరకు నగరంలో పెద్దలంతా కూడా ఆవిడ ప్రదర్శనాలకు పోకతప్పలేదు. ఎవరినోట విన్నా "అబ్బో, థాయిస్! ఆహా! థాయిస్! ఆవిడ అందానికి అప్సరసలు చాలరు! వింటే ఆవిడ పాటే వినాలి, చూస్తే ఆవిడ ఆటే చూడాలి!–" ఇదీ వరస. శ్రీమంతులు, మహా

రాజులు, మంత్రులు, రాకుమారులు, రాజోద్యోగులు- అంతా ఆవిడ ప్రదర్శనాలు తిలకించడానికి థియేటర్లకు పరుగులు తీస్తున్నారు. ఇహ అలగాజనం సంగతి చెప్పక్కర్లేదు. కూలీలు, వర్కర్లు - రోడ్లు ఊడ్చేవారు, ఇంకా ఇతర పని పాటలు చేసుకొనేవారు - వీరంతా అన్నం, నీళ్ళుకూడా మాని, కాలే కడుపుతోనే టిక్కెట్లు కొనుక్కోడానికి థియేటర్ల చుట్టూ తిరుగుతున్నారు. టిక్కెట్టు ఎవరు ముందు కొనుక్కుంటే వారే అదృష్టవంతులు! థాయిస్ గౌరవార్థం, కవులు చాటుపద్యాలు చెప్పారు. చమత్కారమైన పాటలు కట్టారు. బారెడుపొడుగు గడ్డాలు పెంచుకొన్న జ్ఞానులు, వేదాంతులుమాత్రం ఆవిడను దూషించారు. థాయిస్, పల్లకిలోనో, మేనాలోనో పోతూఉంటే క్రైస్తవులు ముఖాలు ప్రక్కలకు తిప్పుకొన్నారు. థాయిస్ భవనంముందు ఇసుక వేస్తే రాలని జనం. ఆవిడను చూడాలని ఎక్కడెక్కడివారు వచ్చి తపించిపోతున్నారు. కొమ్ములుతిరిగిన మొనగాళ్ళుసయితం ఆవిడ వాకిటిముందు పడిగాపులు కాస్తున్నారు. డబ్బు సంచులతో తెచ్చి కుమ్మరిస్తున్నారు. ఆడబ్బుకు ఒక లెక్క-పత్రం లేదు. వృద్ధులు-పిల్లకి బిచ్చంపెట్టని లోభులుసయితం ఎన్నో ఏళ్ళుగా తాము కూడబెట్టిన ధనాన్ని థాయిస్‌కు అర్పించడానికి తయారుగా ఉన్నారు. కొందరు ఆవిడకోరితే చాలు - తమరక్తాన్నే ధారపోయడానికి సంసిద్ధంగా ఉన్నారు. ఆవిధంగా మహామహావారంతా వచ్చి తనకు పాదాక్రాంతులైనప్పటికీ థాయిస్ ఏమాత్రం చలించలేదు. శాంత గంభీర ముద్ర వహించింది. వారు కుమ్మరించే ధనాన్ని మహా క్రీవిగా

స్వీకరించింది. లోకమంతా తనను కొనియాడుతున్నందుకు గర్వపడింది. తన అందచందాలకు తానే ఆనందించింది. తన కీర్తిని తలుచుకొని తనలో తానే పొంగిపోయింది.

ఇలా థాయిస్ అనేకసంవత్సరాలు ఇతర నగరాలలో ఉండి సమస్త సుఖాలు అనుభవించింది. ఆనందాలన్నీ అందుకొన్నది. తరువాత ఆమెకు మళ్ళీ తన జన్మస్థలమైన అలెగ్జాండ్రియాకు ఒకమాటు వెళ్ళాలని బుద్ధిపుట్టింది. తాను పుట్టి పెరిగిన అలెగ్జాండ్రియా నగరంలో తన ప్రఖ్యాతిని వెల్లడించాలని అభిలాషపడింది. అవును; తన బాల్యమంతా ఆ నగరంలోనే గడిపింది. అక్కడే తాను అన్నం - నీళ్లు లేక, బరివంట వీధులవెంట పిచ్చిపిల్లలా తిరిగింది.

థాయిస్ అలెగ్జాండ్రియాకు వెళ్ళింది. భోగభాగ్యాలతో తులతూగుతున్న ఆనగరం ఆవిడను సగౌరవంగా ఆహ్వానించింది. పౌరులు ఆవిడకు పాదపూజ చేశారు. ధనరాసులు కుమ్మరించారు. థాయిస్ ఆటా - పాటా చూచి జనం ఎగబడ్డారు. లెక్కలేనంతమంది వచ్చి ఆవిడచుట్టూ చేరారు. ఆవిడను ప్రేమించారు. ఆవిడ సౌందర్యాన్ని కీర్తించారు. థాయిస్ వారందరినీ చూచీ-చూడనట్లు చూచింది. విముఖత్వంతోనే అందరినీ చేరదీసింది. చివరకు వారిలో ఒకపురుషుడామెను తగిలాడు. అతను మరో లోలియస్‌వంటివాడు.

వారిలో నిసియస్ అను జ్ఞాని, వేదాంతి, ఆవిడకు తటస్థపడ్డాడు. అతను తన కేమీ వాంఛలు లేవని చెప్పుకొంటాడు. కాని అతను థాయిస్‌ను తనవశం చేసుకోవాలని అభిలషిం

చాడు. అతను బాగా కలవాడు. కలిమికితోడు తెలివి, వినయముకూడా ఉన్నాయి అతనికి. కాని ఇన్నిఉన్నా, అతగాడి సున్నితమైన హాస్యాలు, శృంగారభావాలు ఆవిడను ఆకర్షించి ఆకట్టుకోలేకపోయినవి. థాయిస్‌కు అతనిపై ప్రేమ లేదు. అంతేకాదు. అప్పుడప్పుడు అతని పరాచకాలకు ఆవిడకు వళ్ళు మండిపోయేది. ఎడతెగని అనుమానాలతో అతను ఆవిడను వేపుకతినేవాడు. అవును; అతనిది సందేహాత్మ! అతనికి దేనిలోనూ నమ్మకంలేదు. ఆవిడకు అన్నిట్లోనూ నమ్మకం. ఈశ్వరుడన్నా, విధి విలాసమన్నా, దయ్యాలన్నా, భూతాలన్నా, మంత్రాలన్నా, తంత్రాలన్నా, ఉచ్చాటనాది క్రియలన్నా, న్యాయమూ ధర్మమూ అన్నా ఆవిడకు పూర్తివిశ్వాసమున్నది. ఏసుక్రీస్తుయందు ఆవిడకు నమ్మకమున్నది. శాతబళ్ళు చేసేవాళ్ళు, సోది చెప్పేవాళ్ళు, మంత్రకర్తలు – వీరందరిపట్లా ఆవిడకు గౌరవం, అభిమానం ఉన్నాయి. వారు ఎన్నెన్నో అద్భుతాలు చెయ్యగలరంటుందామె. ఏదో తనకు తెలియనిదానికోసం ఆమె తపించిపోతుంది. ఊరూ – పేరూ లేని దేవుళ్ళను తలుస్తుంది, కొలుస్తుంది. నిరంతరం దేనికోసమో నిరీక్షిస్తూ ఉంటుంది. భవిష్యత్తంటే థాయిస్‌కు తగని భయం. అయినా అదేమిటో తెలుసుకోవాలని తహతహలాడుతుంది. ఆవిడచుట్టూ ఎందరెందరో మతగురువులు, మంత్రగాళ్ళు, రాజవైద్యులు, భూతవైద్యులు, పోగయి ఉంటారు. వారంతా ఆవిడను మోసం చేస్తుంటారు. ఆవిడ ఎవరినీ మోసం చెయ్యదు. తను మోసపోతున్నా, మోసపోతున్నానని అనుకోదు. ఆవిడకు మృత్యువంటే

భయం. ఆమృత్యువు విలయతాండవం చేస్తూఉండడం ఆవిడ ప్రతిచోటా చూచింది. తాను కామసుఖాలకు లొంగి నప్పుడు ఏదో భయంకరమైన హస్తం తన నగ్నశరీరాన్ని తాకి నట్లు ఆవిడ ఉలిక్కిపడుతుంది. భయవిచలితురాలైపోతుంది. ఆవిడ అవయవాలన్నీ విలవిలపోతాయి. భయంతో కంపించి పోతూ కెవ్వున కేక పెడుతుంది.

అప్పుడు నిషియస్ ఆవిడతో ఇలా అంటాడు: "ఏమి టయింది థాయిస్? ఎందుకూ వణికిపోతావు? ఈ చల్లని-మెల్లని రాత్రివేళ మనం సుఖడోలికలలో ఊగుతూ - తూగుతూ ఉండిపోదాం. కిలకిల నవ్వుతూ ఈ నీలాల నింగినీ, ఈ అనంతమైన ప్రకృతిశోభనూ తిలకిస్తూ తియ్యని కలలు కందాం. మన జీవితాలను సుఖవంతం చేసుకుందాం థాయిస్. మన ప్రేమ గొప్పది. మన బ్రతుకూ గొప్పది. ఇంద్రియ సుఖాలకు మించిన జ్ఞానం ఈలోకంలో లేదు థాయిస్! ప్రేమను అర్థం చేసుకొని అనుభవించడంలోనే మానవ విజ్ఞానమంతా ఇమిడిఉంది. ఏమీలేనిదానికోసం మనం ఎందుకు చింతించడం? ఎందుకు ఆవేదన చెందడం?"-

అతని మాటలు విని థాయిస్ కోపం తెచ్చుకొంటుంది. "నీలాంటి పురుషులను నేను అసహ్యించుకొంటాను. నీచంగా చూస్తాను. నీకు దేనిమీదా విశ్వాసం లేదు. ఏదన్నా భయం లేదు. ఎందుకో తెలుసుకోవాలని ఉంది నాకు! ఎందుకో తెలుసు కోవాలని ఉంది!-" అని బదులు చెప్పేది.

జీవితరహస్యం ఏమిటో అవగతం చేసుకోవాలన్న తలంపుతో థాయిస్, జ్ఞానులు, వేదాంతులు వ్రాసిన గ్రంథాలు చదవడం మొదలు పెట్టింది. కాని వాటిలో ఒక్క ముక్క కూడా అర్థం చేసుకోలేకపోయింది. తరువాత ఆమెకు శైశవ దశ జ్ఞాపకం వచ్చింది. ఆ జ్ఞాపకాలలో తియ్యని తలపులు పుట్టాయి. ఏదో ఆతురత, ఆవేదన బయలుదేరింది. అలా ఆవేదనతో, ఏమీ తోచక, రాత్రిపూట మారువేషం వేసుకొని తాను చిన్నప్పుడు ఆడుకొన్న ప్రదేశాలన్నీ తిరిగి చూడసాగింది. గొందులు, సందులు, పాడుపడ్డ మంటపాలు, చౌకులు-ఇవన్నీ తాను చిన్నప్పుడు తిరిగిన స్థలాలు. ఆ స్థలాలన్నీ ఇప్పుడు పిచ్చిపిల్లలా తిరిగి చూచింది. ఆవిడకు పుట్టెడు దుఃఖం పొంగివచ్చింది. తనకు అమ్మ-నాన్న లేనందుకు చింతించింది. ముఖ్యంగా వాళ్ళను తాను ప్రేమించలేకపోయినందుకు ఎంతగానో విచారించింది. క్రైస్తవ మతగురువు ఎవరైనా కంటపడినప్పుడు, తాను చిన్నప్పుడు మతం పుచ్చుకొన్న విషయమంతా ఆవిడకు జ్ఞాపకం వచ్చేది. హృదయంలో అంతులేని కల్లోలం బయలుదేరేది.

ఒక నాటి రాత్రి ఆమె నల్లటి ముసుగు వేసుకొని, తన పొడుగాటి జుట్టు కనిపించకుండా తలకు వాశన కట్టుకొని, మామూలు ప్రకారం తిరుగుతూ నగర పొలిమేరలలోనికి వచ్చింది. అక్కడికి వచ్చి చూచుకొన్నది. ఇంతదూరం ఎలా వచ్చానా అని ఆశ్చర్యపోయింది. అక్కడొక చిన్న బాప్టిస్టు దేవాలయం ఉన్నది. తలుపు సందులలోనుంచి సన్నని దీప కాంతి కనుపిస్తున్నది. ప్రార్థనాగీతాలు పాడుతూ ఉండడం

వినిపిస్తున్నది. అవును, అందులో ఆశ్చర్యమేమీలేదు. గత, పాతికసంవత్సరాలబట్టీ అష్టకష్టాలుపడిన క్రైస్తవులు ఇప్పుడు చక్రవర్తి పుణ్యమా అంటూ బహిరంగంగా దైవప్రార్థనలు చేసుకోగలుగుతున్నారు. పండుగలు జరుపుకోగలుగుతున్నారు. భగవంతుని కీర్తనలు ఆవిడ ఆత్మను మేలుకొలిపాయి. ఎవరో వచ్చి పిలిచినట్లుగా ఆలయందగ్గరికి వెళ్ళింది. తలుపు తీసుకొని లోపలికి వెళ్ళింది. లోపల లెక్కలేనంతమంది ఆడవాళ్ళు, పిల్లలు, వృద్ధులు, పోగయిఉన్నారు. వారంతా ఒక సమాధి ముందు మోకరిల్లి ఉన్నారు. ఆ సమాధి గోడకు ఆనుకొని ఉన్నది. అదొక రాతిభోషాణంలా ఉంది. దానిమీద ద్రాక్ష తీగెలు, గుత్తులు అడ్డదిడ్డంగా చెక్కిఉన్నాయి. అయినప్పటికీ ఆ రాతిని వారు ఎంతో భక్తితో పూజిస్తున్నారు. ఆరాధిస్తున్నారు. దానిమీద పచ్చని ఆకులు పరిచారు. ఎర్రగులాబీ గుత్తులతో మాలలు కట్టి వేశారు. చుట్టూ లెక్కలేనన్ని జ్యోతులు ముట్టించారు. పరిమళభరితమైన ధూపాలు వేశారు. గోడలకు దేవతల వర్ణచిత్రాలు వేయబడిఉన్నాయి. మత గురువులు తెల్లని ఉడుపులు ధరించి శవాన్ని ఉంచిన శిలాపేటిక ముందు మోకరిల్లి ఉన్నారు. వారు కీర్తనలు శ్రావ్యంగా పాడుతున్నారు. తక్కినవారంతా చరణాలు అందుకొని పాడుతూ పరవశమైపోతున్నారు. వారి పాటలలో అంతులేని విషాదం, అందులోనే అంతులేని ఆనందం మిళితమైఉన్నాయి. థాయిస్ వారి గానాన్ని శ్రద్ధగా ఆలకించింది. జీవితం ఎంతో మంచిదిగా, ఎంతోమధురమైనదిగా ఆవిడకు తోచి, ఆనందంతో పొంగిపోయింది. తిరిగీ అదే తరుణంలో మృత్యువుయొక్క

విలయతాండవం కనులముందు ప్రత్యక్షమవుతున్నట్లు అనిపించి, మళ్ళీ భయంతో కంపించిపోయింది.

వారంతా ప్రార్థనలు ముగించి లేచారు. అందరూ గుంపుగా నడిచి సమాధివద్దకు వెళ్ళారు. వారందరూ సామాన్య మానవులు. కాయకష్టం చెయ్యడానికి అలవాటు పడినవారు. వారెవ్వరికీ ఆడంబరం లేదు. వంతుల ప్రకారం ఒక్కొక్కరే తలలు వాల్చుకొని, చూపు చెదరనీయక, శాంతంగా, గంభీరంగా ముందుకువెళ్ళి సమాధిమీదికి వంగారు. సమాధికి తమ పెదవులు తాకించి-ముద్దాడారు. వారిలో ఎక్కడలేని నిష్కాపట్యం, నిశ్చలమైన విశ్వాసం దృగ్గోచరమవుతున్నాయి. తల్లులు తమ పిల్లలను ఎత్తుకొని, వారి చెక్కిళ్ళను సమాధికి తాకించారు.

ఇదంతా చూచి థాయిస్ ఆశ్చర్యచకిత అయింది. ఆనిక కిదంతా అగమ్యగోచరంగా ఉంది. ఒక మతగురువును పిలిచి, "ఇదంతా ఏమిటీ? ఎందు కిలా చేస్తున్నారు? అని అడిగింది.

"నీకు తెలీదా అమ్మా! పూర్వం నీర్రోగా పుట్టి, బాని సగా బ్రతికిన సెయింట్ థియోడర్, భగవంతుని నమ్మి తన ప్రాణాలను బలిఇచ్చాడు. ఆయన పవిత్రంగా, జీవించి వీరుడుగా మరణించాడు. ఆ మహాత్ముని జ్ఞాపకార్థం ఇవాళ మేమంతా ఇక్కడ ప్రార్థనలు చేసుకుంటున్నాం. ఆ పుణ్యాత్ముని సమాధి ఇదే తల్లి,"- అని మతగురువు సమాధానం చెప్పాడు.

ఈ మాటలు వినీ వినడంతోనే థాయిస్ నేలమీద మోకరిల్లింది. వెక్కి వెక్కి ఏడవడం మొదలుపెట్టింది. తనను చిన్నతనంలో పెంచిన అమెస్ ఆవిడకు లీలగా జ్ఞాపకం వచ్చాడు. అతను సాధువు. సత్ప్రవర్తన కలవాడు. కాని అదృష్టహీనుడు. బ్రతికినన్నాళ్ళూ కష్టాలే అనుభవించాడు. అవుతేనేం? ఇప్పుడతను మహానుభావుడు. అంతా అతనికి మ్రొక్కుతున్నారు. పూలతో పూజిస్తున్నారు. దీపారాధనలు చేస్తున్నారు. ప్రార్థనలు సలుపుతున్నారు.

—"అవును. అమెస్ మంచివాడు. ఇప్పుడు ఇంతటి మహానుభావుడుగా పూజింపబడుతున్నాడు. ఘనుడుగా కీర్తింపబడుతున్నాడు. కాని అతను అందరికంటే ఎందుకు మహానుభావుడైనాడు? ఏమిటిది? భోగభాగ్యాలకంటేకూడా గొప్పదయిన ఈ విషయం ఏమిటి?"- అని తనలో తాను తర్కించుకొన్నది.

ఇలా థాయిస్ మెల్లగా లేచి నిలుచున్నది. పుణ్యాత్ముడు, తనను ప్రాణంకన్న మిన్నగా ప్రేమించినవాడు అయిన అమెస్ సమాధివైపు నడిచివెళ్ళింది. ఇప్పుడు థాయిస్ అందమైన నీలి కనులలో నీళ్లు తిరిగాయి. నీళ్లు నిండిన కనులు ఆ దీపకాంతిలో తళతళలాడాయి. ఆమె తల వాల్చుకొని మెల్లగా, భక్తిపూర్వకంగా సమాధిమీదికి వంగింది. ఎన్నెన్నో మధురవాంఛలు మొలకెత్తిన తన అధరాలను తాకించి, ఆ బానిస సమాధిని ముద్దాడింది.

థాయిస్ ఇంటికి వచ్చేసరికి నిషియస్ చక్కగా ముస్తాబయి ఉన్నాడు. పరిమళగంధాలు పూసుకొన్నాడు. పట్టు వస్త్రాలు కట్టుకొన్నాడు. నీతిశాస్త్రాన్ని బోధించే ఒక గ్రంథం చదువుతూ థాయిస్‌కోసం కనిపెట్టుకొని ఉన్నాడు. థాయిస్ రాగానే లేచి, చేతులు చాచి ఆవిడను సమీపించాడు—

"పెంకిపిల్లా! ఎక్కడికి వెళ్లావే ఇంత సేపు?—" అంటూ నవ్వాడు—"నీ వెప్పుడొస్తావా అని నే నిక్కడ కనిపెట్టుకొని ఉన్నాను. చూచావుటే థాయిస్? ఒక గొప్ప జ్ఞాని, విరాగి వ్రాసిన గ్రంథం చదువుతున్నాను నేను. అందులో ఏం చెప్పారో తెలుసా? నీతులు, ధర్మవిధులు అనుకొంటున్నావా? కాదు! ఈ గ్రంథంలో ప్రతిపుటలోనూ వేలమంది థాయిస్‌లు నాట్యం చేస్తూ ఉండడం నాకు కనిపించింది. వారంతా చిన్న చిన్న పిల్లలు! నా వేలెడంత లేరు. అవుతేనేం? ఎంత అందంగా ఉన్నా రనుకున్నావ్? వారందరూ థాయిస్‌లే! వారిలో కొందరు బంగారు జరీ అంచులుగల, వలిపెంలాంటి పట్టు ఓణీలు వేసుకొన్నారు. కొందరు ఉల్లిపొరలాంటి తెల్లటి దుస్తులు ధరించారు. వారంతా మేఘాలలో తేలిపోతున్న దేవకన్యల్లా ఉన్నారు. ఇంకా కొందరు నగ్నంగా, కదలక — మెదలక నిలుచుని ఉన్నారు. వారిముందు అప్సరసలు పనికి రారు థాయిస్! చివరకు చెట్టాపట్టాలు పట్టుకొని ఇరువురు కన్యలు కనిపించారు. ఇద్దరిదీ ఒకే పోలిక. ఇది ఫలానా, ఇది ఫలానా అని గుర్తుపట్టలేం. ఆఇరువురూ చిరునవ్వులు నవ్వారు. అందులో మొదటి పిల్ల 'నేను ప్రేమను' అన్నది. రెండో పిల్ల 'నేను మృత్యువును' అన్నది."—

ఇలా చెప్తూ నిసియస్, థాయిస్‌ను కౌగిట్లోకి తీసుకొని గట్టిగా అదుముకొన్నాడు. కాని ఆవిడ తలవాల్చుకొని ఉన్నది. ఆవిడ నీలి కనులనుండి నీరు కారి కాల్వలు కడుతున్నది. కన్నీటితో ఎర్రని కపోలాలు తడిసి ముద్దయిపోతున్నాయి. అది అతను గమనించలేదు. పిచ్చి ధోరణిగా ఇంకా ఏదో ఏదో చెప్పుకుపోతున్నాడు.

"అవునే థాయిస్! నీవు నమ్మూ-నమ్మకపో! ఈ గ్రంథంలోని ప్రతిపంక్తిలోనూ 'థాయిస్‌ను ముద్దాడినవాడికే ముక్తి! ఆవిడ అధరామృతం గ్రోలనివాడి జన్మ వ్యర్థా" అని వ్రాసి ఉన్నది తెలుసా? జ్ఞానులయినవారు ప్రతి గ్రంథాన్ని ఇలాగే చదువుతారు. ఇలాగే అర్థం చేసుకొంటారు. నిజం చెపుతున్నాను థాయిస్! మనం ఈ లోకాన్నీ, ఈ లోకంలోని మనుష్యులనూ మరచిపోదాం. ఎవరికీ అందని మహదానందంలో తేలిపోదాం. మన జన్మలను సార్థకం చేసుకొందాం"–.

థాయిస్ అతని మాటలు వినిపించుకోలేదు ఆవిడ మనస్సు ఇంకా అమోస్ సమాధిపైననే లగ్నమైఉంది. వేడి నిట్టూర్పులు విడుస్తున్నది. అది చూచి నిసియస్ ఆవిడముచ్చలి గుంటను ముద్దాడాడు–

"పిచ్చిపిల్లా! ఎందుకే దిగులు? ఈలోకాన్ని మరిచిపోతేతప్ప మనం సుఖపడలేం. రా, జీవితాన్ని మోసంచేద్దాం, రా. జీవితంపై పగతీర్చుకుందాం, రా. ప్రేమించుకుందాం రా. నన్ను చేరరావే థాయిస్!" అని ప్రేలాపన మొదలుపెట్టాడు.

కాని థాయిస్ అతన్ని అవతలకి త్రోసివేసింది-

"ప్రేమట, ప్రేమ!" అన్నది వెగటుగా- "నీవు నీ జన్మలో ఒకరిని ప్రేమించి ఎరుగవు! నేను నిన్ను ప్రేమించనే లేదు. అవును. నిన్ను ప్రేమించను, ప్రేమించబోను! నీవంటే నాకు అసహ్యం! వెళ్ళు! ఎవరు సుఖంగా ఉన్నా నేను చూడలేను. శ్రీమంతులనూ, సుఖవంతులనూ నేను ఎల్లప్పుడూ ద్వేషిస్తాను, దూషిస్తాను. తెలిసిందా? ఇహ వెళ్ళు! వెళ్ళవేం? దౌర్భాగ్యులలోనే దయా-దాక్షిణ్యాలున్నాయి. వారిలోనే మంచితనం ఉంది. నేను చిన్నదాన్నిగా ఉన్నప్పుడు ఒక నీగ్రో బానిసను ఎరుగుదును. అతను భగవంతుని నమ్మాడు. శిలువ మీద ప్రాణాలు విడిచాడు. మంచివాడంటే అతనూ! నిజమైన ప్రేమ ఏమిటో అతనికే తెలుసు. జీవితరహస్యం అతనికే తెలుసు. అతని పాదధూళి శిరమున తాల్చడానికికూడా నీవు పనికిరావు! ఇహ వెళ్ళు! మళ్ళీ నాకంటపడకు."- అన్నది.

తరువాత వెళ్ళి దివాసీమీద వాలిపోయింది. ముఖాన్ని రెండు చేతులతో కప్పుకొని వెక్కి-వెక్కి ఏడ్వసాగింది. అలా ఏడుస్తూనే ఆ రాత్రంతా గడిపింది. ఇహముందయినా సెయింట్ థియోడర్‌లా పవిత్రంగా జీవించాలనుకొన్నది. ఈ భోగభాగ్యాలన్నీ విడిచిపెట్టి పేదరికం అనుభవించాలని నిశ్చయించుకొన్నది.

ఆ మరునటి రోజు మళ్ళీ మామూలుగా తాను అలవాటుపడిన జీవితాన్నే కొనసాగించింది. సుఖాలకు లొంగింది. ఖులాసాలతో విలాసాలతో కాలం వెళ్ళబుచ్చింది. తన సౌందర్యం

ఇంకా విలక్షణంగానే ఉన్నప్పటికీ అలా ఎంతో కాలం ఉండదనీ, వాడిపోవడం మొదలుపెడుతుందనీ థాయిస్ తెలుసుకొన్నది. అంచేత త్వరత్వరగా తన వాంఛలన్నీ తీర్చుకోవాలనుకొన్నది. సుఖాలనేవి ఏవీ మిగల్చకుండా ఎంత వేగిరం అనుభవిస్తే అంత మంచిదని భావించింది. వచ్చే కీర్తి యావత్తూ ఒకమారే రావాలని కోరింది. ఇలా అభిలాషపడి విడువకుండా నాటకాలు వేసింది. నాట్యప్రదర్శనా లిచ్చింది. పూర్వాంకం కంటె ఎక్కువ ప్రతిభ చూపింది. జనానికి గంగవెర్రులెత్తించింది. శిల్పులు, చిత్రకారులు, కవులు, గాయకులు, నటులు, విటులు - వీరందరినీ మోహంలో ముంచెత్తింది. అందరిచేత 'శెభాష్' అనిపించుకొన్నది. అందంలో, అభినయంలో, ఆటలో, పాటలో అందరినీ తలదన్నింది. "థాయిస్ నిజంగా దేవకన్య. స్వర్గం నుంచి ఊడిపడింది. ఈమెతో సాటివచ్చేవారు ఈలోకంలో లేరు - అన్నారు అంతా. థాయిస్ ఎవ్వరిమాటా కాదనలేదు. నిరుపేదలకూ, నిర్భాగ్యులకూ, దీనులకూ, హీనులకూ సయితం సుఖాలను పంచిపెట్టింది. అందరికీ అందిన ఆనందంగా వెలుగొందింది. అయినప్పటికీ ఆవిడకు శాంతి లేదు. ఎవరికీ లభించని కీర్తి, డబ్బు - అన్నీ తనకు లభించినా ఆవిడ దేనికోసమో పాకులాడసాగింది. ఏదో కొరవడినట్లు, ఏదో పోగొట్టుకొన్నట్లు వెమకసాగింది. ఆరని దాహం, తీరని మోహం ఆవిడను పిల్చిపిప్పిచేస్తున్నాయి. తన సుందరభవనాలలో వున్నా, ఉద్యానవనాలలో విహరిస్తున్నా, ఒక్కక్షణం, ఆమెకు మనశ్శాంతి లేదు. ఏదో మృత్యువు ప్రత్యక్షమైనట్లు భయంతో కంపించిపోతూవచ్చింది.

థాయిన్‌కు సుందరమైన ఉద్యానవనా లెన్నో ఉన్నాయి. హిందూదేశంనుంచీ, పర్షియానుంచీ ఎంతో ఖర్చుపెట్టి తెప్పించివేసిన రకరకాల చెట్లు, తీగెలు ఆ వనాలలో శోభిల్లుతున్నాయి. ఆ వనాలలో జలజల ప్రవహించే ఏరు, మనోహరమైన సరోవరం ఉన్నాయి. గొప్పశిల్పులచే నిర్మింపబడిన చంద్రమంటపాలు, శిలావేదికలు, పెద్ద పెద్ద కృత్రిమ పాషాణాలు, జలంలో ప్రతిఫలిస్తూ కన్నులకింపుగా కనుపిస్తుంటాయి. సరోవరం చుట్టూ సుందర విగ్రహా లుంటాయి. మనిషి నీడ సయితం కనుపించే పాలరాతి విగ్రహాలవి. వనం మధ్యలో థాయిస్ భవనం. ఆ భవనద్వారంలో నిలువెత్తు వనకన్యల విగ్రహాలు మూడున్నాయి. అదాటున చూస్తే అవి సజీవ ప్రతిమలా అనిపిస్తుంది. ఇహ భవనంలో గోడలనిండా దేవతల చిత్రాలు వ్రేలాడుతున్నాయి. ఇంకా థాయిస్ సౌందర్యానికి మెచ్చుకొని బహుమానంగా ఇతరులు ఇచ్చిన రకరకాల బొమ్మలు, పటాలు, తైలవర్ణచిత్రాలు ఉన్నాయి. ఆమె నాటకాలలో వేషం వేసినప్పుడు, వివిధ పాత్రలను అభినయించడాన్ని చూపుతూ గీసిన పటాలుకూడా ఉన్నాయి. మేలురకం దంతంతో తయారుచేసిన శృంగారమైన బొమ్మలు కొన్ని ఉన్నాయి. అవి నిషియస్ బహూకరించినవి. ఇక నేలమీద రంగురంగుల రత్నకంబళ్ళు. వాటిమీద జరీతో చిత్రవిచిత్రమైన అల్లిక పనిచేసిన తలగడలు, దిండ్లు, బాలీసులు, పులిచర్మాలు, సింహపు చర్మాలు వెలుగొందుతున్నాయి. పెద్ద పెద్ద ఇత్తడి, కంచు పూలకుండీలలో రకరకాల పూల మొక్కలు, లతలు శోభిల్లుతున్నాయి. మందిరంలో చిట్ట

చివర తాబేలు ఆకారంలో అమర్చబడిన పట్టుపాన్పు ఉన్నది. థాయిస్ శయనించేది ఆ పాన్పుమీదనే. అక్కడే ఆ త్రిలోక సుందరి ప్రతినిత్యం తన స్నేహితులతోను, ప్రియులతోను కబుర్లాడుతూ, కేళీవిలాసాలలో తేలుతూ ఉంటుంది. పుష్ప సౌరభాలు, సుగంధద్రవ్యాల పరిమళాలు అక్కడ గుప్పున కొడుతూ సువాసిస్తుంటాయి. ఒకొక్కప్పుడు థాయిస్ అక్కడ ఒంటిగా కూచుని తన కళాప్రౌఢమను, అభినయ కౌశలాన్ని తలపోస్తూ కాలం వెళ్ళబుచ్చుతూ ఉంటుంది.

నృత్యప్రదర్శనం ఇచ్చి ఇంటికినచ్చినతరువాత థాయిస్, మధ్యాహ్నంవేళ వనకన్యల విగ్రహాలముందునిలుచుని అద్దంలో చూచుకొంటున్నది. తన వేషాన్ని దిద్దుకొంటున్నది. తన సౌందర్యం వాడిపోతున్న తొలి చిహ్నాలు ఆవిడకు అగుపించాయి. ఆవిడ భయంతో కంపించిపోయింది. తన జుట్టు ఇక తెల్లబడిపోతుందనీ, తన ముఖాన ముడతలు ఏర్పడతాయనీ ఊహించుకొన్నది. మరల తన సౌందర్యాన్నీ, యౌవనాన్నీ పొందగలనని తనకు తాను నచ్చచెప్పుకోడానికి ప్రయత్నించింది. కొన్ని మూలికలు సేవించినట్లైతేనూ, కొన్నిమంత్రాలు జపించినట్లైతేనూ, తన తారుణ్యం, లావణ్యం ఎప్పటికీ వాడకుండా ఉంటుందని తలపోసింది. కాని అంతలో "థాయిస్! నీకు వృద్ధాప్యం వస్తుందిసుమా!"అని ఎవరో అంటున్నట్లనిపించింది. వెంటనే ఆమెకు ఎక్కడలేని భయంవచ్చి ఆవహించింది. ముఖాన చిరుచెమటలు పోశాయి. మళ్ళీ అద్దంలో తన ముఖం చూచుకొన్నది.

"నా అందచందాలు ఎంతమాత్రం చెడలేదు. ఇప్పటికీ నన్ను చూచినవాళ్లు మోహంలో మునిగిపోతారు." అనుకొన్నది. ఇలా అనుకొని చిరునవ్వు నవ్వింది- "అందచందాలలోనేమి, ఆట-పాటల్లోనేమీ నాకు పోటీ ఈ అలెగ్జాండ్రియాలో లేరు!" అనుకొన్నది.

థాయిస్ అద్దంలో చూచుకొంటూ ఇలా అనుకొంటూఉండగా ఎవరో ఒకమనిషి వచ్చి ఆవిడ వెనకాల నిలుచున్నాడు. గడ్డం పెంచుకొని, తెల్లటి పట్టుదుస్తులు ధరించిఉన్న ఆమనిషిని అద్దంలో చూచి థాయిస్ కెవ్వున కేక వేసింది. చేతిలోని అద్దం జారిపడింది.

పఫ్నూటియస్ కదలకుండా మెదలకుండా నిలుచుని, రెప్పవాల్చకుండా ఆవిడ సౌందర్యాన్ని తిలకిస్తున్నాడు.

"ఓ ఈశ్వరా! ఇంతటి అందకత్తె ఈలోకంలో లేదు. తుచ్ఛమైన సుఖాలకు వేటికీ ఈమె లొంగకుండా చూడు. ఈమెను నీపాదదాసిగా చేసుకో!-" అని లోలోపల ప్రార్థించుకొన్నాడు. తరువాత ఏదో శక్తి తనను ప్రేరేపిస్తున్నట్లు ఆమెను చూచి ఇలా చెప్పసాగాడు-

"థాయిస్! నేను దూరదేశంలో ఉంటున్నాను. అంత దూరంలో ఉన్న నేను నీ సౌందర్యాన్నిగురించి విన్నాను. విని నీ దగ్గరకు వచ్చాను. థాయిస్! నీలాంటి అభినేత్రి మరెక్కడా లేదని అంతా చెప్పుకుంటున్నారు. నీ లావణ్యానికి లొంగని పురుషుడే లేడట! నీ అందచందాలనుగురించీ, నీ భోగభాగ్యాలనుగురించీ వింటూ ఉండే నాకు పూర్వం నైలు నదీ

తీరంలో ప్రసిద్ధికెక్కిన మహారాణుల గాథలు స్మరణకు వచ్చాయి. అందుచేత నిన్ను చూడాలనే తీవ్రమైన వాంఛ నాలో పుట్టుకొచ్చింది. వచ్చాను. నిన్ను కళ్ళారా చూచాను. చూచిన తరువాత నేను విన్న వదంతులు నీముందు ఎందుకూ పనికిరా వనిపించింది నాకు. నేను విన్నదానికంటె ఎన్నో వేల రెట్లు మిన్నగా ఉన్నావు నీవు. నీ సౌందర్యం వర్ణించడానికి వాళ్ళకు నోళ్ళు చాలవు. థాయిస్! నీతో నిజం చెపుతు న్నాను. ఇప్పుడు నిన్ను చూడగానే నాకు ఏమనిపించిందో తెలుసా? తాగి తూలుతున్న ట్లనిపించింది థాయిస్!"

ఇలా పఫ్నూటియస్ జ్వరతీవ్రతలో ఉండి మాట్లాడి నట్లు మాట్లాడాడు. అతని వాక్కులలో ఎక్కడిలేని ఉద్విగ్నత గోచరిస్తున్నది. ఆ పలుకులు విని థాయిస్ తనను భయవిచలి తను కావించిన ఆ అపరిచిత వ్యక్తినంక తదేకంగా చూచింది. దీపకళికలలా జ్వలిస్తున్న అతని కనుచూపులు చూసి నిర్విణ్ణురా లయింది. అటువంటి వ్యక్తిని ఆవిడ ఇంతవరకూ చూడలేదు. ఇతను అందరికంటె విభిన్నంగా, విచిత్రంగా కనుపిస్తున్నాడు. ఇతను ఎవరో, ఎలాంటి జీవితం గడుపుతున్నాడో తెలుసుకో వాలని థాయిస్‌కు కుతూహలం కలిగింది. పరిహాసంగా అతని కిలా బదులు చెప్పింది—

"ఓ అపరిచితుడా! నీ పొగడ్తలకు సంతోషించాను. కాని ఒక్క విషయంలోమాత్రం జాగ్రత! నా చూపులకు నీవు తట్టుకోలేవు! నా ప్రేమకు నీవు తాళలేవు సుమా!—"

అందుకు పఫ్నూటియస్ —

"నిన్ను ప్రేమిస్తున్నాను థాయిస్! నా ప్రాణంకంటె మిన్నగా ప్రేమిస్తున్నాను థాయిస్! నీకోసమే నేను ఎడారులు, తపోవనాలు వదలివచ్చాను. మునిగా ఉన్నవాణ్ణి మౌనం విడిచి వచ్చాను. ఎన్నడూ మాట్లాడని వాణ్ణి మాట్లాడుతున్నాను. ఏ విషయం వినని వాణ్ణి వింటున్నాను. ఏ విషయం చూడని వాణ్ణి చూస్తున్నాను. చూశావా థాయిస్! నీకోసం చెయ్యరాని పనులన్ని చేస్తున్నాను. నీకోసం నా ఆత్మ తపించిపోయింది. నా హృదయం వ్రయ్యలయింది. నా భావాలు ఆఘ-మేఘాలమీద పరుగులు తీశాయి. కొండలు, ఎడారులు, గుహాలు, వనాలు దాటి రాళ్ళనక ముళ్ళనక వట్టికాళ్ళతో రాత్రింబవళ్ళు నడచి, ఎన్నో గండాలు గడచి నీ చెంతకు వచ్చాను థాయిస్! అవును, నిన్ను ప్రేమిస్తున్నాను. అందరిలాంటి ప్రేమ కాదు నాది. తుచ్ఛమైన కామసుఖాన్ని కోరి ప్రేమించే ప్రేమ కాదు ఇది. వారంతా తోడేళ్ళలాగా, ఆబోతులులాగా నీ రక్త మాంసాలను పీల్చి పిప్పిచెయ్యడానికి వస్తారు. కాని నేను నిర్మలమైన మనస్సుతో, ఆత్మ శుద్ధిగా ప్రేమిస్తున్నాను థాయిస్! దైవ సంబంధమైన ప్రేమ నాది. ఆరని తీరని మోహదాహాలతో, వారు నీ ఆత్మను బలి తీసుకొంటారు థాయిస్! భగవంతునిపట్ల నాకు గల భక్తి, ప్రేమ, అనురాగాలు నీ యెడల చూపుతున్నాను. ఆ ఈశ్వరుణ్ణి ఎల్లప్పుడూ ఎలా ఆరాధిస్తానో అలానిన్ను ఆరాధిస్తాను. నా హృదయపీఠంపై ఉంచుకొని కొలుస్తాను. నీ విప్పుడు అనుభవిస్తున్న సుఖాలన్నిటికంటె అధికమైనసుఖాన్ని నీకు అందిస్తాను థాయిస్! ఒట్టుపెట్టుకొని చెపుతు

న్నాను. మాట తప్పను. దివ్యమైన భోజనాలు, విందులు, దివ్యభోగాలుఅన్నీ నీకు సమకూరుస్తాను థాయిస్! నేను నీకు అందించే సుఖం ఎప్పటికీ తరగనిది. అంతం కానిది. అమ్మాయ్! నిజం చెపుతున్నాను. ఆ సుఖం వర్ణింప శక్యం కానిది. అవాఙ్మానసగోచరమైనది. అఖండమైనది. అంతులేనిది. ఆ సుఖంముందు నీ విప్పుడనుభవించే ప్రపంచ సుఖాలన్నీ తీసికట్టు. దానిముందు ఇవన్నీ కేవలం నీడల్లా నీకు గోచరిస్తాయి." అని పలికాడు.

అతని పలుకులు విని థాయిస్ కొంటెపిల్లలా నవ్వింది.

"స్నేహితుడా! నీవు చెప్పే ఆ అద్భుతమైనప్రేమ ఏమిటో ఒకమాటు నాకు చూపిద్దూ. ఊఁ; త్వరగా, ఆలస్యం చెయ్యకు. నీ పెద్దపెద్ద ఉపన్యాసాలతో నన్నూ, నా సౌందర్యాన్నీ అవమానించకు. స్నేహితుడా! ఇహ ఒక్కక్షణం కూడా వృథా చెయ్యకు. నీవు చెప్పే ఆనందం ఏమిటో ఒక్కమాటు రుచిచూడాలని నా మనస్సు వేగిరపడుతున్నది. స్నేహితుడా! నేను తాళలేకుండా ఉన్నాను. కాని నిజం చెప్పాలంటే, ఈ ఆనందాలన్నీ నాకెప్పుడూ అంతుపట్టకుండానే ఉంటున్నాయి. నేను ఎప్పుడూ అమాయకురాలినే! నీ ఒట్లూ-సత్యాలూ అన్నీ మాటల్లోనే మాయమైపోతాయేమో! అదే నాభయం! గొప్ప సుఖాన్ని ప్రసాదించడంకంటె, ప్రసాదిస్తానని ప్రమాణంచెయ్యడం చాలా సులువు. ప్రతి ఒక్కరిలోనూ ఏదోరకమైన ప్రతిభ ఉంటుంది. గొప్ప ఉపన్యాసాలివ్వడంలో నీవు ప్రజ్ఞావంతుడవని నేను భావిస్తున్నాను. నీ వేదో అవ్యక్తము, అగోచరము అయిన ప్రేమనుగురించి చెపుతున్నావు. స్త్రీపురుషుల శృంగారమనేది ఎప్పుడు మొద

లయిందో-ఇంతకాలం గడిచినా ఇంకా ప్రేమలో రహస్యాలు మిగిలిఉన్నాయనడం నమ్మలేని విషయం. శృంగారం విషయంలో వేదాంతులకంటె, ప్రేమికులకే ఎక్కువతెలుసు-" అన్నది.

"అమ్మాయ్! నాతో పరాచకాలాడకు. అవ్యక్తము, అగోచరము అయిన ప్రేమను నీకు అందిస్తాను-" అన్నాడు పఫ్నూటియస్.

"స్నేహితుడా! నీవు నాకు చిట్టచివరవాడివి. అన్ని రకాల ప్రేమలూ నే నెరుగుదును." అన్నది థాయిస్.

"నీవెరిగిన ఆప్రేమలన్నీ నీకు పరాభవాన్నీ, నైచ్యాన్నీ తెచ్చిపెడతాయి థాయిస్! నేను ప్రసాదించే ప్రేమ నీకు పరిపూర్ణమైన శోభను, విస్తారమైన మహిమను చేకూరుస్తుంది. తెలుసా అమ్మాయ్!" అన్నాడు మళ్ళీ పఫ్నూటియస్.

థాయిస్‌కు కోపం వచ్చింది. అతనివంక చురచుర చూచింది. సుందరమైన ఆవిడ వదనంలో కోపచ్ఛాయలు అలముకొన్నాయి.

"నీవు చాలా సాహసంతో మాట్లాడుతున్నావు అపరిచితుడా! ఎవరింటికి వచ్చావో వారినే అవమానిస్తున్నావు. ఒక్కమాటు నావంకచూచి చెప్పు; నేను అవమానంతో అధఃపతితురాలను కావలసినదానినేమో చెప్పు. లేదు. నా కేఅవమానమూలేదు. నాకే కాదు; నాలా జీవించే స్త్రీలు ఎందరో ఉన్నారు. అంద చందాలలోనూ, భోగ భాగ్యాలలోనూ వారెవ్వరూ నా కొనగోటికి సరితూగరు. అయినా వారెవ్వరూ

కూడా అవమానంతో, క్రుంగిపోవలసినపని లేదు. నేను అడుగు పెట్టినచోట స్వర్గం సృష్టించాను అడుగడుగునా ఆనందాలు మొలిపించాను. ఈ లోకమంతటా సుఖాలు వెదజల్లాను. ఈలోకానికి అధినేతలు ఎవరున్నారో, వారందరికంటెకూడా నేను అధికురాలిని, శక్తిమంతురాలిని. వారంతా నా పాదాక్రాంతులు కావడం నేను కనులారా చూచాను. చూడు! ఈ నా చిన్న పాదాలవంక చూడు! ఈ చరణాలను తాకడానికి, ముద్దాడడానికి వేలాది మానవులు తమ సిరిసంపద లన్నీ సమర్పిస్తారు. తమ రక్తాలనుసయితం ధారవోస్తారు. నేనేం తాటిచెట్టంత ఎత్తులేను. ఈవిశాల విశ్వంలో నేను ఆక్రమించే జాగా బహుస్వల్పం. నేను వీధిలోనుంచి వెడుతుంటే, ఉన్నత భవనాలపైనుంచి చూచేవారికి ఒకచిన్న నడ్లగింజలా కనుపిస్తాను. కాని ఈ నడ్లగింజకోసం మానవులంతా ఉరుకులు పెడుతున్నారు. తన్నుక చస్తున్నారు. చెయ్యరానిఘోరాలు, నేరాలు చేస్తున్నారు. అసూయా, ద్వేషాలతో ఉడికిపోతున్నారు. పడరాని పాట్లన్నీ పడుతున్నారు. కాబట్టి నాకీర్తి, నాప్రభావం ఇలా లోకం నలుమూలలా ఘోషిస్తూ ఉంటే, నేను పరాభవింపబడుతున్నానని నీ వంటున్నావూ అంటే నీ వొక వెర్రివాడవన్న మాట! కాదామరి?–" అన్నది థాయిస్.

"అమ్మాయ్! ఈ లోకం కళ్ళముందు కనుపించే నీ కీర్తి, నీ ప్రభావం–అన్నీకూడా భగవంతునిముందు ఎందుకూ కొరగావు. తెలిసిందా? అయినప్పటికీ ఈశ్వరసాక్షిగా చెప్పుతున్నాను. నీతో ఏకీభవించాలనే నా ఉద్దేశం. ని న్నా ఈశ్వరుని చరణదాసిగా చెయ్యాలని నా సంకల్పం. అందుకే

వచ్చాను. భగవంతుని కరుణామృతాన్ని నీపై చల్లి నిన్ను పవిత్రురాలినిగా చేస్తాను. నీ జీవితానికి శాశ్వతత్వం ప్రసాదించి నీ జన్మను సార్థకం చేస్తాను థాయిస్! అందుకే ఆ ఈశ్వరశక్తి నన్ను ప్రేరేపించగా నీచెంతకు వచ్చాను"- అన్నాడు పఫ్నూటియస్.

ఇహ ఇప్పుడు థాయిస్కు కోపమంతా మాయమైంది.

"ఇతను శాశ్వతమైన బ్రతుకునుగురించి మాట్లాడు తున్నాడు. యంత్రాలపై, తాయెత్తులపై లిఖించే మంత్రాల లాగా, బీజాక్షరాల్లాగా ఉన్నాయి ఇతని పలుకులు. నిజంగా ఇతనెవరో మాంత్రికుడు. జరామరణాలు లేకుండా చెయ్య గల మహానుభావుడు"- అనుకొన్నది థాయిస్, తనలో. ఇలా అనుకొని అతన్ని చూచి కొంచెం భయపడినట్లు రెండ డుగులు వెనక్కు వేసింది. వనదేవత విగ్రహంచెంత కూచు న్నది. వంటిమీద చెదిరిపోయిన తన దుస్తులను సరిచేసు కొన్నది. మూగపిల్లలా మాట్లాడకుండా తలవాల్చుకొని కూచున్నది. నఖశిఖ పర్యంతం ఇప్పుడామెలో వినయ విధేయ తలు దృగ్గోచర మవుతున్నాయి. ముద్దొచ్చేటట్లు కాళ్ళు క్రిందికి వ్రేలాడవేసుకొన్నది. ఆమె కనురెప్పల నీడ వచ్చి కపో లాలపై పడుతున్నది. కాల్వగట్టున ఆలోచనా నిమగ్నురాలై కూచున్న ఒక పసిపిల్లలా కనుపిస్తున్నది.

ఇలా కొంతసేపు కూచుని ఉండగా పఫ్నూటియస్ ఆవిడవంక చూచాడు. అతను కదలలేదు. అతని కాళ్లు తేలి పోతున్నాయి. నాలుక పిడచగట్టుకొనిపోతున్నది. చెవుల

కేవో శబ్దాలు వినవస్తున్నాయి ఎంతో పూనికతో అలా నిలువబడి ఉన్నాడు. ఉన్నట్లుండి హఠాత్తుగా అతని దృష్టి చెదిరింది. అతని కేమీ అగుపించలేదు. ఒక మందమైన మబ్బు తెర వచ్చి అతని కనులముందు దిగింది. ఆ స్త్రీ తనకు కనుపించకుండా ఉండడానికై ఏసుక్రీస్తు అలా చేశా డనుకొన్నాడతను. తిరిగి బెదరిన మనస్సును చిక్కపట్టుకొన్నాడు. ధైర్యం కూడ గట్టుకొన్నాడు. మహర్షిలా, శాంత గంభీర స్వరంతో—

"నీవు నా అధీన మయ్యేటట్లయితే, భగవంతుని కనులు కప్పుతున్నట్లుగా భావిస్తున్నావా?" అని అడిగాడు.

"భగవంతుడా! ఎల్లప్పుడూ సర్వసాక్షిగా ఉం చూచే ఆ భగవంతుడా! మనం ఆయనకు ద్రోహం చేసినట్లు ఆయన భావిస్తే ఆయన క్రోధన ఆయన్ను వెళ్ళిపోనీ! కాని మనం ఆయనకు ఎందుకు ద్రోహం చెయ్యాలి? ఆయనే మనలను సృష్టించాడు. ఆయన సృష్టించినట్లు మనం ఉన్నాం. ఆయన ప్రసాదించిన స్వభావం ప్రకారమే ప్రవర్తిస్తున్నాం. ఇహ ఆయన మనలను చూచి ఆగ్రహించవలసిన పనీలేదు, ఆశ్చర్య పడవలసిన అవసరం అంతకన్నా లేదు. అయ్యా! నీ వెవరో కాని ఒక్కమాట అడుగుతాను చెప్పు–ఈశ్వరుని నిజస్వరూపం ఏమిటో నీకు తెలుసునా? ఆయన పేరు ఉచ్చరించటానికి నీ వెవరవయ్యా? మహామాట్లాడుతున్నావు"– అని అడిగింది థాయిన్.

ఈ ప్రశ్నకు ఆ సన్యాసి తను అరువు తెచ్చుకొన్న గౌరవవస్త్రులను తీసి తన అంగీ చూపాడు.

"నా పేరు పఫ్నూటియస్! అంటినోయ్ మఠాధిపతిని. నేను తపోవనాలనుంచి ఇక్కడికి వచ్చానమ్మాయ్. ఆ సర్వేశ్వరుడు ఈ ప్రపంచంనుంచి నన్ను వేరుచేశాడు. నాకూ ఈ లోకానికీ సంబంధం లేదు. నా లోకం వేరు. నా బ్రతుకు వేరు. ఇలా జెరూసలెంలో జీవిస్తున్న నాకు నీ రూపం పొడగట్టిందమ్మాయ్. నీవు ఫూర్తిగా పతితురాలివై, భ్రష్టురాలివై పోయావని నాకు తెలుసు. మృత్యువు నిన్ను ఆవహించిందని నాకు తెలుసు. అందుకే వచ్చాను. వచ్చి నీముందు నిల్చున్నానమ్మాయ్. సమాధిముందు నిలుచున్నట్లు నీముందు నిలుచొని 'థాయిస్! లేమ్మా లే! మేల్కో తల్లీ!' అని వాపోతున్నాను" అని చెప్పాడు.

పఫ్నూటియస్, సన్యాసి, క్రైస్తవ మఠాధిపతి — ఈ మాటలన్నీ విన్నది థాయిస్. ఆవిడ వదనం కళావిహీనమైంది. సుడిగాలికి అల్లల్లాడిన చిరులతలా భయంతో కంపించిపోయింది. ఇహ ఇప్పుడామె జుట్టు విరియ పోసుకున్నది. చేతులు జోడించుకొని వెక్కివెక్కి ఏడుస్తూ వచ్చి ఆ పావనుని పాదపద్మములపై వ్రాలింది—

"అయ్యా! నాకు అపకారం చెయ్యకండి. తమరు ఎందుకొచ్చారు స్వామీ? నాతో తమ కేం పని? నాకు హాని చెయ్యకండి. తపోవనాలలో ఉండే తమవంటి మహానుభావులు స్త్రీలను— ముఖ్యంగా నావంటి స్త్రీలను ద్వేషిస్తారు. అసహ్యించుకుంటారు. నాకు తెలుసు. నేను వేశ్యను. వేశ్యలంటే మీకు గిట్టదు నా పై ద్వేషం వహించి నాకు అపకారం చెయ్యడానికే ఇక్కడికి వచ్చారని భయపడుతున్నానయ్యా.

వెళ్ళండి స్వామీ, వెళ్ళండి. తమ ప్రభావాన్ని నేను ఎంత మాత్రమూ శంకించడంలేదు. కాని మీరు నన్ను అసహ్యించుకో వద్దు. నాపై ద్వేషం పూనవద్దు. మీవంటి తాపసోత్తముల బ్రతుకును చూచి అనేకులు పరిహాసించటం నే నెరుగుదును. నే నలాంటిదాన్ని కాను. మీమటుకు మీరు నా భోగ భాగ్యాలను నిరసించకండి. అదే నేను మిమ్ముల్ని కోరేది. అందచందాలలోను, అభినయంలోను గొప్పదానినని నేను కీర్తి ఆర్జించాను. ఏం చెయ్యను? సహజంగా నాకివి లభ్యమైనాయి. మరోపని నే చెయ్యలేకపోయాను. నేను ఇందుకోసమే పుట్టా ననిపిస్తుంది. పురుషులను ఆనందింపచెయ్యడానికే భగవంతుడు నన్ను సృష్టించాడు. మీమటుకు మీరే నన్ను ప్రేమిస్తున్నానని ఇప్పుడేగా చెప్పారు. మీ విజ్ఞానాన్ని నాపై ప్రయోగించకండి స్వామీ. నా సౌందర్యాన్ని ధ్వంసం అయ్యేటట్లు మంత్రం పెట్టకండి. మీ మాయాజాలంతో నన్నొక శిలగా మార్చకండి స్వామీ. నన్ను భయపెట్టకండి! మృత్యువంటే నాకు తగని భయం" అని ప్రార్థించింది.

అంతట పఫ్నూటియస్ ఆవిడను లెమ్మన్నాడు. "భయపడకమ్మా, భయపడకు. నేను నిన్ను తిట్టను. అవమానించను. పల్లెత్తు మాటకూడా అనను. మేరీమాత కుమారుడైన ఆ ఏసుప్రభువు ఆదేశానుసారం నే నిక్కడికి వచ్చానమ్మా. నీ వనుకున్నంత పుణ్యాత్ముడను కాను నేను. నేనూ అంతో ఇంతో పాపం చేశాను. కాని ఆ భగవంతుడు నన్ను కటాక్షించాడు. కోపంతో నే నిక్కడికి రాలేదమ్మా. నీపై జాలిగొని వచ్చాను. ఆ ఈశ్వరుడే నన్నిక్కడికి తీసుకొని

వచ్చాడు. అందరిలాంటి ప్రేమకాదు నా ప్రేమ. నా ప్రేమకు అర్థం వేరు. తుచ్ఛమైన సుఖాలను ఆశించి అందరూ నిన్ను ప్రేమిస్తారు. కాని నా ప్రేమ పవిత్రమైనది. దివ్యమైనది. నిప్పు లాంటిది. మోజస్‌కు కొండమీద ఆ ప్రభువుచూపిన ప్రేమ ఎలాంటిదో అలాంటిప్రేమ నాది. వేషాలు, మోసాలు నా ప్రేమలో లేవమ్మా"– అని పలికాడు.

"ఓ తపోధనుడా! నీపై నాకు నమ్మకం ఉంది. నీవు నన్ను మోసంచేస్తావని కాని, అవమానిస్తావనికాని ఇక నాకు భయంలేదు. థిబాయిడ్‌లోని మునులనుగురించి తరచు నే నెన్నెన్నో విషయాలు విని ఉన్నాను. ఆంథోనీ, పాల్ – వీ రిరువురినిగురించి ఎన్నెన్నో అద్భుతమైన విషయాలు విన్నాను. నీపేరూ నాకు క్రొత్తది కాదు. నిన్నుగురించీ విన్నాను. నీవు వయస్సులో చిన్నవాడవైనా సౌశీల్యంలోనూ, ప్రభావంలోనూ, పూర్వకాలపు ఋషులతో సరితూగినవాడ వని విన్నాను. నీ వెవరో తెలియకపోయినప్పటికీ నిన్ను చూచీ చూడడంతోనే నీవు సామాన్యుడవు కావనిపించింది నాకు. నా కొక్క విషయం చెప్పు. ఎవరి మంత్ర తంత్రాలూ నామీద పనిచెయ్యకుండా నీవు చూడగలవా? నిజంగా నీకు నాపై ప్రేమ ఉన్నట్లయితే నాకు మరణం రాకుండా చేస్తావా?"–అని అడిగింది థాయిస్.

"అమ్మా! బ్రతకాలని కోరుకునేవారు బ్రతుకుతారు. నీ వీ తుచ్ఛమైన భోగాలలోపడి సత్యం ఎప్పటికప్పుడు మరణి స్తూనే ఉన్నావు. వీటినుంచి దూరంగా తొలగిపో. భూత ప్రేతా దులకు నీ సుందర ఆత్మను బలికివ్వకు. నీ వీ జీవితంతో అలసి

పోయినట్లయితే, రా, నాతో రా. ఈలోకానికి దూరంగా వెళ్ళిపోదాం. ఒంటరిగా ప్రశాంతంగా అక్కడ నూతన జీవితాన్ని ప్రారంభిద్దువుగాని. తపోవనాలలోని. పవిత్ర జలాలతో నీ ఆత్మను పరిశుద్ధం కావించుకొందువుగాని. దివ్య నదీతోయాలను గ్రోలి శాశ్వతమైన స్వర్గ సౌఖ్యాలు అనుభవిద్దువుగాని. భగవంతుని సాన్నిధ్యానికి చేరుకొందువుగాని. ఓ దౌర్భాగ్యురాలా! ఈ భోగాలపై నీకు ఆశ దేనికి? రా! నిజమైన భోగాలు, ఆనందాలు అనుభవించు. పేదరికం, ప్రశాంతి, మనలను మనం మరచిపోవడం, ఈశ్వరసాన్నిధ్యంలో ఏకాంతవాసం-ఇవే నిజమైన భోగాలు. నిజమైన ఆనందాలు. ఈనాడు క్రీస్తుకు శత్రువుగా ఉన్నవారు రేపు ఆయన ప్రేమకు పాత్రులవుతారు. రా! ఆ ప్రభువు చెంతకు చేరుకుందాం, రా, నేను ఎందుకోసం వచ్చానో అందుకోసమే నీవు రా. అక్కడికి వస్తే నీకే తెలుస్తుంది- 'నిజమైన ప్రేమను చూడగలిగాను-' అని అంటావు నీవే!- సరేనా?-" అన్నాడు పఫ్నూటియస్.

థాయిస్ ధ్యానంలో మునిగిపోయినట్లు కనుపించింది. ఎక్కడో - దూరంగా ఉన్న విషయాలనుగురించి ఆలోచించసాగింది.

"స్వామీ! నేను ఈ భోగాలన్నింటినీ త్యజించి తపస్సు సలిపినట్లయితే, నిజంగా స్వర్గానికి పోతానా? ఈమాటు జన్మలో దేవకన్యనై జన్మిస్తానా? ఎప్పుడూ ఇలాగే నా సౌందర్యం చెడకుండా ఉంటుందా? చెప్పండి స్వామీ?-"అని అడిగింది.

"థాయిస్! నీకు శాశ్వతమైన జీవితం ప్రసాదిస్తాను. నన్ను నమ్ము. ఎప్పుడూ అబద్ధం నా నోట రాదు." అన్నాడు పఫ్నూటియస్, మళ్ళీ.

"మీరు చెప్పేది సత్యమనడానికి సాక్ష్యమేమిటి?—" అని అడిగింది థాయిస్.

"దావీదు, ఇతర ప్రవక్తలు, పవిత్ర మతగ్రంథాలు, శ్రుతులు-సాక్ష్యం థాయిస్! ప్రమాణంచేసి చెపుతున్నాను."

"స్వామీ! మీమాటలు నమ్మాలనిపిస్తున్నది నాకు. మీకు నిజం నివేదిస్తున్నాను. ఈలోకంలో నాకు సుఖం కనుపించలేదు. ఒక మహారాణికంటె వైభవంగా జీవితం గడిపాను నేను. అయినా అనేకమైన దుఃఖాలు, దురదృష్టాలు నన్ను వెంటాడి వేధిస్తున్నాయి. నాకీ బ్రతుకే భారంగా కనుపిస్తున్నది. ఈ బ్రతుకుతో వేగలేననిపిస్తున్నది. స్త్రీలంతా నన్నుచూచి అసూయపడతారు. అప్పుడప్పుడు నేనుకూడా బజారులవెంట తిరిగి రొట్టెలమ్ముకొనే వృద్ధురాండ్రనుచూచి అసూయపడతాను! అవును. నాచిన్నప్పుడు వారందరినీ నేనెరుగుదును. పేదవారుమాత్రమే మంచివారు, సుఖవంతులు, ఈశ్వరానుగ్రహానికి పాత్రులు - అనేభావం మధ్య మధ్యనామనస్సులో మెరుపులా మెరిసిపోతుంటుంది. నిరాడంబరంగా, తృప్తిగా జీవించడంలోనే ఆనందం ఉన్నదని అనిపిస్తూ ఉంటుంది స్వామీ! నా అంతరంగంలో ఒక పెనుతుఫాను లేపారు మీరు. అగాధ కుహరాలలో పడిఉన్న నా ఆత్మను మేలుకొలిపారు. నేను దేనిని విశ్వసించాలి? అయ్యో!

నే నేమైపోతాను-? బ్రతుకంటే ఏమిటి?-" అన్న ఆలోచ
నలు రేకెత్తించారు-"

థాయిస్ ఇలా చెప్పుతూఉంటే పఫ్నూటియుస్ రూపు
రేఖలు పూర్తిగా మారిపోయాయి. ఒకానొక మహదానందం,
బ్రహ్మానందం తాలూకు వెలుగురేఖలు వచ్చి ఆయన
వదనాన్ని ఉజ్వలితం కావించాయి.

"చెపుతాను వినమ్మా! నే నీ ఇంట్లో అడుగుపెట్టి
టప్పుడు ఒంటరిగా రాలేదు. మరొకరు నావెంట ఉన్నారు.
కాని ఆయన్ని నీవు చూడలేవు. అవును, నీకళ్ళకు ఆయన
కనుపించడు. నీ వింకా అందుకు నోచుకోలేదమ్మా. కాని
త్వరలోనే ఆయన నీకు దర్శనమిస్తాడు. నీవు ఆప్రభువును
చూడగలుగుతావు. ఆ అద్భుతాన్నీ, ఆప్రభావాన్నీచూచి-
"ఆరాధించదగినవాడు ఈ జన ఒక్కడే!"అని నీవే అను
కుంటావు. కాని థాయిస్! ఆప్రభువుకటాక్షం ఇప్పుడు నాపై
ఉన్నది. కనుక నే నాకనులకు మైకం కమ్మలేదు. కమ్మిఉన్న
ట్లయితే నిన్నుచూచి మోహించేవాణ్ణి. పాపం చేసేవాణ్ణి.
అవును థాయిస్! నాలోనూ బలహీనత లున్నాయి. పాప
బుద్ధు లున్నాయి. ఆప్రభువే మన ఇరువురినీ కాపాడాడు.
అవును థాయిస్! ఆయన ఎంతో మంచివాడు. సర్వశక్తి
సంపన్నుడు. ఆయన పేరే రక్షకుడు. ఆయన ఈలోకంలో
అవతరించినప్పుడే ప్రవక్తలు, మునులు, పుణ్యస్త్రీలు-అంతా
ఆయన్ని సేవించారు. దీనులను, హీనులను రక్షిస్తానని
ఆయన ప్రతినపట్టారు. ఆయన శిష్యకోటి ఈలోకంలో
ఆయన బోధనలు వెదజల్లారు. థాయిస్! ఇప్పుడు నీవు

మృత్యుముఖంలో ఉండి భయంతో కంపించిపోతున్నావని ఆయన తెలుసుకొన్నాడు. నిన్ను మృత్యువునుండి కాపాడా లని నీగృహానికి వచ్చాడు. థాయిస్! ఇప్పుడు నాలో నీవు జీసస్ క్రైస్టును చూడడంలేదా? ఆయనవల్ల నేకదా నీవిప్పుడిక్కడ ఉండగలిగావు? ఆయనవల్ల నేకదా నీ సుందర రూపాన్ని నాకు చూపగలిగావు? థాయిస్! ఆ సుందరవదనం నీది కాదా? జలజలా రాలే ఆ కన్నీళ్లు నీవి కావా? అవును, థాయిస్! ఆ దేవదూత ఆ ధర్మదేవత థాయిస్ ఆత్మను చెఱనుండి విడిపిస్తుంది! ఓ ప్రభూ! ఓ జీసస్ క్రైస్ట్! నీ విక్కడ లేవా? నీ ముద్దు పెదవులు తెఱచి మాట్లాడవా? మాట్లాడు జీసస్! నీ వాక్కులు వినాలని ఉంది! థాయిస్! నా అందాల థాయిస్! ఆ రక్షకుడు స్వయంగా వచ్చి నీతో ఏం చెపు తున్నాడో విను థాయిస్. ఇప్పుడు నీతో మాట్లాడేది నేను కాదు. ఆ జీసస్ మాట్లాడుతున్నాడు. "నా చిన్నారి మేక పిల్ల తప్పిపోయింది. ఎంతోకాలంగా వెదుకుతున్నాను. నా చిన్నారీ! చివరకు నీవు కనుపించావు! ఇహ నా దగ్గరనుంచి తప్పించుకొని పోలేవు. నా చిట్టి తల్లీ! నిన్ను నా చేతులలోకి తీసుకోనీ. నా బుజాలమీద స్వర్గలోకాలకు మోసుకొని పోనీ. రా, థాయిస్! రా; నా చిన్నారి తల్లీ! ఇహ రా, నాతో కష్టా లనుభవించు" అని నీతో చెప్పడం లేదా? నీకు వినపించటం లేదా థాయిస్?"—

ఇలా పలుకుతూ పఫ్నూటియస్ నేలమీద మోకరి ల్లాడు. పరవశుడై ఉన్నాడు. ఆయన నేత్రాలలో బ్రహ్మానందం

కొంకిసలాడుతూఉంది. అప్పు డామెన ముఖమండలంలో సజీవుడై ప్రకాశిస్తున్న జీసస్ క్రైస్టును థాయిస్ చూచింది.

"అయ్యో! నా చిన్నతనపు రోజులన్నీ, చెరిగిపోయినాయి-"అయ్యో, నాన్నా, అమెస్! ఓ థియోడర్! ఓ పుణ్యమూర్తీ! నీవు నన్ను చేతులాలా ఎత్తుకొని జ్ఞానస్నానం చేయించావే-మతం ఇప్పించావే! ఆనాడే- నీ చేతుల్లో నేను చనిపోతే ఎంత బాగుండేది! ఆ జీవన ప్రభాతపు తొలికిరణాలు నా పై ప్రసరిస్తుండగానే కన్నుమూస్తే ఎంతహాయిగా ఉండేది" అంటూ వెక్కి వెక్కి ఏడ్వసాగింది.

పఫ్నూటియస్కు దుఃఖం పొంగివచ్చింది. ఆవిడను సమీపించాడు. గద్గదకంఠంతో ఇలా అన్నాడు-

"థాయిస్, ఓ, నా చిన్నారి థాయిస్! నీవు మతం పుచ్చుకొన్నావా? ఆహా! ఏమిటీ మహిమ? ఏమిటీ చోద్యం? ఏమిటీ దివ్యజ్ఞానం? ఓ, ఈశ్వరా! ఇప్పుడు నాకు తెలిసింది. ఏశక్తి నన్నిక్కడికి లాక్కొనివచ్చిందో నాకు తెలిసింది. ఈమె మతం పుచ్చుకొన్నది. దానిప్రభావమే ఇదంతాను! భగవంతుని సాన్నిధ్యంలో ఉన్న నన్ను - అక్కడనుంచి బయలుదేరతీసి మానవులమధ్య విషవర్తులంలోపడి కొట్టుకొంటున్న ఈమెచెంతకు లాక్కొనివచ్చింది ఆ దివ్యశక్తే. సందేహంలేదు. మతం పుచ్చుకొన్నప్పుడు ఈ పిల్లముఖంపై ప్రోక్షించిన ఆ జ్ఞానజలం-అందులో ఒక్క జలబిందువే ఇంతటి ప్రభావాన్ని ప్రసాదించింది. థాయిస్! ఓ, నా చిన్నారి సోదరీ! నీ సోదరుణ్ణి ప్రేమతో స్వీకరించు-"

ఇలా అంటూ ఆ తాపసి ఆ రాయవేశ్య ఫాలభాగానికి తన పెదవులు తాకించాడు.

తరువాత అతను మౌనముద్ర వహించాడు. వనకన్య విగ్రహంనుంచి వెలువడుతున్న జలధారల ధ్వని, థాయిస్ వెక్కి వెక్కి ఏడవడం వినిపిస్తున్నాయి.

థాయిస్ అంతులేని దుఃఖసముద్రంలో మునిగిపోయింది. మరేవిషయం ఆవిడకు పట్టలేదు. తరువాత ఇరువురు దాసీలు పరిమళద్రవ్యాలు, పూలమాలలు గైకొని అక్కడికి వచ్చారు. తరువాత థాయిస్, ఇలా అన్నది:

"ఇప్పుడు ఎంత ఏడిస్తే ఏం లాభం?- ఏడ్చి ఏడ్చి కళ్లు వాస్తాయి. విషాదచ్ఛాయలు అలముకొంటే నా ముఖసౌందర్యం వాడిపోతుంది. ఈరాత్రి కొంతమంది స్నేహితులతో నేను విందారగించాలి. నేను చక్కగా ముస్తాబయి కనుపించాలి. అక్కడికి అనేకమంది స్త్రీలు వస్తారు. నన్ను పరీక్షగా చూస్తారు. ఏమాత్రం నా ముఖం వాడి ఉన్నా ఇట్టే పసికట్టేస్తారు. ఈ దాసీలు నన్ను అలంకరించడానికి వచ్చారు. ఇహ మీరు అవతలకి వెళ్ళండి స్వామీ! వాళ్ళపని వాళ్ళను చెయ్యనివ్వండి. ఈ దాసీలు చాల తెలివైన పిల్లలు. అనుభవం కలవారు. నా వద్ద పనిచేస్తున్నందుకు వీరికి పుష్కలంగా డబ్బిస్తున్నాను. ఇదిగో చూడండి. ఆ ఇరువురిలో బంగారపుటుంగరాలు పెట్టుకొన్నదే- ఆ పిల్ల మంత్రిగారి భార్యదగ్గర పనిచేసేది - కావాలని తీసుకొచ్చి, నాదగ్గర దాసీగా ఉంచుకొన్నాను." అని చెప్పింది థాయిస్.

ఆ రాత్రి విందుకు వెళ్ళకుండా థాయిస్‌ను ఆపుదామని మొదట అనుకున్నాడు పఫ్నూటియస్. కాని మళ్ళీ అది అంత తెలివైనపని కాదని ఊరుకున్నాడు. తరువాత విందుకు ఎవరెవరు వస్తారని ఆమెను అడిగాడు.

ఆగృహయజమాని- కొట్టా లూసియస్ ఆర్లియస్ నిషియస్, ఇంకా తదితర వేదాంతులు, కవి కాలిక్రెటిస్, సెరపిస్ తాలూకు పెద్ద మతగురువు, ఇంకా అశ్వాలను తర్ఫీదుచెయ్యడంలో ఉత్సాహం కల కొందరు యువకులు, మరికొందరు స్త్రీలు వస్తారని థాయిస్ చెప్పింది. వారందరికీ చర్చలలో పాల్గొనడం ఎంతో సరదా అని చెప్పింది. అది విని పఫ్నూటియస్ అస్వాభావికమైన ఉద్వేగంతో "సరే, అక్కడికి వెళ్ళు థాయిస్. కాని ఒక్క విషయం. నేనుమాత్రం నిన్ను విడిచిపెట్టను. నేనుకూడా నీతో ఈవిందుకు వస్తాను. ఏమీ మాట్లాడకుండా నీప్రక్కనే కూర్చుంటాను. సరేనా_?" అన్నాడు.

థాయిస్ ఒక్కమాటుగా పగలబడినవ్వింది. దాసీలు ఊపిరాడకుండా ఆవిడకు ముస్తాబు చేస్తున్నారు.

"మీరు నావెంట వస్తే వారంతా ఏమనుకుంటారు? థెబాయిడ్‌లో ఉండే ఒక సన్యాసి ఈవిడప్రియుడు, అనుకుంటారు. అవునా ?–" అంటూ మళ్ళీ కిలకిల నవ్వింది థాయిస్.



పఫ్నూటియస్‌ను వెంటబెట్టుకొని థాయిస్ విందుకు వెళ్ళింది. అప్పటికే అతిథుల్లో చాలామంది అక్కడ పోగయి ఉన్నారు. గుర్రపునాడాకృతిలో ఉన్న టేబిల్ ముందు సోఫాలలో సుఖాసీనులై ఉన్నారు. టేబిల్ మీద పాత్రలనేకం తళతళ లాడుతున్నాయి. టేబిల్ మధ్యలో ఒక పెద్ద వెండి పళ్ళెరం ఉన్నది. పళ్ళెరం నాలుగువైపులా నాలుగు వనదేవతల విగ్రహాలున్నాయి. పళ్ళెరంలో వేయించిన చేపలు ద్రాక్షాసవంలో తేలుతున్నాయి. థాయిస్ మందిరంలో అడుగు పెట్టగానే నలువైపులనుంచీ కరతాళధ్వనులు మిన్నుముట్టాయి.

"అందాల రాణికి స్వాగతం, సుస్వాగతం!" అన్నారు అంతా. "నరులకూ, నిర్జరులకూ ఆరాధ్యదేవత థాయిస్!" ఆమెకు మా అభివాదాలు! "మోహినీ దేవతకు మా భక్త్యంజలి!" "అలెగ్జాండ్రియా అలివేణికీ, పూబోణికీ మా అభివందనాలు!" —

వందిమాగధుల కైవారాలందుకొన్నట్లు వీటన్నింటినీ అందుకొన్నది థాయిస్. కాని ఆవిడకు కష్టమనిపించింది. అలజడి సద్దుమణిగిన తరువాత గృహయజమాని లూషియస్ కొట్టాతో—"లూషియస్! తపోవనాలలో ఉండే ఒక సన్యాసిని నా వెంట తీసుకొచ్చాను. ఈయన పేరు పఫ్నూటియస్.

ఆండినోయస్ మతాధిపతి. ఈయన గొప్ప వేదాంతి. పుణ్య మూర్తి. ఈయన వాక్కు అమోఘం!" అని చెప్పింది.

లూసియస్ ఆర్లియస్ కొట్టా లేచి, ఎదురేగి పఫ్నూటియస్‌కు స్వాగతం ఇచ్చాడు—

"స్వాగతం పఫ్నూటియస్! క్రైస్తవ మతాచార్యుడవు నీవు. మతం అంటే నాకూ కొంత గౌరవం ఉంది. ఈనాడు మతం అనేది రాజ్యాంగబద్ధమై పోయింది. మతస్థులందరికీ మహా చక్రవర్తి ఈనాడు ఒక విశిష్టస్థానం కల్పించాడు. నిజానికి మీ జీసస్ క్రైస్ట్‌ను ఒప్పుకోక తప్పదు. ప్రతి దేవుని లోనూ ఏదో ఒక విశిష్టత ఉన్నదని మన పూర్వీకుల విశ్వాసం. సరే, ఇహ ఆ విషయం వదిలేద్దాం. మనం కొంచెం పానీయం సేవించి ఆనందించుదాం" అన్నాడు.

వృద్ధుడు, నౌకాదళ కమాండరు అయిన కొట్టా శాంత గంభీర స్వరంతో మాట్లాడాడు. ఆయన ఇప్పుడే పరివ్రాజక పరంపరలకు సంబంధించిన చరిత్ర చదవడం పూర్తిచేశాడు. అయినా ఆయనకు ప్రొద్దుపోలేదు. దేవుళ్ళనుగురించి కబుర్లకు దిగాడు. తరువాత మళ్ళీ: "పఫ్నూటియస్! ఇక్కడ నీవు మాట్లాడదగిన మంచి మంచి స్నేహితులనేకులున్నారు. సెరపిస్‌లోని ఉన్నత మతగురువు హెర్మడోరస్, జ్ఞానులు, వేదాంతులు అగు డోరియన్, నిసియస్, జెనోథెమిస్‌లు, కవి కాలిక్రెటిస్, యువకులగు చెరియస్, అరిస్టోబులస్‌లు, సుందరాకారులైన ఫిలినా, డ్రోసీలు-వీరంతా ఇక్కడున్నారు" అని చెప్పాడు.

నిషియస్ వచ్చి పఫ్నూటియస్‌ను ఆలింగనం చేసు కొన్నాడు - రహస్యంగా అతని చెవిలో-

"తమ్ముడూ! జాగ్రత్త! మన్మధుడు మహాశక్తివంతుడు. నీ అంతట నీ విక్కడికి రాలేదు. ఆ మహాశక్తే నిన్నిక్కడికి లాక్కొచ్చింది. ఒక్కమాట చెపుతాను విను తమ్ముడూ! ధర్మనిష్ఠాపరత నీలో పరిపూర్ణంగా ఉన్నది. కాని దేవమాత అగు సౌందర్యదేవతకు నీవు నిజం నివేదించుకొన్నావా సరే- లేదా నీకు పతనం తప్పదు. పూర్వం గణితశాస్త్రజ్ఞుడైన మెలంథస్ ఏమన్నాడో నీకు తెలీదూ - 'సౌందర్యదేవత నాకు సహాయంగా లేకపోయినట్లయితే నేను త్రిభుజంయొక్క లక్షణాలను ప్రదర్శించి ఉండగలిగేవాణ్ణి కాదు'- అన్నాడాయన. కాబట్టి తమ్ముడూ! ముందే జాగ్రత్తగా ఉండమని చెపుతున్నాను"- అన్నాడు.

కొత్తగా వచ్చిన పఫ్నూటియస్‌వంక డోరియస్ కొద్ది క్షణాలపాటు చూచాడు. చూచి చూచి అకస్మాత్తుగా ఆశ్చర్య చకితుడైనట్లు చప్పట్లు చరిచాడు-

"ఇతనా! ఇతనేనా! ఇతని చూపులు, ఇతని ఆకారం, దుస్తులూ - ఇతనేనా అతను! అరరె! ఇతన్ని నేను నాటకశాలలో చూచానే! థాయిస్ వేషంవేసిన నాటకం అది. ఆవిడ నటిస్తుంటే ఇతను ఎంత ఉద్విగ్నుడైనాడనీ! పట్టరాని ఆవేశంతో మహాతీవ్రంగా మాట్లాడాడుకూడా. ఇతను నీతీ - నిజాయితీ కలవాడే - సందేహంలేదు. కాని ఇతను మనందరినీ దూషిస్తాడు. ఇతని వాగ్ధాటికి మనం తట్టుకోలేమయ్యా.

క్రైస్తవులకు మార్కస్ ప్లేటోలాంటివాడయితే, పఫ్నూటియస్ డెమొస్తెనెస్‌లాంటివాడు!" అని పలికాడు.

ఇహ ఫిలినా, డ్రోసీలు, థాయిస్‌ను కొరికి తిని వేద్దామా అన్నట్లు చూడసాగారు. ఆవిడ తన తలలో నీలి రంగు పూలమాల అలంకరించుకొన్నది. ఆవిడకళ్ళు ఏరంగులో ఉన్నాయో ఆపూలు ఆవర్ణంలో ఉన్నాయి. ఒక్కొక్క పువ్వు ఒక్కొక్క కన్నులా కనుపిస్తున్నది. తళతళలాడే ఆకళ్ళు చల్లని - మెల్లని వాలుచూపులు చూస్తున్న ట్లున్నాయి. అసలు థాయిస్‌ను భగవంతుడు ప్రత్యేకంగా సృష్టించాడు. ఆవిడ ప్రతిఅవయవం ఒక అందాలరవ్వ! ప్రతి భాగం ఒక వజ్రపుతునక! భగవంతు డామె కిచ్చిన వరం అది. వెండిజరీతో ఉన్న ధూమ్రవర్ణం కలదుస్తులు ధరించింది. నగ్నంగా అగుపిస్తున్న ఆవిడ అందమైనబుజాలు ఎంతో ఆకర్షణీయంగా ఉన్నాయి. ఆఇరువురు స్నేహితులూ థాయిస్‌ను చూచి వెర్రిమైకంతో తూలిపోసాగారు.

"నీ వెంత అందంగా ఉన్నావు థాయిస్!–" అన్నాడు ఫిలినా. "నీవు మొట్టమొదట అలెగ్జాండ్రియాకు వచ్చినప్పుడు కూడా ఇంతఅందంగా లేవట! అయినా అప్పుడు నిన్ను చూచిన మా అమ్మ – 'ఈపిల్లతో, సరితూగే అందకత్తెలు ఎంతోమంది లేరు!–'అని చెప్పింది. అప్పుడే అంతఅందంగా ఉన్నావు నీవు. ఇహ ఇప్పుడు నిన్నువర్ణించడం మావల్ల కాదు!" అన్నాడు.

"ఎవరో కొత్తప్రియుణ్ణి పట్టుకొచ్చావే థాయిస్, అత నెవరు? అతని రూపురేఖలు చాలావింతగా ఉన్నాయే!

అచ్చంగా అడవుల్లో గొర్ల కాపరిలా ఉన్నాడు. ఈవెర్రి గొల్లడు ఎక్కడ దొరికాడు థాయిస్ నీకు ? ఇతన్ని పాతాళ లోకంలోనుంచి పట్టు కొచ్చావాలేక భేతాళలోకంనుంచి పిలుచుకొచ్చావా ? చెప్పు థాయిస్!–" అని అడిగాడు క్రోసీ.

క్రోసీ ఇలా మాట్లాడుతుంటే ఫిలీనా అతని నోరు మూశాడు.

"ఇష్! ఇహ ఊరుకోవోయ్ నాయనా. ప్రేమలో ఎన్నెన్నో రహస్యా లుంటాయి. అవి అందరికీ అర్థంకావు. నా మటుకు నేను మురికిగుంటలో దూకమన్నా దూకుతాను. కాని ఈ కొత్తవ్యక్తినిమాత్రం ముట్టుకోలేను. కాని ఏం చేస్తాం? మన కర్మ–మన అందాలరాణి థాయిస్‌కు ఏ గంధర్వ పురుషుడో ప్రియుడుగా ఉండాలి. మరి మనలాంటి యువకులను, సుందరాకారులను అందరినీ వదిలేసి జంతువును పట్టుకొచ్చినట్లు వీణ్ణెవణ్ణో - కొత్తవాణ్ణి పట్టుకొచ్చింది!"– అన్నాడు.

"అబ్బాయిలూ! మీ ఇద్దరూ కాస్త వళ్ళు దగ్గర పెట్టుకొని మాట్లాడండి, ఏమనుకుంటున్నారో!" అని వారికి సమాధానం చెప్పింది థాయిస్– "ఈయన ఒక మునీశ్వరుడు. మంత్రశాస్త్రజ్ఞుడు. మీరు ఏం మాట్లాడుకున్నా, ఈయనకు తెలిసిపోతుంది. మీ మనోభావాలుకూడా ఇట్టే గ్రహిస్తాడు. అటువంటి దివ్యదృష్టి కలవాడీయన! ఈయన ఒక్కతడవ గుడ్లురిమిచూస్తే మీరు భస్మమైపోతారు. మనస్సులో సంకల్పిస్తేచాలు చచ్చిఊరుకొంటారు!"– అన్నది.

ఆవిడమాటలు వినగానే వారిరువురి ముఖాలూ వెల వెల బోయినవి. తరువాత ఆవిడ వారివంక చూడకుండా వచ్చి ఒక సోఫాలో పప్నూటియస్ సరసన కూర్చున్నది. తరువాత కొట్టా, సాధికారంగా– "అబ్బాయిలూ! ఇహ ఎవరిస్థలాలలో వారు కూర్చోండి. ఒసేయ్! దాసీఇల్లలూ! మధుపాత్రలు అందుకోండి – మా అందరికీ మధువు పొయ్యండి"–అని ఆజ్ఞా పించాడు. తరువాత మధుపాత్ర పైకెత్తి పట్టకొని– "ముందు మన చక్రవర్తి సౌఖ్యంకోసం పానీయం సేవిద్దాం. దేవుళ్ళ కంటెకూడా దేశం గొప్పది నాయనలారా!" అన్నాడు.

అతిథులంతా మధుపాత్రలు చేతబుచ్చుకొన్నారు. ఉల్లాసంతో తేనెకలిపిన ద్రాక్షాసవము సేవించారు. ఒక్క పప్నూటి యస్ మాత్రం త్రాగలేదు.

త్రాగి కైపెక్కి ఉన్న డోరియస్ "దేశమంటే ఏమి టోయ్! ఒక నదీప్రవాహం. నదీ తీరాలు ఇవాళ ఉంటాయి, రేపు పోతాయి. కాని నదీతరంగాలు ఎల్లప్పుడూ ఎడతెరపి లేకుండా ఉంటూనేఉంటాయి" అన్నాడు.

అందుకు కొట్టా–"నాకు తెలుసు డోరియస్. ఈ లౌకిక ధర్మాలను నీవు అంతగా లెక్క చెయ్యవు. ఋషి అయినవాడు అన్ని విషయాలకూ దూరంగా ఉండాలని నీ అభిప్రాయం. కాని నా తలంపు వేరు. నీతీ–నిజాయితీ కలవ్యక్తి ఎప్పుడూ రాజ్యంలో ఒక బాధ్యతాయుతమైన పదవిలో ఉండాలని కోరతాడు. దేశం అన్నిటికంటె చాలా గొప్పది!" అని బదులు చెప్పాడు.

తరువాత సెరపిస్ ఉన్నత మతగురువు హెర్మొడోరస్ మాట్లాడాడు.

"ఒకానొక దేశమంటే ఏమిటని అడిగాడు డోరియస్. దేవుళ్ళ పీఠాలు, పూర్వీకుల సమాధులు-ఇవన్నీ కలిసి ఒక దేశ మవుతున్నదని నా అభిప్రాయం. జ్ఞాపకాలు, ఆశలు-వీటి కలియికయే మానవుడు" అన్నాడా మతగురువు.

అంతలో యువకుడైన అరిస్టొబులస్ అందుకొన్నాడు-

"అయ్యో, దేవుడా! ఇవాళ నే నొక అద్భుతమైన గుఱ్ఱాన్ని చూచానయ్యా! ఆ గుఱ్ఱం డెమొఫూన్‌ది. దాని తల ఎంతముద్దుగా ఉందనుకున్నారూ! చిన్నచిన్న దౌడలు; ముందరికాళ్ళు మహా బలిష్ఠంగా ఉన్నాయి. తల ఎత్తుకొని, రాజఠీవిగా నడుస్తున్న దది.—" అన్నాడు.

కాని డొరియస్ అది కా దన్నట్లు తల ఊపాడు.

"అగ్బాయ్, నీవు చెప్పినంత మంచిగుఱ్ఱం కానే కా దది. దాని డెక్కలు బహుపల్చగా ఉన్నాయి. చీలమండలు క్రిందికి దిగిఉన్నాయి. ఆగుఱ్ఱం త్వరలోనే కుంటి దయి పోతుంది!" అన్నాడు.

వా రిలా వాదించుకుంటూఉండగా డ్రోసీ, ఏమి టీగోల అన్నట్లు ఒక చిన్న కేక పెట్టాడు—

"అబ్బ! ఉండండయ్యా, ఒకటే ఊకదంపుడూ! చేప ఎముక ఒకటి గొంతులోపడి, ఉక్కిరి బిక్కిరయి చచ్చాను నేను! ఎట్లాగో ఆ దేవుని దయవల్ల వెంటనే వెళ్ళగక్కాను

కాబట్టి సరిపోయింది! లేకపోతే పైప్రాణం పైన పొయ్యేది!" అన్నాడు.

"దేవుడు నీపై దయ దలచా డంటున్నావా డ్రోసీ?" అని అడిగాడు నిషియస్, చిరునవ్వు నవ్వుతూ—"ప్రేమతో బాధపడేవారికి ముందుగా ఆప్రేమ అసాఖ్యాన్ని కలిగిస్తున్నట్లుగా ఉంటుంది. అది బలహీనతకు నిదర్శనం. ఆ దేవుళ్ళు డ్రోసీపట్ల కనుపరచే దయ, వారి అసంపూర్ణతకు గొప్ప నిదర్శనం!" అన్నాడు.

ఈమాటలకు డ్రోసీ, కోపంతో భగ్గున మండిపడ్డాడు—"నిషియస్! సందర్భంలేని పిచ్చిమాటలు మాట్లాడుతున్నావు. నన్ను వెక్కిరిస్తున్నావే, అసలు నీవే అటువంటివాడివి నీవు చెప్పేదేమిటో నీకే అర్థంకాదు! అర్థాపర్థంలేని పిచ్చిసమాధానాలుమాత్రం చెప్తుంటావు—" అన్నాడు.

నిషియస్ మళ్ళీ చిరునవ్వు నవ్వాడు. "అను, అను. నీ యిష్టంవచ్చినట్లు అను డ్రోసీ. నీ వెన్నన్నా మాకు ఆనందంగానే ఉంటుంది. ముద్దులు మూటగట్టే నీ నోటినుండి ముత్యాలు రాలుతున్నట్లనిపిస్తుంది!" అన్నాడు.

ఆసమయంలో గంభీరంగా అగుపిస్తున్న ఒకవృద్ధుడు, చెదిరిపోయిన దుస్తులతో, తల ఎత్తుకొని మెల్లగా నడుస్తూ లోనికి వచ్చాడు. అక్కడున్న అతిథులవంక తేరిపార చూచాడు. కొట్టా, అతన్ని తన ప్రక్కకు వచ్చి కూచోమని సైగచేశాడు. అతను మెల్లగా వచ్చి కొట్టా కూచున్న సోఫాలోనే కూచున్నాడు. తరువాత కొట్టా—

"యూక్రెటీస్! నీకు స్వాగతం. తత్త్వశాస్త్రంమీద ఈనెలలో ఏదైనా క్రొత్త గ్రంథం వ్రాశావా?" అని అడిగాడు కోట్టా.

అందుకు యూక్రెటీస్ తన తెల్లటిగడ్డం నిమురుకొంటూ— "నైటింగేల్ గానం చెయ్యడానికి పుట్టింది, నేను దేవుళ్ళను కీర్తించడానికి పుట్టాను"— అని సమాధానం చెప్పాడు.

తరువాత డోరియన్ ఇలా మాట్లాడాడు—"యోగులలో, విరాగులలో కడపటివాడైన యూక్రెటీస్‌కు మనం సహినయంగా ప్రణామం చేద్దాం. మన మధ్య ఈయన మన పితృదేవతవలె శాంత గంభీర రూపంతో భాసిస్తున్నాడు. ఈయన మనుష్యుల మధ్య ఉన్నా లేనట్లే కనుపిస్తాడు. మాట్లాడినా మాట్లాడనట్లే అనిపిస్తాడు!"

అంతట యూక్రెటీస్ ఇలా అన్నాడు—"నిన్ను నీవు మోసం చేసుకొంటున్నావు డోరియన్. వేదాంతసారం ఇంకా చావలేదు—సజీవంగానే ఉంది. అలెగ్జాండ్రియా, రోమ్, కాన్‌స్టాంట్‌నోపిల్, మొదలైనచోట్ల నాకు కావలసినంత శిష్యకోటి ఉన్నది. అనేకమంది బానిసలు, సీజరు బంధువులు సయితం, తమ జీవితాలను, తాము సరిదిద్దుకొని, ఏ విషయాలతోనూ ప్రమేయం లేకుండా, హాయిగా, స్వతంత్రంగా గలుగు జీవించుతున్నారు. ఇపిక్‌టస్, మార్కస్, ఆర్రియస్ మొదలైన అనేకులు తమ బ్రతుకులు తాము పరిశుద్ధం చేసుకోగలిగారు. కాని ధర్మమనేది ఈ పుడమిపై ఇంకా పాదం మోపి ఉన్నట్లయితే, నా ఆనందానికీ, నా సౌఖ్యానికీ ఏ కొఱతా లేదు. కేవలం అజ్ఞానులు, అవివేకులు మాత్రమే

తను అధికారానికి విగ్రహీభూతంటారు. సౌఖ్యపడుతున్నామని గర్విస్తుంటారు. భగవంతుని కోరికే నా కోరిక. ఆయనకు లేనిది నాకూ లేదు. ఆ విధంగా నేను జీవిస్తున్నాను. ధర్మమనేది నశించిపోవడం భగవదేచ్ఛ అవుతే అలాగే కానీ. అందుకు నేను చింతించను. అది నా ఆనందానికీ, నా ఆత్మ స్థైర్యానికీ ఏవిధంగానూ అడ్డురాదు. అన్ని విషయాలలోనూ ఆ దివ్య జ్ఞానమే నాకు అనుసరణీయం, ఆదరణీయం, మార్గదర్శకం. నేను సాధించిన జ్ఞానం గొప్పది; దాని కెవరూ విలువ కట్టలేరు. ఎంతో సాధనచేసి సాధించిన జ్ఞానం అది!''

తరువాత నిషియస్ ఇలా ప్రసంగించాడు– "నాకు తెలును యాక్రెటీస్. నీవు దివ్యజ్ఞాన సంపన్నుడవు. కాని ప్రభావం అనేది ఆచరణలో మాత్రం కనుపించడంలేదు. జీనో శిష్యు లున్నారే–వారు తాము దేవుళ్ళతో సమానులయినట్లు నటించారు. ఎద్దును చూచి కప్ప తనూ అంత పెద్దదాన్ని కావాలని, పొట్ట పెంచి గొప్ప ప్రయత్నం చేసింది. ప్రభావ మంటే అదీ!''–

అందుకు యాక్రెటీస్ ఇలా సమాధానం చెప్పాడు –

"నీ కెప్పుడూ పరాచకాలే నిషియస్. ఆ పరాచకాలు కూడా హద్దు మీరు తుంటాయి. నీవు చెప్పిన ఎద్దు కనుక అపిస్‌లాగా దేవుడే అయినట్లయితే, కప్ప దానితో సమానం కావాలని ప్రయత్నించి విజయం సాధించి ఉన్నట్లయితే – ఎద్దుకంటే కప్ప ఎక్కువ ప్రభావంకలదనీ, శక్తికలదనీ అనవలసి

వస్తుంది. నిజానికి అంతేకదా? మరి ఆ కప్పనే నీవు ఎంతగానో కొనియాడవలసిఉంటుందికదా!"-

తరువాత నలుగురు పరిచారకులు కాల్చిన ఒక అడవి పందిని తెచ్చి టేబిల్ మీద ఉంచారు. దాని చుట్టూ చిన్న చిన్న పందిపిల్లల మాంసంతో తయారుచేసిన పిండివంటలు పెట్టారు. ఇహ వారంతా ఆ మాంసాన్ని చీకి తినెయ్యా ఫూను కొన్నట్లు కనుపించారు.

పిమ్మట జెనొఖొమిస్ ఆ సన్యాసివంక తిరిగి-"స్నేహితు లారా! మన కొక ముఖ్యమైన అతిథి వచ్చాడు. ఆయనే పఫ్నొ టియస్. ఆయన్ను ఎరుగనివారు లేరనుకొంటాను. తపోవృత్తిలో ఉండి ఏకాంతంగా జీవిస్తున్నవాడల్లా అనుకోకుండా నేడు మనమధ్యకు అరుదెంచాడు"-అని పలికాడు.

ఆ తరువాత కొట్టా - "అంతే కాదయ్యా. నీవు మరో మాటాకూడా చెప్పాలి - పిలవకుండానే ఆయన దయచేశా డని చెప్పు" అన్నాడు.

మళ్ళీ జెనొఖొమిస్ మాట్లాడసాగాడు-"కాబట్టి లూషియస్ కొట్టా! మనం పఫ్నొటియస్‌ను నేడు ఎంతగానో గౌరవించాలి. ఆయనకు సమ్మతమయ్యేటట్లు మనం నడుచుకోవాలి. మంచి మంచి భావాలు ఆయనకు ఆనందం కలిగిస్తాయి. కాని మనలాగా మంచి మంచి మాంసపు పిండివంటలు ఆయన్ను సంతృప్తిపరచవు. అదీకాక ఆయన అచ్చమైన, స్వచ్ఛమైన క్రైస్తవుడు. కాబట్టి మనం జీసస్ క్రైస్టునుగురించీ, క్రైస్తవ మత సిద్ధాంతాన్నిగురించీ చర్చించుకొందాం. అది ఆయనకు

ఆనందాన్ని చేకూరుస్తుంది. నామటుకు నాకు క్రైస్తవమత సిద్ధాంతాలు చర్చించడమంటే ఎంతో ఇష్టం. ఎంచేతనంటే, ఆ చర్చలలో మనకు మధ్య మధ్య చిన్న కథలు అనేకం వస్తాయి. క్రైస్తవ గ్రంథాలలో దివ్యతేజస్సు ఇమిడిఉన్నది. కాని ఒక్క విషయం. యూదుల గ్రంథాలుమాత్రం వాటితో సరిసమానమైన ప్రభావం కలవి కావని నా ఉద్దేశ్యం. దీనికి పఫ్నూటియస్ అంగీకరిస్తాడో లేదో మరి? ఈ గ్రంథాలు, మనం అనుకునేటట్లు - భగవదాత్మవల్ల మనలో చైతన్యాన్ని పుట్టించవు. వీటిలో దుష్టశక్తులుమాత్రమే మనలను ప్రేరేపిస్తాయి. ఈ దుష్టశక్తులలో ఐవీ చాలా తీవ్రమైన,- భయానకమైన శక్తి. కాని ఈ శక్తికి విరుద్ధశక్తి మరొకటి ఉన్నది. అది బంగారపు రెక్కలుగల సర్పం. నీలివర్ణం కల ఆ సర్పం జ్ఞానవృక్షాన్ని చుట్టలు చుట్టలుగా చుట్టుకొన్నది. వెలుగును, ప్రేమను ప్రసాదించింది. ఈ రెండు శక్తులకూ తీవ్రమైన ద్వంద్వయుద్ధం కొనసాగింది. ఒకటి వెలుగు, ఒకటి చీకటి. ఈ వెలుగు చీకట్లకు పోరాటం తప్పనిసరికదా! ప్రపంచసృష్టి జరిగిన వెంటనే ఈ పోరాటం సంభవించింది. తొలి పురుషుడు, తొలి స్త్రీ అయిన 'ఆదమ్-ఈవ్'లు నందనవనాలయిన ఈడెన్ సుందరోద్యానవనాలలో (స్వర్గంలో) నగ్నంగా సంచరిస్తూ సర్వసౌఖ్యాలు అనుభవించారు. కాని వారి దురదృష్టవశాన, దుష్టశక్తి అయిన 'ఐవీ' వారిని అదుపులో పెట్టడానికి పన్నుగడ పన్నింది. అప్పటికే 'ఈవ్' గర్భంలో అనేకమైన ప్రాణికోట్లు ఉన్నాయి. వాటన్నింటినీ పాలించాలని ప్రయత్నించింది ఆ దుష్టశక్తి. తన మాయాజాలాన్ని ప్రయోగించింది. భూతప్రేతాది

రూపాలు తాల్చి భయపెట్టింది. పిడుగులూ, అగ్నివర్షాలు కురిపించి అల్లకల్లోలం చేసింది. ఆ దుష్టశక్తి నీడ ఆడమ్-ఈవ్‌లపై సోకి వారిని క్షోభపెట్టింది. ఆ ఆదిదంపతులు భయవిచలితులై ఒకరినొకరు కౌగలించుకొన్నారు. ఆ భయంలో వారి అనురాగం మరింత వృద్ధి పొందింది. అప్పుడు సర్పం వారిని చూచి జాలిగొన్నది. వారిజ్ఞానం, అసత్యాలవల్ల తప్పుత్రోవ పట్టకుండా చెయ్యాలని నిశ్చయించుకొన్నది. ఎంతటి దివ్య మహిమ ఉంటేనో కాని ఈ పని చెయ్య సాధ్యపడదు. ఎలాగైతేనేం సర్పం దీనిని సాధించింది. ఆదిదంపతులముందు స్పష్టమైన రూపా లనేకం చిత్రించింది. ఆడమ్-ఈవ్‌లు ఆ రూపాలను ధ్యానించారు. ఈవ్‌కంటె ఆడమ్ ఎక్కువగా ధ్యానం చేశాడు. తరువాత సర్పరాజు, ప్రదర్శించడానికి వీలుకాని ఉత్కృష్టమైన సత్యాలను కొన్నింటిని వారికి చెప్పాడు, బోధించాడు. అప్పుడా సర్పరాజు, ఆడమ్ వాటిని సులభంగా అవగతం చేసుకోజాలడని గ్రహించాడు. ఈవ్‌మాత్రం చాలా సూక్ష్మబుద్ధి కలదై వాటిని గ్రహించింది. అంచేత సర్పరాజు భర్తలేని సమయంలో ఈవ్‌తో ఏకాంతంగా సంభాషించాడు. ముందు ఆమెకే ఉపదేశం చేశాడు''-

అని ఇలా జెనోథొమిస్ చెప్పుకపోతూఉండగా డోరియస్ అడ్డుతగిలాడు.

"స్నేహితుడా! ఒక్క క్షణం ఆగు. నీమాటకు అడ్డు వస్తున్నాను. నీవు చెపుతున్న ఈపురాణంలో బోలెడన్ని అనుమానాలు కలుగుతున్నాయి. నీవు చెపుతున్న సర్పం యొక్క వివేకాన్నిగురించీ, విశ్వాసాన్నిగురించీ నాకు సందే

షం కలుగుతున్నది. నీ వన్నట్లు ఆసర్పం నిజంగా జ్ఞానం కలదైనట్లయితే చిన్నపిల్లగా ఉన్న స్త్రీకి ఎలా జ్ఞానోపదేశం చేసింది. చే స్తేమాత్రం ఆస్త్రీ దానిని ఎలా అర్థం చేసుకో గలిగింది. ఇది అసంభవం! అవతల ఉన్న దుష్టశక్తిలాగానే ఈ సర్పరాజుకూడా, జ్ఞానహీనుడనీ, అబద్ధాలకోరుఅనీ నాతలంపు. స్త్రీశీలాన్ని సులభంగా చెడగొట్టవచ్చునన్న దురుద్దేశంతోనే అతను ముందుగా ఆదమ్‌ను వదలి ఈవ్‌కు జ్ఞానోపదేశం చేయబూనుకొన్నాడు. అంతే కాదు. ఆదమ్ తనకంటే వివేకవంతుడనీ, జ్ఞాని అనీ అతను భయపడ్డాడు.–"అని పలికాడు డోరియస్.

అప్పుడు జెనొఫొమిస్ మళ్ళీ చెప్పసాగాడు- "డోరియస్! నీవు పొరపడుతున్నావు. ఉత్కృష్టమైన, ఉన్నతమైన సత్యాలను తెలుసుకోవాలంటే, తెలివితేటలవల్ల ప్రయోజనం లేదు.సునిశితమైన ఇంద్రియజ్ఞానంవల్లనే అది సాధ్యమవుతుంది. అందుకే పురుషులకంటె స్త్రీలకు ఆలోచనతక్కువ,సూక్ష్మగ్రాహకత్వం ఎక్కువ. దివ్యజ్ఞానసంబధమైన విషయాలను స్త్రీలు ఇట్టే గ్రహిస్తారు. అది వారికి భగవంతుడిచ్చిన వరం. అపోలో, జీసస్‌లు ఒకప్పుడు స్త్రీవేషధారులై సంచరించడానికికూడా అదే కారణం. కనుక నీవేమన్నా అను, డోరియస్!–నేను ఇందాక చెప్పిన ఉపదేశకుడు తెలివైనవాడు. అందుకనే ఆసర్ప రాజు సబుధుగాఉన్న ఆదమ్‌ను వదలి, నక్షత్రకాంతిలా ప్రకాశిస్తున్న ఈవ్‌కు ముందు ఉపదేశించాడు. ఆమె అతని ఉపదేశాలన్నీ విన్నది. జ్ఞానవృక్షంచెంతకు తనను తీసుకపొమ్మని కోరింది. జ్ఞానవృక్షం శాఖోపశాఖలుగా స్వర్గలోకంవరకూ

విస్తరిల్లి ఉంటుంది. ఆవృక్షంయొక్క ఆకులు రానున్న మానవుల భాషలన్నీ మాట్లాడుతాయి. ఆస్వరాలన్నీ ఎంతో మనోహరంగా వినిపిస్తాయి. దివ్యాత్మలనే మంచుబిందువులలా జ్ఞానవృక్షంపై తళతళలాడుతుంటాయి. ఆవృక్షానికి అమృతఫలా లుంటాయి. ఆఫలాలు ఆరగించినవారికి శిలలు, లోహాలు, మొక్కలు, వీటన్నింటికీ సంబంధించిన జ్ఞానమే కాక, భౌతిక నైతిక సూత్రాలకు చెందిన జ్ఞానంకూడా కలుగుతుంది. కాని ఈఫలాలు నిప్పుకణికెల్లా, ముట్టశక్యంకాకుండా ఉంటాయి. బాధలన్నా, మృత్యువన్నా భయపడేవారు ఈఫలాలను తాకలేరు. ఇలా సర్పం చెప్పగా ఈమె విన్నది. ఈభయాలన్నింటినీ విడనాడి ఆమె ఆ అమృతఫలాలను రుచి చూడాలని కోరింది. దివ్యజ్ఞానాన్ని పొందాలని ఆకాంక్షించింది. కాని తాను ప్రేమిస్తూ తనతో సమానంగా చూచుకొంటూఉన్న ఆడమ్‌ను వదిలిపెట్టి ఆవృక్షందగ్గరికి వెళ్ళడానికి ఆమెకు మనస్కరించలేదు. అంచేత అతన్నికూడా వెంటతీసుకొనివెళ్ళింది. వెళ్ళి అమృతతుల్యమై, భగ్గున మండుతున్న ఒక ఆపిల్ పండును తీసుకొన్నది. తాను కొంచెం కొరికి పిమ్మట తనభర్త కిచ్చింది. కాని దురదృష్టవశాత్తూ దుష్టశక్తి అయిన 'ఐవీ' తలవని తలంపుగా ఆవనంలోకి వచ్చి సంచరిస్తూ ఈదృశ్యం చూచింది. ఆదిదంపతులకు జ్ఞానం కలిగిందని తెలుసుకొని, పట్టరాని ఆగ్రహంతో మండిపోయింది. వారు తనను మించిపోతున్నారని అసూయతో ఉడికిపోయింది. వాళ్ళ అంతు చూడాలని నిశ్చయించుకొన్నది. తన శక్తులన్నింటినీ కూడగట్టుకొని తీవ్రంగా విజృంభించింది. ఎక్కడలేని సంక్షోభం

పుట్టించింది. ఆ అల్లకల్లోలానికి, దుర్బలులైన ఆదమ్-ఈవ్‌లు భయకంపితులయినారు. ఆదమ్‌చేతిలో ఉన్న పండు క్రింద పడిపోయింది. ఈవ్, వణికిపోతూ అతనిమెడ కరుచుకొన్నది. "అయ్యో! ఇదేదోశక్తి నన్ను బాధిస్తున్నది"అని భర్తతో పలికింది. ఇలా ఐపి, గాయకుడు. క్షేత్రగణితజ్ఞుడు అయిన సర్ప రాజుపై విజయం సాధించి, ఆదమ్-ఈవ్‌లను, వారికి కలుగ బోయే సంతానాన్ని మందబుద్ధులుగా చేసింది. బ్రహ్మాండమైన ఉల్కలు, మొదలగు విపరీతాలను పుట్టించింది. ఆశక్తి మానవు లను, అజ్ఞానులుగను, కౄరులుగను, అన్యాయప్రవర్తకులుగను చేసింది. అంచేతనే పుడమిపై ఈదుష్టత్వమంతా వ్యాపించింది. అంతేకాదు. ఈ దుష్టశక్తి దేవశిల్పులవంటి కెయిన్‌నూ, అతని కుమాళ్ళను సంహరించింది. ఈసఫ్ కథలవంటి నీతి కథలను, చక్కని కావ్యాలను రచించినందుకు ఫిలిస్టయిన్సును తుద ముట్టించింది. విజ్ఞానానికీ, సౌందర్యానికీ, ఈ దుష్టశక్తి ప్రబల శత్రువుగా తయారైంది. శతాబ్దాలతరబడి మానవ లోకాన్ని భయంలో, బాధలో, కన్నీళ్ళలో,కష్టాలలో ముంచి వేసింది. ఇలా జ్ఞానానికి అపజయం సంభవించింది. కాని తరు వాత గ్రీకులలో పైథాగరస్, ప్లేటో, మొదలైన గొప్పగొప్ప మేధావులు, విజ్ఞానులు, వేదాంతులు అవతరించారు. వారి ముందు ఆదుష్టశక్తి పన్నాగాలు కొనసాగలేదు. జ్ఞాని అయిన సర్పరాజు ఆత్మ వారిలో వె[illegible]ందుతున్నది. అంచేత దుష్టశక్తి వారి నేమీ చెయ్యలేకపోయింది. వారు ఎథీని యనులచేత పూజింపబడినారు. చివరకు ఇటీవల ముగ్గురు దివ్య పురుషులు మానవదేహాలతో ఈలోకాన అవతరించారు.

వారే జీసస్, బాసిలిడెస్, వాలెంటినస్‌లు. వారు జ్ఞానవృక్షం యొక్క అమృతఫలాలు ఆరగించారు. వారి జ్ఞానం అటు ఊర్ధ్వలోకాలవరకూ, ఇటు అధోలోకాలవరకూ విస్తరించింది. యూదులు చేసే తప్పులు, నేరాలు బాగా తెరుచుగా క్రైస్తవులపై ఆరోపిస్తుంటారు. అది అసత్యమనీ, క్రైస్తవులు సరియైన మార్గంలోనే ఉన్నారనీ తెలియ చెయ్యడానికే నేనీ విషయాలన్నీ చెప్పాను.''

అని ఇలా జెనోఫోమిస్ దీర్ఘోపన్యాసం చేసిన పిదప డోరియన్ అందుకొన్నాడు-

"మిస్టర్ జెనోఫోమిస్! జీసస్, బాసిలిడెస్, వాలెన్‌టినస్ లనే ముగ్గురు దివ్యపురుషు లవతరించి – పైథాగరస్, ప్లోటో, ఇంకా ఇతర గ్రీకు వేదాంతులు, జ్ఞానులు, చివరకు మానవులను శుష్క భయాలనుండి బయటపడవేసిన దివ్య పురుషుడు ఇపిక్యూరస్– వీరంతాకూడా కనుక్కోకుండా వదిలిపెట్టిన రహస్యాలను, కనుగొన్నారని నీ వంటున్నావు. కాని నిన్ను ఒక్కమాట అడుగుతాను, చెప్పు. ఎంతోకాలం ధ్యాన నిమగ్నులై ఉన్న మహామునులకు సయితం లభించని జ్ఞానం నీవు చెప్పే ఆ ముగ్గురికీ ఎలా లభించిందయ్యా?–'' అని అడిగాడు.

"నీకు మళ్ళీ చెప్పనా డోరియన్! విజ్ఞానం, చింతన – ఇవి జ్ఞానసాధనకు తొలిమెట్లు మాత్రమే డోరియన్! ఆ పరమానందం మాత్రమే శాశ్వత సత్యానికి త్రోవ చూపుతుంది''– అని బదులు పలికాడు జెనోఫోమిస్.

అప్పుడు హెర్మోడోరస్ మాట్లాడడం మొదలు పెట్టాడు- నీవు చెప్పింది నిజం జెనోఫోమిస్! ఆకులలో తిరిగే కీటకానికి మంచుబిందువు ఆహారమైనట్లు, ఆత్మకు ఆనం దమే ఆహారం. కాని ఇంకా చెప్పాలంటే ఒక్కమనస్సే పరి పూర్ణమగు ఆనందపారవశ్యంలో మునిగిపోగలదు. కారణం ఆత్మ మనకు అగుపించనిది. ఈ భౌతికకాయం ధరించిన మానవ స్వభావంలో మూడువంతులు పరిశుద్ధమైన మనస్సుకు సంబం ధించినదే. ఈ శరీరం, ఒక భవనం లాంటిది ఈ భవనంలో ఉన్న మనస్సు అకస్మాత్తుగా మౌనముద్ర వహించి, ఏకాం తంలో నివసించి, ఆత్మ అనే సుందరోద్యానవనాలలో గుండా ఎగిరిపోయి ఈశ్వర సాన్నిధ్యానికి చేరుకొంటుంది. ఆగతమగు మరణ సుఖాన్ని అనుభవిస్తుంది అంటే భావిజీవితంకోసం మర ణిస్తుంది. ఆస్థితిలో దివ్యమైన పరిశుద్ధతను సాధించి అఖండ మైన ఆనందాన్ని, పరిపూర్ణమైన జ్ఞానాన్ని పొందుతుంది. అప్పుడు అందరిలోనూ ఐక్యమవుతుంది. పరిపక్వం చెందు తుంది.'' అన్నాడు.

తరువాత నిషియస్ ఇలా అన్నాడు-''బావుంది, చాలా బావుంది. కాని హెర్మోడోరస్! నిజం చెప్పాలంటే శూన్యా నికీ, అన్నీనిండిఉన్నదానికీ నాకు అంతగా భేదం కనుపించడం లేదు. ఆ రెండూ వేరు వేరుగా ఉన్నాయని చెప్పడం మన తరం కాదు. ఏమీలేనిదే అనంత మనిపిస్తుంది నాకు. అనంతం- శూన్యం, ఈ రెండూకూడా మన మనస్సుకు అంతుపట్టనివి. ఊహించడానికికూడా శక్యంగానివి. నా ఉద్దేశంలో పరిపూర్ణత అనేదానికి చాలా విలువ ఉంది. ఆ విలువ, ఇంత - అంత అని

చెప్పలేం. ఆ పరిపూర్ణతకోసం మనం సర్వస్వం ధారపోయ వలసి ఉంటుంది. దానిని అందుకోవాలంటే మనకు మనమే లేకుండా పోతాం. ఆ భగవంతునికే పరిపూర్ణత లేదు ఆయనకు కొంతలేకుండా చెయ్యాలని జ్ఞానులు, వేదాంతులు తమశక్తి కొలది ప్రయత్నిస్తున్నారు. మన మెంత, మనస్థితి ఎంత? ఇది ఫలానా అని మనకు తెలియనప్పుడు, ఇది ఫలానా విధంగా ఉండాలనికూడా మనకు తెలీదు. అంతేకదయ్యా మరి?– మనం అజ్ఞానులం. మన కేమీ తెలీదు. అవుతే ఈ విషయాలన్నీ మానవులందరూ ఒప్పుకోరు. కాని నా కో విశ్వాసముంది– ఇలా భిన్నభిన్నమైన అభిప్రాయాలతోను, వాదోపవాదాల తోను తన్నుకలాడి చస్తున్నప్పటికీ, ఏనాడో ఒకనాడు మాన వులంతా ఒక్క అభిప్రాయానికి వచ్చి ఒక్క తాటిమీద నడవ గలరని నా నమ్మకం"–

నిషియన్ ఇలా చెప్పగా విని కొట్టా ఈ విధంగా పలికాడు–

"తత్త్వశాస్త్రమంటే నాకు తగనిఇష్టం. నాకు తీరిక దొరికినప్పుడల్లా దానిని చదువుతుంటాను. కాని అందులో ఒక్కముక్కకూడా నాకు అర్థమయిచావదు. సరే, అబ్బా యిలూ! మరికొంచెం పానీయం సేవిద్దాం. ఒరేయ్, పరిచార కులూ! అందరికీ ద్రాక్షాసవం అందించండిరా!"–

తరువాత కవి కాలిక్రెటీస్ అందుకొని "లూషియన్ కొట్టా! నీపుణ్యమా అంటూ ఇవాళ మేము కడుపార మధు పానం చేస్తున్నాం. మద్యంసేవిస్తుంటే నాకు మధురస్మృతు

లనేకం వస్తాయి. అంతర్యుద్ధాలు, మహాసంగ్రామాలు-ఇవన్నీ నా కనులముందు కలల్లా పొడగడతాయి. పూర్వం రోమనులు సాగించిన మహాసంగ్రామాలు జ్ఞాపకంవచ్చి, నారక్తం పొంగు లెత్తుతుంది. స్వాతంత్ర్యంకోసం సమరాలుసాగిన ఆకాలంలో పుట్టక, అపఖ్యాతికరమైన ఈపాపిష్టికాలంలో పుట్టినందుకు నేను సిగ్గుపడుతుంటాను." అన్నాడు.

తరువాత మళ్ళీ కోట్టా ప్రసంగించాడు : "రిపబ్లిక్ పతనమవుతున్న రోజులలో మా పూర్వీకులు విముక్తికోసం పోరాటం సాగించారు. బ్రూటస్‌తోపాటు మరణించారు. రోమన్ ప్రజలు, చెప్పే స్వేచ్ఛఅనేదానికి అర్థం నిజానికి తమ్ము తాము పరిపాలించుకోవడం. కాని ఈవిషయంలో సందేహించడానికి తగినంతకారణం ఉన్నది. స్వేచ్ఛఅనేది జాతికి గొప్ప వరం లాంటిది. అది నేను కాదనను. కాని బ్రతికినంతకాలం ఒక్క విషయం నన్ను ఎంతగానో బాధిస్తున్నది. బలమైనప్రభుత్వం మాత్రమే పౌరులకు స్వేచ్ఛను ప్రసాదించగలదని నిరంతరం నేను భావిస్తాను. నలభైసంవత్సరాలు నేను ప్రభుత్వ సంబంధ మైన ఉన్నతపదవులలో ఉన్నాను. ఇంతకాలంగా నేను పొందిన అనుభవాన్నిబట్టి, పాలనాశక్తి బలహీనమయినట్ల యితే, ప్రజలు పీడింపబడతారని, నాకు స్పష్టంగా కను పిస్తున్నది. కాబట్టి, అధిక సంఖ్యాకులుగా ఉన్న ఆలంకారికుల వంటివారు ప్రభుత్వాన్ని బలహీనపరచడానికి ప్రయత్నిస్తారు. ఘోరమైన నేరాలు చేస్తారు. తనబుద్ధికి ఎట్లాతోస్తే అట్లా చేసే నిరంకుశ ప్రభువున్నాడే-అతను అప్పుడప్పుడు అతిదుఃఖ కరమైన ఫలితాలకు కారణభూతుడవుతుంటాడు. కాని

అతను కనుక అధికసంఖ్యాకులైన ప్రజాభిప్రాయానికి అనుకూలంగా పరిపాలన సాగించినట్లయితే ఇహ దానిని నివారించడం సాధ్యం కానేకాదు. రోమన్ చక్రవర్తులు ప్రపంచంలో శాంతి వెదజల్లడానికి ముందు, మేధావులగు నిరంకుశ ప్రభువుల పాలనలోఉన్న జాతులుమాత్రమే సుఖంగా ఉన్నాయి."

కొట్టా ఉపన్యాసం విని తరువాత హెర్మొడోరస్ మాట్లాడాడు.

"లూసియస్! నామటుకు నేను మంచి ప్రభుత్వం రూపొందడమనేది లేనే లేదని నమ్ముతున్నాను. మనం అలాంటి ప్రభుత్వాన్ని ఒక్కదాన్నికూడా రూపొందించుకోలేక పోయాం. గ్రీకులకు గొప్ప గొప్ప ఉద్దేశ్యాలయితే ఉన్నాయి. కాని వారికి చక్కటి ప్రభుత్వాన్ని ఏర్పరుచుకోవడం సాధ్యం కాలేదు. అందువలన ఆ విషయంలో మనం అన్ని ఆశలూ కోలుపోయినాం. ప్రపంచం అజ్ఞానంలోను, అనాగరికతలోను, పడిపోనున్న చిహ్నాలు మనకు స్పష్టంగా అగుపిస్తున్నాయి. అనేక దారుణసంఘటనలను ఈనాడు మనం కళ్ళారా చూస్తున్నాం లూసియస్! మానసిక తృప్తి కలిగించే వివేకం, విజ్ఞానం, నీతి, న్యాయం-ఇవి తప్ప, ఇహ మనకు మిగిలిందేమీ లేదు. భయంకరమైన చావుకోసం ఎదురు చూడడమే, ఇహ ఇప్పుడు మనం చేస్తున్నదల్లాను."

అందుకు మళ్ళీ కొట్టా- "ప్రజలలో దుర్బుద్ధులు, అలముకొన్నాయి. కిరాతకత్వం పెచ్చుమీరిపోయింది. ఇది సత్యం. కాని పటిష్టమైన నౌకాదళం, సైన్యం, కొల్లలుగా డబ్బూ ఉంటే..." అని ఏదో చెప్పబోయాడు.

అంతలో తిరిగీ హెర్మోడోరస్ అందుకొని "మనం ఆత్మ వంచన చేసుకొన్నందువల్ల ప్రయోజనం ఏమిటి? నానాటికీ క్షీణించిపోతున్న సామ్రాజ్యం, కిరాతకులకు ఇట్టే బలి అవుతున్నది. గ్రీకు మేధావులు నిర్మించిన మహానగరా లన్నింటినీ, త్వరలో తాగుబోతులయిన కిరాతకులు కొల్లగొట్ట నున్నారు. ఇహ యీభూమిమీద కళలు, వేదాంతాలు, తత్త్వశాస్త్రాలు ఎంతో కాలం జీవించలేవు. దేవాలయాల లోని దేవతల విగ్రహాలన్నీ తల్లక్రిందు లవుతాయి. మానవ హృదయాలే మారిపోతాయి. అందరి మనస్సులకూ అంధకారం ఆవరిస్తుంది. ప్రపంచం త్వరలోనే నశించిపోతుంది. సర్మాషియన్లు ఇహ తెలివికల పనులన్నింటినీ మెచ్చుకుంటారా? జెర్మానీలు సంగీతమన్నా, తత్త్వశాస్త్రమన్నా ప్రేమిస్తారా? క్వాడీలు, మార్కొమానీలు, దవుళ్ళను పూజిస్తారా? నమ్మలేం, నమ్మలేం! మనం అంతులేని అగాధాలవైపు పయనిస్తున్నాం లూషియస్! ప్రపంచానికి టుంగుటుయ్యాల లాంటి మన ఈజిప్టు ఇహ మృత్యుముఖంలో పడిపోతుంది. మృత్యుదేవతకు అంత్య పూజలు జరుగుతాయి! ఇదే ఆఖరు దేవుడు, నేనే ఆఖరు మతగురువును."

హెర్మోడోరస్ ఇలా చెపుతున్న తరుణంలో ఒక విచిత్రమైన వ్యక్తి అక్కడికి వచ్చాడు. బట్టతల, కొంచెం గూని, నీలవర్ణపు ఉడుపులు దాల్చాడు. కాళ్ళకు కిరాతకుల మోస్తరు ఇజారులు ధరించాడు. వాటికి పొదిగిన బంగారు పూలు తళతళలాడుతున్నాయి. అతిథు లంతా అతనివంక తేరిపారచూశారు. అతన్ని చూడగానే అతను మార్కస్

అని పఫ్నూటియస్ గుర్తుపట్టాడు. వెంటనే అతని తలపై పిడుగు పడినట్లయింది. ఎక్కడలేని భయంవచ్చి ఆవహించింది. ముఖం వివర్ణమయింది. భయంతో కంపించిపోయాడు. రెండు చేతులతో ముఖాన్ని కప్పుకొన్నాడు. ఆ విందుకు వచ్చినవారంతా రాక్షసులు, దైవదూషకులు. దైవారాధనను ఖండించేవారు. వారి జ్ఞానం మిడిమిడి జ్ఞానం. వారి వేదాంతాలు, తత్త్వశాస్త్రాలు, తప్పుల తడకలు! ఇన్ని అవకతవకలున్నా-వీరెవరి ప్రభావం పఫ్నూటియస్‌పై పడలేదు. కాని యీ అన్యమతావలంబకుడయిన మార్కస్ కంటపడగానే ఆయన ధైర్య స్థైర్యాలన్నీ భ్రంగిపోయాయి. రక్తం గడ్డకట్టుకు పోయింది. అక్కడ ఒక క్షణం నిలువకుండా పరుగుతీసేవాడే కాని అంతలో థాయిస్ ఆయన కంటపడింది. వెంటనే ఆయనకు ధైర్యంవచ్చింది. థాయిస్ పవిత్రాత్మను ఆయన చూడగలిగాడు. ఆపిక కొంగులు పట్టుకొని మనస్సులో రక్షకుడైన జీసస్ క్రైస్ట్‌ను ప్రార్థించుకొన్నాడు.

క్రైస్తవులకు ప్లేటో అని పేరుగాంచిన మార్కస్ అక్కడ అడుగుపెట్టగానే అందరిలోనూ నూతనోత్సాహం పెల్లుబికివచ్చింది. గుస గుసలాడుతూ చెప్పుకొనే ప్రశంసా వాక్యాలు అంతటా బయలుదేరాయి. మొట్టమొదట హెర్మొడోరస్ ఇలా ప్రసంగించాడు.

"మార్కస్! నీవు ప్రసిద్ధుడవు! నేడు నిన్ను మామధ్య చూడగలుగుతున్నందుకు మేమంతా ఆనందంతో పొంగిపోతున్నాం. అంతేకాదు, నీవు సరిగ్గా సమయానికి

వచ్చావు. బయట చెప్పేవి వినడం మినహా - క్రైస్తవ మత సిద్ధాంతాలనుగురించి నిజానికి మా కేమీ తెలియదు. నీవు మహాజ్ఞానివి. ఈసమయంలో ప్రధానమైన మతరహస్యాలన్నీ నీనోట వినాలని మాకెంతో కుతూహలంగా ఉంది. నీవు మరోలా అనుకోక నీ అభిప్రాయాలను వెల్లడించవలసినది. మనమిత్రుడు జెనొఫోమిస్ ఎప్పుడూ ఏవేవో పెడర్థాలతో మాట్లాడుతాడు కాని, ఏవిషయం సూటిగా చెప్పడు. మీకు తెలిసిందేకా? అతను ఇంతకుమునుపే మన ప్రసిద్ధుడైన వఫ్నూటియస్‌ను యూదుల గ్రంథాలనుగురించి ప్రశ్నించాడు. కాని వఫ్నూటియస్ సమాధానం చెప్పలేదు. అయినా అందులకు మాకు ఆశ్చర్యమేమీలేదు. ఆయన మహాముని. మాట్లాడనని ప్రతినపట్టాడు. తపోవనాలలోనుంచి వచ్చినవాడాయె మరి! కాని మార్కస్! క్రైస్తవమత సభలలో చర్చించిన తత్త్వశాస్త్ర సంబంధమైన సత్యాలను, నీతికథలలో చెప్పిన మతరహస్యాలను దయచేసి నీవు మాకు ఎరుకపరచవలసినది. మా కుతూహలాన్ని తీర్చవలసినది. ఈసత్యాలలో మొట్టమొదటిది దేవుడున్నాడని చెప్పడం కాదా? ఏమంటూరు మార్కస్ ?-"

అందుకు మార్కస్- "అవును తమ్ముడూ! దేవుడున్నాడు. అన్నిటికీ మూలం ఆదేవుడే - ఆయన అనంతుడు!- ఇది ఎవరూ కాదనలేరు" అని బదులుపలికాడు.

"మిస్టర్ మార్కస్! నీవు చెప్పే ఆ దేవుడు ప్రపంచాన్ని సృష్టించాడు కదా? మరి ఆయన ఉనికిలోనే గొప్ప

సంక్షోభం తప్పకపుట్టి ఉండాలి. సృష్టికిపూర్వమే ఆయన ఉండితీరాలి. ఉండి తరువాత అనంతమైన సృష్టికి ఉపక్రమించి ఉండాలి. కాని ఆయన ఉనికి, ఆయన స్థితి చాలా శ్రమతో కూడుకొన్నదని నా విశ్వాసం. ఆయన క్రియాశూన్యుడై సమాధిలో ఉన్నట్లయితే ఆయన ఉన్నాడని ఎవరూ విశ్వసించరు. కనుక ఆ యీశ్వరుడు తన ఉనికిని రుజువుచేసుకోడం కోసం, క్రియాసహితుడైనాడు. సృష్టికి పూనుకొన్నాడు- నేను అనుకునేది ఇదీ - కాని నీవు చెప్పు మార్కస్! యీశ్వరుడు యీ విశ్వాన్ని ఏ విధంగా సృష్టించాడు?" అని అడిగాడు నిషియస్.

అందుకు మార్కస్ - "క్రైస్తవులు కానటువంటి హెర్మొడోరస్, జెనోఫోనిస్ లాంటివారే కాక, జ్ఞాన సూత్రాలు సయితం యీశ్వరుడు తనకుతానై యీ లోకాన్ని సృష్టించలేదనీ, నేరొకరి సహాయంతోనే ఆపని చేశాడనీ ఒప్పుకోకతప్పదు. యీశ్వరుడు ఒకపుత్రుని కన్నాడు. ఆయనవలన యీ సమస్తమూ సృజింపబడిందీ" అని బదులు చెప్పాడు.

"నీవుచెప్పింది అక్షరాలా నిజం మార్కస్! ఆఈశ్వరుని కుమారుడే హెర్మస్, మిత్రా, అధోనిస్, అపోలో, జీసస్, మొదలగు పేర్లతో పిలువబడుతూ ఆరాధింపబడుతున్నాడు-" అన్నాడు, హెర్మొడోరస్.

"ఆయనను జీసస్ క్రైస్ట్, రక్షకుడు అనితప్ప మరే పేరున పిలిచినా నేను క్రైస్తవుణ్ణి కాకుండాపోతాను. ఆ జీసస్‌మాత్రమే భగవంతుని నిజమైన కుమారుడు. ఆయనకు

మొదలు అనేది ఉన్నదికనుక ఆయన నిత్యుడు కాడు. అలా పుట్టకముందుకూడా ఆయన ఉండి ఉన్నాడనడం అసంగతమైన విషయం. ఆవిషయం ♦నైసియన్ కంచరగాడిదలకు వదిలేద్దాం! మొండివగు గాడిద ఒకటి, శాపగ్రస్తమై అథానాసియస్‌అన్న పేరుతో చాలాకాలం అలెగ్జాండ్రియా చర్చిపై పెత్తనం చెలాయించింది". మార్కస్ ఇలా చెప్పగా విని పఫ్నూటియస్ భయంతో కంపించిపోయాడు. ఆయనముఖం వివర్ణమైంది. ముచ్చెమటలు పోశాయి. ఎక్కడలేని ఆవేదన పుట్టుకొచ్చింది. శిలువగుర్తును జ్ఞాపకంచేసుకొని జీసస్‌ను ప్రార్థించుకొన్నాడు. కాని నోరుతెరిచి మాట్లాడక మౌనం వహించే ఉన్నాడు.

అంతట మార్కస్ తిరిగి చెప్పసాగాడు: "బుద్ధిహీనులైన ♦ నిసీన్‌జాతివారు, రాజద్రోహానికి మించిన దైవద్రోహం చేశారు. ఈశ్వరుడు శ్రమించలేదు. ఈసృష్టిచక్రాన్ని త్రిప్పనూ లేదు. అసలు శ్రమించింది ఆయన కానేకాదు. ఆయన ఏకపుత్రుడైన జీసస్‌మాత్రమే. ఆయనే ఈవిశ్వాన్ని సృజించాడు. కాని తరువాత, భగవంతుడు ఆయనసృష్టిని సరిదిద్దడానికి వచ్చాడు. ఎంచేతనంటే సృష్టి సక్రమంగా లేదు. సృష్టిలో

---

♦ బిథీనియా, ఆసియా మైనరులలోని పట్టణాలను నైస్ అనీ నైసియన్స్ అనీ అంటారు.

♦ నిసీన్‌లో 787 సంవత్సరాన మత కౌన్సిల్ ఏడవ సాధారణ సమావేశం జరిగింది. ఆసభవారు విగ్రహాలను ధ్వంసంచేసేవారిని దూషించి వారు దండనార్హులని నిర్ణయించారు.

మంచీ-చెడూ కలిసి ఉండడం తప్పనిసరి అయిపోయింది."
తరువాత నిషిఋస్-"ఏది మంచీ, ఏది చెడూ?"అని అడిగాడు.

పిమ్మట ఒక క్షణంసేపు ఎవరూ మాట్లాడలేదు. తరువాత హెర్మోడోరస్, అక్కడొక చిన్న టేబిల్ మీద ఒక దాంట్లో తెల్లటి ఆలీవ్‌లు, ఒకదాంట్లో నల్లటి ఆలీవ్‌లు ఉన్న రెండు ఇత్తడి బక్కెట్లను చెయ్యెత్తి చూపుతూ ఇలాఅన్నాడు:

"ఈ ఆలీవ్ ఆకులను మీరు చూస్తున్నారుకదా! ఇవి రెండు రకాలుగా కనిపిస్తున్నాయి. వీటివర్ణంలో ఎంతో వ్యత్యాసం ఉంది. ఒకదాంట్లో తెల్లటి ఆలీవ్‌లు, ఒక దాంట్లో నల్లటి ఆలీవ్‌లు. మనం కొంచెం జ్ఞానం తోటి ఆలోచిస్తే మంచి చెడ్డ లనగా ఇవేనని తెలిసి పోతుంది. తెల్లటివల్లా మంచివి, నల్లటివల్లా చెడ్డవి. తెల్లటి వంటే మన కిష్టం, నల్లటివంటే మన కయిష్టం. మనపై భగవంతుడుండి విచారించినట్లే, వీటి మంచి చెడ్డలను మనం వివేకంతో విచారించగలం. మానవుడు కొంతభాగం మాత్రమే చూడగలడు. అతనికి చెడు చెడుగానే కనిపిస్తుంది. కాని భగవంతునికి అలా కాదు. ఆయన అన్నీ చూడగలడు. అన్నీ అవగతం చేసుకోగలడు. అంచేత ఆయనకు చెడు మంచిగా కనుపిస్తుంది! అందం అందమే, వికారం వికారమే. అందం వికారం కాబోదు. వికారం అందమూ కాబోదు. ఇందులో అనుమానంలేదు. కాని ఒక్క విషయం. అన్నీ సుందరంగా ఉన్నట్లయితే, ఈ బ్రహ్మాండమంతా సుందరంగా ఉండదు. కాబట్టి ప్లేటో కంటె గొప్పవాడైన మరొక ప్లేటో

ఉన్నట్లు, మంచికంటె గొప్పదగు చెడుకూడా ఉన్నదన్నమాట. ఉండక తప్పదని మనకు స్పష్ట మవుతున్నదన్నమాట.”

తరువాత యూక్రెటీస్ మొదలెట్టాడు- “అబ్బాయిలూ! మనం ఇంకా నీతిబోధకంగా మాట్లాడడం మంచిది. చెడు అనేది ప్రపంచానికి చెడుకాదు. ఎవరు చెడుచేస్తున్నారో ఆ దుష్టుడికే అది చెడు అవుతుంది. చెడుచెయ్యకుండా అతను ఊరుకోలేడు”-అన్నాడు.

“ఆరి భగవంతుడా! భలే మంచివాదన లేవదీశావయ్యా నీవు. నిజంగా బుద్ధికి బృహస్పతివే!” అన్నాడు కొట్టా.

“ఈ విశ్వమే ఒక విషాదాంతనాటకం! దీనిని రచించినవాడొక మహాకవి. ఆయనే ఈశ్వరుడు. ఆయన ఈదృశ్యకావ్యంలో మనలను తలా ఒక పాత్ర ధరించమన్నాడు. ఆయన ఏవేషం ఇస్తే అది మనం వెయ్యాలి. అది ప్రభువు వేషమేకాని, భిక్షుక వేషమేకాని, వికృతవేషమేకాని, వికలాంగుడి వేషమే కాని. దానిని మనం ధరించితీరాలి. ఆ పాత్రను చక్కగా అభినయించితీరాలి.” అన్నాడు మళ్ళీ యూక్రెటీస్.

“అవును, ఏవేషమైనా మంచిదే. రాజులు,న్యాయబుద్ధి కలవారు, దుష్టులు, క్రూరులు, బుద్ధిమంతులు, సాధువులు, అవినీతిగల భార్యలు, ఉదారబుద్ధిగల పౌరులు, హంతకులు- వీరందరూకూడా ఈనాటకంలో నటులే. వీ రెవరైనాకానీ తమ పాత్రలు తాము చక్కగా పోషించారూ అంటే, నాటక రచయిత అగు ఆ భగవంతుడు వీరందరినీ సమానంగా అభినందిస్తాడు.ఇందులో ఒకరు హెచ్చూ, ఒకరు తగ్గూ అంటూలేదు.

మంచివారూ, చెడ్డవారూకూడా ఈ సంతోషంలో సమాన భాగస్వాములే"-అన్నాడు నిషియస్.

"నిషియస్! నీవు నా ఉద్దేశ్యాలకు పెడర్థాలు కల్పిస్తున్నావు. అందమైన అమ్మాయిని అనాకారిగా మారుస్తున్నావు. నా భావం వేరు, నీ వనేదాని అర్థం వేరు. భగవంతుని గురించీ, ధర్మదేవతను గురించీ, శాశ్వతమైన సూత్రాలను గురించీ, నీవు అంతగా తెలుసుకోజాలని అజ్ఞానివయితే, ఇహ నేను చింతించడం తప్ప చెయ్యగలిగిం దేమీలేదు"-అన్నాడు మళ్ళీ యూక్రెటీస్.

పిమ్మట జెనోఫోమిస్ ఇలా చెప్పాడు- "స్నేహితులారా! నామటుకు నేను, మంచీ - చెడ్డలనేవి, వాస్తవంగా ఉన్నాయని నమ్ముతున్నాను. కాని మానవచర్యలలో ఒక్కటికూడా తరుణోపాయం సూచించడం లేదని అనుకుంటున్నాను. ఆఖరుకు విద్రోహాక చర్యలుకూడా అందుకు పనికిరావు. చిట్టచివరకు మానవవిముక్తికి చెడుమాత్రమే దోహదం చేస్తుంది. యీ విషయం క్రైస్తవులు విస్పష్టం చేశారు. ఎజ్జజుట్టు మనిషి కథ పురాణాల్లో మీరు వినేఉంటారు. అతను తన యజమానికి ద్రోహం చేశాడు. మంచిగానే ఉన్నట్లు నటించి గొంతుకోశాడు. అదే మానవజాతికి ముక్తి అని స్థిరీకరించాడు. కాబట్టి నా ఉద్దేశమల్లా ఒక్కటే. పాల్ శిష్యులలో కొందరిని మనం అనవసరంగా ద్వేషించడంవల్ల ప్రయోజనంలేదు. అది న్యాయం కాదుకూడా. మానవజాతి విముక్తికోసం వారు తమ తమ సిద్ధాంతాల ప్రకారం ఆ యా సమయాలలో అవసరమని భావించిన పనులు చేశారు. వారా విధంగా చెయ్య

న్నయితే ఈ దివ్యజ్ఞానం యావత్తూ ఏనాడో నశించిపోయేది. లోకమంతా దుర్మార్గంలోనూ, అజ్ఞానంలోనూ, మృత్యువు లోనూ పడి కొట్టుకొంటూ ఉండేది.—"

అంతలో మార్కస్ మళ్ళీ ఏదో అడ్డుప్రశ్న వెయ్యగా, జెనొఫొమిన్ తిరిగీ ఇలా చెప్ప నారంభించాడు—

"ఇంతకు ముందే నేను చెప్పాను మార్కస్. చిత్రహింసకు గురిఅయిన జీసస్ క్రైస్ట్ వల్లనే మానవజాతికి ముక్తి కలిగిందని నేను నమ్ముతున్నాను. క్రైస్తవులు ఆ విశ్వాసం కలిగి ఉన్నారని నాకు తెలుసు. అందుకే వారి అభిప్రాయాన్ని నేను అనుసరిస్తున్నాను. 'జూడాస్'ను పూర్తిగా దూషించాలనుకొనేవారికి — వారి తప్పు వారికి చూపాలనే నేను ఆ అభిప్రాయాన్ని వారినుండి అరువు తెచ్చుకొన్నాను! కాని వాస్తవంగా నా కళ్ళకు జీసస్ ఒక జోస్యుడులా, ఒక కాలజ్ఞానిలా కనుపిస్తాడు! స్నేహితులారా! మోక్షరహస్యాన్ని మీకు చెపుతాను వినండి. మీకు వినాలని అంత కుతూహలంగా ఉన్నట్లయితే — ఈ పుడమిపై మోక్షం ఎలా సాధింపబడిందో సాంగోపాంగంగా చెపుతాను. శ్రద్ధగా ఆలకించండి".

జెనొఫొమిన్ ఇలా అనేసరికి అక్కడున్నవారంతా చెప్పండన్నట్లు సైగచేశారు. అంతట దేవకన్యల్లాఉన్న ఓ డజను మంది అమ్మాయిలు, పండ్లబుట్టలు నెత్తిన పెట్టుకొని చల్లగా—మెల్లగా ఆ మందిరంలోనికి వచ్చారు. ఆ బుట్టలలో దానిమ్మ పండ్లు, ఆపిల్‌పండ్లు ఉన్నాయి. ఎక్కడనుంచో ఒక సన్నని వేణుగానం వినిపిస్తోంది. ఆ పిల్లలు పండ్లబుట్టలు తెచ్చి టేబిలో

మీద పెట్టారు. వేణుగానం ఇహ వినిపించలేదు. తరువాత జెనొఫానిస్ మళ్ళీ ఇలా చెప్పడం మొదలు పెట్టాడు-

♦ "యునోయియా ఈజగత్తును సృష్టించింది. అలా సృష్టించి ఆదేవి, దేవతలను నమ్మినవారికి ఈభూపరిపాలనా భారాన్ని అప్పగించింది. కాని వారు పక్షపాతబుద్ధికలవారైనారు. లోకాన్ని సమబుద్ధితో పాలించే సమర్థత వారికి లేదు. ఆ దేవతలు ఒకనాటి సాయంత్రం ఒకనూతిచెంతకువచ్చిన మానవకన్యలను చూచారు. ఆపిల్లల అందచందాలకు ఆశ్చర్యచకితులైనారు. తామూ వారివలె ఉండాలని, వెళ్ళి వారిలో కలిశారు. ఈ విధంగా దేవ మానవ జాతుల కలయికవల్ల, ఈభూమిమీద ఒకానొక సంక్షుభితమైన జాతి పుట్టుకొచ్చింది. దాంతో అన్ని అనైకతవకలు బయలుదేరాయి. అన్యాయం, అక్రమం, క్రౌర్యం, కాఠిన్యం, అసత్యం, హింస-ఇవన్నీ ప్రపంచమంతటా వ్యాపించి, విచ్చలవిడి సంచరించసాగాయి. ఈకల్లోలమంతా చూచేసరికి దైవమాయ అగు యునోయియాకు ఎక్కడలేని దుఃఖం ముంచుకొచ్చింది. "అయ్యో! ఏమిటిదంతా? నేనుచేసిన పనేమిటి?-" అంటూ ఈభూమండలంపై వ్రాలి చింతించింది. "నాబిడ్డలంతా ఇలా దౌర్భాగ్యులైనారే. అసూయా ద్వేషాలతో కొట్టుమిట్టాడుతున్నారే. తీరని బాధలతో క్రుంగిపోతున్నారే! ఇదంతా నావల్లనే కదా! నేను చేసిన తప్పుకు నేనే ప్రాయశ్చిత్తం చేసుకోవాలి. దీనికి పరిహారం నేనే ఆలోచించాలి. నేను ఈశ్వర సంక

---

♦ ఈశ్వరసంకల్పం, లేక ఈశ్వరమాయ ఈ పేరుతో పిలువబడుతున్నది. ఈమాయే జగత్తును సృష్టించిందని భావించబడుతున్నది.

ల్పాన్ని కాబట్టి నాద్వారా కలిగిన యీ కలుషితాన్ని, ఆ యీశ్వరుడుకూడా పోగొట్ట సమర్థుడుకాడు. జరిగిందేదో జరిగింది. దానిఫలితంగా యీసృష్టి ఎప్పటికీ అసంపూర్ణం గానే, అక్రమంగానే ఉండి ఏడుస్తుంది. తప్పదు! కాని నాబిడ్డ లను నేను వదిలిపెట్టకూడదు. ఇది నా కనీసధర్మం. నేను వారిని నాలాగా సుఖజీవులయేటట్లు చెయ్యజాలనట్లయితే, నామ టుకు నేనే వారిలాగా అసౌఖ్యజీవినైపోవడం మంచిది! అప్ర తిష్టకరమైన దేహాలు వారికి నేను ప్రసాదించి, గొప్ప నేరం చేశాను. కాబట్టి నేనూ అలాంటి దేహాన్నే ధరించి వారిదగ్గరికి వెడతాను. వారిమధ్యనే జీవిస్తాను - అనుకొన్నది. "ఇలా అనుకొని ఆదైవమాయ దివినుండి భువికి దిగివచ్చింది. 'ఆర్గోజా' ప్రాంతంలోని ఒకస్త్రీ గర్భవాసాన జన్మించింది. ఆశిశువు చాలా సన్నగా, బలహీనంగా ఉన్నది. ఆపిల్ల పేరు హెలెన్. యీ మానవజీవితంతాలూకు కష్టాలన్నీ అనుభ వించింది ఆపిల్ల. కాని త్వరలోనే పెరిగి పెద్దదయి చక్కని చుక్కగా తయారైంది. దేదీప్యమానంగా ప్రకాశిస్తూ, అందరూ మెచ్చే, అందుకొనచ్చే అందాలరాణిలా రూపొం దింది. అందరికీ ఆనందం పంచిపెట్టింది. కామందులయినవా రనేకులు ఆవిడ శీలాన్ని చెరిచారు. సుఖాన్ని పొందారు. ఆవిడ చెయ్యని పాపమంటూ లేదు. వ్యభిచరించింది! అందరినీ మోహంలో ముంచింది. ఆవిడ సౌందర్యం అనేక అనర్థాలకు కారణమైంది. సమరాలు సాగాయి. వైషమ్యాలు పెరిగాయి. జాతులు వినాశనం పొందాయి. కాని ఆమె తాను ఈశ్వర మాయనని ఎన్నడూ అనుకోలేదు. పాపంచేస్తున్నానని తల

పోయలేదు. ఆవిధంగా హెలెన్ ఆరోజులలో వీరులనూ, మహానాయకులనూ సుఖపెట్టింది. ఆవిడ అందచందాలనూ, దివ్యస్వరూపాన్ని కవులు వర్ణించారు. శిల్పులు బొమ్మలు చెక్కారు. ఈమెను మించిన అందకత్తె ఈభూలోకంలో లేదు" అన్నారు అంతా.

"ఆవిధంగా 'యునోయియా' పాపకూపంలో పడి ఈదుతూ దారుణమైన బాధలన్నీ అనుభవించింది. చివరకు మరణించింది. ఆవిడ సమాధి ఇదే నని ఇప్పటికీ ఆ ప్రాంతం వాళ్ళు చూపుతుంటారు. అవును. అన్నిభోగాలు అనుభవించిన హెలెన్ చివరకు మృత్యువాత పడింది. తాను నాటిన విషవృక్షపు ఫలాలను తానే రుచిచూచింది. కాని హెలెన్‌గా తనువు చాలించిన పిదప ఆ దేవి మరల స్త్రీగానే జన్మించింది. తిరిగి అలాగే పడరాని కష్టాలు పడి, అవమానాలన్నీ భరించింది. ఆవిధంగా ఒక దేహంనుంచి మరొక దేహానికి వెడుతూ, ఈ పాపపు యుగాలలో నిరంతరం సంచరిస్తూ ఉంటుంది. ప్రపంచంలో పాపాలన్నీ తనపైన వేసుకొని భరిస్తూ ఉంటుంది. ఆమె చేసిన త్యాగం వృధాకాలేదు. మానవులమైన మన మధ్యకు వచ్చి ఆమె జీవించింది. మనలను ప్రేమించింది. మన కష్టాలలో పాలుపంచుకొన్నది. మనం దుఃఖస్తే తానూ దుఃఖించింది. ఇలా ఆవిడ ఎల్లప్పుడూ మనకు విమోచనం కలించడంకోసం మనలను మోస్తూ తిరుగుతుంటుంది. తుదకు స్వర్గధామానికి చేరుస్తుంది."—

జెనోఖోమిస్ చెప్పినది విని హెర్మోడోరస్ ఇలా అన్నాడు:

"ఈ పురాణం నాకు కొత్తది కాదయ్యా. ఇదివరకు నేను విన్నదే. దివ్యమూర్తి అయి అవతరించిన హెలెన్, టిబరియస్ చక్రవర్తి పరిపాలనా కాలంలో ఒక మాటు మానవ రూపంలో వెళ్ళి మాంత్రికుడైన సిమన్‌తో కాపురంచేసిందట! ఇది నేను విన్నట్లు జ్ఞాపకం. ఏమైనప్పటికీ ఆమె అధోగతికి పోక తప్పలేదు. దేవతలే ఆమెను నరకంలో పడ ద్రోశారని నే ననుకొంటున్నాను."

"అవును. నీవు చెప్పింది నిజమే, హెర్మోడోరస్! సక్రమంగా ఉపదేశాలు పొందని మానవులు 'యునోయియా' తనకు తానై పతనం కాలేదని భావిస్తున్నారు. కాని వా రూహించినట్లు ఆమె పాపపరిహారంకోసం వేశ్యగా మారలేదని స్థిరపరుచుకొనేటట్లయితే-ఆమెలో ఏమాత్రం మహిమ లేదని మనం అనుకోవలసిఉంటుంది! ఆవిడ అనుభవించిన బాధలు, ఆవిడ చేసిన త్యాగం, ఆ అంతులేని పాపాలు-ఇవన్నీ అర్థం లేని వవుతాయి!" అన్నాడు మళ్ళీ జెనొథామిస్.

"అవుతే జెనొథామిస్! నా కో విషయం చెప్పు. చిరంజీవి అయిన ఈ హెలెన్, ఇప్పుడు ఏ దేశంలో, ఏ రూపంలో, ఏ పేరుతో ఉన్నదంటావయ్యా?" అని అడిగాడు కాలిక్రెటీస్.

"ఇలాంటి రహస్యం తెలుసుకోవాలంటే ఎంతో మేధాశక్తి, జ్ఞానసంపత్తి కావాలి. మాటలతో తెలిసే విషయం కాదిది. ఇహ మన కాలిక్రెటీస్ అంటావా, వట్టి కవి. కవులు వేరు, పండితులు వేరు. కవులు ఏవేవో కలలు కని, శబ్ద

జాలంతో పట్టి కల్పనలు చేసి, ఆనందిస్తారు. కవులకు, పసి పిల్లలకు, ఆట్టే తేడా లేదు. మహాపండితుడైన వాడికిమాత్రమే ఇలాంటి మర్మాలు తెలుస్తాయి. ఇహ మన కాలిక్రెటీస్ ఏం చెపుతాడయ్యా!" అన్నాడు మళ్ళీ-జెనొఫొమిన్.

"చూడు, జెనొఫొమిన్! నీవు పాప బుద్ధి కలవాడవు. దేవుళ్ళను దూషిస్తున్నావు; కొంచెం జాగ్రత్తగా మాట్లాడు! దేవుళ్ళకు అత్యంత ప్రియమైనవారు కవులు. సృష్టియొక్క తొలిసూత్రాలన్నీ కవిత్వంలోనే చెప్పబడినాయి. దైవవాక్కు మొట్టమొదట కావ్యరూపంలోనే వెలువడింది! దైవ ప్రార్థ నలు, కీర్తనలు-అన్నీ కవిత్వమేకదా! అవి దేవుళ్ళకు ఎంతో ప్రీతికరమైనవి. కవులు త్రికాలజ్ఞులనీ, వారికి ఎరుకపడని రహస్యాలంటూ ఏవీ ఉండవనీ ఎందుకు అనుకోకూడదూ? నా మటుకు నేను కవిగా పుట్టినందుల కెంతో గర్విస్తున్నాను. ఎవరికీ లేని గౌరవం నాకున్నది. ఈలోకంలో ఎవరికీ లభించని స్థానం నాకు లభించింది! ఈ తరంలో నన్నెరుగనివా రెవరూ లేరు! హెలెన్ మా కవులందరికీ అత్యంత సన్నిహితురాలు. ఆమె అనుక్షణం మమ్ము వీక్షిస్తున్నది. మేమూ ఆమెను నిరంతరం చూస్తున్నాం. ఇన్నిమాట లెందుకూ? ఇదిగో! ఆ పట్టుసోఫాలో సుఖాసీనురాలైఉన్న థాయిన్‌ను చూడు! ఆమె జగదేకసుందరి. ఆవిడ నేత్రాలు ఎంత అద్భుతంగా ప్రకాశిస్తున్నాయో చూడు! ఆవిడ అధరాలపై అమృతం తొణికిసలాడుతున్నది చూడు. ఆ 'యూనోయియా' దేవత, ఆ హెలెనూ, ఆమే యీ థాయిన్! ఇప్పుడా దేవి యీ రూపంలో పుట్టిందయ్యా!" అన్నాడు మళ్ళీ కాలిక్రెటీస్.

"భలే చెప్పావయ్యా కాలిక్రెటీస్! మహా నగరాలన్నీ చుట్టి వచ్చింది మన థాయిస్! మహావీరులంతా ఆవిడకు పాదాక్రాంతులైనారు. ఏం థాయిస్? హెలెన్‌వు నీవేకా? ట్రోజన్ గుఱ్ఱం ఎంత పెద్దదంటావు?" అన్నాడు ఫిలీనా.

"ఇప్పుడా గుఱ్ఱాలు,ఏనుగుల సంగతి ఎందుకోయ్?... ఎవరామాట అంటున్నది?" అన్నాడు అరిస్టాబులస్, మైకంలో ఉండి.

"నేను పొట్ట ఉబ్బేటట్లు తాగానురా బాబూ! నాకేం తెలియడంలేదు!" అన్నాడు. చెరియస్, టేబిల్ క్రింద పడి దొర్లుతూ.

కాలిక్రెటీస్ మధుపాత్ర పైకెత్తి – "ఉండండయ్యా! మనం పొట్ట ఉబ్బేటట్లు తాగామూ అంటే, ఎవరికీ కష్టం లేకుండా హాయిగా, చచ్చిఊరుకుంటాం!" అన్నాడు.

వృద్ధుడైన కోట్టా తప్పతాగి మైకంలో తూగుతున్నాడు. అతని కళ్ళు మూతలుపడ్డాయి. బట్టశల పక్కకు వాలి పోయింది.

ఇహ డోరియన్ అప్పటికే తప్పతాగి ఉద్రేకంలో ఉన్నాడు. పూనకం వచ్చినట్లు ఊగుతున్నాడు. ఆ మైకంలో థాయిస్ సోఫావరకూ దొర్లుకుంటూ వెళ్ళాడు.

"నేను నిన్ను ప్రేమిస్తున్నాను థాయిస్. ఆడవాళ్ళంటే నాకసలు గిట్టదు. కాని నీపై నా మనస్సుపోయింది థాయిస్" అన్నాడు.

"అవుతే ఇంతకుముందు నన్నెందుకు ప్రేమించలేదు?" అని అడిగింది థాయిస్.

"ఎందుకంటావా? అప్పుడు నాకు 'చుక్క' పడలేదు థాయిస్! ఆ గుక్కెడు నోట్లో పోసుకునేసరికి నీపై ఎక్కడలేని మోహం పుట్టుకొచ్చింది!" అని చెప్పాడు డోరియస్.

"అవుతే అబ్బాయీ! నేను తాగేది మంచినీళ్ళుగాని మద్యంకాదోయ్ నాయనా! కాబట్టి నేను నిన్ను ప్రేమించలేదు. అందుకు నన్ను క్షమించాలి!" అన్నది థాయిస్.

ఇహ డోరియస్, థాయిస్ చెప్పేది వినిపించుకోలేదు. ఇహ అక్కడనుంచి లేచి రమ్మని డ్రోసీ అతనికి సైగచేశాడు. డోరియస్ మెల్లగా దొర్లుకుంటూ ఇవతలికి వచ్చాడు. తరువాత జెనోథెమిస్ వెళ్ళి థాయిస్ సరసన కూచున్నాడు. ఆవిడను ముద్దుపెట్టుకొన్నాడు.

"నీవు చాలా సత్ప్రవర్తన కలవాడవని అనుకుంటున్నాను—"అన్నది థాయిస్.

"అవును. నేను పరిపూర్ణుడను. పరిపూర్ణుడైనవానికి ఏధర్మసూత్రాలతోనూ పనిలేదు థాయిస్—" అన్నాడు జెనోథెమిస్.

"అవుతే నీ విలా ఒకస్త్రీ కౌగిట్లో వాలిపోయావే, నీఆత్మ పాపపంకిల మవుతున్నదని భయంలేదా?—"అని మళ్ళీ అడిగింది థాయిస్.

"ఈపాపాలూ - పుణ్యాలూ దేహానికే కాని ఆత్మకు లేవు థాయిస్. దేహం భోగాలకు వశంకావచ్చు. ఆత్మ

మాత్రం పరిశుద్ధంగానే ఉంటుంది!"అని జవాబు చెప్పాడు జెనొథొమిస్.

"అవుతే వెళ్ళు! దేహంతోనూ, ఆత్మతోనూ ప్రేమించే వాడే నాకు కావాలి. నీవంటివాడు పనికిరాడు! అస లీ వేదాంతులే అంత! ముసలిగొర్రెలు!–"అని ఈసడించుకొన్నది థాయిస్.

దీపాలు ఒకొక్కటే కొండెక్కుతున్నాయి. తెల్లవారవస్తున్నది. చీకటితెరలు మెల్లమెల్లగా విడిపోతున్నాయి. వెలుగురేఖలు విచ్చుతున్నాయి. తెల్లవార్లూ తప్పతాగి వాగుతున్న అతిథులు ఎక్కడవారక్కడ వాలిపోతున్నారు. నిద్రలేక వారి కళ్ళు వాచిఉన్నాయి. చెరియస్, అరిస్టాబులస్‌లు ఒకరిపక్కన ఒకరు పడుకొని గుఱ్ఱుపెడుతున్నారు. జెనొథొమిస్, ఫిలీనాను కౌగలించుకొని గుండెలకు అదుముకొంటున్నాడు. డోరియస్, తాగినంత తాగి తక్కినమద్యం తెచ్చి డ్రోసీ ఎదురొమ్మున పోశాడు. జెనొథొమిస్ ఆమద్యాన్ని తన నాలుకతో నాకుతూ నవ్వుతున్నాడు. యూక్రెటీస్ వెళ్ళి నిషియస్‌ను రెక్కపుచ్చుకొని లేవదీశాడు. హాలుచివరకు తీసుకొనివెళ్ళాడు. "అబ్బాయీ! నీమనస్సు మనస్సులో ఉన్నదా? లేక పూర్తిగా మైకంవచ్చేసిందా? బుద్ధి సరిగా ఉంటే నా కో విషయం చెప్పు. ఇప్పుడు నీ కేమనిపిస్తున్నది?" అని అడిగాడు యూక్రెటీస్.

"నాకా! మన్మథుడు విహరించే నందనవనం ఎలాంటిదో, ఆడదానిపై మరులుగొనడం అలాంటిది!" అన్నాడు నిషియస్.

"అంటే ఏమిటి అర్థం?" అని మళ్ళీ అడిగాడు యూక్రెటీస్.

"నీకు తెలీదా యూక్రెటీస్! భవనాలలో వసారా ముందు కుండీలలో చిన్న చిన్న కొమ్మలు నాటి ఒక చిన్నవనం తయారుచేసినట్లు తయారు చేస్తారు ఆడవారు. అది స్వర్గంలో నందనవనానికి చిహ్నమని వారి తలంపు. కాని యీ కొమ్మలు ఏంతో సేపు ఉండవు. తళతళ మెరిసినట్టే మెరిసి అంతలోనే వాడి వాలిపోతాయి!" అన్నాడు నిషియస్.

"అంటే, అది దేన్ని సూచిస్తుందంటావు. నిషియస్? అలా వాడిపోయే కొమ్మలకు అంత ప్రాధాన్యం ఇవ్వడం అవివేక మంటావా?" అని తిరిగి ప్రశ్నించాడు యూక్రెటీస్.

"సౌందర్యం ఒక ఛాయ. కోరిక ఒక మెరుపు తీగ. కాబట్టి సౌందర్యాన్ని కోరడం ఎంత వెర్రితనం, యూక్రెటీస్! ఇందులో వివేకం ఎంతమాత్రం లేదు. పైగా నడిచే నడిచే మనిషి ఆ మెరుపును చూచి తట్టుకోలేడు. ఆ మెరుపు మెరిసినప్పుడు ఇహ నీకు నీడ ఏం కనిపిస్తుంది? అది ఆ నీడను మ్రింగి ఊరుకుంటుంది" అన్నాడు నిషియస్.

"నీవు మరీ పసిపిల్లవాడివయిపోతున్నావు నిషియస్! నా మాట విని స్వేచ్ఛగా ఉండు! స్వేచ్ఛ ఉన్నవాడే మనిషి!" అన్నాడు మళ్ళీ యూక్రెటీస్.

"మానవుడు ఈ తనువును ధరించి ఉన్నంత వరకూ స్వేచ్ఛ అనేది ఎక్కడున్నది యూక్రెటీస్, నీ పిచ్చిగానీ!" అని చెప్పాడు నిషియస్.

"అబ్బాయ్! ఇప్పుడు నన్ను చూడు! చూచి చెప్పు- "యూక్రెటీస్' స్వేచ్ఛగా ఉన్నాడంటావు నీవే!" అన్నాడు యూక్రెటీస్.

ఆ వృద్ధుడు డోక చలువరాతి స్తంభాన్ని ఆనుకొని మాట్లాడాడు. ప్రభాత వెలుగురేఖలు వచ్చి మెల్లమెల్లగా అతని ముఖంపై పడుతున్నాయి. అంతలో హెర్మొడోరస్, మార్కస్‌లు అక్కడికి వచ్చారు. అతనికి ఎదురుగా, నిషియస్ ప్రక్కనే నిలుచున్నారు. అలా ఆ నలుగురూ మధుపానంవల్ల కలిగే ఆనందాలూ, దుఃఖాలూ, ఏవీ పాటించకుండా దైవ సంబంధమైన విషయాలపై ముచ్చటించుకొన్నారు.

మార్కస్, యూక్రెటీస్‌ను చూచి "నిజంగా ఈశ్వరుడంటే ఎవరో తెలుసుకోడానికి నీవే తగువయ్యా!" అన్నాడు.

అందుకు యూక్రెటీస్- "జ్ఞానవంతుని హృదయంలో నిజమైన దేవుడున్నాడు!" అని సమాధానం చెప్పాడు.

తరువాత వారి సంభాషణ మృత్యువుపైకి మళ్ళింది.

"ఎల్లప్పుడూ చేసిన తప్పులు దిద్దుకోడానికి ప్రయత్నిస్తున్నాను నేను. నా విధులు నేను శ్రద్ధగా నెరవేరుస్తున్నాను. మృత్యుముఖంలో కూడా నేను వెనుకాడను. 'ఓ ఈశ్వరుడా! ఓ దేవుళ్ళారా! దేవతల్లారా! నా ఆత్మాలయంలో మీరు సుస్థిరులై ఉన్నారు. కాబట్టి నా ఆత్మ కలుషితం కాలేదు. నీ ఉపదేశానుసారం నేను జీవించాను. జీవించాను ప్రభూ!' అని యీశ్వరుని ప్రార్థిస్తూ! చావుకు దోసిలి ఒగ్గుతాను" అన్నాడు యూక్రెటీస్.

ఇలా అంటూ ఆయన రెండుచేతులూ ఆకాశంవైపుచాచి ఒక్కక్షణంసేపు మౌనముద్రలో ఉండిపోయాడు. తరువాత మళ్ళీ ఆనందపరవశుడై– "ఓయీ యూక్రెటీస్ ! ఇహ నీవు యీతనువు చాలించు. చెట్టునుండి పండిన పండు రాలినట్లు యీ దేహంనుండి విడిపో ! నిన్ను కన్న యీవృక్షానికీ, నిన్ను పెంచి పెద్దచేసిన యీ భూమాతకూ ప్రణమిల్లి వెళ్ళిపో !" అని పలికాడు.

ఇలా అంటూ యూక్రెటీస్, తటాలున తన మొలలో నుంచి బాకుదూసి గుండెలలో పొడుచుకొన్నాడు.

యీదృశ్యం చూస్తున్నకొందరు వెంటనే అక్కడికి పరుగెత్తుకొనివచ్చారు. వచ్చి అతనిచెయ్యి పట్టుకొన్నారు. కాని అప్పటికే బాకు అతని గుండెల్లోకి దూసుకొనిపోయింది. అతను మరణించాడు. హెర్మోడోరస్, నిషియస్‌లు రక్తం కాల్వలు కడుతున్న అతని దేహాన్ని మోసుకొనివచ్చి ఒక సోఫామీద పడుకోబెట్టారు. దాస దాసీ లంతా గొల్లుమన్నారు. అతిథులు కేకలుపెట్టారు. కలతనిద్రలో ఉన్న కొందరు యీగోలకు ఎగిరిపడి లేచారు. తెరలచాటున జంటలు, జంటలుగా పడుకొనిఉన్న ప్రేయసీప్రియులు, కొట్టినట్లు లేచి ఏడ్పు లంకించుకొన్నారు. వృద్ధుడైన కొట్టాకు అప్పుడే కునుకుపట్టింది. అతను ఉలిక్కిపడి లేచి శవందగ్గరికి వెళ్ళాడు. గాయం పరీక్ష చేశాడు.

"పిలవండయ్యా, మనవైద్యుడు – అరిస్టయిస్‌ను వెంటనే పిలవండి !" అని కేకపెట్టాడు.

3

తెల్లగా తెల్లవారింది. సూర్యోదయ మయింది. పొడుగ్గా ఉన్న నగరవీధి. ఆ వీధికి ఆ తట్టూ - ఈ తట్టూ బారులు తీర్చి కట్టిన స్తంభాలు. స్తంభాల కొట్ట-కొసన, గుమ్మటంలా ఉన్న అలెగ్జాండర్ గోరీ. గోరీపైన తళతళ మెరిసిపోతున్న ఎండ పొడ. వీధిలో పిట్ట-పురుగు లేదు- ఖాలి బాటలో అక్కడక్కడ చెదురు చెదురుగా తెగిపడి ఉన్న పూలమాలలు, కొడిగట్టి కొండెక్కుతున్న దీపాలు. సము మీదినుంచి వచ్చే చల్లని-మెల్లనిగాలి. వఫ్నూటియస్ ... లలో ఎక్కడలేని అసహ్యత, చిరాకు గోచరిస్తున్నాయి. తాను ధరించిన విలువగల పైడుపుచు తీసి, చించి కాళ్ళక్రింద వేసి త్రొక్కిపారేశాడు.

"ఇంతసేపూ వాళ్ళవాగుడు విన్నావుటమ్మా థాయిస్! నోట ఉచ్చరించరాని నానా ఛండాలపు మాటలన్నీ మాట్లాడారు. అయినదానికీ, కానిదానికీ ఆ భగవంతుని పేరు అడ్డం పెట్టుకొన్నారు. అయి పుట్టినదానికే ఆయన నామం తీసుకొచ్చారు.పాపపుణ్యాలు లేవన్నారు.మంచిచెడ్డలు కావన్నారు. అక్కడ మృత్యువు విలయతాండవం చేసింది. అజ్ఞానం, అవినీతి, అంధకారం, అన్యాయం-అన్నీ విచ్చలవిడి విహరించాయి. ఎంత దారుణమైన విషయం థాయిస్! వారంతా తుచ్ఛులు, నీచులు, పురుగులకంటెకూడా హీనులు. కామాంధకాములై, భో

లాలసులై, ఇష్టంవచ్చినట్లు తిని, తాగి పొర్లిగింతలు పెట్టారు. జంతువులకంటె అన్యాయంగా ప్రవర్తించారు. ఇంతటి ఘోర కలి నే నెక్కడా చూడలేదు థాయిస్! వీళ్ళు వేదాంతులా! వీళ్ళు జ్ఞానులా! ఛీ, ఛీ! తప్ప తాగి ఎన్నెన్ని వాగారో చూడు! ఆ తివాచీమీద ఎలా దొర్లారో చూడు! ఎలా కక్కారో చూడు! అయ్యో, భగవంతుడా! ఏమిటీ ఘోరకలి! నీవు ఉండే ఇన్ని చేయిస్తున్నావా స్వామీ? అమ్మా, థాయిస్! ఆ దృశ్యమంతా ఒక్కతడవ జ్ఞాపకంతెచ్చుకో తల్లీ. ఇలాంటి మనుషులు నీ కెక్కడ దొరికారమ్మా? వేదాంతులు-వేదాంతులని-వీళ్ళమధ్యకా నీవు వెళ్ళేది? మదపిచ్చి పట్టి వాగుతున్న వీళ్లా వేదాంతులు? వీళ్ళేనా జీసస్ క్రైస్టను గురించీ, ఈశ్వర తత్త్వాన్ని గురించీ మాట్లాడేది? వాళ్ళ వెకిలి నవ్వులు, వాళ్ళ కేకలు, వాళ్ళ పాపపు చూపులు ఒక్కమాటు జ్ఞాపకం తెచ్చుకోమ్మా థాయిస్. వీళ్ళేనా నీకు తగిన స్నేహితులు థాయిస్! ఇంకా వీళ్ళమధ్య నీవు తిరగా లను కుంటున్నావా? పాపాత్ములు, దుష్టచిత్తులు, మదపిచ్చి పట్టి కామం కళ్ళకు ఎగతట్టి పళ్ళూపై కానక సంచరించువారు అయిన వీరితోనా నీకు పొత్తు? నీవూ వీరిలాగే బ్రతకా లను కుంటున్నావా థాయిస్?" అని ఆవేదనతో అడిగాడు పఫ్నూటియస్.

విందులో జరిగిన దృశ్యాలన్నీ ఒక్కమాటుగా థాయిస్ కనులముందు పొడగట్టాయి. ఎక్కడలేని భయంతో చిలుకంపోయింది. ఆరాత్రి తాను విన్నవీ, కన్నవీ అన్నీ తపించుకొన్నది. వారి ప్రవర్తన, వారి మాటలు, వారి అమాను

షమైన చర్యలు, ద్వేషం, అసూయ వెళ్ళకక్కే వారి చూపులు, వృథాగా, గంటలతరబడి గడచిన ఆకాలం–అన్నీ, ఆపిల్లకు జ్ఞాపకం వచ్చాయి. సుడిగాలి తాకిన చిరులతలా ఊగిపోయింది. పదే పదే నిశ్వసించింది.

—"నాయనా! నేను మృత్యుముఖంలో పడి తన్నుకొంటున్నాను. నా మనస్సుకు శాంతి లేదు. నాకు విశ్రాంతి లేదు. నాకు శాంతి ఎక్కడ స్వామీ? నే నెక్కడికి వెళ్ళాలి? ఏం చెయ్యాలి? నా ఒడలంతా భగ్గున మండుతున్నది. తల తిరిగి పోతున్నది. నా చేతులు స్వాధీనం తప్పిపోతున్నాయి స్వామీ! ఇహ వీటితో ఏఆనందాన్నీ అందుకోలేను స్వామీ!" అన్నది.'

పఫ్నూటియస్ కరుణ, జాలి నిండిన నయనాలతో ఆవిడవంక తదేకంగా చూచాడు– "ధైర్యం తెచ్చుకో అమ్మాయీ! నీకు శాంతి లభించేకాలం వస్తుంది. ఆ చల్లని–మెల్లని సమయం సమీపిస్తుంది తల్లీ–" అన్నాడు.

వారు థాయిస్ భవనందగ్గరికి వచ్చారు. ప్రహరీగోడ అవతల గాలికి మెల్లగా చలిస్తున్న చెట్లు, వాటిమధ్య ఎత్తుగా ఉన్న వనదేవత విగ్రహం కనుపిస్తున్నాయి. భవనం బయట ఉన్న చౌకు నిర్మానుష్యంగా ఉంది. చౌకులో ప్రతిష్ఠించిన పాలరాతి విగ్రహాలు, వాటిముందు కూచోడానికి ఏర్పరచిన ఆసనాలు, ఎండపొడలో తళతళలాడుతున్నాయి. థాయిస్ వెళ్ళి ఒక బండమీద చతికిలబడింది. ఆ సన్యాసివంక ఆతురతగా చూస్తూ– "న న్నేం చెయ్యమంటారు స్వామీ?–" అని అడిగింది.

"నిన్ను వెదుకొంటూ ఎవరు వచ్చారో వారివెంట వెళ్ళు థాయిస్. ఆ వ్యక్తి నీ పాపపు జీవితంనుంచి నిన్ను విడదీస్తాడు. నీ బ్రతుకును మారుస్తాడు. విను, థాయిస్! అలెగ్జాండ్రియాకు పశ్చిమదిశన - సముద్రానికి చేరువగా సన్యాసినుల మఠం ఒకటి ఉన్నదమ్మా. అది జ్ఞానమందిరం. దివ్యజ్ఞానానికి దానిని మించిన ప్రదేశంలేదు. అక్కడున్న స్త్రీలంతా యోగినులు. వారిముందు ఋషికన్యలు చాలరు. వారి దేహాలు ఇక్కడ, ఆత్మలు అక్కడ - ఆ స్వర్గంలో - వారు నిరుపేదలు. నిరాడంబరులు. జీసస్‌కు శిష్యురాండ్రు. ఆ భగవంతుడు వారికి నిత్యం ఏదో రూపంలో దర్శనమిస్తుంటాడమ్మా. ఆ పుణ్య స్త్రీల దర్శనం లభించడమే మహద్భాగ్యం. నేను నిన్ను అక్కడికి తీసుకెడతాను. ఇవాళ తీసుకెళ్ళి వారిదగ్గర వదిలిపెడతానమ్మా. వారు నిన్ను స్వంత చెల్లెలితో సమానంగా చూచుకొంటారు. అక్కడ నీకు ఏ చీకూ - చింతా ఉండదు. నీ చిక్కులన్నీ తీరిపోతాయి. నీకు శాంతి లభిస్తుంది తల్లీ. ఆ మఠంలో పుణ్యాత్మురాలైన ఆల్బినా ఉన్నది!- 'రావే నా చిట్టితల్లీ!'- అంటూ నీకు జ్ఞానోపదేశం చేస్తుంది"- అని చెప్పాడు పఫ్నూటియస్.

రాయివేశ్య - థాయిస్ ఆశ్చర్యచకితురాలైంది. "ఆల్బినా! సీజర్ కుమార్తె! కారస్ చక్రవర్తి మేనకోడలు - అక్కడున్నదా?-" అని నివ్వెరపోతూ అడిగింది.

"అవునమ్మా, ఆమే! ఈ భూమండలాధిపతులలో ఒకనికుమార్తె అగు ఆల్బినా, మహాయోగిని అయి అక్కడ

ఉంటున్నది. ఆమె నీకు మాతృదేవిగా ఉంటుందమ్మా" అన్నాడు పఫ్నూటియస్.

థాయిస్ అక్కడనుంచి లేచింది. "నన్ను ఆల్బినావద్దకు తీసుకువెళ్ళండి స్వామీ" అన్నది.

పఫ్నూటియస్ తాను కృతకృత్యుడనైనానను కొన్నాడు.

"అలాగేనమ్మా, తప్పకుండా నిన్ను అక్కడికి చేరుస్తాను. అక్కడ నిన్నొక చిన్నగుహలో కూచోబెడతాను. చేసినపాపాలు తలుచుకొని దుఃఖిద్దువుగాని. పశ్చాత్తపిద్దువుగాని. నీవు బయటికి రాకుండా ఆగుహద్వారం మూయిస్తాను. లోపల నీవొక ఖైదీలా ఉండిపోదువుగాని. ఎప్పుడు నీకలుషితాలన్నీ కడిగివేసి ఆప్రభువు - జీసస్ క్రీస్తు - నీకు దర్శనమిస్తాడో అప్పుడే నేను మూయించిన గుహద్వారం దానంతట అది పడిపోతుంది. జీసస్ ప్రభువు దర్శనమిస్తాడా అని సందేహించకు. ఆవిషయం నీకే తెలుస్తుంది తల్లీ. ఆప్రభువు వచ్చి స్వయంగా నీ కన్నీళ్ళు తుడుస్తాడు. బ్రహ్మానందాన్ని ప్రసాదిస్తాడమ్మా!" అన్నాడు.

థాయిస్ మళ్ళీ రెండవసారి - "నన్ను ఆల్బినా దగ్గరికి తీసుకవెళ్ళండి స్వామీ-" అని కోరింది.

పఫ్నూటియస్ హృదయం ఆనందంలో పొంగులెత్తింది. చుట్టూ కలయచూచాడు. సృష్టిలోని అందచందాలన్నీ మళ్ళీ ఆయన కనులముందు పొడగట్టాయి. సృష్టిపై చిత్రాల్నీ, ఈశ్వర ప్రభావాన్నీ తలచుకొని ఆనంద

పరవశుడైనాడు. కనులు చెమ్మగిల్లాయి. చెక్కిళ్ళు చెమ ర్చాయి. అకస్మాత్తుగా ఆయనదృష్టి థాయిస్ భవనద్వా రంపై పడింది. ఆగృహంలో గల భోగభాగ్యాలు, ఆసుందర ఉద్యానవనం, సరోవరం, ఆపరిమళాలు, అక్కడ నిరంతరం సాగే ఖులాసాలు, విలాసాలు, ఇవన్నీ మళ్ళీ ఆయనకుజ్ఞాపకం వచ్చాయి. ఆపాపాలన్నీ తలంపుకు వచ్చాయి. పరిశుద్ధమైన భగవంతుని సృష్టిని ఈపాపపంకిలమంతా ఆవరించి కలుషితం చేస్తున్నదని బాధపడ్డాడు. మనస్సు కలవరంతో కొట్టుకొన్నది. భయంతో కంపించిపోయాడు.

"థాయిస్! ఇహ మనం ఇక్కడ ఒకక్షణంకూడా ఉండవద్దు. వెనుదిరిగి చూడవద్దు. వెంటనే వెళ్ళిపోదాం థాయిస్. నీ యీ భోగభాగ్యాలు, వస్తుసంపదలు,- ఇవన్నీ గతంలో నీవుచేసిన నేరాలకు సాక్ష్యంగా ఇక్కడ ఉండి పోతాయి. ఈ పందిరిమంచాలు, పట్టుపరుపులు, దిండ్లు, తివా చీలు, చందనాది పరిమళద్రవ్యాలు, దీపాలు, ధూపాలు, భవ నాలు, సుందరవనాలు- ఇవన్నీ నీ పాపాలకు చిహ్నంగా, నీ అపకీర్తికి గుర్తుగా ఇక్కడ ఉండిపోతాయి థాయిస్. ఇవన్నీ వదిలేసి వెడదాం;రా. ఈబల్లలు, కుర్చీలు, ఈ సిరిసంపదలు - ఇవేకా నిన్ను నిరంతరం వెర్రిమోహాంలో ముంచివేసింది. వీటివల్లనే నీవు తెంపులేకుండా తీరని, ఆరని మోహ దాహాలతో వేగిపోతున్నావు, ఊగిపోతున్నావు. ఈ ఒక్కొక్క వస్తువులో ఒక్కొక్కదయ్యం దాగిఉన్నది థాయిస్! ఈభూతాలు నిన్ను నిముషం నిద్రపోనివ్వవు. నామాట నమ్ము థాయిస్. ఈసంప దలను సర్వనాశనంచెయ్యి. ఈ భోగాలను ధ్వంసం చెయ్యి.

నీ పాపాలకూ, పరాభవాలకూ ఇది చరమాంకం' థాయిస్. నా మాట విని వేగిరపడు. ఇంకా సగం పూటుమణిగే ఉంది. నీ దాసీలు ఇంకా నిద్ర లేవనే లేదు ఎవరూ చూడకముందే, ఈ భయంకరమైన వస్తు వాహనాలను దహించివేసి వెళ్ళిపోదాం, రా. !" అన్నాడు.

"మీ ఇష్టం వచ్చినట్లు చెయ్యండి స్వామీ. ప్రాణం లేని ఈ విలాసవస్తువులలోనయితం దయ్యాలు దాగిఉన్నాయని నాకూ తెలుసు. అవి నన్ను ఎలా వెంటాడి వేధిస్తున్నదీ నేను అప్పుడప్పుడు గమనిస్తూనే ఉన్నాయి. చూడండి స్వామీ, మన భవనద్వారంలో నగ్నంగాఉన్న ఈ వనదేవత విగ్రహం ఉన్నదే - ఇది ఏం చిత్రం చేసిందో తెలుసా స్వామీ? ఒకనాడు ఈ విగ్రహం తల ఇటు త్రిప్పిచూచి మళ్ళీ యథా ప్రకారం నిలుచుని ఉండడం నేను కళ్ళారా చూచాను! అప్పుడు నేను భయంతో ఎలా కంపించిపోయూ నను కొన్నానూ? ఈ విచిత్రమైన కథ నిషియస్‌తో చెప్పాను కూడా. కాని అతను నన్ను ఎగతాళి పట్టించాడు. ఏమైనప్పటికీ ఈ విగ్రహంలో ఏదో మాయో, మంత్రమో ఉన్నది. సందేహం లేదు.నగ్నంగాఉన్న ఈ స్త్రీ విగ్రహం చూచినప్పుడు, ఎంతటి విరాగికైనా మనస్సు చలిస్తుంది స్వామీ. ఇది నాకు అనుభవంకూడా. ఈ విగ్రహాన్నిచూస్తూ, ఎందరు పురుషులు నన్ను తమ కౌగిళ్ళలోకి తీసుకొని ఉన్మత్తులైపోయినారో చెప్పలేను. అయితే ఇంత సుందరమైన విగ్రహం ఎవ్వరూ చేయలేరు. దీని విలువ మనం లెక్కకట్టలేం. అలాగే నా గృహంలోఉన్న ప్రతివస్తువూ అపురూపమైనది, అద్భుతమైనది.

ఈ తెరలు, తివాచీలు, బొమ్మలు,-ఇవన్నీ ఎంతెంత ఖరీదయినవని! ఇంకా నా దగ్గర ఎన్నెన్నో బంగారు, వెండి గిన్నెలు - పాత్రలు - వస్తువులు అనేకంగా ఉన్నాయి. వీటిని ధ్వంసం చెయ్యాలంటే మనిషి అన్నవాడికెవడికీ మనస్సు ఒప్పదు స్వామీ! నాకు తెలుసు. అయినా మీరు అన్నీ తెలిసినవారు. నేను మీ ఆజ్ఞకు బద్ధురాలను. మీకు ఏది అవసరమనితోస్తే అది చెయ్యండి స్వామీ. అభ్యంతరపెట్టను."- అని చెప్పింది థాయిస్.

ఇలా చెపుతూ ఆవిడ సన్యాసివెంట తన భవనద్వారం దగ్గరికి వెళ్ళింది. ద్వారానికి అనేక పుష్పహారాలు వ్రేలాడుతున్నాయి. తలుపు తీసుకొని లోపలికి వెళ్ళగానే ఆవిడ తన పరిచారకుణ్ణి పిలిచింది. ఇంట్లో ఉన్న తన దాసీలను, ఇతర సేవకులను-అందరినీ పిలవమని చెప్పింది. వంటశాలలో పనిచేసే నలుగురు పరిచారకులు ముందుగా వచ్చారు. ఆ నలుగురూ హిందువులు. పచ్చగా ఉన్నారు. ఆ నలుగురికీ ఒక్కొక్క కన్ను గ్రుడ్డి! ఆ నలుగురితో థాయిస్ వేగలేకపోతోంది. కాని ఒంటికంటితో ఉన్న ఆ నలుగురు పరిచారకులనూ ఆవిడ సరదా కోసం అట్టిపెట్టుకొన్నది. నలుగురిదీ ఒకే జాతి, నలుగురికీ ఒకే రోగం! ఆ నలుగురినీ ఒకచోటికి చేర్చడం బ్రహ్మప్రళయం అవుతుంది. వారు నలుగురూ టేబిల్ దగ్గరికి వచ్చారు.చేతులు కట్టుకు నిలుచున్నారు. తమ యజమానురాలయిన థాయిస్‌ను, ఆవిడ ప్రక్కనఉన్న సన్యాసిని చూచి, నివ్వెరపోయారు. ఆ నలుగురినీ తమ తమ కథలను చెప్పమని ఆజ్ఞాపించింది థాయిస్. ఒక్కొక్కరే తమ కథ చెప్పారు.

రువాత ప్రక్కకు వెళ్ళి మాట్లాడకుండా చేతులు కట్టుకొని
లుచున్నారు. ఆ తరువాత వారికి సహాయంగా పని చేస్తున్న
రిచారకులు వచ్చి నిలుచున్నారు. పిమ్మట అశ్వరక్షకుడు,
మోతగాండ్రు, వార్తాహరుడు, కాపలావాండ్రు, ఇంకా ఇంకా
న్నచిన్న పనులు చేసే సేవకులు-వీరంతా వచ్చారు. ఇరు
రు తోటమాలీలు, భయంకరంగా అగుపిస్తున్న ఆరుగురు
గ్రోలు, భీమబలుడుగా ఉన్న ఒక అంగరక్షకుడు-వచ్చారు.
రువాత ముగ్గురు గ్రీకు బానిసలు వచ్చినిలుచున్నారు. వారిలో
కడు కవి, ఒకడు గాయకుడు, మరొకడు వైయ్యాకరుణుడు!
రంతా వాకిటిముందు వరుసగా ఎవరిస్థానాల్లో వారు నిలు
న్నారు. వారిలో ఒక నీగ్రో స్త్రీకూడా వచ్చి చేరింది. మనిషి
లా వింత గొలుపుతోంది. చక్రాల్లాంటి పెద్దకండ్లు, గ్రుడ్లు
రికే తిప్పుతోంది. చేటంత చెవులు. ఆచెవులకు ఇంతింత
డుగు పోగులు ధరించింది. చివరకు ఆరుగురు నీగ్రో
మ్మాయిలు వచ్చి నిలువబడ్డారు. మెల్లగా కాళ్ళీడ్చు
ంటూ, ముసుగులు సవరించుకొంటూ, మెడలలో బంగారు
లుసులు గలగల లాడించుకొంటూ వచ్చారు. ఆ పిల్లలు
తెల్లగా, ఎంతో అందంగా ఉన్నారు. వారి కనులలో ఏదో
పాదం తొంగిచూస్తోంది. ఇలా తన దాస దాసీబృందమంతా
చ్చి చేరిన తరువాత థాయిస్ ఇలా అన్నది:

"మీరంతా ఈయన ఏదిచెపితే అది చెయ్యండి.
యన మహానుభావుడు. సాక్షాత్తూ భగవంతుడు! ఆయన
జ్ఞ ఉల్లంఘించారా - నామ రూపాలు లేకుండా పోతారు.
గ్రత!-" ఇలా అంటూ పఫ్నూటియస్‌ను చూపింది.

పుణ్యాత్ములలో ఎన్నెన్నో మహిమ లుంటాయని ఆమె విన్నది. వారు తమచేతిలో ఉన్నదండం నేలమీదకొట్టి ఏమాట అంటే ఆమాట అయితీరుతుంది! ఇది ఆవిడ నమ్మకం. అందుకే అలా చెప్పింది.

పఫ్నూటియస్ అక్కడున్న దాసీపిల్లలను, గ్రీకు సేవకులను వెళ్ళిపొమ్మని చెప్పాడు. తరువాత తక్కినవారిని చూచి ఇలా అన్నాడు.

"కట్టెలు తీసుకొచ్చి ఈభవనంముందు ఒకపెద్దచితి పేర్చండి. ఈఇంట్లో ఉన్న వస్తువులు, సామగ్రులు - అన్నీ తెచ్చి మీఇష్టంవచ్చినట్లు ఆచితిలో పడేసి నిప్పంటించండి"

ఈమాట విని పరిచారకులందరూ నిర్ఘాంతపోయారు. ఒక్కరినోటా మాటరాలేదు. ఒక్కరూ కదలలేదు. అందరూ తమ యజమానురాలివంక చూచారు. తరువాత ఒకరివంక ఒకరు చూచుకొన్నారు - "ఏమిటిది? నవ్వులాటలకు అంటున్నారా?" అన్నట్లు ఒకరి నొకరు మోచేతులతో పొడుచుకొన్నారు. కనుసైగలు చేసుకొన్నారు.

"ఊఁ! కానియ్యండి!" అని మళ్ళీ ఆజ్ఞాపించాడు పఫ్నూటియస్.

ఆ పరిచారకులలో చాలామంది క్రైస్తవులు. అంచేత పఫ్నూటియస్ ఆజ్ఞను వారు ఉల్లంఘించడానికి జంకారు. వెంటనే ఇంట్లోకి వెళ్ళి చితిపేర్చడానికి అవసరమైన కట్టెలు వగైరా సంపాదించడానికి పూనుకొన్నారు. తక్కినవారు కూడా వారిని అనుసరించారు. అవును; నిజానికి వారంతా

ేసవారు. బానిసలుగా బ్రతికేవారు. భోగభాగ్యాలంటే
వారికే గిట్టవు. వాటిని ధ్వంసం చెయ్యడం వారికి ఇష్టమే.

ఇలా వారంతా కట్టెలు మొదలయినవి తెచ్చి చితి
పేరుస్తుండగా, పఫ్నూటియస్ థాయిస్‌తో ఇలా అన్నాడు:

"థాయిస్! ఒకమాటు నాకో ఆలోచన తట్టింది తల్లీ.
అలెగ్జాండ్రియాలో ఇంకా ఒకదేవాలయం మిగిలిఉంది. దాని
ఇంకా ధ్వంసం చెయ్యలేదు. ఎంతో పవిత్రమైన ఆలయం అది.
ఆ ఆస్తి పాస్తులన్నీ ఆ ఆలయాధికారులపరం చేస్తే బావుం
టుందనుకొన్నాను. అన్యాయార్జితమైన-ఈ పాపపు సొమ్ముకు
ఓ ఉత్తమస్థితి కల్పించా లనుకొన్నాను. నీ సొమ్మును
అక్కడ సద్వినియోగ పరుస్తారు. నీ ఆస్తియావత్తూ పేదలకూ,
అనాథలకూ పంచిపెడతారు థాయిస్! కాని మళ్ళీ ఆ ఆలో
చన మానుకొన్నాను. భగవంతుడు నా మనస్సు మార్చాడు
థాయిస్. నీ పాపపు ఆస్తితో దేవాలయాన్ని అపవిత్రం
చెయ్యడం, ఆ జీసస్ ప్రభువుకు అపచారం చేసినట్లే అవు
తుంది. నీ సిరిసంపదలన్నీ అగ్నికి ఆహుతి చెయ్యడమే ఉత్తమం.
ఈ నీ చీని - చీనాంబరాలు, ఆభరణాలు - కామపీడితులైన
పురుషులు ఎందరు ఎన్నివిధాల తాకారో కదా! ఎన్నెన్ని
కౌగిళ్ళల అలలమధ్య ఈ వస్తువులన్నీ ఉయ్యాల లూగాయో
కదా! కామతృష్ణాపీడితులగు పాపాత్ములు వీటన్నింటినీ ఎన్ని
సార్లు పదేపదే ముద్దాడి దాహం తీర్చుకొన్నారో కదా!
వీటిని అగ్నికి ఆహుతిచెయ్యడం తప్ప వేరే మార్గంలేదు
థాయిస్. అగ్నిహోత్రుడు తన నాల్కలు చాచి వీటన్నిం
టినీ ఇప్పుడు అందుకొంటాడు......ఏమర్రోయ్, సేవకులూ!

త్వరగా - త్వరగా కానియ్యండి. ఈ కట్టెలు చాలవు. ఇంకా పట్టాండి. ఊఁ... నిప్పు నాలుగుప్రక్కలా ముట్టించండి..."

పఫ్నూటియస్ ఆజ్ఞలను థాయిస్ శిరసావహించింది. హిందువులయిన సేవకులు పొయ్యిలోనుంచి నిప్పు పట్టు కొచ్చారు. పెద్దఎత్తుగా మండె పేర్చినట్లు పేర్చిన చితికి నాలుగుప్రక్కలా నిప్పు ముట్టించారు. ఇహ నీగ్రో పరిచారకులు గబ గబవెళ్ళి పెద్దపెద్ద దంతపుపెట్టెలు, చేవమ్రానుతో చేసిన మందసాలు, దేవదారు చెక్క పెట్టెలు - ఇవన్నీ మోసుకొచ్చి అమాంతం వాటిని చితిలో పడేశారు. కొన్ని పెట్టెలు పగులగొట్టి, మూతలు తెరిచి వాటిల్లో ఉన్న రకరకాల ఆభరణాలు, రత్నహారాలు, ముత్యాలహారాలు, పగడపు దండలు- ఇంకా వజ్రాలహారాలు - అన్నీ నిప్పుల్లోకి విసిరేశారు. చితి నాలుగుప్రక్కలా నిప్పంటుకొన్నది. పెద్దపెట్టున సెగలు - పొగలు బయలువెడలాయి. నాలుగుదిక్కులా పొగ క్రమ్ము కొన్నది. తరువాత చిటపటమని ధ్వనులుచేస్తూ మంటలు పైకె గసి రాసాగాయి. ఏదో బ్రహ్మరాక్షసి పెడబొబ్బలు పెడు తున్నట్లుగా ధ్వనులు పుట్టుకొచ్చాయి. అగ్నిజ్వాలలు అంత కంతకూ మింటికెగసి, మిడిసిపడుతున్నాయి, విలువకట్ట సాధ్యం కాని థాయిస్ సిరులన్నీ అగ్నికి ఆహుతి అయిపోతున్నాయి. సేవకులు ఇంకా ఉల్లాసంగా, ఉత్సాహంగా పనిచెయ్యసాగారు. ఇంట్లోకీ - బయటికీ పరుగులు తీస్తున్నారు. విలువైన తివాచీలు, అందచందా లుట్టిపడే తెరగుడ్డలు, పట్టుపరుపులు, దిండ్లు, బాలీసులు, వెండి, బంగారు జరీఅంచులతో కుట్టిన థాయిస్‌దుస్తులు, వస్త్రాలు, మేలిముసుగులు, ఓణీగుడ్డలు,

గౌనులు, బంగారుపూలు పొదిగిన పందిరిమంచాలు, పడక కుర్చీలు, దివ్యమైనపీటలు, ఆసనాలు, దంతపు బొమ్మలు, చందనపు ప్రతిమలు, ఎన్నెన్నోరకాల నగిషీ పనులుచేసిన కొయ్య సామానులు, ఇంకా చిత్రవిచిత్రములైన నానారకాల విలాస వస్తువులు – అన్నీ తెచ్చి అగ్నిగుండంలో - పడేశారు. ఎంతో ఆనందంగా వారా పనిచేస్తున్నారు. ముగ్గురుసేవకులు వెళ్ళి వనదేవతల విగ్రహాలను తెచ్చారు. వాటిని ముక్కలు ముక్కలుచేసి అవతల పారవేశారు. ఇంతసుందరమైన విగ్రహాలను ఎక్కడా చూడం. అవి అలా ధ్వంసం అయిపోతోంటే ఇంట్లోఉన్న దాస దాసీజనమంతా గొల్లుమని ఏడ్చారు.

ఆ తరుణంలో థాయిస్ ప్రత్యక్షమైంది. జుట్టు పైకి ఎగత్రోసి ముడివేసుకొన్నది. కాళ్ళకు జోళ్లు లేవు. చాలా ముతకగా, అసహ్యంగా ఉన్న దుస్తులు ధరించింది. కాని అదేమిటో ఆ దుస్తుల్లో ఆవిడ మరీ అందంగా కనుపిస్తున్నది. ఆవిడ కులుకు-తళుకు - ఏవీ మాయులేదు. చూచేవారిని మోహంలో ముంచివేస్తున్నది. ఒక్కమాటు తాకి చూడాలని బుద్ధి పుట్టిస్తున్నది. ఆవిడ వెనకాలే ఒక తోటమాలి, దంతంతో చేసిన మన్మథుడి విగ్రహం ఒకదాన్ని కనుపించకుండా మోసుకొని వచ్చాడు.

థాయిస్ అతన్ని ఆగమని చెప్పి పఫ్నూటియస్‌ను సమీపించింది. ఆ విగ్రహం ఆయనకు చూపింది.

"స్వామీ! దీనినికూడా నిప్పుల్లో పారెయ్యమంటారా స్వామీ? ఇది ఒక అద్భుతమైన విగ్రహం. ఇందులో అసాధారణమైన పనితనం ఉంది. ఇది ఎంత బరువున్నదో-అంత

బరువుగల బంగారం ధరకు నూటురెట్లు ఎక్కువ ధర దీనికి పలుకుతుంది దీనిని 'పోగొట్టుకొంటే' వచ్చేనష్టం ఇంతా - అంతా కాదు. మళ్ళీ ఇంతటి మనోహరమైన విగ్రహం తయారు చేసే శిల్పిని ఈ భూలోకంలో మరెక్కడా కానం. మరొక విషయంకూడా ఉంది స్వామీ. ప్రేమకు చిహ్నమైన కామ దేవుని విగ్రహం ఇది. కనుక దీనిని ధ్వంసం చెయ్యడం మంచిది కాదు ప్రేమ అనేది ఒక మహోత్కృష్టమైన విషయం. ఒక వేళ నేను పాపమే చేసిఉన్నట్లయితే-అందుకు ఈ దేవుడు; బాధ్యుడు కాడు. ఆయనకు వ్యతిరేకంగా నేను నడిచి ఉండ వచ్చు కాని ఆయన్ను ఆధారంగా చేసుకొని పాపానికి ఒడిగట్ట లేదు. ఈ పాపపు పనులు చెయ్యడానికి ఆయన ఏవిధంగానూ కారణం కాదు. చూడండి స్వామీ! ఈ కామదేవుని విగ్ర హం ఎంత ముద్దొస్తున్నదో చూడండి! నన్ను ప్రేమించిన నిషియస్ ఒకనాడు ఈ విగ్రహం తీసుకొని నాదగ్గరకి వచ్చాడు "యీ విగ్రహం నన్ను నిరంతరం నీకు జ్ఞాపకం చేస్తూ ఉంటుంది" అని చెప్పి ఇచ్చాడు. కాని అదేమిటో యీ విగ్ర హంవల్ల నాకు నిషియస్ ఎప్పుడూ జ్ఞాపకం రాలేదు. పూర్వం నాకు తెలిసిన లోలియస్ అనే యువకుడు ఎప్పుడూ జ్ఞాపకానికివచ్చేవాడు స్వామీ! ఇప్పటికే యీ అగ్నిగుండంలో కావలసినన్ని వస్తువులు, సిరిసంపదలు కుమ్మరించారు. యీ విగ్రహం ఒక్కటిమాత్రం నాకు మిగల్చండి స్వామీ. దీనిని ఏ మఠంలోనో అట్టిపెడతాను. దీనిని చూచినవారి హృద యాలు ఈశ్వరునిపైకి మళ్ళుతాయి. అవును స్వామీ, ప్రేమ

అనేది సహజంగా భగవంతుని సాన్నిధ్యానికి త్రోవ తీస్తుంది"
అని చెప్పింది.

ఇహ యీ విగ్రహానికి ఏముప్పూ లేదు లెమ్మను కొన్నాడు తోటమాలి. పసిపిల్లను చూస్తున్నట్లు దానివంక చూస్తూ ముసిముసి నవ్వులు నవ్వుకొన్నాడు. కాని అంతలోనే పప్నూటియస్, అతని చేతిలోనుంచి ఆ బొమ్మను గభాలున లాక్కొని నిప్పుల్లోకి విసరివేశాడు-

"చాలు థాయిస్, చాలు! చేసినంతవరకూ చాలు! ఆ నిషియస్ ముట్టుకోవడంవల్ల ఈ విగ్రహం నానా విష పూరితమైపోయిందమ్మా!" అని బిగ్గరగా అరచాడు.

తరువాత ఆయన తన రెండుచేతులతో అక్కడున్న తళ తళ మెరిసే దుస్తులు, బంగారపు చెప్పులు, రకరకాల అద్దాలు, రంగురంగుల దువ్వెనలు, దీపాలు, దీపపు సెమ్మెలు, వీణలు, తంబురలు, వేణువులు - ఇంకా రకరకాల వాయిద్యాలు - అన్నీ గబగబ తీసుకొని అగ్నిగుండంలోకి విసరివేశాడు. యీ వస్తువు, ఆవస్తువు అని లేదు. విలువైన వస్తువులన్నీ ఆ విధంగా నిప్పుల్లో కాలి బూడిద అయిపోతున్నాయి. హోమగుండంలా అగ్నిగుండం అంతకంతకూ ప్రజ్వరిల్లుతున్నది. అగ్నిహోత్రుడు సంతోషంతో పొంగిపోతున్నాడు. దాస దాసీ జనమంతా ఆ చితిచుట్టూ ప్రదక్షిణంచేస్తూ ఆనందంతో నృత్యం చేయసాగారు.

తరువాత ఇరుగు పొరుగువారు ఒక్కొక్కరే మేలుకొన్నారు. నగర వీధిఅంతా సెగలుపొగలు కమ్ముకొనిరావడం

చూచారు. ఊపిరాడక కిటికీలు, తలుపులు తెరిచారు! నిద్ర కళ్ళు తుడుచుకొని "ఏమిటీ, సెగలు - పొగలు? ఎక్కడనుంచి వస్తున్నాయి?" అని పరిశీలించి చూచారు. దుస్తులుకూడా ధరించకుండా ఆదుర్దాగా మేడలు, మిద్దెలు దిగి వీధిలోకి వచ్చారు. థాయిస్ భవనముందు భగభగమండుతున్న చితి దగ్గరకి పరుగెత్తారు. జనమంతా పోగయింది.

"ఏమిటిది? ఏమిటీ చిత్రం?" అంటూ అంతా నివ్వెర పోయి చూచారు.

ఆజనంలో అనేకమంది వర్తకులున్నారు. వారంతా ఏదోవిధంగా థాయిస్వల్ల బాగుపడినవారే. థాయిస్ వారి దగ్గర ఎప్పుడూ సెంట్లూ, అత్తర్లు, పన్నీర్లు, అగరుబత్తులు, ఇంకా రకరకాల పరిమళద్రవ్యాలు - అన్నీ కొంటూఉండేది. ఆవిడవల్ల వారు లక్షలు గడించారు. ఇప్పుడు వారంతా మహా భయంతో, ముఖాలు వెలవెలబుచ్చుకొని ఏంజరుగుతున్నదో అర్థంకాక చూడసాగారు. కొందరు విటులు, తెల్లవార్లూ వేశ్యలగృహాంలో విందులతోనూ, వినోదాలతోనూ కాలం వెళ్ళబుచ్చి అప్పుడే తమసేవకులతో ఇళ్ళకు మరలుతూ, త్రోవలో యీగందరగోళం చూచి ఆగారు. ఇదేమీ అర్థం కాక పెద్దపెట్టున కేకలుపెట్టారు. అంతకంతకూ జనం రావడం ఎక్కువైంది. ఎక్కడెక్కడివారూ వచ్చి యీచిత్రం చూడ సాగారు. త్వరలోనే యీవార్త నగరమంతటా పాకిపోయింది. ఆంటినోయీ మఠాధిపతి ఆజ్ఞానుసారం థాయిస్ తన భోగ

భాగ్యాలన్నీ పరిత్యజించి సన్యాసం పుచ్చుకోబోతున్నదన్న విషయం నగరం నలుమూలలా తెలిసిపోయింది!

దుకాణదార్లు తమలో తాము యీవిధంగా అనుకో సాగారు.

"థాయిస్ నగరం విడిచి వెళ్ళిపోతున్నది. ఇహ మనకు అమ్మకాలులేవు. మనం అంగళ్లు మూసుకోవలసిందే. అయ్యో! యీ విషయం అనుకుంటేనే భయం పుడుతున్నదే. ఇహ మనం ఏమిటి చేసేది? ఇహ మన గతి ఏమిటి? మనం బ్రతికేది ఎలాగ? యీబైరాగి ఎవడో వచ్చి ఆవిడమనస్సు మార్చాడు. ఆవిడకు పిచ్చిపట్టేటట్లు చేశాడు. వీడు మనలను సర్వనాశనం చేస్తున్నాడు. ఎందుకు వీడికీ దుర్బుద్ధి? ఎందుకు చేస్తున్నట్టిదంతా? అసలీ అధికారం వీడి కెవడిచ్చాడు? కోర్టులు, చట్టాలు ఏమైనాయి? అలెగ్జాండ్రియాలో మేజిస్ట్రేట్లు లేరా ఏం? వీడిట్లా చేస్తుంటే ఊరుకున్నారేం? అయినా థాయిస్‌కు ఇల్లాంటి దుర్బుద్ధి పుట్టిందేమిటి? మన భార్యా బిడ్డలిట్లా 'అలోలక్ష్మణా,' అని ఏడుస్తుంటే చూడాలను కున్నదా ఏమిటి? ఇది ప్రజలందరికీ ముప్పు! థాయిస్ నగరం దాటి వెళ్ళకూడదు - ఇక్కడే ఉండితీరాలి."

తరువాత యువకులుకూడా ఇలా తలపోశారు-

"ఏమిటిది? థాయిస్ ఇహ ఆటా - పాటా మాను కొన్నట్లేనా? ఇహ గజ్జెకట్టదా? వేషం వెయ్యదా? విటులనూ, నటులనూ ఆహ్వానించదా? అయితే మన గతి ఏం కావాలి? మన విలాసాలకూ, కులాసాలకూ ఇంతటితో తిలోద

కాలేనా? అయ్యో, దేవుడా! ఆవిడ వేషంకట్టి రంగస్థలం మీాద వచ్చి నిలుచుంటే - మన జన్మలు ధన్యమైపోయేవి. ఆ అందం, ఆ చందం, ఆ ఆటా - ఆ పాటా, ఆ అభినయం - అవి ఎవరికొస్తాయయ్యా? ఆ భంగిమలు ఎవరు చూపగలరయ్యా? మనమంతా ఆవిడను ప్రేమించాం. ఆవిడకోసం ప్రాణాలర్పించడానికి సిద్ధంగా ఉన్నాం. ఇహ మనమంతా కట్ట కట్టుకొని గంగలో దూకవలసిందేనా? హాయి, హాయి! ఇహ మన ముద్దు - ముచ్చట్లు తీరేదెట్లాగయ్యా? ఆ కులుకు- ఆ తళుకు, ఆ వగలు - ఆ ఒయ్యారం ఏ ఆడదానికున్నాయయ్యా బాబూ? ఆ సెకలు ఎవరు పడగలరయ్యా? ఇహ మనలను సుఖపెట్టే దెవరయ్యా?"-

యువకు లిలా తమలో తాము అనుకొంటూ ఉండగా, వారిలో సెరన్ను అనే ఒకతను, గుంపులోనుంచి ముందుకొచ్చాడు. చేతు లింత పొడుగున చాచి మహోద్రేకంతో, థాయిస్‌ను బలాత్కారంగా ఎత్తుకుపోవడాన్ని సహించమని చెపుతూ దైవదూషణకు పూనుకొన్నాడు. వెంటనే జన సమూహం నలువైపులనుంచీ, థాయిస్ ప్రవర్తనను తీవ్రంగా నిరశిస్తూ, నిందిస్తూ అరుపులు, కేకలు వినిపించాయి-

"సిగ్గూ - ఎగ్గూ లేకుండా ఇలా పారిపోవడం తగదు!"

"పిరికిపందలు చేసేపని ఇది!"-

"థాయిస్ మా నోటికాడి అన్నం లాక్కొని పోతున్నది!"

"మా భార్యా బిడ్డలను దోచుకుంటున్నది"-

"నేను ఈమెకు ఎన్ని హారాలు అమ్మేవాణ్ణను కున్నారుగా? వాటి ఖరీదంతా ఇప్పుడు కట్టితీరాలి"-

"అరవై జతల దుస్తులకు ఆవిడ నాకు 'ఆర్డ' రిచ్చిందయ్యా!"

"ఆవిడ ప్రతిఒక్కరికీ డబ్బు బాకీ ఉన్నది"-

"ముందు మా అప్పులు తీర్చి కదలమను"-

"ఈవిడను చూచి మనం రంభ, ఊర్వశులను మరిచి పోతున్నాం. ఇహ ఈ అప్సరస మనకు అగుపించదు. మన కళ్ళల్లో దుమ్ముకొట్టి పోతున్నది!"

"ఈవిడ ఇల్లు మూతపడితే, ఇహ మనబ్రతుకే మూత పడినట్లే!"-

"అలెగ్జాండ్రియన్ ఆకాశంలో థాయిస్ ఒక శుక్ర తార! ఒక చందమామ!"

నగరంలో నానా దుర్మార్గాలకూ పేరు వహించిన అలగాజనమంతా అప్పుడక్కడ పోగయినారు. కుంటివాళ్ళు, బిచ్చగాండ్రు, గ్రుడ్డివాళ్ళు, రోగులు, పక్షవాత మొచ్చిన వాళ్ళు, పిచ్చివాండ్రు-పడుతూ లేస్తూ అంతా ఆప్రదేశానికి వచ్చిచేరుకొన్నారు. అగ్నికి ఆహుతి అయిపోగా మిగిలి ఉన్న థాయిస్ ఆస్థి-పాస్తుల చుట్టూ మూగి ఇలా ఏడవడం మొదలుపెట్టారు-

"ఇహ ఇక్కడ థాయిస్ లేకపోతే మేం బ్రతికేది ఎలాగబ్బ! మాకు కూడు ఎవరు పెడతారు? మమ్మెవరు పోషి

స్తారు? థాయిస్ తిని లేచిన, పళ్ళాలలో ప్రతిరోజూ మూడు రెండు వందలమందికి కూడు దొరికేది. ఆవిడ ఇంటికి వచ్చి పోయే విటులు, రోజూ గుప్పెడు గుప్పెడు డబ్బులు మా ముఖాన పారేసేవారు. ఇహ ఇప్పుడు మా గతి ఏం కావాలి?

కొందరు దొంగలు, దోపిడిగాండ్రుకూడా వచ్చి ఆ గుంపులో కలిశారు. ఇంకేం? అంతా కలిసి ఒకటే గోల–ఒకటేగందరగోళం. అరుపులు, కేకలు, పెడ బొబ్బలు–అగ్నికి వాయువు తోడైనట్లు, ఒకరి కొకరు తోడై–ఎవరికి చిక్కింది వాళ్లు కాజెయ్యాలని పూనుకొన్నారు. అవకాశం చిక్కింది కనుక అంతా పెద్దలే–అడిగే నాథుడేడీ?

టాడియస్ అనే ఉన్ని వర్తకు డొకడున్నాడు. ఉన్ని బట్టలు, ఇతరవస్త్రాలు అమ్ముతాడు. చాలా పెద్ద వ్యాపారం అతనిది. థాయిస్ అతనికి బోలెడంత డబ్బు బాకీ ఉన్నది. అతను వృద్ధుడు. పెద్ద గడ్డం–అతనూ. ఇందరు ఇన్నివిధాల గోలచేస్తున్నా అతనుమాత్రం తొణకలేదు – బెణకలేదు. అరుస్తూ కేకలు పెడుతున్న, ఆ చెలరేగిన జనసమ్మర్దం మధ్య అత నొక్కడూ నిశ్చలంగా, నిశ్శబ్దంగా గడ్డం దువ్వుకొంటూ నిలుచున్నాడు. ఆ గోల వింటూ,ఆ జనాన్ని జాగ్రత్తగా పరిశీలిస్తూ, ఆలోచనా నిమగ్నుడై ఉన్నాడు. చివర కతను యువకుడైన సెరన్నును సమీపించాడు. అతని చొక్కా పట్టుకొని లాగి ప్రక్కకు పిలిచాడు. రహస్యంగా అతని చెవిలో ఇలా చెప్పాడు–

"చూడబ్బాయ్! నీ వంటే థాయిస్ పడి చస్తుంది ఎలాగయినా నీవు వయసుకుర్రాడివి, అందగాడివి – ఏవిధంగా

నైనాసరే ఈసన్యాసివెధవ థాయిస్‌ను ఎత్తుకపోకుండా చూడ చోయి నాయనా!"

అందుకు సెరన్ను "దేవుడిమీాద ఒట్టు! ఆవిడను ఎత్తుక పోడం వీడి తరం కాదు. ఎలాగో నేనూ చూస్తాను. నేరుగా వెళ్ళి థాయిస్‌తోనే మాట్లాడతాను. చస్తే నామాట కాదనదు. మీాకెందుకు? మీారూరుకోండి!" అని ఆవర్తకుడికి సమాధానం చెప్పి, "ఇదిగో, అబ్బాయిలూ! తప్పుకోండి, తప్పుకోండి!

త్రోవ ఇవ్వండిరా వెధవాయిలూ! అని జనాన్ని తోసుకొంటూ ముందుకువెళ్లాడు. రొమ్ములు విరుచుకొని అడ్డంవచ్చిన జనాన్నీ, ముసలమ్మలను, పిల్లలను, కాళ్లా వేళ్ళా త్రొక్కుతూ, పడత్రోసుకొంటూ థాయిస్‌ను సమీా పించాడు. ఆమె నొకప్రక్కకు పిలుచుకొనివెళ్ళి:

"చూడుపిల్లా! నావంక చూడు! నీవు నిజంగా వడుపు వృత్తి మానుకొంటున్నావా? నాముఖంచూచి చెప్పనేపిల్లా!" న్నాడు. కాని అంతలోనే పఫ్నూటియస్ ఘూకుడుగా అక్కడికి వచ్చాడు. వారిద్దరిమధ్య వచ్చి నిలుచున్నాడు.

"పాపాత్ముడా! ఆపిల్లను తాకావా జాగ్రత్త! భస్మ మైపోతావు. ఆఅమ్మాయి పవిత్రురాలు. దేవుడిబిడ్డ!" అని అరిచాడు.

"పోరా బైరాగీ!" అని కోపంగా సమాధానం చెప్పాడు సెరన్ను. నన్ను నాప్రియురాలితో మాట్లాడనియ్యి. కలచేశావా నీచర్మం ఒలుస్తాను. గడ్డంపీకి కుప్పలుపెడతాను. న్ను ముక్కలు ముక్కలుచేసి నిప్పుల్లో పారేస్తానురా

వెధవా !" అన్నాడు. ఇలా అంటూ అతను థాయిస్ ఒంటి మీద చెయ్యి వేశాడు. కాని పఫ్నూటియస్ తటాలున వచ్చి అతన్ని ఒక్క త్రోపు త్రోశాడు. ఆయనకు అంతటిశక్తి ఎల వచ్చిందో ఊహించలేం. ఆత్రోపుడుకు అతను నాలుగడుగుల వెనక్కితూలి, కాలి బూడిదఅయిఉన్న చితిముందు పోయి పడ్డాడు.

ఈలోగా ఉన్నివర్తకుడు — టాడీయస్, జనంలో ఒకొక్కరి దగ్గరికి వెళ్ళి, వాళ్ళతో గుసగుసలాడుతున్నాడు- అందరినీ రెచ్చగొడుతున్నాడు. పఫ్నూటియస్ మీదికి వెళ్ళవలసిందని బోధిస్తున్నాడు. ఇంకేం? ఈవిధంగా ఒకచిన్న తిరుగుబాటుదార్ల ముఠా తయారయింది. ఈగుంపంత పఫ్నూటియస్‌ను ఎదుర్కోడానికి సంసిద్ధమయింది. థాయిస్‌ను అక్కడనుంచి వెళ్ళకుండా చెయ్యాలని నిశ్చయించుకొన్నది

ఇహ క్రిందపడిన సెరన్ను లేచాడు. అతని ముఖంనిండా దుమ్ము కొట్టుకొన్నది. తల వెంట్రుకలు చెల్లాచదరయినాయి చితిలోనుంచి వచ్చే పొగంతా కళ్ళలోకి, గొంతులో పోయింది. మనిషి ఉక్కిరి బిక్కిరి అయినాడు. క్రోధోద్రేకంతో రెచ్చిపోయినాడు. నోటికి వచ్చినట్లల్లా దేవుళ్ళను, దేవతలను తిట్టిపొయ్యసాగాడు. తానా తిరుగుబాటుదార్లలో వెళ్ళి కలిశాడు. ఆ మూకకు నాయకత్వం వహించి నడిపించాడు. అతని వెనకాలే కుంటి - గ్రుడ్డి మొదలయిన అల్లరి చిల్లరమూకంతా నడిచింది. ఆ బిచ్చగాళ్ళు తమ చంకకర్రలు ఊతకోలలు పట్టుకొని కుంటుకుంటూ నడిచారు. ఆ విధంగా క్షణంలో ఆ మూకంతా పఫ్నూటియస్‌ను చుట్టుముట్టింది

వాళ్ళు కర్రలు పైకెత్తారు. పిడికిళ్ళు బిగించారు. చెవులు చిల్లులుపడేటట్లు అరుపులకు, కేకలకు లంకించుకొన్నారు. సావును తెగించినట్లు పఫ్నూటియస్ పై పోట్లాటకు సిద్ధపడ్డారు.

"ఈ సన్యాసి వెధవను చంపి, కాకులకూ- గ్రద్దలకూ వేస్తాం!" అని అరిచారు కొందరు. "కాదు. నిప్పుల్లో తొయ్యండి! ప్రాణాలతోనే దహించండి!" అన్నారు మరి కొందరు.

ఇలా జనం తమను చుట్టుముట్టి, నానాదుర్భాష లాడుతూ, పైన పడవస్తున్న సమయంలో, పఫ్నూటియస్ థాయిస్‌ను దగ్గరికి తీసుకొన్నాడు. ఆవిడను గట్టిగా పట్టు కొన్నాడు.

"దురాత్ములారా! ఈశ్వర సాన్నిధ్యంలో ఉన్న పాపిని విడదీయడం మీ తరం కాదు!"- అని బిగ్గరగా అరి చాడు. ఆయన కంఠస్వరం భయదజలదగర్జనలా వినిపించింది-

"కాని ఒక్క విషయం చెప్తున్నాను, వినండి. ఈమెను ఆదర్శంగా పెట్టుకొని మీ కళ్మలాన్నంతా కడిగి వేసుకోండి. తుచ్ఛమైన మీ సిరి సంపదలను పరిత్యజించండి. మీ పాపాలను పుణ్యాలుగా మార్చుకోండి. త్వరపడండి. కాలం వృధా కానీయకండి. దుఃఖం ఎప్పుడూ దివ్యజ్ఞానం కలి గిస్తుంది. ఈశ్వర సాక్షాత్కారానికి మార్గం కష్టాలతోనే, కన్నీళ్ళతోనే ప్రారంభమవుతుంది. మీ పాపాలకు పరితపిం చండి, పశ్చాత్తపించండి- మీ పాపాలు భగవంతునిముందు నివేదించుకొని, పవిత్రులను చెయ్యమని ప్రార్థించండి. థాయిస్

అడుగు జాడలలో నడవండి. ఆవిడకంటె ఎక్కువ ఘోరాలు, నేరాలు చేశారు మీరు. అవన్నీ ఒక్కతడవ తలంపుకు తెచ్చుకోండి. మీలో పేదవారుకానీ, భాగ్యవంతులుకానీ, వర్తకులుకానీ, సైనికులుకానీ, జ్ఞానిసలుకానీ, ప్రసిద్ధ పౌరులుకానీ-ఎవరైనా సరే భగవంతుని సముఖంలో నిలవబడి, 'ఈ పడుపుకత్తెకంటె నేం గొప్పవాళ్ళం' అని చెప్పుకోగలరా? చెప్పుకోలేరు. అవును. వేశ్యావృత్తిలో ఉన్న ఈ థాయిస్ మీకంటె ఎన్నోరెట్లు నయం! మురికిగుంటలలో పురుగులలా జీవిస్తున్నారు మీరు. కాపట్యం, కాలుష్యం, అసత్యం, అన్యాయం, వంచన, మోసం-ఇదే మీ బ్రతుకు! ఇదే మీ చరిత్ర."

ఇలా మాట్లాడుతూ ఉంటే ఆయన నేత్రాలనుండి నిప్పులు కురిశాయి. అమోఘమైన ఆయన వాక్కులు అక్కడున్న వారందరినీ కట్టివేశాయి. ఆయనను దూషించి, ఎదురొక్కవాలని వచ్చిన ఆజనసమూహం, ఎక్కడికక్కడ స్తంభించిపోయి ఆయన చెప్పేది వినసాగింది. ఎవరూ ఒక్క అడుగు ముందుకు వెయ్యలేదు.

కాని వృద్ధుడైన టాడియస్‌మాత్రం ఊరుకోలేదు. అంతకుముందే అతను కొన్ని రాళ్ళూ-రప్పలూ పోగుచేసుకొని రహస్యంగా తన చొక్కా జేబుల్లో దాచుకున్నాడు. కాని రాళ్ళు విసరడానికి అతనికి ధైర్యం చాలలేదు. మెల్లగా వాటిని అక్కడున్న బిచ్చగాండ్రకు అందించాడు. అంతట వాళ్ళు ఆ రాళ్ళు అందుకొని ఇష్టం వచ్చినట్లు వఫ్నూటియస్‌మీద థాయిస్‌మీద రువ్వారు. కొన్నిరాళ్ళు ఆ సన్యాసి ముఖానికి తాకాయి. నెత్తురు వరదలయి కారసాగింది. సన్యాసి

కౌగిట్లో ఉన్న థాయిస్‌కూ దెబ్బలు తగిలాయి. బంగారం లాంటి ఆవిడ సుతిమెత్తన శరీరం కదుములు కట్టింది. ఆ పిల్ల చెప్పలేనంత భయంతో కంపించి పోయింది.

అంతలో చక్కగా ముస్తాబు చేసుకొన్న ఒక వ్యక్తి అక్కడికి అరుదెంచాడు. మాలగా గుచ్చిన ఒక రకమైన అడవి ఆకులను తలకు చుట్టుకొన్నాడు. ఆ జనసమూహంలోనుంచి త్రోవ చేసుకొని ముందుకు వచ్చాడు.

"ఆగండి, ఇహ ఆగండి. ఈ సన్యాసి నా సోదరుడు!" అని కేక వేశాడు.

అతను నిషియస్. అతను, విందునుంచి ఇంటికి మరలి పోతూ త్రోవలో ఈ అలజడి చూచి అక్కడికి వచ్చాడు. కాని చెలరేగిన ఈ జనసమూహంకానీ, భగభగమండుతున్న చితికానీ ఆయనకు ఎలాంటి ఆశ్చర్యాన్నీ కలిగించలేదు. సన్యాసిని వేషంలోఉన్న థాయిస్‌నూ, దెబ్బలుతగిలిన పఫ్నూటియస్‌నూ చూచాడు నిషియస్.

మళ్ళీ ఇలా బిగ్గరగా అరిచాడు :

"ఇహ ఆపండి మీ ఆగడాలు! చెపుతున్నా; ఆపండి. ఈసన్యాసీ నేనూ చిన్నప్పుడు ఒకబళ్ళో చదువుకొన్నాం. ఇతనిపేరు పఫ్నూటియస్. ప్రసిద్ధమైనవ్యక్తి. నామాట విని ఇతన్ని వదిలిపెట్టండి!"

ఎంత జ్ఞాని అయినా, వేదాంతిఅయినా, నిషియస్అంటే ఎవరికీ గౌరవంలేదు. మూర్ఖులైన జనం ఆయనమాటలను

లెక్క పెట్టలేదు. థాయిస్‌కు అడ్డంగా నిలుచుని ఆమెను రక్షించవూనుకొన్న పఫ్నూటియస్‌పై మళ్లీ రాళ్ళవర్షం కురిసింది. అయినా ఆయన చలించలేదు. ఈశ్వరుణ్ణి ధ్యానిస్తూ తన రక్తం ధారవోయడానికి సంసిద్ధుడై ఉన్నాడు. ఇహ నిషియస్ కూడా తనమాటలు వినేవారెవరూ లేరని తెలుసుకొన్నాడు. స్నేహితుణ్ణి రక్షించడం తనవల్ల కాదని గ్రహించాడు. ఆభగవంతుడు ఏం చెయ్యదలుచుకొంటే అది చేస్తాడని ఊరుకొన్నాడు. కాని అతనికి దేవునిమీద నమ్మకం తక్కువ. మనుష్యులంటే అతనికి గిట్టదు. అందువల్ల ఏదో ఒక పన్నాగం పన్నాలనుకొన్నాడు. అకస్మాత్తుగా అతని కొక ఆలోచన తట్టింది. తనమొలకు కట్టుకొనిఉన్న డబ్బుల సంచీ బయటికి తీశాడు. అందులోని వెండి, బంగారు నాణాలను గుప్పిటితో తీసుకొని జనంలో వెదజల్లాడు. అతను స్వతహాగా దానగుణం కలవాడు, సరదామనిషి; పైగా ఈఅల్లరి మూకను అదుపులో పెట్టాలంటే ఇది చక్కని ఉపాయంగా అతనికి తోచింది. ఇలా డబ్బులు వెదజల్లినా, కోపంతో రెచ్చిపోయి రాళ్ళు రువ్వుతున్న జనం మొదట ఇది గమనించలేదు. కాని తరువాత వారిదృష్టి, ఘల్లున రాలుతున్న డబ్బులపై పడింది. కొన్ని వెండి, బంగారు నాణాలు వారి చెవులకు, ముక్కులకు తాకుతున్నాయి. కొన్ని నేలమీద ఘల్లున పడుతున్నాయి. జనానికి ఆశపుట్టింది. వారా డబ్బులు ఏరుకోవడం మొదలుపెట్టారు. నిషియస్, తెంపులేకుండా సంచీలోనుంచి గుప్పిటతో డబ్బులుతీసి కొంచెం కొంచెం జనంలో విసురుతున్నాడు. అంతకంతకూ జనానికి ఆసక్తి

హెచ్చింది. ఆశ పెరిగింది. తళతళలాడే డబ్బులుచూచి వాళ్ళ కళ్ళు చెదిరాయి. ఇహ ఇప్పుడు వారు వఫ్నాటియన్ విష యం పట్టించుకొనేస్థితిలో లేరు. థాయిన్ ఉన్నదో - పోయిందో ఆలోచించేస్థితి అసలే లేదు వారికి. ఇప్పుడు వారి దృష్టంతా డబ్బులమీదనే. ఆవిధంగా బిచ్చగాండ్రు, దొంగలు, రౌడీలు, వికలాంగులు - అంతా ఒకరి నొకరు పడత్రోసుకొంటూ, నెట్టుకొంటూ, అటూఇటూ పరుగులు తీస్తూ ఎవరికి చిక్కింది వారికి చిక్కినట్లు డబ్బులు ఏరుకోవడం మొదలుపెట్టారు.ఆఖరుకు వర్తకులు, పనిపాటలవాండ్రు సయితం ఆ డబ్బులకోసం నానాపాట్లు పడసాగారు. జనంలోనే త్రొక్కిడి ఎక్కువయింది. వఫ్నాటియన్‌పై పగపట్టిన యువకులు, ఇంకా పెద్ద పెద్దవారుకూడా క్రిందపడి నాకంటే నాకని డబ్బు గుంజుకుంటున్నారు. యువకుడైన సెరన్సుకు ఇప్పుడు కోపమంతా మాయమయింది. అతనూ ఈ డబ్బు పిచ్చిలో పడ్డాడు. అతని విరోధులయిన మరికొందరు యువ కులు ఈ వినోదం చూస్తూ పగలబడి నవ్వసాగారు. వారు కూడా తమలో తాము పోటీపడి ఎవరిదగ్గరున్న డబ్బు వారు జనంలో వెదజల్లడం మొదలుపెట్టారు. రోడ్డుమీద డబ్బులు- ఎక్కడచూచినా డబ్బులు! డబ్బులవర్షం! ఘల్లు ఘల్లుమని శబ్దం! ఎంగిలి మెతుకులకోసం కుక్కలు కొట్లాడుకొంటు న్నట్లు- జనమంతా కొట్లాడుకొంటున్నారు. ఒక కుంటి వాడు నానా గడ్డి తిని ఒక బంగారునాణెం చేజిక్కించు కొన్నాడు. ఆ సంతోషంలో పొట్ట చెక్కలయ్యేటట్లు పగల బడి నవ్వసాగాడు. రోడ్డుమీద మరేం కనుపించడంలేదు.

పైనుంచి డబ్బులవర్షం కురుస్తుంటే, అవి ఏరుకోడానికి జనం నేల మీద పడి నంగడం - లేవడం - తుఫానులో సముద్రతరంగాలు లేస్తూ పడుతున్నట్లు! ఇహ ఇప్పుడు పఫ్నూటియస్, థాయిస్‌ల విషయం ఎవరికీ పట్టలేదు. వారివిషయమే ఎవరికీ గుర్తులేదు.

తాను వేసిన ఎత్తు చక్కగా పారిందని నిషియస్ సంతోషించాడు. పఫ్నూటియస్ దగ్గరికి పరుగెత్తాడు. తన అంగీ ఆయన ముఖానికి కప్పాడు. ఆయన్నూ, థాయిస్‌నూ, ఇవతలికి లాక్కొచ్చాడు. ఆ విధంగా నిషియస్, పఫ్నూటియస్, థాయిస్‌లు జనసమూహంనుంచి తప్పించుకొని, చిన్న చిన్న సందులలోగుండాపడి పరుగుతీయడం మొదలు పెట్టారు. ఇలా నిశ్శబ్దంగా ఒకేమైన పరుగెత్తి పరుగెత్తి చాలా దూరం వెళ్ళారు. ఇహ శత్రువులనుంచి ఎలాటిభయమూ లేదని, తెలుసుకొని మెల్లగా నడకసాగించారు. అప్పుడు, నిషియస్ ఒకప్రక్క ఆనందం - ఒకప్రక్క విషాదం- రెండూ పెనవేసుకొన్న కంఠస్వరంతో ఇలా అన్నాడు-

"సరే, ఎలాగయితేనేం పూర్తిఅయింది. ప్లూటో, ప్రాసెర్పైన్‌ను చెయిపట్టుకొని పోయినట్లు, పఫ్నూటియస్ థాయిస్‌ను తన ఇష్టంవచ్చిన చోటికి తీసుకెడుతున్నాడు!"-

అందుకు థాయిస్-"నిజం నిషియస్! నీ వన్నది నిజం" అని బదులు పలికింది. "ముస్తాబులు చేసుకొని, ముసిముసి నవ్వులు నవ్వుతూ ఉండే నీలాంటి మనుష్యులమధ్య నాసలీ మసలీ నాకు విసుగుపుట్టింది నిషియస్. పైకి పెద్దమనిషిలా కనుపిస్తావుగాని, నీఅంత తుంటరి ఎవరూలేరు. నీకు అహం

భావమూ ఎక్కువే! ఏమైతేనేం, నాకు తెలిసిన ఈ విష యాలన్నింటితోనూ ఇహ నేను వేగలేను. కాబట్టినాకు తెలియని దానికోసం వెదుకుతున్నాను. ఆనందంకాని ఆనందం నేను అనుభవించాను. విషవిషాదమే నిజమైన ఆనందమని యీ మహానుభావుడు నాకు ఉపదేశించాడు. సత్యం ఆయన కొక్క డికే తెలుసు. కాబట్టి ఆయన్నే నమ్మాను''-అన్నది.

"ప్రేయసీ!" అంటూ నిషియస్ ఆవిడకు సమాధానం చెప్పసాగాడు. "నాకు తెలియని సత్యం లేదు. పఫ్నూటియస్‌కు తెలిసింది ఒకే ఒక సత్యం. నాకు అలాంటి సత్యాలు ఎన్నో తెలుసు. కనుక ఈ విషయంలో ఆయనకంటె నేనే ఘనుడను. అయినా నిజం చెప్పాలంటే- ఇన్ని నిజాలు తెలిసినా నాకు గర్వం లేదు. సుఖం అంతకంటెనూ లేదు."

నిషియస్ ఇలా చెపుతుండగా పఫ్నూటియస్ అతని వంక తీక్షణంగా చూచాడు. అది కనిపెట్టి నిషియస్ మళ్ళీ ఇలా అన్నాడు-

"పఫ్నూటియస్! నా ప్రియ స్నేహితుడా! నిన్ను అపహసిస్తున్నానని అనుకోకు. నీవు చేసేది పూర్తిగా అక్రమ మనీ నేను అనడం లేదు. కాని ఒక్క విషయం: నా జీవితాన్ని నీ జీవితంతో పోల్చుకొని చూచి నప్పుడు—ఈ రెంటిలో ఏది మంచిదో, ఏది చెడ్డదో నామటుకు నేను చెప్పలేను. నా మట్టసానికి నేను సరాసరి ఇంటికి వెళ్ళి నా దాస దాసీలు అందించిన పన్నీటి జలంతో స్నానమాడతాను. రుచికరమైన మద మాంసాలు భక్షిస్తాను. మధుపానం సేవిస్తాను. హాయిగా

ఏ నీతి కథలనో, ప్రబంధాలనో-చదివినవే మళ్ళీ చదువుతూ కూచుంటాను. మరి నీవూ? నీవు మళ్ళీ తపోవనాలకు వెళ్ళిపోతావు. అక్కడ ఏగుట్టమీదనో, గుహలోనో ముక్కు మూసుకొని కూచుంటావు. ఇంతకాలంగా నీవు వేటిని- ఏ సూత్రాలను వల్లిస్తున్నావో, ఏసిద్ధాంతాలను నెమరు వేసుకుంటున్నావో నాకు అవగతం కాదు. అలా ప్రొద్దస్తమానం ఏవో ఆలోచించి, ఆలోచించి, చివరకు ఏరాత్రివేళనో చప్పుడు కాకుండా వాటిని మ్రింగి ఊరుకుంటావు. కనుక స్నేహితుడా! ఆలోచించి చూస్తే మన ఇరువురం ఒకే రకంగా జీవిస్తున్నామని అర్థమవుతుంది. నీ గోల నీది, నా గోల నాది. నీ కది ఆనందం. నా కిది ఆనందం. బయటికి చూడడానికి మన చర్యలు వేరు వేరుగా కనుపించినా వాటి అంతరార్థం ఒక్కటే! నీ ఆనందం నీవు వెదుక్కొంటున్నావు. నా ఆనంద నేను వెదుక్కొంటున్నాను. నీ మార్గంలో నీవు, నామార్గంలో నేనూ పయనించి తుదకు ఏదో అసాధ్యమైన సుఖం అందుకోవాలని యత్నిస్తున్నాం. మన ఇరువురి గమ్యమూ ఒక్కటే. అంచేత నీవు అనుసరించేది తప్పు అనడం నా వెర్రితనమే అవుతుంది. కాని నా మార్గం సక్రమమైనదని నే ననుకొంటున్నాను. అయినా నీది తప్పనిమాత్రం అనడంలేదు."

ఇహ నీవు థాయిస్! నీవిషయం - ఈభోగభాగ్యాలకంటె, ఆ పేదరికంలోనే, ఆతపోవనాలలోనే ఎక్కువసుఖంగా ఉంటుందని నీవనుకొంటే, అక్కడికేవెళ్ళి సుఖపడు థాయిస్. కాని మొత్తంమీద నేనుచెప్పేది ఒకటే థాయిస్ - నిన్ను చూచి అసూయపడవలసిఉంది. నేనూ, వఫ్నూటియస్ -

మాజీవితాలు యానత్తూ ఒకేఒక ఆనందంకోసం, ఒకేఒక సంతృప్తికోసం పాకులాడుతూ వచ్చాయి. నీవు అలా కాదు. నీవు నీజీవితంలో రకరకాల ఆనందాలు చవిచూచావు. నాస్నేహితుడు పఫ్నూటియస్ పుణ్యపురుషుడు. అతనిలాగా ఒకగంటఅయినా ఉండాలని నాఅభిమతం. కాని అదినాకు సాధ్యంకాలేదు. సరే, ఇహ సెలవు థాయిస్, వెళ్ళొస్తాను! ప్రకృతిలోని రహస్యశక్తులు, విధికృతం – నిన్ను ఎక్కడికి లాక్కొనివెడితే అక్కడికి వెళ్ళు! నీవు ఎక్కడున్నా, ఏం చేస్తున్నా, ఈ నిషియస్ శుభాశీస్సులు నిన్ను అంటిపెట్టుకొనే ఉంటాయి సుమా! నిజానికిది వట్టి తెలివితక్కువ అని నే నెరుగుదును. కాని ఒకప్పుడు నీ కౌగిట్లోఉండి ఎన్నెన్నోకలలు కన్న నేను, నీకు ప్రతిఫలంగా మరేం ఇవ్వగలను? నావిష విషాదాలుమాత్రమే నీకు అందిస్తున్నాను. పండని ఆశలు, ఎండిన ఆకాంక్షలు నీకు అప్పగిస్తున్నాను థాయిస్. ఇహ ఇప్పుడు నాకు మిగిలిందల్లా ఆ మధురస్మృతులుమాత్రమే. నీతాలూకు నీడలుమాత్రమే థాయిస్! నాప్రాణంలో ప్రాణమా! నాఅన్నదాతా! వెళ్ళొస్తాను. ఇహ సెలవు! మాయతోకూడిన మంచితనానికి, మానవుల దుఃఖాలతో నిండిన ఆనందానికీ, ఇహ సెలవు! ఏదో ఎరుకపడని హేతువుతో ఈమోసాల వేషాల ప్రపంచ ముఖమండలంపై విరజిమ్మబడిన ప్రకృతితాలూకు అద్భుతప్రతిమలకు ఇహ ఇంతటితో సెలవు!"

నిషియస్ ఇలా మాట్లాడుతూ ఉంటే ఆ సన్యాసి హృదయంలో అంతకంతకూ ఆగ్రహం పుట్టుకరాసాగింది. చివరికది

కట్టలు తెంచుకొని, వెల్లువెత్తి, శాపాలరూపంలో బయటపడనే వడింది.

"ఛీ, దుష్టుడా! ఇహ వెళ్ళు! నీవంటే నాకు అసహ్యం. నీ ముఖం చూడను వెళ్లు! నీవు పాపాత్ముడవు. నీ ముఖం చూస్తే పంచమహాపాతకాలు చుట్టుకొంటాయి. ఇప్పుడు నన్ను తిట్టి, రాళ్ళతో కొట్టి అవమానించారే- ఆ జనం నీ కంటె వెయ్యిరెట్లు నయం! వాళ్ళు మూర్ఖులు. వాళ్ళు ఏం చేస్తున్నదీ వాళ్ళకు తెలియదు. దేవుని మహిమ ఏమిటో వాళ్ళు ఎరుగరు. నేను వాళ్ళకు గుణపాఠం నేర్పాను. ఇవాళ కాకపోతే రేపైనా వాళ్ళ మనస్సులు మారతాయి. వాళ్ళ హృదయాలు పవిత్రమవుతాయి. కాని నీవున్నావే-నిషియస్! నీవు నీచుడవు, వంచకుడవు, విశ్వాసఘాతకుడవు! నీ హృదయంలో కాలకూటవిషం ఉన్నది. నీ నవ్వు విషపునవ్వు! నీ ముఖంలో మృత్యువు తాండవిస్తున్నది. నీవు 'సైతాను'వు. ఛీ! ఇహ వెళ్లు దుష్టుడా!"- అని పఫ్నూటియస్ శాపనార్థాలు పెట్టగా నిషియస్, ఆయనవంక తేరిపార చూచాడు-

"సరే, వెడతాను తమ్ముడూ! బ్రతికున్నంతకాలం నీ నమ్మకాలు నీలోనే అట్టిపెట్టుకో. ప్రేమ, ద్వేషం- అన్నీ అలాగే ఉంచుకోవయ్యా. సరే, థాయిస్! ఇహ వెడతాను. నీవు నిరంతరం నా మనస్సులో మెదులుతుంటావు. కనుక నన్ను మరిచిపోవడం నీతరం కాదు!"- అన్నాడు.

ఇలా అని నిషియస్ వారిని వదిలి తన ఇంటిముఖం పట్టాడు. అలెగ్జాండ్రియానగర స్మశాన ప్రాంతంలోని వీధుల

గుండా, మెల్లగా, ఏదో ఆలోచిస్తూ నడవసాగాడు. ఆ వీధులలో, ప్రేతకర్మలప్పుడు అవసరమయ్యే వివిధ రకాల పాత్రలు, కుండలు, చల్లు అమ్మే అంగళ్ళున్నాయి. అంగళ్ళన్నీ తెరిచి ఉన్నాయి. రకరకాల పాత్రలు, రంగురంగుల మట్టిబొమ్మలు అంగళ్ళనిండా అగుపిస్తున్నాయి. వాటిలో దేవతా విగ్రహాలు- స్త్రీదేవతలవి, పురుషదేవతలవి,- రెక్కలుగల గంధర్వులవి, ఖేచరులవి - ఇవన్నీ ఉన్నాయి. మృతులైన వారితోపాటు ఈ విగ్రహాలనుకూడా తీసుకొనిపోయి పూడ్చిపెడతారు. ఇవన్నీ చూస్తూ వెడుతున్నాడు నిషియస్. అతని మనస్సు పరి పరి విధాలపోతున్నది. తాను మరణించినప్పుడు ఆ బొమ్మలలో ఒకబొమ్మ తన వెంట వస్తుందనుకొన్నాడు. ఒక చిన్న మన్మథుడి బొమ్మ. లాగూ, చొక్కా తొడుక్కొని తనవంక చూచి వెకిలిగా నవ్వుతూ ఎగతాళి చేస్తున్నట్లనిపించింది అతనికి. తన చావును గురించిన తలంపు వచ్చిం దతనికి. చెప్పలేనంత బాధతోను, భయంతోను కంపించిపోయాడు. వెంటనే ఆ బాధ, భయం నివారించుకునేటందుకు ప్రయత్నించాడు. వేదాంత సంబంధమైన కారణాలతో తనకు తాను నచ్చచెప్పుకొన్నాడు.

"కాలానికి వాస్తవికత లేదు. ఇది నిశ్చయం. కాలం అనేది కేవలం మన మానసికమైన భ్రమ తప్ప మరేం కాదు. కాబట్టి అసలు కాలం అనేదే లేనప్పుడు ఇహ నాకు మరణం ఎలా వస్తుంది; అంటే నేను ఎప్పటికీ చిరంజీవినై ఉంటాననేనా అర్థం? కాదు. మరణం అనేది ఎప్పుడూ ఉన్నది. ఉంటుంది. ఇప్పటికి చావు సమీపించిందని నాకు అనిపించడంలేదు. అయినా అది నాలో ఒక ప్రక్కన దాగి ఉన్నది. అది ఇది

వరకే నాలో తిష్టవేసుకొని ఉన్నది కాబట్టి, ఇహ ఇప్పుడు దాన్ని తలచుకొని నేను భయపడడం కేవలం వెర్రితనమే అవుతుంది. అది నా జీవనగ్రంథంలో ఆఖరుపుట. దానిని ఇంకా నేనుచదవడం పూర్తిచెయ్యలేదు."

ఇలాంటివాదంతో నిషియస్ తనకు తాను నచ్చ చెప్పుకొని నడక సాగించాడు. అయినా అతనికి హాయి కలుగ లేదు. భయంకరమైన, బాధాకరమైన, అంధకారపూరితమైన ఆలోచనలు అనేకం వచ్చి అతని మనస్సును చెదరగొడుతున్నాయి. అంతలో ఇల్లు సమీపించింది. అతని స్నేహితులు కొందరు పకపక నవ్వుకొంటూ 'టెనిస్' ఆడుతున్నారు. అతని రాకకోసం కనిపెట్టుకొని ఉన్నారు.

ఇహ ఇక్కడ - థాయిస్, వఫ్నూటియస్‌లు చంద్ర ద్వారంగుండా నగరందాటి, సముద్రతీరాన నడవసాగారు.

"అమ్మా! ఇంతటి మహాసముద్రజలాలుకూడా మాలిన్యాన్ని కడిగివేయలేవమ్మా!" అన్నాడు వఫ్నూటియస్.

ఎక్కడలేని కోపంతోను, అసహ్యంతోను ఆయన మళ్ళీ ఇలా మాట్లాడడం మొదలుపెట్టాడు:

"నీవు పడుపుకత్తెవు, వచ్చిలంజెవు! ఒళ్ళూ పైకానక, పవిత్ర దేవాలయంలాంటి నీదేహాన్ని తుచ్ఛులకు, నీచులకు అప్పగించావు. మతం అంటే నమ్మకంలేనివాళ్ళు, మహా పాపులు, దైవదూషకులు నిన్ను పొందారు. అయినా నీ విప్పుడు నిజం తెలుసుకొన్నావు. ఆపావవుపనికి ఇప్పుడు

నీవు ఒడిగట్టలేవు. ఆకామాంధులను ఇప్పుడు కౌగలించుకోలేవు. ముద్దాడలేవు. అందుకు నీమనస్సు అంగీకరించదు."

థాయిస్ జవాబు చెప్పలేదు. తల వాల్చుకొని, పిల్లిలా తాపసి వెంట నడవసాగింది. త్రోవంతా రాళ్ళు - రప్పలు. పైన మండుతున్న ఎర్రని ఎండ. ఆవిడకాళ్ళు స్వాధీనం తప్పుతున్నాయి. మోకాళ్లు కలకలుపుట్టాయి. ఆవిడ సుతిమెత్తని పాదాలు కోసుకొనిపోయి నెత్తురు కారుతున్నాయి. ఆయాసం వస్తున్నది. దాహంతో నాలుక పిడచకట్టుకొనిపోతున్నది. అయినా ఆవిడ ఆబాధలన్నీ ఓర్చుకొంటున్నది. చెయ్యరాని పాపాలెన్నో చేశానని తనకు తెలుసు. అందుకే సహిస్తున్నది. ఆవిడ అంతబాధ పడుతున్నప్పటికీ పఫ్నూటియస్ ఏమీఅనలేదు. అవుతే ఆయనకు జాలి, కరుణ లేకపోలేదు. ఉండి ఏంచేస్తాడు? ఆవిడ చేసిన పాపాలకిది శిక్ష!... ఈశిక్ష చాలదేమో! ఆసుందర సుకుమార శరీరంతో ఆవిడ ఎన్నెన్ని సుఖాలు అనుభవించింది. ఆసుఖాలకి కష్టం తప్పదు. ఆదేహాన్ని ముక్కలు ముక్కలుగా నరికినా పాపంలేదని ఆయన మతం. ఆవిడ గడపిన వేశ్యాజీవితాన్నిగురించి ఆయన కెన్నెన్నో తలంపులు పుట్టుకొస్తున్నాయి. ఆయన నిర్మల హృదయంలో కల్లోలాన్ని రేపుతున్నాయి. నిసియస్‌నుకూడా ఆవిడ తన శయ్యాగారానికి ఆహ్వానించింది. అతని కౌగిళ్ళలో తేలిపోయింది. ఈ ఆలోచన మనస్సులోకి వచ్చేసరికి పఫ్నూటియస్ పట్టరాని ఆగ్రహావేశాలతో వణకిపోయాడు. దేహమంతటా తేళ్ళు - జెఱ్ఱులూ పాకినట్లనిపించింది. ఆవేశం ఆపుకోలేకపోతున్నాడు. కాని తిట్లూ, శాపనార్థాలు నోటి

దాకావచ్చి ఆగిపోతున్నాయి. పంఫ్నుటియస్ పటపట కొరుకొన్నాడు. ఈశ్వరతేజం ఆయన్ను ఆవహించింది. వివర్ణుడై, విచలితుడై, భయంకరమైన ఉగ్రరూపం దాల్చి తటాలున ఆవిడ ముందు నిలుచున్నాడు. ఆవిడ ఆత్మలోనికి చూచాడు. తుపుక్కున ఆవిడముఖాన ఉమ్మివేశాడు.

థాయిస్ నిశ్చలంగా, నిశ్శబ్దంగా ముఖం తుడుచుకొన్నది. మెల్లగా నడవసాగింది. రోషకషాయితలోచనుడై ఆవిడవంక చురచుర చూస్తూ, వెంట వెళ్ళాడు పఫ్నూటియస్. ఆవిడ నరకకూపంలో ఉన్నట్లు భావించుకొన్నాడు. క్రీస్తు ఎవరిపైనా పగ తీర్చుకోలేదు. కాని తాను పగతీర్చుకోడం ఎలాగ అని ఆయన ఆలోచిస్తున్నాడు. అంతలో ఆయనదృష్టి థాయిస్ పాదాలపైన పడింది. ఆ మృదుచరణాలనుండి నెత్తురు వరదలై ప్రవహించడం చూశాడు. అకస్మాత్తుగా ఏదో తెలియని ప్రభావం వచ్చి ఆయన హృదయంలో ప్రవేశించింది. ఆయన హృదయం వెయ్యి వ్రక్కలయింది కనుల వెంట నీరు కారజొచ్చింది. పెదవులు వణకిపోయాయి. గబగబ పరుగెత్తి థాయిస్ ముందు మోకరిల్లాడు. అమ్మాయీ! చెల్లీ! అని పిలుస్తూ ఆవిడ పాదాలు పట్టుకొని వెక్కివెక్కి ఏడ్వసాగాడు "అమ్మాయీ! సోదరీ! నా చిట్టితల్లీ! నా పుణ్యాత్మురాలా!" అంటూ ఆవిడ పాదాలు ముద్దాడాడు. తరువాత భగవంతుని ఇలా ప్రార్థించాడు—

"ఓ, దేవతల్లారా! ఓ, స్వర్గవాసులారా! ఈ చిట్టితల్లి తన రక్తం ధారబోస్తున్నది. మీరు దీనిని గైకొని పోయి ఆ పరమేశ్వరుని పాదాల సన్నిధిన ఉంచండి. థాయిస్ దేహం

నుండి చిమ్మిన నెత్తురు ఎంతటివారి హృదయాలనూ పవిత్రం చేస్తుంది. సందేహం లేదు. అమ్మా, థాయిస్! నీ వెంత పుణ్యాత్మురాలవమ్మా, థాయిస్!" ఇలా పఫ్నూటియస్ ప్రార్థిస్తూ ఉండగా ఒక పిల్లవాడు గాడిదమీద ఎక్కి ఆ త్రోవన వెడుతున్నాడు. అప్పు డాయన ఆ కుర్రవాణ్ణి గాడిద మీదనుంచి దిగమని ఆజ్ఞాపించాడు. పిల్లవాడు దిగాడు. ఆ గాడిదమీద థాయిస్ ఎక్కి కూచున్నది తరువాత కుర్రవాడు కళ్ళెం పట్టుకొని గాడిదను నడిపిస్తూ వెళ్ళాడు. అలా వారు ప్రయాణంచేసి ప్రొద్దుకూకేవేళకు ఒక వాగు ఒడ్డుకు చేరు కొన్నారు. వాగుచుట్టూచక్కని చెట్లు, చేమలు ఉన్నాయి. అంతట గాడిదను ఒక ఖర్జూరపు చెట్టుకు కట్టివేయించి, తానూ థాయిస్ కలిసి ఒక పాచిపట్టిన బండమీదకి వెళ్ళి కూచు న్నారు. ఇంత రొట్టెముక్క ఉప్పులో నంచుకొని ఇరువురూ తిన్నారు. నిర్మలమైన వాగునీళ్లు, దోసిళ్ళతో తీసుకొని కడు పార త్రాగి దాహం తీర్చుకొన్నారు. తరువాత కొంతసేపు గొప్పగొప్ప విషయాలనుగురించి మాట్లాడుకొన్నారు.

"ఇంత నిర్మలమైన నీళ్ళు నా జన్మలో త్రాగలేదు. ఇటువంటి పరిశుద్ధమైన గాలి నే నెన్నడూ పీల్చలేదు. నిజంగా ఈ గాలి, ఈ వెలుతురు, ఈ ప్రకృతిశోభ – ఇవన్నీ తిలకిస్తూ ఉంటే సాక్షాత్తు ఆ ఈశ్వరుడు ఇక్కడున్నాడా అనిపిస్తున్నది స్వామీ!" అన్నది థాయిస్.

"చూడమ్మా! సూర్యుడు అస్తమిస్తున్నాడు. ఇప్పు డిప్పుడే కొండలపై నల్లని – చీకట్లు క్రమ్ముకొంటున్నాయి చూడు తల్లీ! కాని త్వరలోనే ఈరాత్రి గడుస్తుందమ్మా. మళ్ళీ

సూర్యోదయమవుతుంది. వెలుగు రేఖలు విచ్చుకొంటాయి. పద్మాలు వికసిస్తాయి. ఆ ఈశ్వరునికి ప్రభాతపూజలు. అర్చనలు కొనసాగుతాయి తల్లీ" అన్నాడు పఫ్నూటియస్.

ఆ రాత్రంతా వారు ప్రయాణం చేశారు. చల్లని, తెల్లని చంద్రోదయంవేళ వారు పాటలు, భజనకీర్తనలు పాడారు. పరవశులైనారు. తరువాత ప్రొద్దు పొడిచింది. సూర్యోదయం వేళకు వారు లిబియన్ ఎడారి చేరుకొన్నారు. బ్రహ్మాండమైన ఎడారి వారిముందు ఎర్రగా - తివాచీలా పరుచుకొని కనుపించింది. ఎడారి కొసన ఒత్తుగా ఉన్న ఖర్జూరపుచెట్లు, కొన్ని తెల్లటి పర్ణకుటీరాలు, ఎండపొడలో తళతళ మెరుస్తూ అగుపించాయి.

"మనం వెళ్ళేది అక్కడికేనా స్వామీ? ప్రభాతవేళ దేవతార్చనలు జరిగే ప్రదేశం అదేనా?" అని అడిగింది థాయిస్.

"అవును తల్లీ - అదే - అక్కడే నీవు ముక్తిమందిరం చూస్తావమ్మా. నిన్ను నా చేతులతో ఆ మందిరానికి చేర్చి అక్కడ-బందీగా ఉంచుతానమ్మా"-అన్నాడు పఫ్నూటియస్.

త్వరలో వారా పర్ణకుటీరాలచెంతకు చేరుకొన్నారు. అక్కడ అనేకమంది స్త్రీలు - తేనెతుట్టెలచుట్టూ ముసురుకొన్న ఈగల్లా, ఆ పర్ణకుటీరాలచుట్టూ మూగిఉన్నారు. కొందరు రొట్టెలు చేస్తున్నారు. కొందరు కూరలు తయారుచేస్తున్నారు. చాలామంది ఉన్ని వడుకుతున్నారు. ఈశ్వరుని మందహాసాలనుండి వెలువడే దివ్యకాంతులు వారివదనాలనుండి

విరజిమ్ముతున్నాయి. మరికొందరు స్త్రీలు పాదలమధ్య ఆసీనులై దైవచింతనలో మునిగిఉన్నారు. మాగ్డాలిన్‌లాగా కేవలం ధ్యానముద్రలో ఉండి భగవధ్యానం చెయ్యడమే వారి పని. వారికి ఇంకొక పనిలేదు. ఆ చింతనలోనే వారు బ్రహ్మా నందం అనుభవిస్తారు. కనుక వారందరినీ 'మేరీ' లని పిలుస్తూ ఉంటారు. అందరూ తెల్లని దుస్తులు ధరించారు. తక్కిన పని చేసేవారందరూ 'మార్తా'లని పిలువబడుతుంటారు. వారు నీలవర్ణపు దుస్తులు ధరించారు. ఆ స్త్రీలంతా తలలకు ముసుగులు వేసుకొన్నారు. ఎవరికీ జుట్టు కనుపించదు. ముఖంమీద సగంవరకూ ముసుగే ఉంటుంది. వారిలో మరీ చిన్నతనంలో ఉన్న స్త్రీలు కొంద రున్నారు. వారు ముసుగులు ధరించినా అక్కడక్కడ కొంచెం ముంగురులు బయటకి కనుపిస్తున్నాయి. కావాలని వా రలా వేసుకోలేదు. అయినా మరీచిన్న వయస్సులో ఉన్నవారవడంవల్ల అది అంత పట్టింపుగా లేదు. అందరిలోకీ మరీ వృద్ధురాలు ఒకామె ఉన్నది. పొడుగ్గా, తెల్లగా, పండిన పండులా ఉన్నది. ఆమె ఒక చేతికర్ర సహాయంతో ప్రతి పర్ణ కుటీరానికీ వెళ్ళి చూచివస్తున్నది. పఫ్నూటియస్ సగౌరవంగా ఆమెను దర్శించాడు. ఆమె వస్త్రపుకొంగులను ముద్దాడాడు.

"అమ్మా, ఆల్బినాదేవీ! నీవు దేవమాతవమ్మా. నేను మీ ఆశ్రమానికి ఒక అమ్మాయిని తీసుకొనివచ్చాను. బ్రతుకుబాటలో తప్పిపోయిన అభాగ్యురాలు ఆపిల్ల. ఆపిల్లను నేను వెదికి పట్టుకొచ్చాను తల్లీ. ఇహ నీకు అప్పగిస్తాను" అన్నాడు.

ఇలా అంటూ, నేలమీద మోకరిల్లి ఉన్న థాయిస్‌ను ఆవృద్ధురాలికి చూపించాడు.

ఆల్బినా, థాయిస్ వంక తీక్షణంగా చూచింది. ఆమెను లెమ్మన్నది. ఫాలభాగాన్ని ముద్దాడింది. తరువాత సన్యాసివంక తిరిగి–

"ఈమెను ఇక్కడ అట్టిపెట్టుకుంటాం. 'మేరీ'లతో పాటు ఉంటుంది" అన్నది.

తరువాత పఫ్నూటియస్, ఆల్బినాతో, జరిగిన విషయమంతా చెప్పాడు. థాయిస్‌ను అక్కడికి ఎలా తీసుకొనివచ్చిందీ అంతా వివరించి చెప్పాడు. తక్షణమే ఆమెను ఆశ్రమంలో కట్టివెయ్యాలని కోరాడు. ఆల్బినా అలాగే నన్నది. వారి నొక పర్ణశాలదగ్గరికి తీసుకెళ్ళింది. ఆపర్ణశాలల్లో పూర్వం 'లాయిటా' కన్య ఉన్నది. ఆమె మరణించినతరువాత అది ఖాళీగా ఉన్నది. ఆపవిత్రమైన పర్ణశాలలో ఇప్పుడు థాయిస్‌ను ఉండమని ఆల్బినా చెప్పింది.

పర్ణశాల బహుచిన్నది. లోపల ఒకపక్క, ఒకచిన్న టేబిల్, నీళ్లుతాగేముంత తప్ప మరేమీలేవు. థాయిస్ ఆపర్ణ కుటీరంలో ప్రవేశించింది. ఆమెహృదయం ఆనందంతో పొంగిపోయింది.

"ఈపర్ణశాల వాకిళ్ళు నేనే స్వయంగా మూస్తాను. సీలుకూడా వేస్తాను. ఆ జీసస్‌ప్రభువు స్వయంగావచ్చి తన హస్తాలతో ఈతలుపులు తెరుస్తాడు" అన్నాడు పఫ్నూటియస్.

ఇలా అని ఆయన ఒక నీటిబుగ్గచెంతకు వెళ్ళాడు. అక్కడున్న బంకమట్టి గుప్పిటనిండా తీసుకొని వచ్చాడు. దానిలో తన ఉమ్మివేసి కలిపాడు. తన వెంట్రుక ఒకటి తీసి అందులో ఉంచాడు. పిమ్మట ఆబంకమట్టిని తలుపుగడియలకు పూసి, బిళ్ళమాదిరిగా అతికించాడు. తరువాత కిటికీదగ్గరికి వెళ్ళి చూచాడు. థాయిస్ కిటికీచెంత నిలుచుని ఉన్నది. ఎంతో హాయిగా, ఆనందంగా ఉన్నట్లు అగుపిస్తున్నది. ఆయన, ఆపిల్లముందు మోకరిల్లాడు. ముమ్మారు నమస్కరించి భగవంతుణ్ణి ప్రార్థించాడు.

"ప్రభూ! ఎంత సుందరమైన పాదాలు ఈ పిల్లవి. ఈమె ధర్మపథంలో నడిచింది ప్రభూ! ఈవిడ వదనంలో దివ్య తేజస్సు ప్రకాశిస్తున్నది స్వామీ!" అని పలికాడు.

తరువాత అక్కడనుంచి లేచి, తన తలమీద కుళ్ళాయిని కనులదాకా గుంజుకొన్నాడు. మెల్లగా, ప్రశాంతంగా నడచి వెళ్ళాడు.

ఆల్బినా, అక్కడ ఉన్న ఒక కన్యను పిలిచింది—

"అమ్మాయీ! థాయిస్‌కు ఏమేమి కావాలో తీసుకొని పోయి ఇవ్వు తల్లీ—రొట్టె, నీళ్లు, మూడు రంధ్రాలుకల ఒక వేణువు ఆ పిల్లకు ఇచ్చిరా అమ్మా!" అని చెప్పింది.

# మూడవభాగం

పఫ్నూటియస్ తిరిగి తపోవనాలకు వెళ్ళిపోయాడు. 'అర్సినోస్' వద్ద పడవఎక్కి ప్రయాణం సాగించాడు. మఠాధిపతి సెరపియన్ ఉండేమఠానికి, ఆహార పదార్థాలను నింపుకొని నైల్ నదిమీద పోయే పడవ అది. ఆయన పడవ దిగగానే ఆయన శిష్యకోటి మహదానందంతో ఆయన్ను ఆహ్వానించడానికి ఎదురు వచ్చింది. కొందరు శిష్యులు చేతులు పైకెత్తి జయ జయ ధ్వానాలు చేశారు. కొందరు సాగిలపడి మ్రొక్కారు. మరికొందరు ఆ మఠాధిపతి పాదుకలను స్పృశించి కనులకు అద్దుకొన్నారు. అవును. తమ గురువర్యులు అలెగ్జాండ్రియాలో ఒక మహాత్కార్యం సాధించారని వారికి ఇదివరకే తెలుసు. ఏమైతేనేం, ఎవరూ చెప్పకుండానే, చెయ్యకుండానే, గురుపాదులు పఫ్నూటియస్ సురక్షితంగా, జయప్రదంగా తన కార్యం ముగించుకొనివచ్చారన్న వార్త ఎలా అందిందో, తపోవనాలలో, ఎడారులలో ఉండే సన్యాసులందరికీ అందింది.

పఫ్నూటియస్ ఎడారులలో నడిచి వెడుతుండగా శిష్యగణం ఈశ్వర సంకీర్తన చేస్తూ ఆయనను వెంబడించింది. శిష్య కోటిలో అత్యంత వృద్ధుడైన ఫ్లావియన్‌కు అకస్మాత్తుగా ఆవేశం పుట్టుకొచ్చింది. పూనకం వచ్చినట్లుగా భక్తి పారవశ్యంతో ఇలా పాడడం మొదలుపెట్టాడు.

"నేడే కదా సుదినం!
మా స్వామి మరలి వచ్చిన శుభదినం!
నేడే కదా సుదినం!
తండ్రి సద్గుణములే బిడ్డలకు సంపద
మా తండ్రి రాక మము ముదముతో నింపద!
పరమ పూజ్యు డితండు, పతితపావను డితడు
పఫ్నూటీయస్ మమ్ము పాలించగలడు!
మహిమ లెన్నో గల మహాత్ము డితడు
నలుపును తెలుపుగా మార్చగలడు!
మా స్వామి నే డిటకు మరలి వచ్చాడు
నూతనోత్సాహము నిండివచ్చాడు
ఖ్యాతి కెక్కిన పనులు చేసివచ్చాడు!
నేడె మా అందరికి నేత్రానందమగు
ఈ పర్వ దినము మా పాపాలు వైదొలగు!
ఆడుతూ పాడుతూ చేయుదము పండుగ
అందరము విందారగించుదము మెండుగ!!"

తరువాత వారు మఠాధిపతి గుహవద్దకు చేరుకొన్నారు. అప్పుడు శిష్యకోటి అంతా నేలమీద మోకరిల్లి—"మా తండ్రి మమ్ము ఆశీర్వదించుగాక! ఆయన మరలివచ్చిన సందర్భములో ఉత్సవం జరుపుకోవడానికి మాకు అనుజ్ఞ య్చిగాక!—" అని వేడుకొన్నారు.

తరువాత అవివేకి అయిన పాల్ అక్కడ ఒంటిగా ఉండిపోయి— "ఎవరీ మనిషి?" అని అడిగాడు. అతను పఫ్నూ

టియస్‌ను గుర్తుపట్టలేదు. అత నిలా అడుగుతుంటే ఎవరూ అతని మాటలు వినిపించుకోలేదు. అతను మనలోకంలో లేడనీ, భక్తిపారవశ్యంలో మునిగి ఉన్నవాడనీ అందరూ ఎరుగుదురు.

పఫ్నూటియస్ తన ఆశ్రమంలోకి వెళ్ళి తలుపులు తాళాలు వేసుకొని కూచున్నాడు. తనలో తాను ఇలా తల పోయ సాగాడు—

"నేను మళ్ళీ నా స్థానానికి వచ్చాను. నా సుఖాన్ని నేను పొందగలిగాను. సంతోషం, సంతృప్తి ప్రసాదించే నా పుణ్యభూమికి నేను చేరుకొన్నాను. కాని ఈ పవిత్రమైన ఆశ్రమం నన్ను ప్రేమతో ఆహ్వానించడం లేదేమి? 'వచ్చావా, రా, నాయనా!' అని పలకరించదేమి? నేను వెళ్ళేటప్పుడు ఎలా ఉందో, ఇప్పుడు అలా లేదేమి ఈ ఆశ్రమం?— ఏమిటీ మార్పు?— పైగా ఇక్కడంతా నాకు క్రొత్తగా కనుపిస్తున్న దేమిటి?— యీ బల్ల, యీ నా శయ్య, యీ మతగ్రంథాలు— ఎంతో మహిమ కలవి. ఇక్కడే నేను నిరంతరం ఈశ్వర ధ్యానంలో మునిగిఉండేవాడినే— ఇవాళే నేను మొట్టమొదటి సారిగా చూస్తున్నట్లు ఇవన్నీ క్రొత్తగా కనుపిస్తున్న వేమిటి? ఈ ఆశ్రమం, ఈ వస్తువులు - ఇవన్నీ పూర్వపు మహిమను కోల్పోయినాయి. నిర్జీవంగా, నిస్తేజంగా కనుపిస్తున్నాయి. ఏమిటబ్బా కారణం? ఇహ ఇప్పుడిక్కడ భగవంతుని నేను దర్శించలేక పోతున్నాను. అంతా మారిపోయింది. ఇక్కడ అంతటా మృత్యువు ఆవరించి ఉన్నదే - అయ్యో! ఏమిటీ మార్పు?......కాదు. ఇవేవీ మారలేదు. ఇవన్నీ యథావిధిగానే ఉన్నాయి. మారిందల్లా నేనే! నేనిప్పుడు వెనుకటి మని

పిని కాను! నేను జీవచ్ఛవాన్ని. నా కిక ఈశ్వర సాక్షాత్కారం కలుగదు. ప్రభూ! ఈశ్వరా! ఏమిటిది? నా కేం పెద్దముప్పు ముసించిందయ్యా? నీ దివ్య తేజస్సు నన్ను విడిచి వెళ్ళిందా దేవా? నే నిప్పు డెవరిని స్వామీ?"-

ఈవిధంగా పఫ్నూటియస్ వాపోవసాగాడు దేనినో పోగొట్టుకొన్నట్లు వెదుకుతున్నాడు. ఆయనహృదయంలో ఎక్కడలేని కలవరం బయలుదేరింది. మరల ఈశ్వరుని పరిపరి విధాల వేడుకోసాగాడు. తల నేలకు ఆనించి బోర్లా పడుకొన్నాడు. అలా ధ్యానంలో ఉన్నప్పుడు ఆయనకు కొంచెం హాయి చిక్కింది. కాని అలా ఒకగంటసేపు ఉన్నాడో లేదో- అంతలోనే థాయిస్‌రూపం ఆయన కనులముందు పొడగట్టింది.

"ప్రభూ! జీసస్! నీవే నన్ను థాయిస్‌దగ్గరకి పంపావు. నీవు ఉదారుడవు - నాకు తెలుసు. అందుకు నేను నీకు సర్వదా కృతజ్ఞుడను. నీఆనతిప్రకారం ఆపిల్లను తెచ్చి నీకు అప్పగించాను. నీఆజ్ఞ నెరవేర్చినందుకు నాకెంతో హాయిగా ఉంది. ఆవిడ రూపురేఖలు, అందచందాలు, ఆవిడ తళుకు, ప్రభావం, వెన్నెల విరిసినట్లుండే ఆవిడ చిరునవ్వులు - అన్నీ నీదయవలన నేను చూడగలిగాను. సంతోషించగలిగాను. నీఆజ్ఞప్రకారం ఆవిడను పవిత్రం చెయ్యటానికి పూనుకొన్నాను. నిన్ను సంతోషపెట్టడానికి ఆమెను నీకు కానుకగా అర్పించాను. కనుక నాకిప్పుడు థాయిస్ కలలోకి వస్తున్నదంటే నీవే అలా ఆమె కలలోకి వచ్చేటట్లు చేశావనుకొంటున్నాను. ప్రభూ! కాని ఆమెను నీపాదాలముందు సమర్పించానన్న

విషయం మాత్రం మనకు ప్రభూ! నీకు సంతోషం ఉన్నంత వరకూ ఆపిల్లను కాపాడు. నీసన్నిధిననే అట్టిపెట్టుకో. ఆవిడసౌందర్యం, నీకే అంకితం కావాలి. అంతేకాని ఆమె మరొకరికి ఆనందం అందించకూడదు. ఆవిషయం నీవు జాగ్రత్తగా కనిపెట్టిఉండు." అని పఫ్నూటియస్ ఈశ్వరుని వేడుకొన్నాడు.

కాని రాత్రంతా ఆయనకు కన్ను మూతపడలేదు. తానురాను థాయిస్, తన కనులముందు మరింత స్పష్టంగా కనుపించసాగింది. తాను ప్రత్యక్షంగా చూచినదానికంటె కూడా ఎక్కువ విస్పష్టంగా, ఆవిడ దర్శనమిస్తోంది.

"నేను చేసిందేదో ఆభగవంతునికోసమే చేశానుకాని నాకోసం చెయ్యలేదు—" అని తనకు తాను నచ్చచెప్పుకొన్నాడు. "ఆఈశ్వరమహిమను వెల్లడిచెయ్యడానికే చేశాను" అనుకొన్నాడు.

అయినప్పటికీ ఆయనహృదయం తేలికపడలేదు. అందుకు మిక్కిలి ఆశ్చర్యం చెందాడు. బరువుగా నిశ్వసించాడు.

"అయ్యో! నాఆత్మ ఇంత విచారంగా, దిగులుగా ఉన్నది దేనికి? ఊరిక ఇలా గిజగిజ కొట్టుకొంటున్నది దేనికి?" అని ప్రశ్నించుకొన్నాడు.

ఆయన మనస్సు మరింత చెదిరిపో నారంభించింది. ఆ విధంగా నెలరోజులు- ఆ ఆశ్రమంలో ఒంటిగా, దీనంగా, దిగులుగా, దిక్కూ-మొక్కూ కానక పడిఉన్నాడు. రాత్రి

పగలు కూడా థాయిస్ ఆయన్ను వదిలి పెట్టలేదు. ఆమె రూపం నిరంతరం కనులముందు గోచరిస్తూనే ఉంది. దానిని చెరిపివేసుకోవాలని ఆయన ప్రయత్నించలేదు. భగవంతుని సంకల్పంవల్లనే ఇలా జరుగుతున్నదని ఇప్పటికీ భావిస్తున్నాడు. ఆ రూపం ఒక పుణ్యమూర్తి రూపం అని తలుస్తున్నాడు. అందుకే దానిని తుడిచి వెయ్యడానికి ప్రయత్నం చెయ్యలేదు. కాని ఒకనాటి ఉదయం థాయిస్ ఆయనకు కలలో కనుపించింది. తలకు కిరీటం పెట్టుకొని జగన్మోహినిలా దర్శనమిచ్చింది. ఆయన భయంతో కంపించిపోయాడు. ఒళ్ళంతా చెమటలు పోశాయి. రక్తం గడ్డకట్టుకపోయినట్లనిపించింది. కెవ్వున కేక పెట్టి మేలుకొన్నాడు. కళ్ళు ఇంకా బరువుగా ఉన్నాయి. నిద్రమత్తుగానే ఉంది. అలాగే లేచి కూచున్నాడు. ఒక చిన్న నక్క లోనికి వచ్చి తన ప్రక్కన కూచుని ఉండడం చూచాడు. అది తన ముందర కాళ్ళతో నేల త్రవ్వుతూ, నోరంతా వెళ్ళబెట్టి రొప్పుతున్నది. ఆయనవంక చూస్తున్నది.

పఫ్నూటియస్ నిలువునా నిర్ఘాంతపోయాడు. కాళ్ళ క్రింద నేల తొలుచుకొని పోతున్నట్లనిపించింది. ఒక అంతు లేని అగాధంలో పడిపోతున్నట్లు తోచింది. నిజానికి ఆయన నిలువునా కూలిపోయాడు. ఆయన ఆత్మవిశ్వాసం గంగలో కలిసింది. కొంతసేపటివరకూ స్మృహ లేదు. తరువాత మెల్ల మెల్లగా కోలుకొన్నాడు. మరింత కలవరంతో ఆలోచించ సాగాడు.

"ఇది — రెండింటిలో ఏదో ఒకటి అయిఉండాలి. ఇప్పుడు నేను చూస్తున్న — పూర్వం మాదిరి భగవంతుని

సంకల్పమై ఉండాలి. అప్పుడిది శుభప్రదమే అవుతుంది. సహజంగా నాకుగల వక్రబుద్ధియే ఈ దృశ్యానికి కారణం-అది అవకాశంగా తీసుకొని ఈ క్షుద్రజంతువు ఇక్కడికి వచ్చి ఉంటుంది. లేదా, యీ స్వప్నదర్శనం ఈశ్వర సంకల్పంకాక, ఏ దయ్యాలో, భూతాలో కల్పించిన మాయ అయినాకావాలి. అప్పుడిది అనిష్ట సూచకం. నిజంగా ఇది దుస్వప్నమే అయినట్లయితే - నాలో పూర్వం ఉన్న దివ్యశక్తులన్నీ ఇప్పుడు మంటకలిశాయన్నమాట. ఒక ఋషికి అవసరమైన మహిమ, ప్రభావం నాలో లేవన్నమాట- ఏది ఏమైనప్పటికీ దీనివలన ఒక్క విషయంమాత్రం రూఢిఅవుతున్నది. ఇహ యిప్పుడు నాలో భగవంతుడులేడు - కారణాలేమిటో సరిగ్గా చెప్పలేక పోతున్నానేకాని, నేను పతనమైపోయినట్లు స్పష్టంగా తెలుస్తూనేఉంది"- అనుకొన్నాడు.

తిరిగీ యీ విధంగా ప్రశ్నించుకొన్నాడు- "నిజంగా ఈ భూత ప్రేత పిశాచాలు - దుష్టశక్తులయినట్లయితే - భగవంతుడు వాటిని ఎందుకు సృష్టించినట్లు? భగవంతుని సేవకులమయిన మావంటి వారికి - వాటి అనుభవం ఎందుకు కలిగిస్తున్నట్లు?- కనుక ఓ, ఈశ్వరా! యీభేదం ఏమిటో - నాకు విశదమయ్యేటట్లు చెయ్యవలసినది"-

ఈవిధంగా పఫ్నూటియస్ ఏమీతోచని అయోమయావస్థలో పడిపోయాడు. చివరకు థాయిస్ విషయమే తనను ఇంతగా కలవరపెడుతున్నదని గ్రహించాడు. ఆమెను పూర్తిగా మరచిపోవడానికి నిశ్చయించుకొన్నాడు. కాని

ఆ నిశ్చయం నిష్ప్రయోజనం అయింది. కనుపించకుండానే ఆ వేశ్య నిరంతరం ఆయనతో ఉంటూవచ్చింది. గ్రంథపఠనం చేస్తున్నా, ప్రార్థన సలుపుతున్నా, ధ్యానంలో ఉన్నా, యోగంలో ఉన్నా ఆపిడ ఎల్లప్పుడూ కనిపెట్టుకునే ఉంది. ఆయనవంక రెప్ప వాల్చకుండా తదేకంగా చూస్తున్నది. ఎక్కడచూచినా, ఎటుచూచినా ఆమె కనిపిస్తున్నది. రకరకాల రూపాలతో దర్శన మిస్తున్నది. ఒకప్పుడు మాట్లాడుతుంది. ఒకప్పుడు నవ్వుతుంది. ఒకప్పుడు నడుస్తుంది. ఒకప్పుడు దగ్గరికి వచ్చి కూచుంటుంది. ఒకమాటు తలలో పూలు పెట్టుకొని, తురాయి పెట్టుకొని కనుపిస్తుంది. ఒకతడవ విందుకు వెళ్ళే దుస్తులు ధరించి విలాసంగా దర్శనమిస్తుంది. ఇంకొకసారి వలిపం లాంటి దుస్తులు ధరించి, మబ్బులలోనుంచి వచ్చిన మెరపు తీగెలా ప్రత్యక్షమవుతుంది. ఒయ్యారాలు ఒలికిస్తుంది. వగలు పడుతుంది. మరొక తడవ వనకన్య విగ్రహంచెంత నగ్నంగా కూచుని పన్నీట జలకాలాడుతూ కనుపిస్తుంది. ఒకమాటు దీనంగా, విషాదవదనయై వస్తుంది. ఒకసారి రంగురంగుల దుస్తులతో, రకరకాల ఆభరణాలతో, అందని అందచందా లన్నీ అందిస్తూ, అప్సరసలా, కులుకులన్నీ - తళుకులన్నీ ఒలక పోస్తూ, పట్టుపరుపులమీద, పందిరిమంచాలమీద కేళీవిలా సాల సొక్కుతూ, సోలుతూ దర్శనమిస్తుంది. ఒకప్పుడు భయం కరమైన మృత్యురూపంలో ప్రత్యక్షమవుతుంది. ఏమైతేనేం? పఫ్నూటియస్ ఈ దృశ్యాలన్నీ చూడలేక పోతున్నాడు. తాను ఏభోగభాగ్యాలనూ, సిరిసంపదలనూ అగ్నికి ఆహుతిచేశాడో- ఆ సిరులు, ఆ సంపదలు, రకరకాల వస్తువులు- అన్నీ

ఆయన కిప్పుడు భయంకరమైన రూపాలతో దృగ్గోచర మవుతున్నాయి. ఈ పాడు సిరిసంపదలు నాశనం చేసినా నశిం చేవి కావనీ, వాటికి చావులేదనీ ఆయనకు తోస్తున్నది! ఆయన మనస్సు బెదరిపోతున్నది, చెదరిపోతున్నది.

అయ్యో, భగవంతుడా! థాయిస్ చేసిన పాపాలన్నీ నాపైన పడ్డాయి. నన్ను చుట్టుముట్టాయి!" అని వాపోయాడు.

వెనుతిరిగిచూచేసరికి థాయిస్ తన వెనకాలే నిలు చుని ఉన్నట్లు కనుపించింది. ఆయన మరింత భయంతో ఊగి పోయాడు. ఆయన పడే వేదన ఇంతా-అంతా కాదు. కాని ఎన్నెన్నో మనోవికార హేతువులమధ్యకూడా ఆయన దేహం, ఆత్మ రెండూ పరిశుద్ధంగానే ఉన్నాయి. ఎటువంటి కామవాంఛలకూ మనస్సు వశంకాలేదు. భగవంతుని నమ్ము కొన్నాడు. ఆయనతో మొరపెట్టుకొన్నాడు-.

"ప్రభూ! ఈశ్వరా! నవనాగరికులమధ్య జీవిస్తున్న థాయిస్‌కోసం వెళ్ళాను. ఎన్నెన్నో శ్రమలు పడ్డాను. ఇదంతా నీకోసం కాని, నాకోసం కాదు. నీకోసం ఇంతచేసిన నన్ను - నీ విలా బాధించడం న్యాయంకాదు ప్రభూ! ఓచల్లని ఏసు ప్రభూ! నన్ను రక్షించు. ఓ, రక్షకుడా! నన్ను కాపాడు! మాయలోపడి నేను మనలేను. నన్ను మాయలో పడకుండా చెయ్యిస్వామీ! ఏ నీలి నీడలూ నాపై వాలకుండా చూడు ప్రభూ! ఇప్పుడు నేను మహావిపత్తులో చిక్కుకొన్నానని నాకు తెలుసు. వాస్తవంకంటె స్వప్నం బలవత్తరమైనదనీ నే నెరుగు దును. స్వప్నం అన్నిటినీ మించిన నిజం! అన్నిటికీ అది ఆత్మ.

విగ్రహారాధకుడైనప్పటికీ, ప్లేటో మరియు ప్లేటో - భావాలకు వాస్తవమైన ఉనికి ఉన్నదనే విషయం పరీక్షించి చూచాడు. ఆనాటివిందులో ఎందరు రాక్షసులను నేను కళ్ళారా కాంచాను! అప్పుడు నీవు నా వెంటనే ఉన్నావుకదా? ఆ రాక్షసులు ఎన్నెన్నోవాదనలు చేశారు. వారిమధ్యకూడా నే నొక విషయం స్పష్టంగా గ్రహించ గలిగాను. ఏకాంతంలోనే, ధ్యానంలోనే, బ్రహ్మానందంలోనే వాస్తవమైన విషయాలను చూడగలమన్న విషయం నేను అవగతం చేసుకొన్నాను. ప్రభూ! స్వప్నాల ప్రభావం ఎటువంటిదో - నీ వేదవాక్కుల వలన అనేకతడవలు చూడగలిగాను. మహాశక్తిసంపన్నుడవైన ఓ ఈశ్వరా! అవి నీ సంకల్పంవల్లనైనా జనించాలి, లేదా నీకు ప్రతికూలమైన శక్తి అయినా వాటిని కల్పించిఉండాలి"-

పఫ్నూటియస్‌లో ఇప్పుడు మరొక క్రొత్తమనిషి ప్రవేశించాడు. ఈశ్వరునితో సమాధానపడడానికి ప్రయత్నించాడు. కాని భగవంతుడు ఆయనకు వెలుగు ప్రసాదించలేదు. ఉత్తేజాన్ని ఇవ్వలేదు. ఆయనకు రాత్రిళ్ళు నిద్రలేదు. బరువుగా, బాధగా, దీర్ఘంగా గడుస్తున్నాయి. రాత్రిళ్ళేకాదు, పగళ్ళూ అంతే. ఒకనాటి వేకువన ఆయన మేల్కొన్నాడు. బరువుగా నిశ్వసించాడు. నేరాలు, ఘోరాలు చేసినవారి సమాధులపై నుండి ఏదో చంద్రకాంతిలాంటిది వచ్చి ఆయన్నుతాకింది. థాయిస్ ఆయన కనులముందు పొడగట్టింది. రక్తం చిమ్ముతున్న తన పాదాలు చూపింది. ఆయన ఏడుస్తున్నాడు. ఆవిడ కెటాలున వచ్చి ఆయన శయ్యమీద వాలిపోయింది. ఏమాత్రం

సందేహంలేదు. థాయిస్ రూపమే అది. అచ్చంగా ఆ వేశ్య రూపమే అది.

పఫ్నూటియస్ హృదయం దుఃఖంతో, అసహ్యంతో నిండిపోయింది. వెంటనే తన పవిత్రమైన శయ్యనుండి లేచాడు. రెండుచేతులతో ముఖాన్ని కప్పుకొన్నాడు. సూర్యకాంతిని చూడకూడదనుకొన్నాడు. అలా ఎన్నోగంటలు గడిచింది. కాని కోలుకోలేదు. అవమానంతో, ఆవేదనతో క్రుంగిపోతు న్నాడు. ఆశ్రమం నిశ్శబ్దంగా ఉంది. ఎన్నోరోజుల తరువాత, మొట్టమొదటిసారిగా పఫ్నూటియస్ అలా ఏకాంతంలో ఉండి పోయాడు. చివరకు ఆయనను ఆవరించుకొన్న మాయ విడి పోయింది. ఆ తెర విడిపోయినప్పటికీ ఆయనకు శాంతి చిక్క లేదు. అదలా విడిపోవడం ఆయనకు మరింత బాధ కలిగించింది. దాని వియోగం భరించలేకుండా ఉన్నాడు. ఆ స్వప్నమే తెరలు తెరలుగా ఆయన మనస్సులోకి వస్తున్నది. మహా భయంతో ఇలా అనుకొన్నాడు–

"ఏమిటిది? థాయిస్‌ను విడిచిపెట్టలేకుండా ఉన్నా నేమిటి? ఆవిడ చల్లని కౌగిట్లోనుంచి తప్పించుకోలేక పోతున్నానేమిటి?"

ఇక తన ఆశ్రమం అపవిత్రమైపోయిందనుకొన్నాడు. తను తపస్సు చేసుకొనే ఆసనం పాపపంకిలమయిందను కొన్నాడు. ఇక ఆ ఆశ్రమంలో ఏక్షణంలోనయినా పిశా చాలు స్వేచ్ఛగా ప్రవేశించవచ్చనుకొన్నాడు. ఇక అక్కడ భగవంతునిపేరు ఉచ్చరించడానికే భయపడ్డాడు. ఆయన భయ

పడినట్లే జరిగింది. అనుకొన్నంతా అయింది. ఎన్నడూ ఏ క్షుద్రజంతువూ ఆయన ఆశ్రమంలో అడుగుపెట్టలేదు. అలాంటిది ఇప్పుడు-ఏడు నక్కలు-గుంపుగావచ్చి ఆగుహాలో ప్రవేశించాయి. ఆయన ప్రక్కకిందికివెళ్ళి దాక్కొన్నాయి. తరువాత అసురసంధ్యవేళ ఎనిమిదవది వచ్చి చేరుకొన్నది. ఆమరునటిరోజు మరొకటి - ఇలా అంతకంతకూ, ముప్ఫయి, నలభై, యాభై, అరవై - చివరకు ఎనభైనక్కలు ఆగుహాలో పోగయినాయి. అన్నీ చిన్న చిన్న పిల్లలు. ఒక్కొక్కటి ఎలుకపిల్లంతఉన్నది. క్రిందా - పైనా, బల్లమీద, పక్క మీద - అంతటా నక్కపిల్లలే - ఒకపిల్ల బల్లమీదికెగిరి అక్కడున్న దేవునిచిత్రంపై నాలుగుకాళ్ళూపెట్టి కూచుంది. ఆయనవంక తీక్షణంగా చూచింది. ఇలా రోజు రోజుకూ స్వేచ్ఛగా నక్కలు అక్కడికి రాసాగాయి. ఆశ్రమంలో ఎక్కడచూచినా మృత్యువు!- మృత్యువు అంతటా విచ్చలవిడి విహరిస్తోంది!

తనకు వస్తున్న దుస్వప్నాలవల్ల కలిగే పాపాలకు ప్రాయశ్చిత్తం కావించుకోడానికీ, తన మనస్సులోకి చెడు ఆలోచనలు రాకుండా చేసుకోడానికీ, ఆశ్రమాన్ని విడిచివెళ్ళడానికీ నిశ్చయించుకొన్నాడు పఫ్నూటియస్. ఈ పాపపంకిలంనుండి బయటపడడానికి తపస్సు ఒక్కటే ఆధారమనుకొన్నాడు. దూరంగా, తపోవనాలకు వెళ్ళిపోయి ఎవరూ కనీ, వినీ ఎరుగని కఠోరనియమాలు, అసిధారావ్రతాలు చేపట్టాలనుకొన్నాడు. తన ఆత్మనూ, దేహాన్నీ పలుకష్టాలకు గురిచెయ్యాలనుకొన్నాడు. ఆవిధంగా తిరిగీ తపోధనుడై బ్రహ్మర్షిత్వం

సాధించాలని నిశ్చయించుకొన్నాడు. అందుకు ముందుగానే ముందు వృద్ధుడైన పాలెమన్‌ను ఒకమాటు దర్శించి ఆయన సలహా తీసుకోవాలని బయలుదేరాడు.

పఫ్నూటియస్ వెళ్ళేసరికి పాలెమన్ తన తోటలో పిట్టలకు, పక్షులకు ఆహారం, నీళ్ళు పెడుతున్నాడు. అది సాయంత్రపువేళ. నీలికొండల నానుకొని నైలునది ప్రవహిస్తున్నది. నూరేండ్లు నిండుతున్న ఆ వృద్ధుని భుజంమీద ఒక చిన్న పావురాయిపిట్ట వాలిఉన్నది. అది భయపడి ఎగిరి పోతుందేమోనని ఆయన మెల్లగా నడుస్తున్నాడు.

పఫ్నూటియస్‌ను చూడగానే వృద్ధుడు-"క్షేమంగా ఉన్నావా నాయనా? నీ ఈశ్వరారాధన సక్రమంగా సాగుతున్నదికదా? నా జీవితం ఈ పక్షులతో, జంతువులతో సరి పోతున్నది నాయనా. ఆ భగవంతుడు వీటిని నాకు అప్పగించాడు. ఇదంతా ఆయన సృష్టికదా నాయనా! చూడు, ఈ చిన్ని పావురాయిపిట్టను చూడు! ఇది ఎంత ముద్దుగా ఉన్నదంటావు? దీని మెడ ఎంత అందంగా ఉన్నదంటావు? ఇదంతా ఆ ఈశ్వరుని సృష్టి సౌందర్యం తండ్రీ! సరే బాబూ! నీవు నాతో ఏదైనా మాట్లాడాలని వచ్చావా? దైవసంబంధమైన విషయం ఏదైనా అడగాలని వచ్చావా? చెప్పు నాయనా! అందుకే వచ్చినట్లయితే ఈ నీళ్ళకుండ ఇక్కడపెట్టి నీవు అడిగేదేమిటో వింటాను" అన్నాడు.

అప్పుడు పఫ్నూటియస్ తన విషయం చెప్పాడు. తాను థాయిస్‌కోసం వెళ్ళడం, తిరిగి తపోవనాలకు రావడం,

ఆశ్రమంలో తనకు వచ్చిన దుస్స్వప్నాలు, నక్కలు ఆశ్రమంలో ప్రవేశించడం-మొదలైన విషయాలన్నీ-ఏ ఒక్క పాపకార్యం దాచకుండా-అన్నీ పూసగ్రుచ్చినట్లు ఆయనకు చెప్పాడు.

"స్వామీ! ఇదంతా చూడబోతే పిశాచాల ప్రభావంలా తోస్తున్నది. కాబట్టి నేను ఒంటిగా ఎడారులకు వెళ్ళిపోయి అక్కడ తాపసికి అవసరమైన కఠోర నియమాలు, వ్రతాలు చేపట్టాలనుకుంటున్నాను. అందుకు మీ రేమంటారు స్వామీ?" అని అడిగాడు.

"నాయనా! నామటుకు నేను మహాపాపిని. నాకు మానవులగురించి తెలిసింది అత్యల్పం. నా జీవితమంతా ఈ వనంలో- యీ వృక్షాలమధ్య, పక్షులమధ్య, జంతువులమధ్య గడిచిపోయింది నాయనా! కాని నా కొకటి అనిపిస్తున్నది. నీవు నిరంతరం ఏకాంతంగా తపస్సులో ఉండేవాడివి. అలాటి వాడివి అకస్మాత్తుగా, అల్లకల్లోలంగా ఉండే మానవలోకంలోకి వెళ్ళావు. అదే నీ యీ విచారానికి కారణం. అకస్మాత్తుగా ఇలాంటి మార్పులు ఎప్పుడూ ఆత్మసంక్షోభాన్ని కలిగిస్తాయి నాయనా. ఆత్మకుగల ఆరోగ్యాన్ని చెడగొడతాయి. అధికోష్ణాన్నీ, అధికశైత్యాన్నీ - రెంటినీ ఒకేసారి బహిర్గతం చేసే మనిషిలాంటి మనిషివి నీవు. ఆ మనిషిని ఒకప్రక్క దగ్గు పీల్చి పిప్పిచేస్తుంది. మరొకప్రక్క జ్వరం అల్లడ-తల్లడచేస్తుంది. నాయనా! నీవున్న పరిస్థితిలో నేనున్నట్లయితే-నీలా తక్షణం తపోవనాలకు వెళ్ళి ముక్కు-మూసుకొని కూచోను. ఒకసన్యాసికి, మఠాధిపతికి సరిపడే విషయాలను స్వీకరించి వినోదంగా గడిపేవాణ్ణి. ఇరుగు - పొరుగున ఉన్న క్రైస్తవమఠాలను

దర్శించేవాణ్ణి ఈ మఠాలలో కొన్ని మరీ అద్భుతంగా ఉంటాయని చెప్పగా విన్నాను నాయనా సెరపియన్ మఠంలో ఒక వెయ్యీ నాలుగువందల ముప్పయిరెండు గుహలున్నాయట! ఎవరో అన్నారు. సన్యాసులను గుంపులు గుంపులుగా విడదీసి ఆ గుహాలలో ఉంచుతారట! గ్రీకుభాషలో ఎన్ని అక్షరా లున్నాయో అన్ని గుంపులుగా ఉన్నారట ఆ సన్యాసులు. ఒక్కొక్క గుంపుకు ఒక్కొక్క అక్షరం గుర్తుగా ఉంచుతారనీ, ఆ గుర్తు ఒక్కొక్క గుంపు స్వభావానికి సాదృశ్యంగా ఉంటుందనీ, విచిత్రంగా చెప్తుకొంటారు. ఉదాహరణకు 'జడ్' అనే అక్షరం గుర్తుగల గుంపులో ఉండే సన్యాసులు హింసించే స్వభావం కలవారట! అలాగే 'ఐ' అనే అక్షరం చిహ్నంగా కలవారు సత్య సంఘులని చెపుతారు. నాయనా పఫ్నూటియస్! నీలాగే నేనున్నట్లయితే తప్పకుండా అక్కడికి వెళ్ళి ఈ చిత్రవిచిత్రాలన్నీ కళ్ళారా చూచేవాణ్ణి. ఒక్కక్షణం విశ్రాంతిలేకుండా పర్యటించేవాణ్ణి. నైలునదీ తీరాన నివసించే వివిధవర్గాలకు చెందిన జనాన్ని స్వయంగా వెళ్ళి పరిశీలించేవాణ్ణి. వారి ఆహార విహారాదులనుగురించి తెలుసుకొనేవాణ్ణి. ఒకరికీ ఒకరికీ గల వైవిధ్యం ఏమిటో గ్రహించేవాణ్ణి. నీవంటి మతోద్ధారకునకు ఇలాంటి పరిశీలన ఎంతో అవసరం నాయనా. మఠాధిపతి ఇప్రహెంమ్‌ను గురించి నీవు వినేఉంటావు. ఆయన తన మఠానికి చాలా చక్కని ధర్మశాసనాలు ఎన్నో వ్రాయించాడు. ఆయన అనుమతిపొంది వాటి నకళ్ళు నీవు ఎత్తి వ్రాసుకోవచ్చు. నీవు చక్కని వ్రాయసగాడవు. నా

కటుకు నేను అందుకు పనికిరాను. పార-పలుగు పట్టుకొని అస్తమానం పనిచేస్తున్న నా చేతులు మొరటు తేలి, మొద్దు బారి పోయినాయి. వ్రాతకు పనికిరావు నీవా విద్యాధికుడవు' భాషాజ్ఞానం కలవాడవు. నీ అక్షరాలు ముత్యాల్లా ఉంటాయి. అదికూడా అందరికీ అబ్బదు నాయనా. మంచి వ్రాయస గాడు కావడంకూడా ఈశ్వరానుగ్రహమే. అంతేకాదు. చద వడంలో, వ్రాయడంలో గడిపేవారికి చెడు ఆలోచనలు త్వరగా మనస్సులోకి రావు నాయనా. పఫ్నూటియస్ ! మన పితృపాదులగు పాల్, ఆంథోనీల ఉపదేశాలు నీవు ఎందుకు వ్రాసి పెట్టకూడదూ? ఇటువంటి పుణ్యకార్యాలు చేస్తుంటే క్రమక్రమంగా నీ మనస్సు కోలుకుంటుంది నాయనా. నీ మనస్సుకూ, ఆత్మకూ శాంతి చిక్కుతుంది. మళ్ళీ నీవు మామూలు మనిషివి అవుతావు. ఆనందం పొందు తావు. శాంతచిత్తుడవై ఏకాంతంలో సుఖం అనుభవిస్తావు. మళ్ళీ నీవు యథావిధిగా సన్యాసాశ్రమ ధర్మాలు నిర్వర్తించు కోవచ్చును. అంతేకాని కఠోరమైన వ్రతాలవల్ల, తపస్సులవల్ల అంతగా ప్రయోజనంలేదు నాయనా. మన తండ్రి ఆంథోనీ – మనమధ్య ఉండేటప్పుడు ఒకవిషయం చెప్పేవాడు. నాకు బాగా జ్ఞాపకం – కటికి ఉపవాసాలు చెయ్యడంవల్ల శరీరంలో బల హీనత ఏర్పడుతుంది. పనిచేసేశక్తి లేకుండా పోతుంది.దానివలన సోమరితనం బలుస్తుంది – అక్రమమైన పద్ధతిలో కటికి ఉపవా సాలుచేసి కొందరు సన్యాసులు తమదేహాన్ని శుష్కింపచేసు కొన్నారు. భూతశక్తి ఆవహించడంవల్ల తమ్ముతాము నాశనం చేసుకొన్నారని వారినిగురించి చెప్పబడుతోంది–''అని ఆయన

సెలవిచ్చారు. "కాబట్టి నాయనా! నీకీ విషయం చెప్పాను. నేను వృద్ధుణ్ణి. అజ్ఞానిని. అయినా భగవంతుని కృపవలన మహాత్ములు చెప్పినవాక్కులు జ్ఞాపకం ఉంచుకోగలిగాను" అని చెప్పాడు వృద్ధుడు పాలెమన్.

పఫ్నూటియస్. ఆయనకు నమస్కరించాడు. ఆయన సలహా పాటించడానికి ప్రయత్నిస్తానని వాగ్దానం చేశాడు. పిమ్మట ఆయనవద్ద సెలవుగైకొని అక్కడనుంచి బయలు దేరాడు. తోట దాటివచ్చి వెనుదిరిగి చూచాడు. వృద్ధుడు మొక్కలకు నీళ్ళు పోస్తూఉండడం కనుపించింది. ఆయన నడుం విల్లంబుబద్దలా వంగిపోయింది. నడవలేక నడుస్తున్నాడు. ఆ దృశ్యం పఫ్నూటియస్ హృదయాన్ని కలచివేసింది. ఆయన కంట తడిపెట్టాడు.

ఆయన తిరిగి ఆశ్రమానికి వచ్చి చూచేసరికి అక్కడొక చిత్రం జరిగింది. ఇసుకరేణువుల్లాంటివి సుడిగాలికి కొట్టుకొని వచ్చి ఆశ్రమంనిండా పడిఉన్నాయి. ఆ రేణువులకు జీవం ఉన్నది. అటు – ఇటు కదులుతున్నాయి. అవి నక్కల దేహాలకు సంబంధించిన లవణాలని ఆయన తెలుసుకొన్నాడు. ఆరాత్రి ఆయన కొక కలవచ్చింది. ఒకఎత్తైన రాతిస్తంభం కనుపించింది. ఆ స్తంభంపైన ఒక మానవాకృతి అగుపడి "ఈ స్తంభం అధిరోహించు!" అని చెప్పింది.

ఆయన నిద్ర మేల్కొన్నాడు. దివ్యలోకాలనుండి భగవంతుని ఆదేశం ఈ స్వప్నరూపంలో వచ్చిందని అనుకొన్నాడు. వెంటనే తనశిష్యులనందరినీ పిలిపించాడు.

"నాయనలారా! నేను మిమ్మందరినీ వదలి వెడు తున్నాను. భగవంతుడు ఎక్కడకు పంపుతాడో అక్కడికి వెళ్ళాలి. కాబట్టి నే నిక్కడ లేనంతకాలం, నాస్థానంలో సోద రుడు ప్లావియన్ ఉంటాడు. నామారుగా అతన్ని మీకు అప్ప చెపుతున్నాను. న న్నెలా గౌరవించారో అతన్ని అలా గౌరవిం చండి. అతని ఆజ్ఞలను శిరసావహించండి. పోతే, మన సోదరుడు పాల్ ఉన్నాడే - అతన్ని జాగ్రత్తగా కనిపెట్టి ఉండండి. నాయన లారా! సెలవు తీసుకొంటాను-" అని వారికి చెప్పాడు.

శిష్యుల కిలా చెప్పి పఫ్నూటియస్ ఆశ్రమం విడిచి పెట్టాడు. ఎడారులలోగుండా నడిచి వెళ్ళసాగాడు. శిష్యులంతా నేలమీద మోకరిల్లి ఆయనకు నమస్కరించారు. ప్రార్థనలు చేశారు. తలఎత్తి చూచేసరికి ఆయన దూరంగా, దిగంతాల లోకి మెల్లగా నడిచి వెడుతూఉండడం వారికి కనుపించింది.

ఆ విధంగా పఫ్నూటియస్ రాత్రిం బగళ్ళు నడిచి ప్రయాణం సాగించాడు. చివరకు ఒకశిథిలమైన దేవాలయం చేరుకొన్నాడు. పూర్వం విగ్రహారాధకులు కట్టిన ఆలయం అది. ఇదివరకు పఫ్నూటియస్ దేశయాత్రలు చేసినప్పుడు ఆ దేవళంలో ఎన్నో రాత్రులు గడిపాడు. తేళ్ళు - పాములమధ్య, భయంకరమైన పిశాచాలమధ్య పడుకొని, రోజులు గడిపాడు. ఆలయం గోడలమీద ఎన్నెన్నో మంత్రాలు, యంత్రాలు - ఇప్పటికీ చెరిగిపోకుండా ఉన్నాయి. బ్రహ్మాండ మైన రాతిస్తంభాలు ఒక ముప్పైదాకా అక్కడ ఉన్నాయి. ఆ స్తంభాల కొట్టకొసన మానవ శిరస్సులమాదిరిగాను, పద్మదళాల మాదిరిగాను నిర్మితమై ఉన్నాయి. ఆలయానికి

ఒకకొసన ఒక పెద్ద రాతి స్తంభం ప్రత్యేకంగా ఉన్నది. అది చాలా పురాతనమై, అక్కడక్కడ విరిగి - దేనితోనూ సంబంధం లేకుండా ఉన్నది. ఆ స్తంభం కొన ఒక స్త్రీ ముఖా కృతిలో ఉంది. పెద్ద పెద్ద కండ్లు, గుండ్రటి చెక్కిళ్లు, నవ్వు ముఖం - కాని తలమీద ఆవు కొమ్ములవంటి కొమ్ము లున్నాయి.

పఫ్నూటియస్ ఆ స్తంభాన్ని తేరిపారచూచాడు. తనకు స్వప్నంలో కనుపించినది అదేనని గుర్తించాడు. అది ముప్పయి రెండు మూరల ఎత్తుఉంటుందని అంచనా వేసుకొన్నాడు. తరువాత ఆ ప్రక్కనేఉన్న గ్రామానికి వెళ్ళాడు. ముప్పయి రెండు మూరల పొడుగుగల నిచ్చెన ఒకటి తయారుచేయిం చాడు. దానిని తెప్పించి ఆ స్తంభానికి ఆనించి నిలబెట్టాడు. తరువాత నిచ్చెన ఎక్కి స్తంభం కొట్టకొసకు వెళ్ళి కూచు న్నాడు. అక్కడనుంచి భగవంతుని ఇలా ప్రార్థించాడు-

"ప్రభూ! నీవు నన్ను ఆదేశించిన ప్రకారం- ఇదిగో, నే నీ స్థలానికి చేరుకొన్నాను. ఈశ్వరా! నీ దయ ఉంటే చాలు-ఈ స్తంభం కొసన ఇలాగే, నాకు చావు సమీపించే- వరకూ వ్రేలాడుతూ ఉంటాను!"

పాపం-ఆయన దగ్గర తినుపదార్థాలు ఏమీ లేవు. ఏవస్తువూ వెంట తీసుకు వెళ్ళలేదు. భగవంతునిపై భారం వేశాడు. ఆయన దయ ఉంటే, ఆ గ్రామంలో జనులు ఎవరో ఒకరు సహాయం చెయ్యరా అనుకొన్నాడు. నిజానికి ఆ మరు నటి రోజున తొమ్మిది గంట లయ్యేసరికి అలాగే జరిగింది.

గ్రామంలోని స్త్రీలు తమ పిల్లలతో సహా అక్కడికి వచ్చారు. రొట్టెలు, ఖర్జూరపు పండ్లు, మంచినీళ్లు అన్నీ పట్టుకొచ్చారు. చిన్నచిన్న పిల్లలు ఆ పదార్థాలు తీసుకొని నిచ్చెన ఎక్కారు. వాటిని ఆయనకు అందించారు.

స్తంభం కొసన జాగా లేదు. అక్కడ మనిషి కూచోవడమే కష్టం. అలాంటిది పడుకోవడం ఎలాగ? చాలా ప్రమాదకరం. ఏ క్షణంలోనైనా క్రింద పడిపోవచ్చు. అయినా పఖ్యాటియస్ ఆ కొసన అలాగే వెల్లకిల పడుకొన్నాడు. కాళ్లు ముడుచుకొన్నాడు. తల వాల్చుకొని పొట్టలోకి దూర్చుకొన్నాడు. ఆయన పరిస్థితి చూచేవారికే మహా భయంకరంగా ఉంది. దారుణమైన బాధ అనుభవిస్తూ అలాగే కనులుమూసుకొని పడుకొన్నాడు. ప్రాతఃకాలంలో క్రౌంచపక్షులు వచ్చి రెక్కలతో ఆయనకు విసిరాయి. ఆయన భయంతోను, బాధతోను నిద్ర మేల్కొన్నాడు.

నిచ్చెన తయారుచేసిన వడ్రంగి ఈ పరిస్థితి అంతా చూచాడు. ఆ మహాత్ముడు ఎండకూ, వానకూ, శుష్కించి వరుగయిపోతాడేమోనని, అలా పడుకొని ఏ క్షణంలోనో జారి క్రిందపడిపోతాడేమోననీ అనుకొన్నాడు. తను నిచ్చెన తయారు చేసి ఇవ్వబట్టేకదా ఇంతప్రమాదం వచ్చింది! అందుకు భగవంతుడు తనను శిక్షిస్తాడేమోనని భయపడ్డాడు. వెంటనే ఆపుణ్యాత్ముని కాపాడాలన్న తలంపుతో క్రింద గుంజలు పాతి, ఆ స్తంభంపైన ఒక కప్పులాంటిది నిర్మించాడు. స్తంభం చుట్టూ ఒక మంచెలాంటిదికూడా కట్టాడు. ఆ విధంగా ఆయ

నకు ఎండ తాకకుండాను, వాన పడకుండాను, ఆయన క్రింద పడినా ప్రమాదం లేకుండాను చేశాడు.

త్వరలోనే ఈ విచిత్రవార్త ఊరూరా ప్రాకిపోయింది. పల్లెపల్లెకూ వ్యాపించింది. మహాత్ముడు పఫ్నూటియస్ ఎన్నడూ కని విని ఎరుగని విధంగా ఆకాశంలో స్తంభంకొసన పడుకొని కఠోర తపస్సు సలుపుతున్నాడని అందరికీ తెలిసి పోయింది. పల్లెలలోనుంచి ప్రజలు గుంపులు గుంపులుగా ఆ చిత్రిం చూడ రాసాగారు. కొండ కోనలలో, లోయలలో ఉండే పాటకజనం, భార్యా బిడ్డలతో సహా ప్రతి ఆదివారం అక్కడికి వచ్చి చూచిపోతున్నారు. ఆయన శిష్యులకుకూడా ఈ అద్భుతవార్త అందింది. వారు ఆశ్చర్యపోయి వెంటనే అక్కడికి పరుగెత్తుకొని వచ్చారు. ఆయన అనుమతి పొంది, అక్కడే – ఆ స్తంభందగ్గరే పర్ణకుటీరాలు కట్టుకొని ఉంటూ వచ్చారు. ప్రతిరోజూ ఉదయం శిష్యులంతా వచ్చి స్తంభంచుట్టూ గుండ్రంగా నిలుచునేవారు. తను గురువు చెప్పే ఉపదేశాలు శ్రద్ధాసక్తులతో వినేవారు. పఫ్నూటియస్ వారి కిలా బోధించేవాడు:

"నాయనలారా! జీసస్ ప్రేమకు పాత్రులైనబిడ్డలు ఎలా జీవించారో, అలా జీవించండి ముక్తికి అదే రాచబాట. దైహికంగా చేసిన పాపమున్నదే – ఆపాపమే అన్నిపాపాలకూ మూలం. తల్లికి పిల్లపుట్టినట్లు పాపాలన్నీ ఆపాపంనుండే పుడ తాయి. అహంకారం, అత్యాశ, లోభం, క్రోధం, అసూయ, ద్వేషం – ఇవన్నీ ఆపాపానికి ముద్దుబిడ్డలు! ఈవిషయం నేను అలెగ్జాండ్రియా నగరంలో కళ్ళారా చూచాను. శ్రీమంతులు

భోగలాలసులై, పాపపంకిలంలోపడి కొట్టుకపోతున్నారు. అలా పోయి పోయి తుదకు అగాధమైన - నరకకూపంలో కూలిపోతారు."

తరువాత ఈవార్త, మఠాధిపతులు - ఎఫ్రెమ్, సెరపియన్‌లకుకూడా అందింది. ఈవింత ఏమిటో కళ్ళారా చూడాలని వారు బయలుదేరారు. నదిమీద ప్రయాణంచేసి వస్తుండగా, వారిని అల్లంతదూరాన చూచాడు పఫ్నూటియస్. ఏకాంతవాసులైన సన్యాసులందరికీ తనను ఒక తార్కాణంగా భగవంతుడు ఉంచాడన్న భావం ఆయనమనస్సులోకి వచ్చింది. ఆమఠాధిపతు లిరువురూ పఫ్నూటియస్‌ను సమీపించారు. ఆశ్చర్యచకితులయినారు. ఇరువురూ తమలోతాము సంప్రదించుకొన్నారు. ఇటువంటి అసాధారణమైన తపోదీక్ష పనికిరాదని తీర్మానించుకొన్నారు. ఈదీక్షనుంచి పఫ్నూటియస్‌ను విరమింపచెయ్యాలని నిశ్చయించుకొన్నారు.

"ఇటువంటి జీవితం అవలంబించడం మేం ఎక్కడా చూళ్ళేదు. ఇది చాలా వింతగా ఉంది. ధర్మనియమాలన్నింటికీ విరుద్ధంగాఉంది!"అన్నారు.

కాని పఫ్నూటియస్ వారికిలా ప్రత్యుత్తరం ఒసగాడు:

"పీఠాధిపతుల జీవితం-విచిత్రము, వింత కాక మరేమిటి? సన్యాసుల చర్యలు ఎప్పుడూ అసాధారణంగానే ఉంటాయి. భగవంతుని ఆదేశానుసారం నే నీ దీక్షకు పూనుకొన్నాను. ఈ స్తంభాన్ని అధిరోహించాను. ఈదీక్ష విరమించుకోవాలంటే,

ఇక్కడనుంచి దిగిరావాలంటే, మళ్ళీ ఆ ఈశ్వరుడే నాకు ఆజ్ఞ ఇవ్వాలి!"

ఇలా చెప్పి పఫ్నూటియస్ తన దీక్ష యథావిధి కొనసాగించాడు. ప్రతిరోజూ అక్కడికి వాతస్థులు రాసాగారు. పఫ్నూటియస్ శిష్యులతోపాటు వారున్నూ, అక్కడ కుటీరాలు నిర్మించుకొని ఉండిపోయారు. వారిలో కొందరు ఆయనను అనుకరించడానికి ప్రయత్నించారు. శిథిలమైన ఆ ఆలయ గోపురాలపైకి ఎక్కి కూచున్నారు. కాని అలా ఎంతోసేపు ఉండలేకపోయారు. గాలికీ, ఎండకూ తట్టుకోలేక శోషవచ్చి, మళ్ళీ క్రిందకి దిగి వచ్చారు. ఇహ ఆ ప్రయత్నం విరమించుకొన్నారు.

దేశం నలుమూలలనుంచీ జనం, తీర్థప్రజాలా అక్కడికి వస్తున్నారు. చాలా దూరప్రదేశాలనుండికూడా జనం ఆకలి దప్పులను సయితం లెక్కచెయ్యక నానా శ్రమలు పడి వస్తున్నారు. పేదరాలయిన ఒక వితంతువుకు ఒక ఆలోచన తట్టింది. ఎడారికి వస్తున్న ఆ జనానికి మంచినీళ్లు, కర్జూరపండ్లు అమ్మి డబ్బుగడించవచ్చునని అనుకొన్నది. ఇహనేం? స్తంభానికి చేరువలో ఒక అంగడి పెట్టింది. మట్టికుండలనిండా మంచి నీళ్ళు, ఒక చెక్కబల్లమీద పండ్లరసాలు ఉంచింది. బేరం సాగించింది- "ఏ మర్రోయ్! చల్లని పానీయం ఎవరికి కావాలి?" అంటూ కేకలు వెయ్యసాగింది. ఆమెనుచూచి తక్కిన జనం ఎగబడ్డారు. పొట్ట తిప్పలకు తలా ఒక వ్యాపారం మొదలెట్టారు. ఒక డొక్క చిన్నపొయ్యిపెట్టి రొట్టెలుచేసి వచ్చిన యాత్రీకులకు

అమ్మడం మొదలుపెట్టాడు. ఇహ వచ్చే జనానికి తెంపులే కుండా పోయింది ఈజిప్టులోని పెద్ద పెద్ద నగరవాసులంతా రాసాగారు. ఈ అదనుచూచి ఒక ఆశపోతు వ్యాపారస్థుడు పెద్ద సత్రమే ఒకటి అక్కడ కట్టించాడు. జనానికి గదులు అద్దెకిస్తున్నాడు. పెద్దపెద్దవారు ఉండడానికీ, వారి సేవకులు ఉండడానికీ, వారి గాడిదలు, ఒంటెలు కట్టెయ్యడానికీ వేరువేరుస్థలాలు ఏర్పాటుచేసి డబ్బు గుంజుకొంటున్నాడు. త్వరలోనే ఆ స్తంభం ముందు ఒక పెద్ద "మార్కెట్" కూడా ఏర్పాటయింది. నైలునదీ తీరంలోని బెస్తవాడొకడు చేపలు, మాంసం, తెచ్చి పెట్టాడు. కొందరు తోటపనివాండ్రు శాకాహారులకు రకరకాల కూరగాయలు తెచ్చిపెట్టి అమ్ముతున్నారు. ఒక మంగలివాడు బాహాటంగానే కూచుని వచ్చిన వాళ్ళకు తలలు గొరుగుతూ, గడ్డాలు గీకుతూ, తమాషాలు పట్టిస్తున్నాడు! శిథిలమై ఎంతోకాలంగా నిశ్శబ్దంలో మునిగి ఉన్న ఆ దేవాలయం-నర సంచారంలేని ఆ ప్రదేశం-ఇప్పుడు కోలాహలంగా ఉన్నది. ఎక్కడ చూచినా జనం,ఎక్కడ బట్టినా ధ్వనులు! అదొక పెద్ద ఊరుగా తయారయింది. రకరకాల అంగళ్ళు వెలిశాయి. హోటళ్ళు వచ్చాయి. ఇండ్లు ఏర్పాటయినాయి. పఫ్నూటియస్, స్తంభంపై తపస్సు చేస్తున్నట్లుగా ఉన్న పటాలు, తయారయినాయి. దుకాణదారులు, హోటళ్ళవాళ్లు ఆ పటాలను తమ అంగళ్ళముందు, హోటళ్ళముందు, గోడలకు వ్రేలాడదీశారు. "ద్రాక్ష సారాయి, దానిమ్మ పండ్ల సారాయి, అత్తిపండ్లసారాయి, శ్రేష్ఠమైన కాల్డియన్ బీర్ ఇచ్చట అమ్మబడును!" అని గ్రీకు, ఈజిప్షియన్ భాషలలో

బోర్డులు వ్రాసి కట్టారు. చిల్లర సరుకులు అమ్మేవారు ఉల్లి పాయలు గుత్తులు గుత్తులుగా గుమ్మటాలుకట్టి అంగళ్ళ ముందు వ్రేలాడ దీశారు. వేయించిన చేపలు, చచ్చిన సీమ కుంకేళ్ళు, గొర్రె తలకాయలు-ఇలాంటివన్నీ ఏమూలాణంలో చూచినా వ్రేలాడుతూ కనిపిస్తున్నాయి. సాయంకాలం వేళ మరి గోల-వంటలు వండేవారు, ఇళ్ళలోనుంచి ఎగసి వచ్చే పొగలు, సెగలు,-తప్పతాగి తిప్పన్న పదాలు పాడేవారి కేకలు-పెడబొబ్బలు-ఎక్కడ చూచినా కోలాహలం. తిరణాల! రాను రాను ఊరు పెరిగిపోయింది. జనాభా జాస్తి అయింది. బజారులు, వీధులు మొలుచుకొచ్చాయి. రోడ్లు ఏర్పాటయి నాయి. తాపీపనివారు వచ్చి పెద్దపెద్ద భవంతులు నిర్మించారు. మఠాలు, ధర్మసత్రాలు, గుళ్లు, గోపురాలు, అన్నీ వెలిశాయి. ఆరు మాసాలయ్యేసరికి అక్కడొక మహానగరం తయారయి ఊరుకొంది. ఒక రక్షకమందిరం, ఒక న్యాయస్థానం, ఒక కారాగారం, ఒక పాఠశాల, ఇవన్నీ అక్కడ ఏర్పాటయినాయి.

వచ్చే యాత్రికులకు అంతులేదు. బిషప్‌లు, మతాధి కారులు, పీఠాధిపతులు, గురువులు అంతా వచ్చి చూచి పోతు న్నారు. పఫ్నూటియస్‌ను ఎంతగానో అభినందిస్తున్నారు. ఆ సమయంలో ఈజిప్టులోఉన్న ఆంటియూచ్ ప్రధానాచార్యుడు తన శిష్యకోటినంతా వెంటబెట్టుకొని అక్కడికి దయచేశాడు. అసాధారణమైన దీక్షబూనిన పఫ్నూటియస్‌ను వేనోళ్ళ అభి నందించి ఆనందం వెలిబుచ్చాడు. లిబియన్ చర్చి తాలూకు వారంతాకూడా ఆయన అభిప్రాయాన్ని అనుసరించారు. తమ అభినందనలుకూడా తెలియచేశారు. ఇదంతా విని

మఠాధిపతులు ఎఫ్రెమ్, సెరపియన్‌లు మళ్ళీ పఫ్నూటియస్ దగ్గరికి వచ్చారు. ఆయనను దర్శించి-పూర్వం తాము తప్పుడు అభిప్రాయాన్ని వెలిబుచ్చామనీ, అందుకు మన్నించవలసినదనీ క్షమాపణలు చెప్పుకొన్నారు. అందుకు పఫ్నూటియస్ వారి కిలా ప్రత్యుత్తరం ఒసగాడు-

"సోదరులారా! ఒక్క విషయం గ్రహించుకోండి - ఈ ధ్వజ స్తంభంమీద అహోరాత్రాలుండి ఇంతటి కఠోరమైన తపస్సు సలుపుతున్నానూ అంటే - ఇది సామాన్యమైన విషయం కాదు. ఈశ్వరునితో తుల్యమైన మహిమ, ప్రభావం, శక్తి నాలో ఇమిడిఉండబట్టే నే నిలా నిలువగలిగాను! బిడ్డలారా! గగనవీధిలో ఉండి నేను ఈ యావత్ప్రపంచాన్నీ తిలకిస్తున్నాను. ఈ మానవులంతా నా కంటికి చీమలవలె, దోమలవలె కనుపిస్తున్నారు! ఇళ్ళు, గుళ్ళు, నదులు, సముద్రాలు, ఏర్లు, ఎడారులు, పర్వతాలు, పొలాలు, పల్లెలూ, పట్టణాలు - ఒకటే మిటి? - ఈ సృష్టియావత్తూ నాలో నేను చూస్తున్నాను! అనంతమైన బ్రహ్మాండాలను నాలో ధరించిఉన్నాను. వెంట మోసుకొని పోతున్నాను. కాని ఒక్క విషయం. ఈ బ్రహ్మాండమంతటా పాపము, మృత్యువు పరుచుకొని ఉన్నాయి. పృథ్విని చీకట్లు ఆవరించిఉన్నట్లు ఆవరించిఉన్నాయి! నేను చూస్తూనే ఉన్నాను. సృష్టిలోని దుష్టత్వం, పాపం అంతా నాలో ఉన్నది!"-

పఫ్నూటియస్ మానస సరోవరంలో స్త్రీవాంఛ మొలకెత్తిఉన్నది. అందుకే అలా మాట్లాడాడు.

తరువాత పదవమాసంలో అలెగ్జాండ్రియానుండి బుబ స్టిస్, సాయిస్ అను ఇరువురుస్త్రీలు అక్కడికి వచ్చారు. వారికి సంతానంలేదు. గొడ్డుపోతులు! ఆపుణ్యక్షేత్రానికివచ్చి ఆ మహానుభావుణ్ణి దర్శిస్తే సంతానం ప్రాప్తిస్తుందేమోనన్న అభిలాషతో ఆస్త్రీలు అక్కడికి వచ్చారు. పఫ్నూటియస్ ఎక్కిఉన్న రాతిస్తంభానికి మ్రొక్కారు. ఆబండలకు తమ పొట్టలువేసి రుద్దుకున్నారు. ఒకపెద్ద ఊరేగింపు బయలు దేరింది. కనుచూపుమేరవరకూ ఒకటేజనం. బండ్లు, పల్లకీలు, మేనాలు — మహావైభవంగా ఊరేగుతూవచ్చి పఫ్నూటియస్‌కు మొక్కులు మ్రొక్కారు. ముడుపులు చెల్లించుకొన్నారు. అర్చనలు, ఆరాధనలు చేశారు. తిరణాలజనం - ఇహ అక్కడ నుంచి రకరకాలజనం - రాసాగారు. భయంకరమైన రోగా లతో బాధపడేవాళ్లు-అవి,నయం అవుతాయని గుంపులు గుంపు లుగా అక్కడికి వస్తున్నారు. కళ్ళుపోయినవాళ్ళు,కాళ్ళుపోయిన వాళ్ళు, మూర్ఛలవాళ్ళు, నంజురోగులు, పక్షవాతంతో బాధ పడేవాళ్లు, క్షయరోగులు, విషజ్వరాలవాళ్ళు, వెర్రెత్తిన వాళ్ళు, కడుపునొప్పివాళ్ళు, కాళ్ళతీపులవాళ్ళు, కుష్టురోగులు, గాలి - ధూళి సోకినవాళ్ళు, సోలి సోలి పడబొయ్యేవాళ్ళు- ఒకరేమిటి ? లోకంలో ఎన్నిరోగాలవాళ్ళున్నారో-వాళ్ళంతా అక్కడికివచ్చి, గుంపులు గుంపులు పోగవుతున్నారు. రద్దీ జాస్తిఅయింది. ఆజనంలో ఎవరిగోల వారిది. ఒకరినొకరు నెట్టుకొంటూ వెళ్ళి రాతిస్తంభంముందు ప్రాణాచారాలు పడుతున్నారు. పైనుంచి పఫ్నూటియస్, తన రెండుచేతులూ చాచి వారిని ఆశీర్వదిస్తున్నాడు. మంత్రంపెట్టినట్లు వారి

బాధలు మాయమవుతున్నాయి. వారికష్టాలు పోతున్నాయి. ఇహ ఆడవాళ్ళకూ పిల్లలకూ అంతేలేదు. ఏదో ఒకజబ్బు, ఏదో ఒక అవుడు, వచ్చిన తమ పిల్లలను చంక నేసుకొని స్త్రీలు పోర్లబడ్డారు. పఫ్నూటియస్ వారివంక చూచినమాత్రాన, "ఫరవాలేదు, తగ్గిపోతుంది" అని ఒకముక్క పలికినమాత్రాన వారిబాధలన్నీ తీరుతున్నాయి. రోగాలు నయమవుతున్నాయి. నంజురోగంవల్ల బూరుగపరుపుల్లా ఇంతింతలావెక్కిన దేహాలతో ఆడవాళ్లు వస్తున్నారు. కడుపులో పుట్టవ్రణంపుట్టిన స్త్రీలకు లెక్కేలేదు. వీరంతా ఆ స్తంభంచుట్టూ మూగి పైన పమిటలుకూడా లేకుండా రెండుచేతులూ పైకెత్తి మహాత్ముడైన పఫ్నూటియస్‌ను వేడుకొంటున్నారు. కొందరు ఒళ్ళంతా దుమ్ముఅవుతున్నా లెక్కచెయ్యకుండా నేలమీద సాగిలపడి ప్రార్థిస్తున్నారు. ఆస్త్రీలను, వారి నగ్న దేహాలను, అందచందాలను తిలకిస్తూ పఫ్నూటియస్ ఆశీర్వదిస్తున్నాడు. బోదకాళ్లు వచ్చినవాళ్ళయితే అడుగుతీసి అడుగు వెయ్యలేక — బాధపడుతూకూడా అలాగే మెల్లగావచ్చి ఆయనముందు మోకరిల్లుతున్నారు. పఫ్నూటియస్ వారినిచూచి 'క్రాస్' చేసుకొని, అభయం ఇస్తున్నాడు. ఒకఊరినుంచి ఒకఅమ్మాయిని సవారీలో మోసుకొనివచ్చారు. ఆపిల్ల మూడురోజులు నోట నెత్తురు కక్కిందట. తరువాత స్పృహలేదు. మైనపుబొమ్మలా కనుపిస్తున్నది. అంతా చచ్చిందనే అనుకొన్నారు. పిల్లమీద ఆకులు — అవీ పడేసి ఆశ వదులుకొని అక్కడికి తీసుకొచ్చారు. ఆ అమ్మాయికోసం పఫ్నూటియస్ దైవ

ప్రార్థన చేశాడు. వెంటనే ఆ పిల్లకు తెలివి వచ్చింది. కళ్ళు తెరిచింది. తలఎత్తి చూచింది.

ఈ విధంగా పఫ్నూటియస్ ప్రభావం దేశమంతటా పాకిపోయింది. ఆ యతీశ్వరుడు, మహానుభావుడు ఎన్నెన్నో అద్భుతాలు చేస్తున్నాడన్న విషయం ప్రతిచోటా అల్లుకొపోయింది. ఆయన ఒక దివ్యపురుషు డన్నారు అంతా. దివ్య మహిమవలన ఎటువంటి బాధా నివారిస్తాడు అన్నారు అంత ఈజిప్టుదేశం నలుమూలలనుంచీ వెర్రెత్తినట్లు ఎక్కడెక్క జనం అక్కడికి రాసాగారు. ఆ స్తంభాన్ని చూడడమే త వుగా అందరికీ ఏదో పూనకం వచ్చేది. ఏదో ఆవేశం వచ్చినట్ల ఊగేవాళ్లు. తూగేవాళ్లు. మట్టిలోపడి పొర్లేవాళ్ళు. మూర్ఛ రోగం వచ్చినట్లు వంకర్లు వంకర్లు తిరిగేవాళ్ళు. మీరు నమ్మండి, నమ్మకపోండి! అక్కడికి వచ్చిన ప్రతి ఒక్కరి కంపరం గలిగేద; సంధిగుణం పుట్టినట్లు నోటికివచ్చినట్లు వదరేవాళ్లు. ఆ వదురుడులో కాలజ్ఞానుల్లా ఎన్నెన్నో విషయాలు పలికేవాళ్లు. ఈ విధంగా సన్యాసులు, యతీశ్వరులు, యాత్రికులు, స్త్రీలు, పురుషులు,—వీరంతా ఒక వరుస, క్రమము లేక—దొమ్మీగా వచ్చినట్లు వచ్చి అక్క నానా గందరగోళం సాగిస్తున్నారు. వెర్రెత్తి పోతున్నార ఇహ స్తంభంపైన ఉన్న పఫ్నూటియస్ స్థితికూడా అలా ఉంది. ఈ జన సంక్షోభంవల్ల ఆయనకూ వెర్రెత్తింది. ఏదో తీవ్రమైన జ్వరంలో ఉన్నట్లు ఉన్నాడు.

“నేను ‘సుడిమాను’ కు కట్టిన బలిమేకను! ఈ ప్రజ పాపాలన్నీ నాపైన వేసుకొంటాను. అందువల్లనే ప్రభూ

గా దేహం యావత్తూ దుష్ట శక్తులతో నిండిపోయింది. అని భగవంతునితో చెప్పుకొన్నాడు.

రోగంతో బాధపడే మనిషి స్వస్థుడై వెళ్ళిపోతున్నప్పుడల్లా, జనం కేకలు పెడుతున్నారు. సంతోషంతో చప్పట్లు కొడుతున్నారు. ఆ మనిషిని పైకెత్తి విజయం సాధించినట్లుగా అందరికీ చూపుతున్నారు-

"చూడండయ్యా, చూడండి! మళ్ళీ మనకొక దేవ వైద్యుడు దొరికాడు!" అని అరుస్తున్నారు.

ఆ స్తంభంచుట్టూ అప్పటికే అనేక శిలలు, ప్రతిమలు వెలిశాయి. ఉదారబుద్ధికల స్త్రీలు అనేక దేవతా విగ్రహాలను ప్రతిష్ఠించారు. మొక్కుబళ్ళు చెల్లించుకొంటున్నారు. కొందరు గ్రీకులు పద్యాలు,పాటలు కట్టి రాళ్ళపైన చెక్కారు. వచ్చిన ప్రతి యాత్రికుడు తనపేరు ఏదో ఒక బండమీద చెక్కుకొన్నాడు. గ్రీకు, లాటిన్, సిరియన్, హీబ్రూ, కోప్టిక్, ప్యూనిక్ - మొదలైన భాషలన్నింటిలోనూ, చిత్రవిచిత్రమైన అక్షరాలు శిలలపై కనుపిస్తున్నాయి.

అంతలో 'ఈస్టర్' పండుగ వచ్చింది. ఆ పండుగ రోజులలో అక్కడ జనం మరీ పొర్లబడ్డారు. వృద్ధులైతే-మహా అద్భుతాలు జరిగే పూర్వకాలపు రోజులు వచ్చాయని అనుకొన్నారు. ఆ పుణ్యక్షేత్రం దర్శించడానికి ఎక్కడెక్కడివారూ వచ్చారు. వీరూ - వారూ అని లేదు. దేశంలోఉన్న అన్ని వర్గాలవారూ, అన్ని వేష భాషలవారూ అక్కడ పోగయ్యారు. రకరకాల వేషాలు, అలంకారాలు ధరించిన ఈజిప్షియన్లు,

అరబ్బులు, గ్రీకులు, నుబియన్లు, రోమన్లు- వీరంతా వచ్చారు. బంగారపు జరీ వస్త్రాలతో, శృంగారంగా అలంకరించుకొన్న రాజవేశ్యలు, విలాసవతులు, నాట్యకత్తెలు - అంతా పోగయినారు. ముసుగు వేసుకొన్న ఒక స్త్రీ గాడిదమీద ఎక్కి వస్తుంటే - ఆవిడ వెంటనున్న నల్లటి 'కొజ్జాలు' కర్రలతో జనాన్ని అదలిస్తూ, 'తప్పుకోండి, తప్పుకోండి- అమ్మగారు వస్తున్నారు' అని త్రోవచేస్తున్నారు. గారడీవాళ్ళు, విప్రవినోదులు- వచ్చి నేలమీద తివాచీలు, కంబళ్లు పరిచి ఎన్నెన్నో అద్భుతాలు ప్రదర్శిస్తున్నారు. జనం చుట్టూ నిలుచుని, నిశ్శబ్దంగా ఆ తమాషాలు చూస్తున్నారు. పాములవాళ్ళు, బుట్టలతో రకరకాల పాములను తెచ్చి ఆడిస్తున్నారు. ఎక్కడ చూచినా దుమ్ము, ధూళి - అరుపులు, కేకలు - ఇసుక వేస్తే రాలని జనం, బండ్లు, ఒంటెలు, గాడిదలు, మేనాలు, పల్లకీలు - వీటన్నింటిమీద జనం విధీ విరామం లేకుండా వస్తున్నారు. జనంలో తిరిగి తినుబండారాలు, చిల్లరసరుకులు అమ్మేవాళ్ళ అరుపులు, కేకలు-మిన్నుముట్టుతున్నాయి. కొందరు యతులు, సన్యాసులు బైబిల్‌లోని ప్రార్థనాగీతాలను పఠిస్తున్నారు. స్త్రీలు పాటలు పాడుతున్నారు. బిచ్చగాళ్లు జానపద గీతాలు పాడుతూ, ముష్టి అడుక్కుంటున్నారు. గొర్లకాపరులుకూడా అక్కడ పోగయినారు. ఖర్జూరపుపండ్లు అమ్ముతూ అటూ - ఇటూ పరుగులు తీస్తున్న నీగ్రో కుర్రవాళ్ళకు అంతేలేదు. ధ్వనులతో చెవులు చిల్లులు పడిపోతున్నాయి.

ఆవిధంగా జనం ఎర్రనిఎండలో స్తంభించుట్టూ నిలుచుని, ఏమాత్రం శ్రమ అనుకోకుండా, శ్రద్ధాభక్తులతో

ప్రార్థనలు చేస్తున్నారు. ఆరాధనలు జరుపుతున్నారు. మొక్కుబళ్లు చెల్లిస్తున్నారు! ఆజనంలోనుంచి రకరకాల పరిమళాలు వెలువడి గుప్పుమంటున్నాయి.

ఇహ రాత్రివేళ – ఎక్కడచూచినా దీపాలు. లాంతర్లు, కొవ్వొత్తులు, వెలుగుతున్నాయి. కొందరు మంటలు వేస్తున్నారు. అంతటా ఎర్రని, నల్లని నీడలు – ఆకారాలుతప్ప మరేమీ కనుపించడంలేదు. ఒకవృద్ధునిచుట్టూ జనం గుమికూడి ఉన్నారు. పూర్వం ఒకతను మంత్రమహిమవలన తన గుండెను చీల్చి, దానిని ఒక కసిందచెట్టుపై పెట్టడం, తరువాత తన మటుకు తానే ఒకచెట్టుగా మారిపోవడం – మొదలగు విషయాలన్నీ చెపుతున్నాడు. జనం – చెవులు దొన్నెలు చేసుకొని కుతూహలంగా వింటున్నారు. వృద్ధుడావిషయాలన్నీ చెబుతూ, ముఖం అష్టవంకర్లు తిప్పుతున్నాడు. చేతు లాడిస్తున్నాడు. రకరకాల భంగిమలుపెట్టి అభినయిస్తున్నాడు. జనం సంతోషంతో పొంగిపోయి 'వహ్వా, వహ్వా' అంటూ చప్పట్లు కొడుతున్నారు. ఇక హోటళ్ళలో కొందరు – తప్పతాగి తూగుతున్నారు. బీరు, ద్రాక్షాసవం – మొదలైన పానీయాలు సేవించి ఒడలు తెలియకుండా సోఫాలమీదపడి దొర్లుతున్నారు. ఆటకత్తెలు, పాటకత్తెలు, సింగారించుకొని – సిగ్గు, బిడియం లేకుండా నగ్నంగా అవయావాలన్నీ కనపరుస్తూ, త్రాగుబోతులముందు ఆడుతున్నారు, పాడుతున్నారు. కులుకులతో, తళుకులతో వారిని కవ్విస్తున్నారు, నవ్విస్తున్నారు. వయసు కుర్రవాళ్లు కొందరు ఒకమూల కూచుని పచ్చీసు ఆడుతున్నారు. కొందరు పేకాటల్లోనూ, కొందరు పులిజూదాలలోనూ

మునిగిఉన్నారు. వృద్ధులైనవారు పడుపుకత్తెలవెంట పడి పోతున్నారు. అక్కడ ఇంత అలజడి, అల్లకల్లోలం – సాగుతున్నా, ధ్వజస్తంభంకొసన పఫ్నూటియస్ ఒక్కడూ, ఏకాంతంగా, తనలోకంలో తాను ఉన్నాడు. అంతలో చంద్రోదయం అయింది. దేవకన్య దేహంనుండి రెక్క మొలిచినట్లుగా పొడుచుకొని వచ్చాడు చంద్రుడు. నైలునదిపై నగ్నసుందరిలా, ఆడుతున్న చంద్రబింబాన్నిచూచి థాయిస్ అనుకొన్నాడు పఫ్నూటియస్. ఆవిడ అందచందాలన్నీ ఆయనకు జ్ఞాపకం వచ్చాయి.

రోజులు గడుస్తున్నాయి. పుణ్యపురుషుడగు పఫ్నూటియస్ ఇంకా అలాగే ఆ ధ్వజ స్తంభంపై తపస్సుచేస్తున్నాడు. వర్షాకాలం వచ్చింది. కుంభపోతగా వానలు కురిశాయి. పైన కప్పు ఉన్నప్పటికీ, కప్పు సందులలోనుంచి వాన జల్లులు తెంపు లేకుండా ఆయనపై పడుతున్నాయి. రాత్రింబగళ్లు వానకు తడిసి, దేహం నానిపోయింది. అవయవాలన్నీ ఎక్కడికక్కడ మొద్దుబారిపోయాయి. అలా నెలలతరబడి, ఎండకు ఎండి, వానకు తడిసిన ఆయన దేహం చివరకు ఎందుకూ పనికిరాని స్థితికి వచ్చింది. కాలు, చెయ్యి కదపలేడు. ఎక్కడి కక్కడ పట్టుక పోయినాయి. చర్మం పగుళ్లు వాసింది. ఒళ్ళంతా పెద్ద పెద్ద పుండ్లుపడి పుచ్చిపోతున్నది. కాని ఇంతటి యమయాతన అనుభవిస్తున్నా, థాయిస్‌పై మోహం ఆయన్ను వదలలేదు. లోపల ఒకప్రక్క స్త్రీవాంఛ ఆయనను దహించి వేస్తూనే ఉంది.

"ఓ–పరమేశ్వరా! ఇంకా చాలదు. ఇంతమాత్రంతో సరిపోదు. ఇంకా ఎక్కువ కోర్కెలు పుట్టించు – ప్రపంచం

ఉన్న పాపపు ఆలోచనలన్నీ నా మనస్సులోకే రానీ. నన్ను మోహాలలో ముంచవయ్యా స్వామీ! మానవుల కుండే కామములన్నీ నాపైన పడెయ్యి. వాటన్నింటికి నేను ప్రాయశ్చిత్తం చేసుకోగలను! వాటిని పరిహరించుకోగలను! పూర్వం ఒక మోసగాడు ఒక కథ చెప్పగా నేను విన్నాను. గ్రీకు మంత్రకర్తె ఒకతె, లోకంలోని పాపాలన్నీ తనపైన వేసుకొని భరించిందట! ఆ కథ నిజం కాకపోయినప్పటికీ అందులో ఒక అంతరార్థం దాగి ఉన్నది. ఆ సత్యాన్ని నేనిప్పుడు గుర్తించగలిగాను. ప్రజల పాపాలన్నీ పుణ్యపురుషుల ఆత్మలో ప్రవేశించి-ఆత్మఅనే సరోవరంలో అదృశ్యమైపోతాయి. ఇది సత్యం! కనుకనే పుణ్యపురుషుల ఆత్మ లెప్పుడూ పాపాత్ముల ఆత్మలకంటెకూడా పాపపంకిలమై ఉంటాయి. కాలుష్యంతో నిండి ఉంటాయి. అందుకే ప్రభూ! ఈ ప్రపంచం తాలూకు మురికికూపంగా నన్ను చేసినందుకు నిన్ను ఎంతగానో అభినందిస్తున్నాను!" అని మొరపెట్టుకోసాగాడు పఫ్నూటియస్.

ఇలా ఉండగా ఒకనాడు ఆ పుణ్యక్షేత్రంలో ఒక వదంతి పుట్టింది. ఒక గొప్ప వ్యక్తి, ఒక ప్రసిద్ధ పురుషుడు, ఒక ఉన్నత పదవి అలంకరించినవాడు – అలెగ్జాండ్రియన్ నౌకాదళాధిపతి అగు లూషియస్ ఆరిలియస్ కొట్టా, తన పనిమీద వెడుతూ ఆ నగరానికి వస్తున్నాడన్న వార్త అంతటా పాక్కింది. చివరి కది యతీశ్వరుడగు పఫ్నూటియస్ చెవిదాకా వెళ్ళింది.

ఆ వార్త నిజమే. వృద్ధుడగు కొట్టా నైలునది తాలూకు కాలువలను, నౌకలను తనిఖీ చెయ్యడానికి అక్కడికి వచ్చాడు.

ధ్వజ స్తంభంపై ఉన్న మహానుభావుణ్ణి, అక్కడ కొత్తగా వెలసిన పుణ్యక్షేత్రాన్ని దర్శించాలని అభిలషించాడు. తన సిబ్బందితో ఆ విషయం పలుతడవలు చెప్పాడుకూడా.

ఒకనాటి ఉదయం నైలునదిపైన అనేక ఓడలు రావడం క్షేత్రవాసులు చూచారు. వృద్ధుడగు కొట్టా తన సిబ్బందితో వచ్చి రేవులో దిగాడు. నగరంవైపు నడిచి వస్తున్నాడు. ఆయన కార్యదర్శి పుస్తకాలు చంకనబెట్టుకొని వెంటఉన్నాడు. అరిస్టియస్ అను వైద్యుడుకూడా వచ్చాడు. కొట్టాకు స్వంతవైద్యుడతను. అతనితో కబుర్లాడుతూ [illegible]కం కొట్టా [illegible].

లూషియస్ కొట్టాను, ఆయన సిబ్బంది యావత్తూ అనుసరించింది. వారంతా నౌకాదళ ఉద్యోగులు, మిలిటరీ దుస్తుల్లో ఉన్నారు. క్రమశిక్షణతో సిబ్బంది అంతా ఆయన వెంట నడిచింది.

కొట్టా వచ్చి అల్లంతదూరాన ఆగాడు. స్తంభానికి కొన్ని అడుగులు ఎడంగా నిలుచున్నాడు. తల పైకెత్తి ముఖం తుడుచుకొంటూ, స్తంభంవంక, స్తంభంపై ఉన్న సన్యాసివంక పరీక్షగా చూడసాగాడు. అతనికి ఆశ్చర్యం కలిగింది. పదే పదే పరిశీలించి చూడడం మొదలుపెట్టాడు. అసలు కొట్టా సామాన్యుడుకాడు. అతను ఎన్నెన్నో దూరప్రయాణాలు చేశాడు. ఎన్నెన్నో దేశాలు చూచాడు. చూచిన విషయాలన్నీ గుర్తుంచుకోవాలనీ, వాటిని వ్రాసిపెట్టుకోవాలనీ అతని అభిలాష. ఇలా తాను కళ్ళారా చూచిన విషయాలన్నీ ఒక చారిత్రాత్మక గ్రంథంగా వ్రాసిపెట్టాడు. ఆ గ్రంథంలో ప్రసిద్ధమైన, అద్భుత

మైన సంగతులు అనేకం ఉన్నాయి. కాని ఇప్పుడు కనుల ముందు కనుపించే దృశ్యం అతన్ని ఆశ్చర్యచకితుణ్ణిగా చేసింది. ఇటువంటి చిత్రం అతను ఎక్కడా, ఎన్నడూ చూడలేదు.

"ఇది చాలా విచిత్రంగా ఉంది." అన్నాడు. ఎండతాపానికీ, ఉక్కపోతకూ ఉఫ్ అని ఊసుకొంటూ - "మనం తప్పకుండా వ్రాసిపెట్టుకోవలసిన సంఘటన ఇది. చూచారా, ఎంత చిత్రమో! ఈ స్తంభంపైన ఉన్నమనిషి మాఇంటికి అతిథిగా వచ్చాడు. అవును. ఇతనే - ఈసన్యాసే గతసంవత్సరం మాఇంట్లో విందారగించాడు. ఆతరువాత ఒక అభినేత్రిని వెంటబెట్టుకొని వెళ్ళిపోయాడు"అని చెప్పాడు. తరువాత తన కార్యదర్శివంక తిరిగి "అబ్బాయ్! నాపుస్తకాల్లో ఆవిషయం వ్రాసిపెట్టవోయి నాయనా! ఈధ్వజస్తంభం కొలతలు - పొడుగు, వెడల్పు - అన్నీ ఒక్కటీ బీకుపోకుండా వ్రాసుకోవోయ్" అన్నాడు. తరువాత నుదుటిమీద చెమట తుడుచుకొని తనవైద్యుడైన అరిస్టియస్‌వంక చూచాడు.

"ఏమయ్యా, భిషగ్వరా! ఈసన్యాసి ఈస్తంభంపైకి ఎక్కి సంవత్సరం అయిందట! అప్పటినుంచి క్రిందికి దిగనే లేదట! జనం చెప్పుతున్నారు. ఇది సాధ్యమే నంటావా?" అని అడిగాడు.

"ఇతనికి పిచ్చి అన్నా పట్టిఉండాలి. లేదా ఏదైనా జబ్బు అయినా ఉండాలి. లేకపోతే ఇలా ఉండడం ఎవరికీ సాధ్యంకాదు" అన్నాడు అరిస్టియస్-దేహమూ, మనస్సూ ఈ రెండూ సక్రమంగా ఉన్నమనిషి ఎవడైనా ఈ పని చెయ్యగలుగుతాడటండీ? ఒక్క విషయం చెప్పుతాను వినండి లూసి

యన్! ఒక్కొక్కప్పుడు శారీరకంగాగానీ, మానసికంగాగానీ, వ్యాధులు వచ్చినవారికి, ఆరోగ్యవంతులకుకూడా లేని బలమూ శక్తీ పుట్టుకొస్తాయి. ఇది తలుచుకొంటే బహు చిత్రంగా ఉంటుందిసుమా! అసలు వాస్తవానికి ఆరోగ్యం బాగుండడమంటూ కానీ, బాగులేకపోవడమంటూ కానీ, ఏమీ ఉండదు! అవయవాల పరిస్థితులుమాత్రమే వేరువేరుగా ఉంటాయి. అంతే. రోగాలనేవాటినిగురించి నేను తీవ్రంగా చదివి, పరిశీలన చేసినపిమ్మట అవి జీవితానికి అవసరమైనరూపాలని అనుకొంటూ వచ్చాను. ఆ రోగాలను జయించేశక్తి సంపాదించాలన్న తలంపుతోనే వాటిని పరిశీలన చెయ్యాలని నాకు కుతూహలం కలిగింది. ఈ రోగాలలో కొన్ని చాలా గమ్మత్తు అయినవి ఉన్నాయి. అవి మనకు దుఃఖాన్ని కలిగించవు. పైపెచ్చు చక్కని హాయిని, సంతోషాన్ని ప్రసాదిస్తాయి. చూశారా, ఎంత తమాషో! ఉదాహరణకు చెపుతాను-వంతుల ప్రకారం సరిగా నాలుగు రోజులకొకమాటు వచ్చే జ్వరాలున్నాయి. చూడండీ-అవి నిజానికి చాలా ముచ్చట గొలుపుతాయి! శరీరాలకు సోకే కొన్ని రోగాలవల్ల మానసికశక్తులు చాలా వేగంగా అభివృద్ధికావడం అప్పుడప్పుడు జరుగుతూ ఉంటుంది. క్రియన్‌ను మీరు ఎరుగుదురుకదూ? అతను పసిపిల్లవాడుగా ఉన్నప్పుడు మాటలే రాలేదు. చచ్చేనత్తి. కాని ఆ తరువాత ఒక నిచ్చెన ఎక్కుతూ జారి క్రిందపడ్డాడు. పుర్రె బ్రద్దలైంది. దాంతో ఒక పెద్దలాయరు అయికూచున్నాడు. మీకు తెలిసిన విషయమేకాః? చూచారా మరి చిత్రం! అలాగే ఈ సన్యాసికి మనకు అగుపించని ఏదో ఒక అవయవం

దెబ్బతిని ఉండాలి. తప్పదు. పైగా ఇట్లా ధ్వజస్తంభంపైన రాత్రింబవళ్లు వ్రేలాడుతూ ఉండడం నిజానికి మీరు అనుకొనేటంత అసాధారణమైన విషయం ఏమీ కాదండీ. మీ కళ్ళకు అలా కనుపిస్తున్నది అంతే. మీకు తెలుసు ననుకొంటాను. హిందూ దేశంలో యోగులు కొందరు, ఒక ఏడూ, రెండేండ్లూ కాదు, వరుసగా పాతిక, ముప్పయి, నలభై-ఇంకా ఎన్నో ఏండ్లు కదలక మెదలక అలాగే ఉండిపోతారట! అదేదో సమాధిలో ఉంటారని చెపుతారు."

"అరి భగవంతుడా! ఇదేం పిచ్చి అయ్యా? ఇది నే నెక్కడా చూళ్ళేదే! మనిషి పుటకపుట్టింది దేనికి? కదలడానికి కాదూ? మనిషన్నవాడు హాయిగా తిరగాలి, పని చెయ్యాలి. అంతేకాని, ఇలా కాళ్లు, చేతులు ముడుచుకొని యోగంపట్టి కూచోవడమేమిటి? సోమరితనం. క్షమించరాని నేరం ఎంచేతనంటే దానివలన దేశానికి ప్రమాదం వస్తుంది. ఇటువంటి సోమరితనం ఆచరణలో పెట్టడాన్ని అంగీకరించే మతం ఏదైనా ఉన్నదేమో నాకు తెలీదు. కాని ఆసియా దేశంలోని కొన్ని మతాలవారు దీనిని అంగీకరించవచ్చునని నే ననుకొంటు న్నాను. నేను సిరియాలో గవర్నరుగా ఉన్నప్పుడు ఒక విషయం చూచాను. 'హీరా' నగరం వెలుపల ఒక ధ్వజస్తంభంలాంటిది ఉన్నది. ఒక మనిషి సంవత్సరానికి రెండు తడవలు ఆ ధ్వజం ఎక్కుతాడు. దానిపైన ఒకవారం రోజులుండి తరువాత దిగివస్తాడు. అక్కడున్న వారందరూ అతను దేవతలతో మాట్లాడతాడట సిరియాదేశాన్ని సుభిక్షంగా ఉంచమని దేవతలను ప్రార్థిస్తాడట. అక్కడిజనులు చెప్పుకొంటారు. ఈ

ఆచారం కేవలం అగ్రగహీతమని అనిపించింది నాకు. కాకపోతే ఏమిటి మిస్సా? ... మేమిటి ధ్వజస్తంభం ఎక్కడమేమిటి? అక్కడ దేవతలతో మాట్లాడడమేమిటి? శుద్ధ తెలివితక్కువ! అయినా నేను వారి ఆచారాన్ని ...దనలేదు. దాన్ని తీసెయ్య ... కి ... ంచలేదు. ఎంచేతంటావా- పాలకు లెప్పుడూ ప్రజ... ట్టుబొట్లలోనూ, ఆచార వ్యవహారాలలోనూ జోక్యం కలిగించుకోకూడదు. పైపెచ్చు ఆ ఆచార వ్యవహారాలు ... కొనసాగే ట్లు చూడాలి. లేకపోతే చి... లొస్తాయి. ఒక మతాన్ని ...సుకొచ్చి ప్రజలమీద బల ... రుద్దడం ప్రభుత్వం పని కాదు. ఏ ప్రభుత్వమైనాసరే ... ప్రమేయం పెట్టుకోకూడదు. కాని అక్కడ అది ... ఒక నాతనీ, ఒక ఆచా... నీ ఉంటే - అది మంచిదే కానీ, ...డ్డదేకానీ - అది సక్రమంగా కొనసాగేటట్లు చూడవలసి... బాధ్యత ప్రభుత్వానికి ఉన్నది. అవును. ఆ యా కాలా ..., ఆ యా ప్రదేశాలలో, ఆ ... జాతులలో ఆ యా ఆచా ... నస గుతూనే ఉండాలి. వాటిని ఎవరూ మార్చ... కాని ఈ ఆచారాలుకనుక ఒకమతాన్ని కూల ...డానికి యత్నించినా, ...ప్ల...త్మకమైన భావాలు ప్రక...చు..., క్రూర, హింసాత్మకమైన చర్యలకు ఒడిగట్టినా, ... ...తురం గ్రహించాలి. అదు ముమ్మాటికీ న్యాయం. ...హానంతో వాటిని అర్థంచేసుకోగలిగితే తప్ప, లేక పో... మనం ఈ మూఢవిశ్వాసాలనుండి బయటపడేదెట్లా ... వీటన్నింటికీ అతీతంగా ఉండేదెట్లాగయ్యా? మిస్టర్ ...యాన్స్! ఆకాశంలో పక్షి గూడు కట్టుకొని ఉన్న ఈమత

సన్యాసిని క్రిందికి లాగాలనే ఉంది నాకు. కాని ఇతన్ని అలా క్రిందికి లాగినందువల్ల నాకు ఒరిగేదేమీ లేదు. అయినా ఇతని భావాలేమిటో, విశ్వాసాలేమిటో తెలుసుకొని వాటిని వ్రాసి పెట్టుకోడం నాకెంతో అవసరం!" అన్నాడు కొట్టా.

ఇలా అని గొంతు సవరించుకొన్నాడు. తన కార్యదర్శి బుజంమీద చెయ్యివేశాడు.

"అబ్బాయ్! వేశ్యలను పట్టుకపోయి తరువాత ధ్వజ స్తంభాలమీద తపస్సుచేస్తూ ఉండేవాళ్ళను చూచి క్రైస్తవులలో కొన్నితరగతులవారు ఎంతో హర్షిస్తారు. అదొక ఘనకార్యంగా భావిస్తారు. ఈవిషయం మన పుస్తకాల్లో వ్రాసిపెట్టుకోవోయ్‌నాయనా! దయ్యాలనూ, భూతాలను పూజిస్తున్నారనడానికి ఈ ఆచారాలు చక్కటి సాక్ష్యమిస్తున్నాయని కూడా అందులో వ్రాసిపెట్టుకో. కాని ఇది ఎంతవరకు నిజమో ఈసన్యాసిని స్వయంగా ప్రశ్నించి తెలుసుకోవడం అవసరం"

ఇలా అంటూ కొట్టా తల ఎత్తిఆకాశంలోకి చూచాడు. ఎండ తగులకుండా కళ్ళకు చెయ్యి అడ్డం పెట్టుకొన్నాడు. పఫ్నూటియస్‌ను పిలిచి ఇలా ప్రశ్నించాడు-

"ఏమయ్యోయ్, పఫ్నూటియస్! నేను నీకు జ్ఞాపకం ఉన్నానా? ఒకమాటు నీవు మా యింటికి అతిథిగా వచ్చావు. గుర్తున్నదటయ్యా బాబూ? చెప్పవయ్యా, నీ విప్పుడక్కడ ఏం చేస్తున్నావు? అసలీ ధ్వజస్తంభం ఎందుకు ఎక్కినట్లు? అక్కడ ఎందుకు ఉంటున్నట్లు? ఈధ్వజ స్తంభం ఏదైనా దైవస్వరూపంగా నీకు కనిపించిందా ఏమిటి? చెప్పవయ్యా స్వామీ! చెప్పు!"

కొట్టా ఇలా బిగ్గరగా అరిచినప్పటికీ వఫ్నాటియస్ సమాధానం చెప్పలేదు. అతన్ని ఒక విగ్రహారాధకునిగా భావించుకొని ఆయన బదులు పలుకలేదు. కాని ఆయన శిష్యుడైన ఫ్లావియన్, కొట్టాను సమీపించి ఇలా ప్రత్యుత్తరం ఒసగాడు:

"అయ్యా! ఈ మహానుభావుడు లోకంలోని పాపాలన్నీ తనపైన వేసుకొంటాడు. ఎటువంటి రోగాలూ నయం చేస్తాడు.

"ఆరి భగవంతుడా! విన్నావుటయ్యా అరిస్టియస్! ఇతని మాటలు? ఈ ఖేచరుడు నీలాగనే వైద్యం చేస్తున్నాట్ట! ఇతను నీకు పోటీ వచ్చాడు—ఇహ నీపని ఖాళీ! ఇప్పుడేమంటావు చెప్పు? నీ ఉద్దేశం ఏమిటి?" అని కొట్టా తన వైద్యుణ్ణి అడిగాడు.

అరిస్టియన్ తల ఊచాడు.

"ఇందులో విచిత్ర మేమీ లేదండీ. కొన్ని వ్యాధులు నాకంటె బాగా ఇతనే నయం చెయ్యవచ్చు. ఉదాహరణకు చెపుతాను: మూర్ఛరోగం దివ్యరోగమని చెపుతారు. అసలా మాట కొస్తే రోగాలన్నీ దివ్యమైనవే. ప్రతిరోగమూ దేవతలనుండే మనకు సంభవిస్తున్నది! కాని ఈ మూర్ఛల రోగానికి కారణం భ్రమ. ఏదో భావించుకొంటారు. దాంతో ఈ రోగం పుడుతుంది. చూచారూ? ఈ యతి ధ్వజస్తంభం మీది కెక్కాడు. ఒక దేవత శిరస్సుమీద కూచున్నాడు. రోగుల మనస్సులో ఇదొక ప్రభావాన్ని కలిగిస్తుంది. నేను నా వైద్యశాలలలో కూచుని, మందులతో, మాత్రలతో సతమతమయిపోతుంటాను. ఆ మందులకంటె దీని ప్రభావం బలీయమై

నది. రోగులకు ఇది పనిచేసినంతగా నా ఔషధాలు పనిచెయ్యవు. హేతువాదంకంటెనూ, వైజ్ఞానిక శాస్త్రంకంటెనూ బలీయమైన శక్తులు కొన్ని ఉన్నాయండీ” అన్నాడు.

“ఏమిటవి?” అని అడిగాడు కొట్టా.

“అజ్ఞానము, వెర్రితనము-” అని చెప్పాడు అరిస్టియస్.

“ఏమైనా ఇటువంటి విచిత్ర దృశ్యం నేనెక్కడా చూడలేదు-” అంటూ మళ్ళీ చెప్పసాగాడు కొట్టా- “కాని ఈ పిచ్చిపనులకు మూలకారణ మేమిటో ఇవాళకాకపోతే రేపైనా ఒకశక్తివంతుడైన రచయిత లోకానికి వెల్లడిస్తాడు. నా కా ఆశ ఉన్నది-సరేనయ్యా ఇహ వెళ్ళి మన పని చూచుకుందాం. కాలువలు తనిఖీచెయ్యాలి...వెళ్ళొస్తానయ్యా పఫ్నూటియస్! మళ్ళీ వీలైతే రేపు ఉదయం కలుస్తాను. కాని ఒక విషయం. నీవు మళ్ళీ ఏనాటికైనా నేలమీదికి వస్తే, అలెగ్జాండ్రియా నగరానికి దయచేస్తే. మా యింటికిమాత్రం తప్పకుండా రా. ఒకపూట నాతో విందారగించి వెడుదువుగాని. మరిచిపోకు-”

ఇలా చెప్పి కొట్టా, తన సిబ్బందిని వెంటబెట్టుకొని అక్కడనుంచి వెళ్ళిపోయాడు. కొట్టా అన్నమాటలు ఆ నోటా ఆ నోటా పడి అందరికీ తెలిసిపోయినాయి. అతని మాటలకు అంతా విలువ ఇవ్వసాగారు. ఎంతో అనుభవం కలవాడు, జ్ఞాని, ఎన్నెన్నో దేశాలు పర్యటించినవాడు, పెద్ద పదవిలోఉన్నవాడు అయిన ఆర్లియస్ కొట్టా మనస్సును సయితం మహానుభావుడైన పఫ్నూటియస్ మార్చగలిగాడని అంతా చెప్పుకోసాగారు. ఆయన చివరసారి అన్నమాటలు అందరినీ మరింతగా ఆకర్షించాయి. అంతవాడు పఫ్నూటియస్‌ను తన ఇంటికి

విందుకు ఆహ్వానించాడనీ, కనుక ఇందులో ఏదో గొప్ప గూఢార్థం దాగిఉన్నదనీ అందరూ విశ్వసించారు. వేటినీ త్వరగా నమ్మనటువంటి కొట్టా, ఇప్పుడు పఫ్నూటియస్‌తో ఎంతోసేపు వాదించి తుదకు ఆయన మహిమను అంగీకరించా డనీ, అతనికి నమ్మకం కుదిరిందనీ చెప్పుకొన్నారు. కొట్టా ఒక్కడే కాదు. అతని కార్యదర్శి- అతని వైద్యుడు- సిబ్బందీ - అందరూకూడా ఒకే సమయంలో మారిపోయా రనుకున్నారు. ఏమైతేనేం? ప్రముఖులందరూకూడా ఈ సంఘటనకు ఒక చారిత్రకమైన ప్రాధాన్యత కలిగించారు. ప్రజలు దీనిని ఒక అద్భుతమైన, ఒక ప్రసిద్ధమైన విషయంగా భావించారు. లిబియాలోని క్రైస్తవదేవాలయాల ప్రధాన మతగురువులం దరూకూడా దీనినొక ప్రామాణికమైన వాస్తవవిషయంగా వ్రాసి పెట్టుకొన్నారు. ఈ సంఘటన జరిగిన తరువాత అనతికాలం లోనే పఫ్నూటియస్ పేరు ప్రపంచమంతా పాకిపోయినట్లు చెప్పవచ్చు. అందరికీ ఆయనను చూడాలన్న ఆకాంక్ష ప్రబ లమై పోయింది. అటు తూర్పున, ఇటు పశ్చిమాన ఉన్న-క్రైస్త వులు యావన్మందీకూడా దిగ్భ్రాంతిచెందినవారై ఆయన వంక చూడసాగారు! ఇటలీలోని ప్రసిద్ధమైన మహాపట్టణాలన్నీ తమ ప్రతినిధివర్గాలను ఆయనవద్దకు పంపాయి. క్రైస్తవ మతంపట్ల ఆదరం చూపుతున్నవాడు, ప్రసిద్ధుడు అయిన రోమన్ చక్రవర్తి స్వయంగా పఫ్నూటియస్ పేర ఒకలేఖ వ్రాశాడు. చక్రవర్తి రాయబారులు ఆ లేఖను తీసుకొని పెద్ద ఊరేగింపుతో బయలుదేరివచ్చి పఫ్నూటియస్‌కు అందిం చారు. కాని ఇలా ఉండగా ఒకనాటి రాత్రి నగరంయావత్తూ

నిద్రమత్తులో తూగుతున్న సమయాన పఫ్నూటియస్‌కు ఒక కంఠస్వరం వినిపించింది–

"పఫ్నూటియస్! నీ తపస్సు సిద్ధించింది. నీకు వాక్శుద్ధి కలిగింది. ఈశ్వరుడు నిన్ను తనంతవానినిగా చేశాడు. నీద్వారా అద్భుతకృత్యా లెన్నో చేయిస్తున్నాడు. నీచేత ఎక్కడెక్కడి రోగాలూ నయంచేయిస్తున్నాడు. విగ్రహారాధకులయిన మతస్థులను మారుస్తున్నాడు. పాపులకు వెలుగు చూపిస్తున్నాడు. దేవాలయాల్లో శాంతి ప్రతిష్ఠిస్తున్నాడు."

ఈధ్వని విని పఫ్నూటియస్ "ఈశ్వర సంకల్పం నెరవేరుగాక!" అని బదులుచెప్పాడు.

మళ్ళీ ఆగొంతుక ఇలా అన్నది.."లే, పఫ్నూటియస్! రోమన్‌నగరంలో అన్యాయాలు అనేకం జరుగుతున్నాయి. వాటిని అరికట్టడానికి వెళ్ళు పఫ్నూటియస్. వెంటనే బయలుదేరి వెళ్ళు. అక్కడ చక్రవర్తికి సంబంధించినవారిలో నాయకులైనవారు కొందరు క్రైస్తవమతంపట్ల అపచారం చేస్తున్నారు. నీవు వెళ్ళి క్రైస్తవధర్మాన్ని ఉద్ధరించు పఫ్నూటియస్. నగరపు కంచుద్వారాలు నీకోసం తెరువబడతాయి. క్రైస్తవ దేవాలయాలలోకల్లా ప్రసిద్ధికెక్కిన బంగారపు దేవాలయంలో ప్రవేశించి నీ ప్రభావాన్ని లోకానికి వెల్లడించు. సీజర్ల సింహాసనముందు నీ పవిత్రమైన పాదుకలు ఉంచు. నీ దివ్య వాక్కులు అక్కడ ప్రతిధ్వనింపచెయ్యి పఫ్నూటియస్. చక్రవర్తికుమారుడు కల్మష హృదయంతో ఉన్నాడు. అమోఘమైన నీవాక్కులు అతనిమనస్సును మార్చుగాక! శక్తివంతమైన, శాంతియుతమైన క్రైస్తవ దేవాలయాలను నీవు

ఉద్ధరించుదువుగాక! ఆత్మ దేహాన్ని నడుపుతుంది. పాలిస్తుంది. అలాగే క్రైస్తవమతం సామ్రాజ్యాన్ని పరిపాలిస్తుంది. రాజులు, రాజప్రతినిధులు, న్యాయాధిపతులు - వీరందరికన్నా ఉన్నత మైన స్థానం నీవు అధిష్ఠించుదువుగాక! ప్రజల దురాశను, దుష్టత్వాన్ని అణచివేయుదువుగాక! అనాగరకుల ఘోర కృత్యాలు అరికట్టుదువుగాక! ప్రభుత్వానికి నీవే అధినేతవని తెలుసుకొని వృద్ధుడగు కొట్టా నీ పాదధూళి శిరమున తాల్చు గాక! వెళ్లు పఫ్నూటియస్! వెంటనే వెళ్ళు!" అందుకు పఫ్నూటియస్ మరల - "ఈశ్వర సంకల్పం సిద్ధించుగాక!" అని సమాధానం చెప్పాడు.

ఇలా చెప్పి ఆ ధ్వజ స్తంభంపైనుంచి లేచి క్రిందికి దిగ డానికి సంసిద్ధుడైనాడు. కాని అంతలోనే మరల గొంతుక విని పించింది.

"పఫ్నూటియస్! అదేమిటి? ఆ నిచ్చెనమీదనుంచి దిగుతున్నావేమిటి? వద్దు. మామూలు మనుష్యులు అలా చేస్తారు. మరి నీవో? నీవు మహానుభావుడవు. నీవంటి సిద్ధుడు అలా క్రిందకు దిగిరాకూడదు. పక్షిలా పైనుంచి ఎగిరి గాలిలో తేలుతూ భూమిమీదికి రావాలి. అలా రా. మరేం భయం లేదు. నీకు దేవ, గంధర్వులు సహాయపడతారు!"

"ఈశ్వర సంకల్పం ఆవిధంగా ఉంటే అలాగే జరుగు తుంది."-అని సమాధానం చెప్పి పఫ్నూటియస్ ఆ స్తంభంపై నుండి ఎగిరి క్రిందికి దూకడానికి పూనుకొన్నాడు. ఒక పెద్ద పక్షి రెక్కలు చాచినట్లుగా రెండుచేతులూ చాచి నేలపైకి వాలబోయాడు. అంతలో హఠాత్తుగా, ఒక భయంకరమైన

వికృత అట్టహాసం ఆయనకు వినిపించింది. ఒక భయంకరజలద గర్జనలా ఉంది ఆనవ్వు —అది విని ఆగిపోయాడు పఫ్నూటియస్.

"ఎవరా నవ్వేది?" అని అడిగాడు.

"అహ్హాహ్హా!" మళ్ళీ భయంకరమైన నవ్వు—"నేనా? నన్నెరగవూ. నేను నిన్నెరిగినప్పటినుంచీ నేను నీ వెంట ఉంటున్నాను— ఇన్ని ఈ ధ్వజస్తంభం ఎక్కించింది నేనే కదుటయ్యా. నేను చెప్పినట్లల్లా చేశావు నీవు; నేను ఆడించినట్లల్లా ఆడావు నీవు — నిన్ను చూస్తే నా కెంతో ఆనందంగా ఉంది పఫ్నూటియస్..." అన్నదా గొంతుక.

అప్పుడు పఫ్నూటియస్ భయంతో కంపించిపోయాడు— "ఛీ, పో, పో! నీ వెవరో ఇప్పుడు నాకు తెలిసిందిలే. జీసస్‌ను ఆలయగోపురంపైకి తీసికొనివెళ్ళింది నీవే. ఆయనకు ఈ లోకంలోని రాజ్యాలన్నింటినీ చూపింది నీవే"—

ఇలా అంటూ భయంతో ఆ స్తంభంపై అలాగే కూలిపోయాడు—

"అయ్యో! ఈ విషయం ముందుగానే తెలుసుకోలేక పోతినే? ఎందుకిల్లా నబ్బా?. అయ్యో! నేనెంత గ్రుడ్డివాడ నయి పోయాను? ఎంత చెవిటివాడ నయిపోయాను? ఎంత అవివేకి నయి మోసపోయాను? నా బుద్ధికి పక్షవాతం వచ్చింది. నాలో దివ్యజ్ఞానం నశించింది. దివ్యశక్తులన్ని కోల్పోయాను. పిచ్చి వాడ నయిపోయాను. నోట మట్టికొని స్మశానంలో పొరలాడే పిచ్చివాళ్ళ నాకంటె నయం. ఇహ ఇప్పుడు నేను ఏది పుణ్యమో, ఏది పాపమో తెలుసుకోలేని స్థితిలో ఉన్నాను. స్వర్గ నరకాలకు గల భేదమేమిటో ఎరుగని స్థితిలో ఉన్నాను.

అప్పుడు పుట్టిన బిడ్డను తల్లి పక్కలోనుంచి తీస్తే కెవ్వున ఏడుస్తుంది. కుక్కపిల్ల తన యజమాని అడుగుజాడలను వాసనపట్టి తెలుసుకొంటుంది. ఆఖరుకు అటువంటి జ్ఞానంకూడా నశించింది నాకు. భూత, పిశాచాదుల వికటాట్టహాసాన్ని ఇప్పుడు నేను! ఎంతగా మారిపోయాను! కనుక సైతాను నన్నిక్కడికి లాక్కొచ్చిందన్నమాట. నేనిక్కడ అడుగు పెట్టినప్పుడే అహంకారం, వ్యామోహం నన్ను ఆవరించుకొన్నాయి. మహాత్ముడు ఆంథోనీ, తన కొండమీద ఉన్నప్పుడు ఇలాగే బాధపడ్డాడు. ఈ బాధలన్నీ బరిశెల్లా నా శరీరమంతా గుచ్చుకొని నన్ను చిత్రవధ చెయ్యనీ. దేవతలు కళ్ళారా చూస్తుండగా నాకీ శాస్తి కావలసినదే. బాధలంటే ఎలాఉంటాయో తెలుసుకోవడం నాకు ఇష్టమే. కాని ఆ ఈశ్వరుడు నాతో పలకడమే మానివేశాడే. ఆయన ఇలా మౌనం వహించడం చూస్తే నాకు కాళ్లు - చేతులు ఆడకుండా ఉన్నాయి. నిలువునా నీరయిపోతున్నాను. ఈశ్వరుడు నన్ను విడిచివెళ్లాడు - ఆయన్ను వెదికి పట్టుకోవాలి. ఆయన నన్ను విడిచి వెళ్ళడం వల్ల నేను ఒంటరివాడనయిపోయాను. భయంలో మునిగి ఉన్నాను. నేను ఆయన వెంట వెళ్ళాలి. తప్పదు. ఈ రాతిస్తంభం నా పాదాలను దహించివేస్తున్నది. వెంటనే వెళ్ళి ఆ భగవంతుని వెంటబెట్టుకొని వస్తాను."

ఇలా నిశ్చయించుకొని పప్నూటియస్, స్తంభానికి ఆనించి నిలువబెట్టి ఉన్న నిచ్చెన పట్టుకొన్నాడు. దానిమీద కాలు మోపి క్రిందికి దిగడం ప్రారంభించాడు. అప్పుడా స్తంభం కొసను ఉన్న రాక్షసి తల ఆయన కంటపడింది. ఆ

రాక్షసి తనను చూచి పక్కన నవ్వుతున్నట్లనిపించింది. ఇహ ఒక్క క్షణం ఆలస్యం చెయ్యకుండా గబగబ నిచ్చెన దిగి క్రిందికి వచ్చాడు. భూమిమీద అడుగు పెట్టాడు. కాని ఆయన కాళ్ళు స్వాధీనం తప్పాయి. అడుగు తీసి అడుగు వెయ్యలేక పోయాడు. ఇంతకాలంగా, నడవడం అలవాటు తప్పినందువల్ల తూలి పడబోయాడు. కాని మళ్ళీ నిలవ త్రొక్కుకొన్నాడు. సైతానులా ఉన్న ఆ ధ్వజస్తంభంనీడ ఇహ ఎంతమాత్రం తనకు సోకకూడ దనుకొన్నాడు. అక్కడనుంచి ఒకటే పరుగు లంకించుకొన్నాడు. అంతా నిశ్శబ్దం, ఊరంతా నిద్రమత్తులో ఊగుతోంది. హోటళ్ళు, సత్రాలు, అంగళ్ళు, సారాదుకాణాలు వీటన్నింటినీ దాటేసి, ఒక సందులో గుండాపడి లిబియన్ కొండలవైపు పరుగెత్తాడు. ఒక కుక్క అరుస్తూ ఆయనవెంట పడింది. ఆయన ఎడారికొసకు పోయి అక్కడ ఆగాడు. అక్కడి నుంచి ఒక త్రోవలేదు, తెన్నులేదు. అడ్డత్రోవన పడి మృగాలు, జంతువులు సంచరించే మార్గాన నడవసాగాడు. అలా ఒక్కడూ రాత్రనక పగలనక నడిచాడు.

చివర కాయనకు అలుపువచ్చింది. ఆకలి దప్పులు పీడించడం మొదలుపెట్టాయి. మనిషి సుళ్ళు తిరిగిపోయాడు. భగవంతు డింకా తనకు దూరమై పోయాడనే భావించాడు. తుద కొక నిశ్శబ్దమైన నగరం చేరుకొన్నాడు. దిగంతాలవరకూ వ్యాపించిఉన్న దా నగరం. అక్కడ భవనాలు విడివిడిగా పిరమిడ్లమాదిరి ఉన్నాయి. అవన్నీ పెద్దపెద్దగోరీలు. అదొక మహాస్మశానం. వాటిద్వారాలు భగ్నమై ఉన్నాయి. నక్కలు, తోడేళ్ళు - అంతటా కాపురం ఉంటున్నాయి. క్షుద్రజంతువు

లచే సగం సగం కొరికి తినివేయబడిన శవాలు అంతటా పొర్లాడుతున్నాయి. ఈభయంకరమైన స్మశాననగరంగుండా ప్రయాణం సాగించాడు పఫ్నూటియస్. ఒక వాగుఒడ్డున ఖర్జూరపుచెట్లమధ్యనున్న ఒక గోరీముందుకు వచ్చి ఆయన ఆయాసంతో కుప్పకూలిపోయాడు. ఈగోరీ చక్కగా అలంకృతమై ఉన్నది. తలుపులు లేవు లోపలికి వెళ్ళి చూచాడు. అక్కడొక రంగురంగుల మందిరం కనుపించింది. మందిరం అంతటా పాములు పారాడుతున్నాయి.

"ఈ ప్రదేశం నాకెంతో అనువుగా ఉంది. ఇక్కడ కఠోరతపస్సు చేస్తాను. నాపాపాలకు పశ్చాత్తపిస్తాను" అనుకొన్నాడు.

కాళ్ళీడ్చుకుంటూ లోనికివెళ్ళాడు. బల్లులను, తొండలను, పాముపిల్లలను కాళ్ళతో అటూ ఇటూ నెట్టి అక్కడున్న ఒకరాతిపై నిలుచున్నాడు. అలా పద్దెనిమిది గంటలసేపు నిలుచుని తరువాత వాగుదగ్గరికి వెళ్ళి కడుపునిండా మంచినీళ్ళు త్రాగాడు. తరువాత కాసిని ఖర్జూరపుపండ్లు కోసుకొని తిన్నాడు. వాటితోపాటు పద్మదళాలున్నూ త్రుంచుకొని భక్షించాడు. రోజూ ఇలాగే ఏదో పండూ - ఫలమూ, ఆకూ - అలమూ తిని బ్రతుకుదామని నిశ్చయించుకొన్నాడు. ఇలాంటిజీవితమే ఉత్తమమైనదని భావించాడు. మళ్ళీ వెళ్ళి బండమీద తలవాల్చుకొని కూచున్నాడు. ప్రొద్దస్తమానం అలాగే కూచుంటున్నాడు. తల ఎత్తడు.

ఇలా ఉండగా ఉండగా ఒకనాడు ఆయనకొక గొంతుక వినిపించింది:

"అబ్బాయ్! ఒక్కమాటు తల ఎత్తి చూడు! ఈ బొమ్మలవంక చూడు నాయనా."

ఇది విని పఫ్నూటియస్ తల ఎత్తి చూచాడు. ఆ మందిరంలో గోడలమీద చిత్రించిన ఎన్నెన్నో బొమ్మలు అగుపించాయి. చూడ చక్కని దృశ్యాలవి. ఎప్పుడో పూర్వ కాలంలో చెక్కినవి. కాని చక్కని పనితనం కనిపిస్తున్నది. వాటిలో జీవకళ ఉట్టిపడుతున్నది. వంటవాళ్లు పొయ్యి రాజవేస్తూ వంటలు చేస్తున్నట్లున్న బొమ్మలు కొన్ని. మరొక బొమ్మ-ఒక బోయవాడు బాతులను, గొర్రె పిల్లలను చంపి బుజాన వేసుకొంటున్నాడు. ధనుర్బాణాలు చేత పట్టుకొన్నాడు. ఒక చోట రైతులు - పొలాల్లో పనిచేస్తున్నారు. విత్తనాలు చల్లేవారు కొందరు, పండిన పంట కోతకోసేవారు కొందరు, కుప్పలు వేసేవారుకొందరు-ఇలా రకరకాల పనులలో నిమగ్నులయి ఉన్నారు. మరొక దృశ్యం-ఒక అమ్మాయి మురళివాయిస్తూ నృత్యం చేస్తున్నది. ఒకస్త్రీ ఫిడేలు, మరొక ఆమె వీణ వాయిస్తున్నారు. ఒక పిల్ల సితారా వాయిస్తున్నది. కలువ పూవు ఒకటి తలలో ఎంతో ముచ్చటగా ధరించింది. ఒళ్ళంతా తళతళ మెరుస్తూ కనుపించేటట్లు వలిపెంలాంటి దుస్తులు వేసుకొన్నది. ఉన్నతమైన వక్షోజాలు, చంద్రబింబం లాంటి ముఖం-చూడచక్కని చిన్నది ఆ పిల్ల. ముఖం ఒక ప్రక్కకు తిప్పుకొని తదేకంగా ముందుకు చూస్తున్నది. పఫ్నూటియస్ ఈ బొమ్మను పరిశీలించాడు. తరువాత తల వాల్చుకొన్నాడు. తనకు వినిపించిన కంఠస్వరానికి తిరిగి ఇలా బదులు చెప్పాడు-

"ఈ బొమ్మలవంక చూడమన్నావు. దేనికి? ఈ బొమ్మల్లో ఏమున్నది? పిచ్చిబొమ్మలు! ఎవరో విగ్రహారాధకులు చెక్కిన బొమ్మలు. మృతజీవుల జీవితాలు ఇవి. నీడల నీడలు ఇవి!"

"అవును, వీరు మరణించారు. కాని వీరు చచ్చి బ్రతికినవారు. మరి నీవూ? – నీవు బ్రతికినా, చచ్చినవాడివే!"–అని మళ్ళీ అన్నది ఒక గొంతుక.

ఆరోజులగాయతూ పఫ్నూటియస్‌కు ఒక్కక్షణం శాంతిలేదు. ఆకంఠస్వరం నిరంతరం అతని చెవిదగ్గర వాగుతూనేఉంది. సితారా వాయించే అమ్మాయి బొమ్మ ఆయనవంక రెప్పవాల్చకుండా చూస్తున్నది. చివరకా పిల్లకూడా మాట్లాడింది.

"చూడు, నావంక చూడు. ఎంత అందంగా ఉన్నానో! ప్రియుడా! నీపై మరులుగొన్నాను. మోహదాహంతో తపించిపోతున్నాను. రావోయీ! నాకౌగిట్లోకి రావోయీ! ఎందుకోయీ అంతభయం? నన్ను తప్పించుకొనిపోవడం నీతరంకాదు. నేను స్త్రీసౌందర్యాన్ని. ఓబుద్ధిహీనుడా! నన్ను తప్పించుకొని ఎక్కడికి పారిపోవాలనుకొంటున్నావు? ఎక్కడికి వెళ్ళినా నేను నీవెంట ఉంటాను. ఎక్కడికి వెళ్ళినా నీకు కనుపిస్తాను. విరిసిన పూవుల్లో, మిలమిల మెరిసే చెట్లల్లో, తీగల్లో, వెండివాన కురిసినట్లుండే వెన్నెల వెలుగుల్లో, విహాయస వీధులలో, తేలిపోయే పావురాయిపిట్టలలో, జలజల ప్రవహించే సెలయేళ్ళలో, బెదిరి బెదిరి చూచే లేడిపిల్ల కనులలో – అంతటా నీవు నా రూపాన్ని దర్శిస్తావు.

నాసౌందర్యాన్ని తిలకిస్తావు. ఇంతఎందుకు? నీవు కనులు మూసినా, నీలోనే నేను వుండడం చూస్తావు. నే నిక్కడ ఉండబట్టి ఎన్నో వేలవండ్లయింది. ఎందరెందరో ఈ నా పాదాలచెంత వవళించారు. నిద్రమత్తులో ఊగారు. నా పెదవులను ముద్దాడారు. అయినా వా రెవ్వరికీ తనివి తీరలేదు. నీవుకూడా నన్ను ఎరుగుదువు వఫ్నాటియస్! ఇంకా నీవు నన్ను గుర్తుపట్టనేలేదా? థాయిస్ ఎత్తిన అనంతకోటి అవతారాలలో నేను ఒక అవతారాన్ని! నీవు తాపసులలో శ్రేష్ఠుడవు. వివేకవంతుడవు. ఎన్నో విషయాలు తెలిసినవాడవు. ఎంతోదూరం ప్రయాణం చేసినవాడవు. బహుదేశాటనం ఎవరికైనా వివేకం పుట్టిస్తుంది. వదేండ్లు ఇంటిదగ్గర ఉంటే ఎంతో — ఒకరోజు దేశాటనంలో ఉంటే అంత! పూర్వకాలంలో థాయిస్, హెలెన్ అనే పేరుతో పుట్టిందని నీవు వినే ఉంటావు. ఆమె ఎన్నో రూపాలెత్తింది. నేను దెబెస్‌కు చెందిన థాయిస్‌ను. ఈ విషయం నీ కెందుకు తెలియలేదో నాకు వింతగా ఉంది. నేనీ లోకం జన్మించినప్పుడు ఎందరెందరి పాపాలో భరిస్తూ వచ్చాను. ప్రపంచ మానవుల పాపాలలో పాలుపంచుకొంటూ వచ్చాను. ఇప్పుడు నీవనై ఈ లోకంలో తిరుగుతున్నాను. ఇప్పటికీ పాపాలను భరించేశక్తి నాకు ఉన్నది. చెపితే ఆశ్చర్యపోతావు. నీవు ఎక్కడున్నా థాయిస్ మళ్ళీ నీకు కనుపిస్తూనే ఉంటుంది. ఇది నిజం; ముమ్మాటికీ నిజం!"—

ఈ మాటలువిని వఫ్నాటియస్ భయంతో కంపించిపోయాడు. బండకు తలవేసి బాదుకొన్నాడు. బిగ్గఱగా ఏడ్చాడు. కేకలు పెట్టాడు. ప్రతిరాత్రి ఆ అమ్మాయి అతని

దగ్గరికి వస్తున్నది. స్పష్టంగా మాట్లాడుతున్నది. మోహంలో ముంచివేస్తున్నది. ఆ పుణ్యపురుషుడు ఇంద్రియాలను నిగ్రహించుకొంటున్నాడు. వాంఛలను అణచుకొంటున్నాడు. చివర కామె ఇలా అన్నది-

"స్నేహితుడా! నన్ను ప్రేమించు, కామించు. నాకు వశం కావోయీ నాయనా! మృతి చెందిన స్త్రీ ఎంతఓపికతో ఉంటుందో నీవు ఎరుగవు. నేను ఇలాగే ఓపికపట్టి ఉంటాను. చివరదాకా. అవసరమైతే నీవు చచ్చేదాకా! తెలిసిందా? నేను మంత్రికత్తెను, నీవు చనిపోయినా సరే. నీ శరీరంలో ప్రవేశిస్తాను. నిన్ను బ్రతికించి, నా చెప్పు చేతల్లో, నే గీచిన గీటు దాటకుండా-ఉండేటట్లు చేసుకొంటాను. కాబట్టి ఆలోచించుకో పఫ్నూటియస్. పవిత్రమైన నీ దేహం పాపపంకిలంలో పొర్లాడుతుంది. పైన ఉన్న నీ ఆత్మ అది చూచి ఎంతగా క్షోభిస్తుందో ఊహించుకో. ఆ భగవంతుడుకూడా నీకు తోడ్పడే అవకాశం ఉండదు. ఆయనమటుకు ఏం చేస్తాడు? భూతం పట్టిన నీ దేహంలో దివ్యమైన ఆత్మను ఎలా ప్రవేశపెట్టగలుగుతాడు? క్షుద్ర మంత్రాలనుండీ, మాయలనుండీ ఎలా కాపాడ గలుగుతాడు? పాపం! ఈ విషయాలన్నీ నీవు ఆలోచించుకొని ఉండవు. అలాగా నిన్ను కాపాడే ఆ భగవంతునికికూడా ఈ ఆలోచనలు తట్టిఉండవు. ఇహ నీవూ - నేనూ అంటావా? మన మధ్య జరిగే విషయాలు ఆయనకు అంతగా అంతుపట్టవు. మాంత్రికులు ఎవరైనా సరే, ఈశ్వరుణ్ణి ఇట్టే మోసం చెయ్యగలరు. పాపం! ఆయన పట్టి అమాయకుడు. మాయలూ, మర్మాలూ యెరుగనివాడు. కాని ఆయన

మహాశిల్పి. సందేహం లేదు. నామటుకు నాకు యీ సౌందర్యం ప్రసాదించింది ఆయనే కదా. అంటే ఏమిటి అర్థం? నన్ను ఆయన వలచా డన్నమాట! నీవు ఆయన్ను తప్పుగా అర్థం చేసుకొన్నావు పఫ్నూటియస్. నీవు యీ గోరీలో ఉండడానికి వచ్చావు. వచ్చినప్పుడు ఎన్నెన్నో పాముపిల్లలను, తొండలను-ఇంకా చిన్న చిన్న జంతువులను కాళ్ళతో అటూ-ఇటూ ఇష్టంవచ్చినట్లు నెట్టిపారేశావు. నిజాని కవి నీకు ఏమీ అపకారం చెయ్యలేదు. వాటి పిల్లలను, గ్రుడ్లను చిదిమివేశావు నీవు. పఫ్నూటియస్! నీవు చాలా ప్రమాదమైన మనిషివి. ఈశ్వరుడు సౌందర్యోపాసకుడు. గొప్ప సంగీత పాటకుడు. మరి నీవు? చేసిందేమిటి? సౌందర్యమన్నా, విజ్ఞానమన్నా, నీకు సరిపడదు. వాటితో నీవు యుద్ధం చేశావు. కనుక నీకా భగవంతుడు తోడుండడు. నీవు వట్టి దౌర్భాగ్యుడివి పఫ్నూటియస్. ఆయన నిన్ను కాపాడతాడన్నది కల్ల. ఇహ ఈ భ్రమ వదిలిపెట్టు. ఏదీ, స్నేహితుడా! ఇలారా. ఒక్క ముద్దివ్వు!"-

మాయాజాలమంతా తనను చుట్టుముట్టినట్లు ఉలిక్కిపడుతున్నాడు పఫ్నూటియస్. తరువాత తనలో-"నే నిప్పుడున్నది ఒకగోరీలోకదా. ఇక్కడ పూడ్చిపెట్టబడిన మనిషికి ఈ మాయలన్నీ తెలిసి ఉండాలి?"-అనుకొన్నాడు.

ముఖ్యంగా ఆయన భయం ఒక్కటే. ఇక్కడ భూస్థాపితంచేయబడిన మనిషికీ ఆగోడమీది అమ్మాయికీ సంబంధం ఉన్నదని ఆయన ఊహించాడు. వీరిరువురూ దయ్యాలై ప్రేమించుకుంటున్నారని అనుకొన్నాడు. బ్రతికిఉన్నప్పుడు

ఎలా కలిసిఉన్నారో అలాగే చచ్చినతరువాతకూడా విడిపోయ కుండా ఉండాలని ఇలాచేస్తున్నట్లు ఆయనకు తోస్తున్నది. అప్పుడప్పుడూ స్త్రీ పురుషులు ముద్దాడుకోవడంకూడా ఆయనకు వినిపిస్తున్నది.

పఫ్నూటియస్ మనస్సు అల్లకల్లోలమవుతున్నది. క్షణక్షణం భగవంతునికి దూరమైపోతున్నట్లు అనుకుంటు న్నాడు. భయంతో కంపించిపోతున్నాడు [illegible] లో చిస్తున్నాడు. ఒకనాటి సాయంత్రం [illegible] భగవ ద్ధ్యానం చేసుకొంటున్న సమయంలో ఆయనకొక గొంతుక ఇలా వినిపించింది–

"పఫ్నూటియస్! నీవు అనుకున్నదానికంటె ఎక్కువ మంది జనులు ఈ భూమిమీద ఉన్నారు. నేను వారి నివ యాలన్నీ నీకు చూపించినట్లయితే నీవు [illegible]క్రాంత పోతావు. ఉన్నచోటనే ఉండిపోతావు. ఒం[illegible]ళ్లు, ఒంటికాలివాళ్లు లోకంలో ఎందరో ఉన్నారు. [illegible]లు గల వికృతరూపులున్నారు [illegible] వాండ్లు. ఆడ[illegible]డు, ఆడవాండ్లుగా మారే [illegible] గవాళ్లు ఉన్నారు [illegible] గుహలలో ఉన్న మనుష్యులు కొందరున్నారు. కొందరి [illegible]లలేకుండా కడుపులోనే కళ్లు, ముక్కు గల భయంకర [illegible] రంతో ఉన్నారు. ఒక్కటి అడుగుతాను, [illegible] క్రైస్ట్, ఈ మానవులందరినీ ఉద్ధరించడంకో[illegible]లు వీడాడని నీకు నమ్మకముందా?"–

మరొకసారి ఒక కల వచ్చింది. ఆ [illegible]లో పెద్ద వెలు తురు. ఆ వెలుతురులో విశాలమైన [illegible], [illegible]లు

కనుపించాయి. అరిస్టొబులస్, చెరియస్‌లు సిరియాదేశపు గుఱ్ఱా లను ఎక్కి స్వారిచేస్తున్నారు. ఆ యువకు లిరువురూ ఎంతో ఆనందంగా అగుపిస్తున్నారు. ఒకచోట కాలిక్రెటిస్ కూచుని పద్యాలు చదువుకొంటున్నాడు. ఎక్కడలేని అహంభావత్వం అతని కనులలో ద్యోతకమవుతోంది. తోటలో ఒకచోట జెనొఫొమిన్, బంగారపు యాపిల్‌పండ్లు ఏరుకొంటున్నాడు. రెక్కలుగల సర్పరాజును లాలిస్తున్నాడు. ఇహ హెర్మొడొ రస్, తళతళలాడే తెల్లని దుస్తులు ధరించి పిండార పోసినట్లున్న వెన్నెల వెలుగుల్లో ధ్యానంచేసుకొంటూ కూచున్నాడు. పోతే అతని వెనకాల పైనుంచి దూకుతూ ప్రవహిస్తున్న సెల ఏరు. ఆ ఏటి ఒడ్డుననే నిసియస్ కూచున్నాడు. నక్షత్రమండ లాన్ని పరిశీలిస్తున్నాడు. తరువాత, స్వప్నంలో ఒక ముసుగు వేసుకొన్న అమ్మాయి కనుపించింది చేతిలో కదంబవృక్షపు కొమ్మ ఒకటి పట్టుకొన్నది. ఆ పిల్ల పప్నూటియస్ దగ్గరికి వచ్చి—

"చూడు! కొందరు శాశ్వతమైన సౌందర్యాన్ని దర్శిం చడం కోసం, ఏదో అర్థంలేని శూన్యంలో జీవిస్తూ కాలం గడుపుతారు. మరి కొందరు ఏ ఆలోచనా లేకుండా నిశ్చిం తగా బ్రతుకుతారు. కాని ఇలాంటి వారుమాత్రమే, జీవితం లోని అసలైన ఆనందం అనుభవించ గలుగుతారు. ప్రకృతి రమణీయకతను, శోభను చవిచూడ గలుగుతారు. ఇలాంటి వారే సుఖజీవులు. కారణం ఏమంటే అన్నింటిలోకీ మానవ జీవితమేకదా గొప్పది. ఈశ్వరునకు అత్యంత ప్రియమైన గీతం, సంగీతం, మానవజీవితం! సుఖించడం ఒక్కటే మాన

వృత్తికి పరమార్థం. అందుకోసమే మానవుడు పుడతాడు, బ్రతుకుతాడు, చస్తాడు. అలాంటప్పుడు నీ సిద్ధాంతం ఏమిటి పఫ్నూటియస్? నీవు పట్టి దగాకోరువు అన్నమాటేగా? నీ వెర్రి-మొర్రి వేదాంతాలన్నీ వ్యర్థమన్నమాటేగా?" అని అడిగింది.

ఇలా కలలు వచ్చి పఫ్నూటియస్ మనస్సును పూర్తిగా చెదరగొడుతున్నాయి. ఎడతెరపి లేకుండా ఆయన దేహాన్నీ, మనస్సునూ వివశమయ్యేటట్లు చేస్తున్నాయి. ఎక్కడలేని పెనుభూతాలన్నీ వచ్చి ఆయన్ను ఆవహించాయి. ఒక్క క్షణం శాంతి లేదు. దయ్యం పట్టినట్లున్నాడు. ఎక్కడో, ఏకాంతంగా, ఎవరి కంటా పడకుండా ఆయన ఉంటూ వచ్చిన గోరీ అల్లకల్లోలంగా ఉంది. ఒక మహానగరం నడివీధి జన సమ్మర్దంవలన ఎంత అలజడిగా ఉంటుందో అంత అలజడిగా ఉంది. ఏమూల చూచినా భూతాల అరుపులు, వికటాట్ట హాసాలు. ఒకటి కాదు, రెండు కాదు. ఎన్నోవేల భూతాలు గుంపులుగావచ్చి కోలాహలం చేస్తున్నాయి. సాధారణ జీవితాన్ని రకరకాలుగా చూపుతున్నాయి. ఆయన భయ విచలితుడవుతున్నాడు. సుళ్ళు తిరిగి పోతున్నాడు. సాయంకాలం వేళ వాగు దగ్గరికి వెళ్ళినప్పుడు వనాలలో సంచరించే భూతాలు, బ్రహ్మరాక్షసులు వచ్చి ఆయనను చుట్టుముట్టుతున్నాయి. శృంగార నృత్యాలు చేస్తూ ఆయనచేతకూడా ఆడించడానికీ, పాడించడానికీ విశ్వప్రయత్నం చేస్తున్నాయి. బలవంతాన లాక్కెడుతున్నాయి. ఇప్పుడు ఆయనంటే ఆ భూతాలకు ఏమాత్రం భయం లేదు. విచ్చలవిడిగా ఆయన్ను ఆటలు పట్టి

స్తున్నాయి. అపహాస్యం చేస్తున్నాయి. అవమానిస్తున్నాయి. చావమోదుతున్నాయి. చూడకూడని బూతు దృశ్యాలన్నీ చూపుతున్నాయి. ఒక నాడు ఒక చిన్న భూతం వచ్చి ఆయన మొలత్రాడు దొంగిలించుకొని పోయింది.

"అయ్యో, భగవంతుడా! నన్ను ఎక్కడికి తీసుకెడుతున్నావు?" అని ఆయన వాపోయాడు. ఏదో ఒక పని చెయ్యాలని నిశ్చయించుకొన్నాడు. ఆ పని సందట్లో నయినా మనోవేదన మరచిపోదామనుకొన్నాడు.

వాగు ఒడ్డున కొన్ని అడవి అరటిచెట్లున్నాయి. పెద్ద పెద్ద ఆకులువేసి, తాటిచెట్లనీడలో ఏపుగా పెరిగి ఉన్నాయి. వాటి బోదెలన్నీ తెగకొట్టి, వాటిని గోరీవద్దకు మోసుకొని పోయాడు పఫ్నూటియస్. అక్కడ వాటిని రాళ్ళతో నలగగొట్టి, నార తీశాడు. తాళ్ళు పేనేవాళ్లు చేసినట్లు నారతో తాళ్ళు పేనడం మొదలుపెట్టాడు. దానితోనే మళ్ళీ తనొక మొలతాడు పేనుకొని మొలకు కట్టుకోవాలనుకొన్నాడు. కాని ఇది చూచి భూతాలు భరించలేక పోయినాయి. ఇహ ఆయనచుట్టూ చేరి అరవడం మానేశాయి. గోడమీద అమ్మాయి బొమ్మకూడా, తన మాయాజాలం ప్రదర్శించడం మానుకొని నిశ్శబ్దంగా ఉంది. ఇలా అరటి ఊచలు తెగ కొట్టుతూ, తాళ్ళు పేనే పనిలో ఉండిపోయి పఫ్నూటియస్ కొంత మనశ్శాంతి చిక్కించుకొన్నాడు. ఆయనకు మరింత విశ్వాసం, ధైర్యం పుట్టుకరాసాగాయి.

"భగవంతుని తోడుగా చేసుకొని దేహాన్ని లొంగ తీసుకుంటాను. నాఆత్మ స్థైర్యం ఇప్పటికీ చెక్కుచెదరకుండా ఉంది. నామనస్సులో అనుమానాన్ని అల్లకల్లోలాన్నీ రేకెత్తిస్తున్న ఈభూతకోటి ప్రయత్నాలను వృధాచేస్తాను. మరులు గొలుపుతున్న ఈస్త్రీని జయిస్తాను. మహానుభావుడు - జాన్ లాగా వీరికి సమాధానం చెపుతాను-'మొట్టమొదట వాక్కు పుట్టింది. ఆవాక్కే భగవంతుడు!'అని చెపుతాను. నావిశ్వాసాన్ని చస్తే వదిలిపెట్టను. అది అబద్ధమని ఎవరైనా అంటే వారు అంటున్నకొద్దీ నావిశ్వాసాన్ని మరింత దృఢతరం చేసుకొంటాను. వాస్తవానికి అది అబద్ధమే. సందేహంలేదు. కాకపోతే నాకంతటి నమ్మకం కుదరదు. నమ్మకం కుదుర్చుకోడానికి బహులు ఆలోచించి అవగతం చేసుకొనేవాణ్ణి."అనుకొన్నాడు తనలో.

ఆయన ఈవిధంగా తాళ్లు పేనుకొంటూ కాలం గడపసాగాడు. ప్రతిఉదయం లేచి నారతీయడం, అది చెడిపోకుండా ఎండలో ఆరవేయడం - ఇత్యాదిపనులలో నిమగ్నుడయి ఉంటున్నాడు. తను ఆవిధంగా శ్రమిస్తునందుకు ఎంతో ఆనందిస్తున్నాడు. ఆఖరుకు పసిపిల్లవాడయినట్లు అయినాడు. తాళ్లు పేనడం పూర్తయినతరువాత, ఆచుట్టుప్రక్కలఉన్న తుంగ పీకి దానితో చాపలు, బుట్టలు అల్లడం మొదలుపెట్టాడు. ఆయన ఉంటున్న గోరీ ఒకచిన్న మేదరివాడి ఇల్లులా తయారయింది. ఏమైనా ఒకచెంపన ఇలా పనిచేస్తూ, మరొకచెంపన తన దైవప్రార్థనలు కొనసాగిస్తున్నాడు పఫ్నూటియస్. ఇంత చేస్తున్నప్పటికీ ఈశ్వరుడు దయదలచలేదు. ఒకనాటి

రాత్రి ఒక భయంకరమైన గొంతుక వినిపించింది. ఆయన ఉలిక్కిపడి లేచాడు. భయంతో నెత్తురు గడ్డకట్టుకపోయింది. చచ్చి అక్కడ సమాధి చెయ్యబడిన మనిషిగొంతుకే అది అని ఊహించుకొన్నాడు.

ఆగొంతుక త్వరత్వరగాను, చెవులో గొణిగినట్లుగాను ఇలా అన్నది-

"హెలెన్! హెలెన్! లే, లే! త్వరగా లేచిరాం. నాతో జలకమాడుదువుగాని. ఊఁ, త్వరగా!"

అంతట ఒకస్త్రీ, ఆయన చెవిదగ్గర నోరుపెట్టి - "స్నేహితుడా! నేను లేవలేను. నామీంద ఒకమనిషి పడుకొని ఉన్నాడు!" అని సమాధానం చెప్పింది.

అంతలో అకస్మాత్తుగా, తను ఒకస్త్రీ వక్షస్థలంపై తలవాల్చుకొని ఉన్నట్లు తెలుసుకొన్నాడు పఫ్నూటియస్. ఆస్త్రీ ఎవరోకాదు. గోడమీంది బొమ్మలోఉన్న అమ్మాయే!

పఫ్నూటియస్ మోహపరవశుడైనాడు. పరిమళాలు వెదజల్లుతూ, పచ్చగా, వెచ్చగా ఉన్న ఆపిల్ల శరీరాన్ని గట్టిగా కావలించుకొన్నాడు. మధురపానీయం త్రావబోయి నట్లు త్రావబోయినాడు.

"వెళ్ళకు ప్రియురాలా, వెళ్ళకు!" అని బిగ్గరగా అరచాడు. కామం ఆయనకళ్ళకు ఎగతట్టింది.

కాని అంతలోనే ఆవిడ లేచి వాకిట్లోకి వెళ్ళి నిలుచున్నది. పకపక నవ్వింది. వెన్నెలవిరిసినట్లున్నదానవ్వు!

"నే నెందుకు వెళ్ళకూడదూ? మధురమైన ఊహాజగత్తులో తేలిపోయే ఇటువంటి ప్రియుడికి ఒకనీడతాలూకు నీడ చాలునయ్యా! ఇహ ఇక్కడ నే నెందుకు ఉండాలి? పైగా నీవు పాపంచేశావు. ఇంకా ఏంకావలయ్యా నీకు?" అన్నదామె.

ఆరాత్రంతా పఫ్నూటియస్ వలవల ఏడుస్తూ కూచున్నాడు. సూర్యోదయంకాగానే ఈశ్వరుని ఇలా ప్రార్థించసాగాడు.

"జీసస్, ఓ జీసస్! నన్ను కాపాడరావేం? నే నెంతటి ప్రమాదస్థితిలో చిక్కుకొని ఉన్నానో నీవు చూడడంలేదా ప్రభూ? రా. రక్షకుడా! రా. నాకు తోడ్పడు. నీ తండ్రి నన్ను ప్రేమించడం మానుకొన్నాడు. నా మొఱలు వినడమే లేదు. కనుక ఇహ నీవే నాకు దిక్కు. ఆ స్వామికి నాపై దయ లేదయ్యా. నాపై జాలి దలచడయ్యా. నేను నిన్నే నమ్ముకొన్నాను. నీవూ ఒకతల్లి బిడ్డడవు. నీవూ ఒక మానవుడవు. తోటి మానవుని కష్టసుఖాలు తెలిసినవాడవు. నీవు దేవదేవుడవనీ, వెలుగుల వెలుగువనీ, సర్వాంతర్యామివనీ, జగద్రక్షకుడవనీ, నిన్ను ప్రార్థించడమేకాక, నీవు ఈ భూమిమీద అవతరించావనీ, నిరుపేదలమధ్య జీవించావనీ, మానవుల గాథలలో పాలుపంచుకొన్నావనీ నిన్నింతగా వేడుకొంటున్నానయ్యా. నే నిప్పుడు సైతాను చేతుల్లో చిక్కి ఎంతగా హింసపడుతున్నానో చూడడంలేదా ప్రభూ? ఈ నా దేహం నీది. ఈ నా జీవితం నీది. ఈ నా కష్టం నీదికాదా ప్రభూ? ఈ నా అవమానం నీదికాదా స్వామీ? కనుక నిన్ను శరణుజొచ్చుతున్నానయ్యా"–

పఫ్నూటియస్ ఇలా మొఱపెట్టుకొంటూ ఉండగా, ఆ స్తంభం నాలుగు ప్రక్కలా ఒక పిట్టాట్టహాసం వినిపించింది. తాను స్తంభంపై ఉన్నప్పుడు వినిపించిన ధ్వనిలాంటి ధ్వనే అది. ఆయన చెవులు గింగురు లెత్తాయి.

"నిరతావలంబనుడైన మార్కస్ ప్రార్థనలాంటిదే ఇది. పఫ్నూటియస్ క్రీస్తు విరోధి! పఫ్నూటియస్ క్రీస్తు విరోధి!"

ఈ ధ్వని విని పఫ్నూటియస్, తలమీద పిడుగు పడినట్లు మూర్ఛపోయాడు.

*          *          *          *

ఆయనకు స్పృహ వచ్చింది. కళ్ళు తెరిచి చూచేసరికి నల్లని ఉన్ని ముసుగులు తలకు పెట్టుకొని సన్యాసులు చుట్టూ కూర్చుని ఉన్నారు. ఆయన ముఖంమీద, కణతలమీద నీళ్లు చిలకరిస్తున్నారు. దయ్యాల్ని వదలగొట్టే మంత్రాలు చదువుతున్నారు. ఇంకా అనేకమంది సన్యాసులు తాటిమట్టలు చేత పట్టుకొని అవతల నిలబడి ఉన్నారు.

"మేము ఎడారిలోనుంచి వెళుతుండగా, ఈ గోరీలోపలనుంచి పెద్దగా అరుపులు వినిపించాయి. లోపలికి వెళ్ళి చూశాం. నీవు స్పృహతప్పి పడిఉన్నావు. ఏవో భూతాలు నిన్ను క్రింద పడత్రోసి ఉంటాయి. మేము రాగానే అవి పారిపోయాయి." అని చెప్పాడు ఆ సన్యాసులలో ఒకతను.

పఫ్నూటియస్ తల ఎత్తి చూచాడు. సంగిమాటతో ఇలా అడిగాడు.

"అన్నలారా! మీ రెవరు? ఎక్కడి కిలా వెడుతున్నారు? మీ చేతుల్లో ఆ తాటి మట్టలేమిటి? నన్ను పూడ్చిపెట్టడానికా?

అంతట వారిలో ఒకడు- "తమ్ముడూ! నీ కింకా తెలియదా? మన తండ్రి ఆంథోనీ - నూట అయిదు సంవత్సరాలు నిండిన వృద్ధుడు-కోల్జిన్ కొండ శిఖరంమీదనుంచి ఇవాళ దిగి వస్తున్నాడు. తన బిడ్డలను ఆశీర్వదించడానికి వస్తున్నాడు. మేము ఆ మహాత్ముని దర్శించడానికి వెడుతున్నాం? అది సరే కాని, ఏమిటి నీ పరిస్థితి? నీవు ఇలా పతనమై పోయావేమిటి? భగవంతుడు నీకు తోడులేడా?"- అని అడిగాడు.

"అయ్యో! అంతటి పుణ్యానికి నేను నోచుకోలేదయ్యా. భూతాలు, బ్రహ్మరాక్షసులు నన్ను పట్టి వేధిస్తున్నాయి. అన్నలారా! నాకోసం దైవప్రార్థనలు చెయ్యండి. నాకు ముక్తి కలిగించండి. నేను పఫ్నూటియస్‌ను. ఆంటినోయ్ పీఠాధిపతిని - భగవంతుని సేవకులలో నీచాతినీచుడను"-అని పఫ్నూటియస్ బదులు పలికాడు.

పఫ్నూటియస్ పేరు వినగానే అక్కడున్న సన్యాసులంతా ఆయనకు సాగిలపడి మ్రొక్కారు. ఆయన గొప్పతనాన్ని గురించి గుసగుసలాడారు. తరువాత వారిలో ఒకాయన- "నీవా? నీవేనా పఫ్నూటియస్‌వు? ఎన్నెన్నో మహత్కార్యాలు చేసి మహానుభావుడని పేరుపొందిన పఫ్నూటియస్‌వు నీవేనా? ఏనాటికైనా మహాత్ముడైన ఆంథోనీతో సరితూగగలడనుకొన్న ఆ పుణ్యాత్ముడవు నీవేనా? నీవు తపస్సిద్ధుడవు. రాయవేశ్యగా ఉన్న థాయిస్‌ను ఉద్ధరించిన

వాడవు. ఈశ్వరసన్నిధికి చేర్చినవాడవు. నీవు ధ్వజస్తంభంపై అహోరాత్రాలుండి కఠోరతపము సలిపావు. ఆ పుణ్యధ్వజం దర్శించి వేలాది ప్రజలు ముక్తులయినారు. ఆ దివినుండి దేవ కన్యలు దిగివచ్చి నీ చుట్టూ పరివేష్టించారు. కాని ఇలా జరిగిన కొంతకాలానికి ఒకనాడు ఉన్నట్లుండి నీవు మాయమైనావు. నీ వా ధ్వజస్తంభంపై లేకపోవడం జనమంతా చూచారు. పైనుంచి ఒక భయంకరమైన ఏడుపు వినిపించింది. కాని నీ శిష్యులలో ఒకడయిన ఫాలియన్, నీ అద్భుతాలను జనానికి చెప్పాడు. నీకుమారుగా ఆచార్యపీఠం అలంకరించి శిష్యకోటికి ఆశీస్సు లందించాడు. కాని మళ్ళీ అంతలోనే - వెర్రివాడని పిలువబడే పాల్ అనే ఒకతను వచ్చి అందరి అభిప్రాయాలనూ ఖండించాడు. తనకు ఒకకల వచ్చిందనీ, ఆ కలలో పఫ్నూటియస్ కనుపించాడనీ, అతన్ని భూతాలు పట్టుక పోతున్నాయనీ అందరికీ చెప్పాడు. జనం అతని మాటలు నమ్మలేదు. పైగా నిన్ను ఇలా అవమానిస్తున్నందుకు ఆగ్రహపూరితులైనారు. పాల్‌ను రాళ్ళతో కొట్టడం మొదలుపెట్టారు. కాని ఎలా తప్పించుకొన్నాడో అతను చావుతప్పించుకొని బయటపడ్డాడు. నాపేరు జోజిమస్. ఇప్పుడు ముందు సాగిలపడి ఉన్న ఈసన్న్యాసులందరికీ నేను గురువును. నేను మీకు నా ప్రణామములు అర్పిస్తున్నాను. మమ్మందరినీ ఆశీర్వదించండి. ఇంతకాలంగా మీరు గ్రహించిన ఈశ్వరతత్వాన్ని మాకు ఉపదేశించండి." అన్నాడు.

జోజిమస్ చెప్పినది విని పఫ్నూటియస్ "మీరు అనుకున్నంత పుణ్యపురుషుణ్ణి కానయ్యా నేను. ఈశ్వరుడు నన్ను

నానాహింసలూ పెట్టాడు. మోహాలలో ముంచి పరీక్షించా డయ్యా. ఏదేవకన్యలూ వచ్చి నన్ను తీసుకొని వెళ్ళలేదు. నాకనులముందు ఒకానొక నీడ గోడకట్టుకొని కనుపించింది. ఆనీడ నాకనులలో ఆడిందయ్యా! నేనొక కలలో జీవించాను. ఒకానొక భ్రాంతిలో పయనించాను. భగవంతుడు లేని దీర్ఘ స్వప్నం అది. నేను అలెగ్జాండ్రియా నగరానికి ప్రయాణం చేసి నప్పుడు నేను ఎన్నెన్నో ధ్వనులు = మాటలు, పాటలు విన్నాను. అవన్నీ తప్పులమాటలని తరువాత తెలుసుకొన్నా నయ్యా. ఆమాటలే నన్ను నిరంతరం వెంటాడి వేధిస్తూ వచ్చాయి. శూలాల్లా చుట్టుముట్టాయి" అని సమాధానం చెప్పాడు.

అంతట జోజిమస్ "స్వామీ! తాము తపోనిధులు. తమకు తెలియనివిషయం లేదు. పుణ్యపురుషులు - అందులోనూ ఏకాంతగా జీవిస్తున్న పుణ్యపురుషులు ఎన్నెన్నో పరీక్షలకు గురికాక తప్పదు. దేవకన్యలు వచ్చి మిమ్ములను ఎత్తుకొనిపోయి నట్లయితే, మీ దివ్యశక్తులన్నీ భగవంతుడు మీశిష్యుడైన ఫ్లావియన్‌కు ప్రసాదించిఉండాలి. సందేహం లేదు. మీకు పూనకంవచ్చి ఇక్కడ పడిఉన్నారు. నామాట అసత్యమేమో, ఈసన్యాసులను, తక్కిన జనాన్ని అడగండి స్వామీ" అన్నాడు మళ్ళీ జోజిమస్.

తానుకూడా వారితో వెళ్ళి ఆంథోనీ ఆశీస్సులు పొందా లనుకొన్నాడు పఫ్నూటియస్.

"నాయనా, జోజిఫస్!' నాకూ ఒక తాటిమట్ట ఇవ్వండయ్యా. నేనూ మీతో వచ్చి మన తండ్రి ఆంథోనీని దర్శించుకొంటాను" అన్నాడు.

"అలాగే రండి స్వామీ, వెడదాం" అని చెప్పాడు జోజిఫస్–"సన్యాసులకు క్రమశిక్షణ ఉండాలి. సైనికులలాగానే. సన్యాసులు దేవుని సైనికులు. మీరూ, నేనూ మఠాధిపతులం. కనుక మన ఇరువురం ముందు నడుద్దాం. మన వెంట తక్కిన ఈ సన్యాసులంతా నడిచి వస్తారు. ప్రార్థనాగీతాలు పాడుతూ వస్తారు" అన్నాడు.

అలాగే వారంతా పయనమై పోసాగారు. అప్పుడు పఫ్నూటియస్ మళ్ళీ ఇలా అన్నాడు.

"ఈశ్వరుడు ఒక్కడే. ఆయన ఒక్కడే సత్యం. ఆయన ఒక్కడే నిత్యం. ఈ ప్రపంచం బహుళం. కనుక ఇది అసత్యం. అనిత్యం. ఎంత అమోఘకంగా అగుపించినా సరే, ప్రకృతి దృశ్యాలన్నింటినుంచి మన మనస్సును మళ్ళించుకోవాలి నాయనా. అప్పుడు మనకు మహదానందం కలుగుతుంది. నా మటుకు నేను జలజల ప్రవహించే ఏటిలోని తామర పూలను తేరిపారచూడలేను. ఎందుకో తెలుసా? ఈ కనుపించే ప్రకృతి అంతా మాయ. ఇది మనలను మరులు గొలుపుతుంది. భ్రాంతి కలిగిస్తుంది. కాంక్షలను రేకెత్తిస్తుంది. కనుక ఇంద్రియాలను ప్రేరేపించే ఏదృశ్యాన్ని అయినా, ఏవస్తువునయినా సరే మనం త్యజించి తీరాలి. యీ ప్రపంచంలో ప్రతిదీ మనలను మోహంలో ముంచివేస్తుంది. ఆఖరుకు కంటికి కనుపించని ఇసుక రేణువుకూడా ప్రమాదకరమైనదే.

మోహం బహు చెడ్డది నాయనా. అన్నిటికంటె స్త్రీ వ్యామోహం మరింత ప్రమాదకరం. అన్ని మోహాలకలయిక స్త్రీ. అన్ని మోహాలకూ మూలం స్త్రీ. ఈ చల్లని గాలి, యీ రంగు రంగుల పూలు, ఈ పిల్లకాలువలు, ప్రకృతి శోభ-ఇవన్నీ స్త్రీ స్వరూపమే. కనుక పాత్రకు మూత బిగించినట్లు ఆత్మను బంధించుకోవాలి. వాడే సుఖి. ఎవడు అంధునిలా, బధిరునిలా, మూగలా, జడునిలా ప్రవర్తించ గలుగుతున్నాడో వాడే సుఖి, సదానందుడు. ఎవడు ప్రపంచాన్ని గురించి ఏమీ యెరుగడో, అతనికి ఈశ్వరుని గురించి అంతా ఎరుకపడుతుంది నాయనా! ఇదీ అసలు కీలకం!"

ఇది విని జోజిమస్, తత్త్వచింతన చేస్తూ తిరిగీ ఆయనకిలా ప్రత్యుత్తరం ఇచ్చాడు.-

"స్వామీ! మీరు మీ ఆత్మస్వరూపాన్ని నాకు ఎరుకపరిచారు. ఇహ నేనూ, నే చేసిన పాపాలు మీకు బాహాటంగా చెప్పడం న్యాయం. ఒకరి పాపాలు ఒకరికి నివేదించుకొనడం క్రైస్తవధర్మం. చెపుతాను వినండి స్వామీ. నేను సన్యాసిని కాకపూర్వం చాలా దుష్టజీవితాన్ని గడిపాను. 'మెడవురా' అనే పట్టణంలో ఉండేవాణ్ణి. ఆ నగరం వేశ్యలకూ, విలాసినులకూ పుట్టిల్లు. అక్కడ నేను ప్రపంచ సుఖాలన్నీ అనుభవించాను. ప్రతిరాత్రీ పడుపుకత్తెల ఇండ్లకు వెళ్ళేవాణ్ణి. వాళ్ళతో కలిసి ఆడేవాణ్ణి, పాడేవాణ్ణి, తినేవాణ్ణి, తాగేవాణ్ణి. ఇలా తప్పతాగి, మైకంలో తూగి, తుదకు నాకు నచ్చిన పిల్లను వెంటవేసుకొని ఇంటికి వెళ్ళేవాణ్ణి. ఆవిడతో కేళీవిలాసంగా గడిపేవాణ్ణి. ఇలా విచ్చలవిడి విహరించాను. నేను

చెయ్యని పాపంలేదు. నా చుట్టూ ఆటక త్తెలూ, పాటక త్తెలూ, పైనా-పక్కనా పడుతుండేవాళ్ళు. చివరకు నా కోర్కెలకు అంతులేకుండాపోయింది. నా వ్యామోహాలు పరిమితిలేకుండా పెరిగిపోయినాయి. వెర్రి వ్యామోహంలోపడి కొట్టుక పోసాగాను. ఇల్లాండ్ర పొందు కోరాను. కన్యలను సయితం చెరిచాను. దైవదూషణ చేశాను. 'మెడపురా' నగరంలోకల్లా నన్ను మించిన తాగుబోతూ, తిరుగుబోతూ, లేడన్నారు అంతా. అయినప్పటికీ నేను క్రైస్తవుణ్ణి. ఎన్ని పాపాలు చేస్తున్నా జీసస్‌పైనా, క్రైస్తవమతంపైనా విశ్వాసం వదలిపెట్ట లేదు. ఇలా వ్యర్థపు జీవితం గడిపిన తరువాత కొంతకాలానికి, నా ధనం పూర్తిగా తరిగిపోయింది. దారిద్ర్యం పట్టుకొన్నది. దానికితోడు మరొక సంఘటనకూడా నన్ను మార్చివేసింది. నా స్నేహితు డొకడికి భయంకరమైన వ్యాధి వచ్చింది. అది అతన్ని పీల్చి పిప్పిచేసింది. అతను లేవడానికికూడా అశక్తుడైనాడు. కళ్లు తెరచి చూడలేక పోయాడు. ఆ వ్యాధితోనే అతను మరణించాడు. పశువులాగా బ్రతికిన నాస్నేహితుడు తుదకు దుర్మరణం చెందాడు. అప్పటికే నేను ఆస్తిపాస్తులు పోగొట్టుకొని దరిద్రావస్థ అనుభవిస్తున్నాను. దానికితోడు స్నేహితునిమరణం. అది నాకు జ్ఞానోదయం కలిగించింది. దాంతో జీవితంపై రోతపుట్టింది. నాహృదయం పూర్తిగా మారిపోయింది. ప్రపంచంపై విరక్తి కలిగింది. ఊరు వదిలిపెట్టి ఎడారులకు వెళ్ళిపోయాను. అక్కడ ఇరవై సంవత్సరా లున్నాను. నాకు శాంతి లభించింది. చీకు-చింతా ఏమీలేదు. యతులతోను, తాపసులతోను కలిసి

పనిచేశాను. చాపలు, బుట్టలు అల్లాను. తాళ్ళు పేనాను. రాళ్లు చెక్కాను. వడ్రంగంపని చేశాను. చివరకు రాతకోతలు కూడా నేర్చుకొన్నాను. నిజానికి వ్రాయడమంటే నాకంత ఇష్టం లేదు. అయినా వ్రాయసగానివృత్తిలో ఉన్నాను. ఎంతో హాయిగా, ఆనందంగా రోజులు గడిపాను. రాత్రిళ్ళు నిశ్చింతగా, భగవద్ధ్యానం చేసుకొంటూ నిద్రించేవాణ్ణి. భగవంతుని దయ నాపైవున్నదని నమ్మాను. భయంకరమైన పాపాలమధ్య ఉన్నప్పుడుకూడా నేను విశ్వాసం విడనాడలేదు. ఆశ వదిలిపెట్టలేదు."

జోజిమస్ ఇలా చెప్పగా విని పఫ్నూటియస్ తలఎత్తి ఆకసంవంక చూచాడు.

"ప్రభూ! ఈశ్వరా! ఇతను వ్యభిచరించాడు. దైవదూషణ చేశాడు. ఇంకా ఎన్నెన్నో ఘోరమైనపాపాలు కావించాడు. అయినా ఇతన్ని నీవు దయదలిచావు. మరి నేనూ? నే నెన్నడూ పాపం చెయ్యలేదు. ధర్మం విడనాడలేదు. నీఆజ్ఞను ఉల్లంఘించలేదు. ఇంత పవిత్రంగా జీవించిన నన్ను నీవు కనికరించలేదు. ఇదేనా నీ న్యాయం? ఇదేనా నీ ధర్మం? నీ న్యాయమేమిటో అంతుపట్టకుండా ఉన్నది ప్రభూ! నీతీరు-తెన్నులు ఎంతమాత్రం అవగాహన కాకుండా ఉన్నాయి ప్రభూ!" అని మొర పెట్టుకొన్నాడు.

జోజిమస్ రెండుచేతులూ చాచాడు — "చూడండి స్వామీ! దూరాన-అటట్టూ ఈటట్టూ నల్లగా చీమల్లా బారులు తీర్చి కనుపిస్తున్నారు. వాళ్ళంతా మనవాళ్ళేస్వామీ. అంతో

సీని దర్శించడానికి వెడుతున్నారు చూడండి - లెక్కలేనంత మంది!"- అన్నాడు.

చివరకు వారు ఆంథోనీని కలుసుకొనే ప్రదేశానికి చేరుకొన్నారు. అక్కడ బ్రహ్మాండమైన జనం పోగయిఉన్నది. యతులు, సన్యాసులు అంతా అర్ధచంద్రాకారంగా మూడు వరుసలు తీరి నిలుచున్నారు. మొదటివరుసలో తపోవనాలనుంచి వచ్చిన మరీ వృద్ధులైన మునులు, తాపసులు, చేతులు కట్టుకొని నిలుచున్నారు. వారి తలలు జడలు మెలుచుకొని పోయి ఉన్నాయి. గడ్డాలు భూమికి తాకుతున్నాయి. ఇహ మఠాధి పతులైన ఎఫ్రిమ్, సెరిఫియులన్ క్రింద ఉన్నసన్యాసులు, నైల్ నదీ తీరంలోని తక్కిన తాపసులు యావన్మందీ రెండవ వరుసలో నిలవబడి ఉన్నారు. పోతే వారి వెనకాల మూడవ పంక్తిలో ఎక్కడో-కొండగుహాలలో నివసించే యతీశ్వరులు నిలుచున్నారు. వీరందరి దేహాలూ ఎండకు ఎండి, వానకు తడిసి నల్లగా మొద్దుబారి ఉన్నాయి. కొందరు చిరిగి-పీలిక లయిన గుడ్డలు అడ్డ-దిడ్డంగా కట్టుకొన్నారు, కొందరు తెల్లుగడ్డి, బర్దలు వేసి వస్త్రంగా ధరించారు. ఇంకా అనేకమందికి మొల మీద గుడ్డ లేదు-అందరూ దిగంబరులు! అవుతేనేం? వారి వంటినిండా గొర్రె బొచ్చు పెరిగినట్లు బెత్తెడు మందాన బొచ్చు పెరిగి ఉంది. అదే వారి దేహాలను కాపాడుతోంది. వారందరి చేతుల్లోనూ తాటాకులున్నాయి. వారలా అర్ధ చంద్రాకృతిలో నిలుచుని పచ్చని ఇంద్రధనస్సుల్లా ప్రకాశిస్తున్నారు.

సన్యాసులంతా క్రమశిక్షణతో ఉన్నారు. అంతమంది పోగయిఉన్నా ఎక్కడా అలికిడిలేదు. అంతా నిశ్శబ్దం. అంత

పందిట్లోనూ పఫ్నూటియస్, తన శిష్యులు, తన మతానికి చెందినవారు అయిన సన్యాసులను ఇట్టే గుర్తుపట్టాడు. వెళ్ళి వారిమధ్య నిలుచున్నాడు. కాని తనను వాళ్లు గుర్తించకుండా ఉండేటట్లు తలమీది కుళ్ళాయి ముఖందాకా లాక్కొన్నాడు. ఎవరి ప్రశాంతతకూ ఎట్టిభంగమూ కలిగించకుండా ఒకప్రక్కన ఒదిగి ఉన్నాడు

అంతలో అకస్మాత్తుగా- "అడుగో పుణ్యాత్ముడు! అడుగో మహానుభావుడు. ఏ పాపమూ అంటనివాడు. ఈశ్వరునకు ప్రియమైనవాడు-మనతండ్రి ఆంథోనీ-అడుగో, అడుగో!"- అంటూ అందరూ అరిచారు.

తరువాత అంతటా నిశ్శబ్దం అలముకొన్నది. అందరూ వినయవిధేయతలతో తలలు వాల్చుకొన్నారు.

ఒక బ్రహ్మాండమైన ఇసుక తిన్నె కొట్టకొసనుంచి, దివినుంచి దిగివస్తున్న దివ్యపురుషునిలా ఆంథోనీ దిగి రా సాగాడు. ఆయన ప్రియశిష్యులైన మకరియస్, అమెథాస్‌లు చెరి ఒక ప్రక్కన ఉండి ఆయన్ను నడిపించుకొని వస్తున్నారు. ఆంథోనీ మెల్లగా అడుగులు వేస్తున్నాడు. పొడుగ్గా,నిటారుగా ఉన్నాడు. అంత వృద్ధుడైనా మనిషి ఏమాత్రం వాలిపోలేదు. ఏదో దివ్యశక్తి ఆయనలో మూర్తీభవించి ఉన్నట్టు ద్యోతకమవుతోంది. ఆయన గడ్డం తెల్లగా నెరసిపోయి ఉంది. నున్నటి బట్టతల ఎండపొడలో తళతళ మెరుస్తూ మోజెస్ శిరస్సును పోలిఉంది చూపులు తీక్ష్ణంగా ప్రకాశిస్తున్నాయి. వదనంలో మందహాసం తాండవిస్తోంది. నూరు సంవత్సరాలు

ఎన్నెన్నో మహత్కార్యాలకు వినియోగించిన తన రెండు హస్తాలనూ పైకెత్తి, శిష్యకోటికి ఆశీస్సులు అందించాడు. ఆయన నోటినుండి చివరిసారి ప్రేమపూరితమైన వాక్కులు వెలువడినాయి-

"ప్రభూ! నీ ఆలయాలు ఎంత అద్భుతంగా ఉన్నాయి. నీ భక్తులు ఎంత ఆనందపరవశులై ఉన్నారు!"- ఆయన కంఠ స్వరం ఈ కొసనుంచి ఆ కొసకు-అంతటా కంచు మ్రోగినట్టు మ్రోగింది.

శిష్యులు వెంటరాగా మహాత్ముడు ఆంథోనీ-బారులు తీర్చి ఉన్న యతీశ్వరులు, తాపసులు, మునులు, సన్యాసుల మధ్యనుంచి నడవసాగాడు. ఆయన మహాత్ముడు. పుణ్య పురుషుడు. మహాజ్ఞాని, పండితుడు, ప్రవక్త, స్వర్గ నరకాలుదర్శించి వచ్చిన వాడు. క్రైస్తవ దేవాలయాలన్నీ ఆయన అధీనంలో ఉన్నాయి. ఆయన ఏదంటే అది సత్యమై తీరుతుంది. అటువంటి ఆంథోనీ తన శిష్యకోటిని ఆదరంతో చూస్తాడు. ప్రియంగా పలుకుతాడు.

ఆయన ప్రసన్నవదనుడై పీఠాధిపతులగు ఎఫ్రెమ్, సెరిపియన్‌లతో ఇలా అన్నాడు:

"నాయనలారా! మీరిరువురూ గొప్ప సేనాపతులు. బ్రహ్మాండమైన సేనావాహినులను మీరు నడుపుతున్నారు. మీకు స్వర్గలోకంలో సమస్త సుఖాలు లభిస్తాయి."

తరువాత వృద్ధుడగు ఫిలేమన్‌ను గుర్తుపట్టి ఆయన్ను ఆలింగనం చేసుకొన్నాడు-

"నీవు నా శిష్యులందరిలోకీ అగ్రగణ్యుడవు. నీ ఆత్మ ఎల్లప్పుడూ దివ్య పరిమళాలను ఆఘ్రాణిస్తూ ఉంటుంది"- అన్నాడు.

తరువాత వ్రాధిపతి జోజిమస్‌ను చూచి ఇలా పలికాడు.

"నాయనా! ఎన్నడూ నీవు దైవశక్తిని త్యణీకరించి ఎరుగవు కాబట్టి ఈశ్వరుని శాంతిసుందరంలో నీకు ఉత్తమ స్థానం లభిస్తుంది పాపాలు చేశానని భయపడకు నాయనా. పంకిలంలో నే పంకజం వికసిస్తుంది!"-

ఇలా ఆయన అందరితోనూ మాట్లాడాడు. వృద్ధులగు మునుల నుద్దేశించి- "నాయనలారా! ఈశ్వరుని సింహాసనం చుట్టూ ఎనభైమంది వృద్ధులు, తెల్లని పట్టువస్త్రాలు, తలకు కిరీటాలు ధరించి ఆయనను సేవిస్తున్నారు-" అన్నాడు.

తరువాత యువకులైన యతులను, సన్యాసులను చూచి- "సంతోషంగా ఉండండి బిడ్డలారా! ఈ ప్రపంచంలో ఎవరు భోగాలలో తేలుతున్నారో-వారికి మీ విషాదాన్ని విడిచి పెట్టి మీరు ఆనందంగా ఉండండి!"- అని పలికాడు.

ఇలా ఆయన వరుస వరుస తిరిగి అందరినీ పలకరించాడు. అప్పుడు పఫ్నూటియస్, అంథోనీని చూచి, దగ్గరికి వెళ్ళాడు. ఆయన పాదాలముందు మోకరిల్లాడు. భయంతో గజగజ వణికిపోతూ -

"స్వామీ! స్వామీ! నాకు సహాయపడండిస్వామీ, నేను నాశనమై పోతున్నాను. థాయిస్ అనే అమ్మాయి ఆత్మను భగవంతునకు సమర్పించాను. ధ్వజస్తంభంపై ఉండి కఠోరవ్రతం సలిపాను. సమాధిలోఉండి ధ్యానం చేశాను. నిరం

తరం మట్టిలో తలదూర్చుకొని ఉన్నాను నాయనా ఇంతగా తపించినా ఈశ్వరుడు నాకు దూరమైనాడు. నన్ను ఆశీర్వదించండి స్వామీ! నన్ను కాపాడండి స్వామీ! నా పాపాలు ప్రక్షాళితం చెయ్యండి తండ్రీ! నాకు వెలుగుచూపండి స్వామీ"- అని ఏడుస్తూ మొరపెట్టుకొన్నాడు.

ఆంథోనీ బదులు పలకలేదు... ఆంటినోయస్ మఠానికి చెందిన సన్యాసులవంక తిరిగాడు. ఆయన చూపులకు ఎవరూ తట్టుకోలేరు. ఆయన ఎంతో సేపు, తదేకంగా వెర్రివాడని పిలువబడే పాల్‌వంక చూచాడు. చివరకు తనదగ్గరికి రమ్మని సైగ చేశాడు. జ్ఞానహీనుడు, వెర్రివాడు అయిన పాల్‌ను, మహాత్ముడు ఆంథోని ఇలా పిలిచి మాటాడబోవడం అంతా చూచారు. నిర్ఘాంతపోయారు తరువాత ఆంథోనీ ఇలా అన్నాడు-

"మీలో ఎవ్వరికీ లభించని ఈశ్వర కటాక్షం ఇతనికొక్కడికే లభించింది......నాయనా, పాల్! ఒక్కసారి కన్నెత్తి చూడు. స్వర్గంలో నీకు ఏం కనుపిస్తున్నదో నాకు చెప్పు!"-

వెర్రివాడగు పాల్ తల ఎత్తి ఆకసంవంక చూశాడు. అతని ముఖమండలంలో దివ్యతేజస్సు ప్రకాశించింది ఎప్పుడూ వ్రేలాడుతూ ఉండే అతని నాలుక ముడుచుకొని పోయింది. అతని వెర్రి ఏమై పోయిందీ ఎవరికీ తెలియదు. అతని నోటి నుండి దివ్యవాక్కులు వెలువడినాయి.

"స్వర్గంలో ఒక బంగారు పాన్పు కనిపిస్తున్నది. ఆ పాన్పుచుట్టూ ముగ్గురు దేవకన్యలు కాపలా కాస్తున్నారు. ఒక్కరికి పిట్ట పురుగు రాకుండా వెయ్యి కళ్ళతో చూస్తు

న్నారు. ఆ పాన్పు ఎవరికోసం ఏర్పాటు కావించబడిందో వారే రావాలి. ఇతరు లక్కడ అడుగు పెట్టలేరు.” అని చెప్పాడు.

ఆ పాన్పు తనగుహిమకు చిహ్నంగా ఏర్పాటు కావించ బడినదని పఫ్నూటియస్ తలచాడు. అందుకు భగవంతునికి తన కృతజ్ఞతలు తెలుపుతూ ప్రార్థించడం మొదలుపెట్టాడు. కాని అంతలో ఆంథోనీ ఆయన్ని నిశ్శబ్దంగా ఉండమని సైగ చేశాడు. తిరిగీ పాల్ చెప్పేది వినసాగాడు. పాల్ మహా దానందంలో మునిగిపోయి మళ్ళీ ఇలా చెప్పడం ప్రారంభించాడు: “ఆ ముగ్గురు దేవకన్యలూ నాతో మాట్లాడుతున్నారు. 'ఒక పుణ్యాత్మురాలు భూలోకాన్ని వదిలిపెట్టబోతున్నది. అలె గ్జాండ్రియాలో ఉండే థాయిస్ మరణిస్తున్నది. ఆమెకోసం మేము ఈ పాన్పు సిద్ధం చేశాం. ఆమె సుగుణాలే మేము ముగ్గురమూను-విశ్వాసం, భయం, ప్రేమ”-

తరువాత ఆంథోనీ-“నాయనా! ఇంకా ఏం కనుపిస్తున్నది నీకు?” అని అడిగాడు.

పాల్ శూన్యంలోకి చూచాడు. ఆకాశం మధ్యకూ, ఈకొసనుంచి ఆకొసకూ పరిశీలించాడు. తూర్పు పడమరలు వీక్షించాడు. అకస్మాత్తుగా అతని దృష్టి ఆంటినోయ్ మఠాధి పతి అగు పఫ్నూటియస్‌పై పడింది. అతని ముఖం వివర్ణమయి కుంచించుకొనిపోయింది. పాప భీతి ద్యోతకమయింది. అతని కనుగ్రుడ్లు ఇంతింతలావు అయినాయి. చింతనిప్పుల్లా జ్వలించాయి.

"మూడు భూతాలు మహోల్లాసంతో ఆమనిషిని పట్టుకోడానికి సంసిద్ధమై ఉండడం నాకు కనుపిస్తోంది. ఆమూడు భూతాలలో ఒకటి ధ్వజస్తంభం శిరస్సులా ఉంది. రెండవది స్త్రీరూపం. మూడవది మంత్రాలమారిలా ఉంది. ఈమూడు భూతాలూ తమ తమ పేర్లను, ఎర్రగా కాల్చిన ఇనుపగరిటెలతో వాతలు పెట్టుకొన్నట్లు-తమ దేహాలమీద వ్రాసుకొన్నాయి. మొదటిభూతం తనపేరు నొసట రాసుకొన్నది. రెండవది పొట్టమీద, మూడవది రొమ్ములమీద రాసుకొన్నాయి. ఆపేర్లు ఇవి – గర్వం, మోహం, అనుమానం... ఇహ నాపని అయిపోయింది!"

ఇలా చెప్పి పాల్ మళ్ళీ మామూలుమనిషి అయినాడు. ఎప్పటిలా పిచ్చివాడయినాడు. నాలుక బయటికి వెళ్ళబెట్టి తల వ్రేలాడవేసుకొన్నాడు.

ఆంటినోయ్ మఠానికి చెందిన సన్యాసులంతా ఆంథోనీ ఏం చెపుతాడో అని ఆతృతతో చూడసాగారు. అప్పుడు ఆయన ఇలా అన్నాడు. "భగవంతుడు ధర్మంగా తీర్పు చెప్పాడు. తాను ధర్మమూర్తినని మళ్ళీ ఒకమాటు ఋజువుపరిచాడు. ఆయనను మనం ప్రార్థించుదాం"

ఇలా అని ఆయన వెళ్ళిపోయాడు. వెడుతూ అందరికీ తన ఆశీస్సు లొసగాడు. అప్పటికి ప్రొద్దు వాటవాలింది. ఆయన వెడుతోంటే వెనకాల ఆయననీడ ఒకఅంతులేని తివాచీలా, మానవులమధ్య వదలివెళ్ళిన ఒక దివ్యచిహ్నంలా కనుపించింది.

పఫ్నూటియస్ తలపై ఒక పెద్ద పిడుగుపడినట్లు నిలువునా కూలిపోయాడు. ఇహ ఆయన కేమీ వినిపించలేదు. ఏమీ కనుపించలేదు. ఒకేఒకమాట చెవులలో మారుమ్రోగు తోంది. "థాయిస్ చనిపోతున్నది, థాయిస్ చనిపోతున్నది!" ఈఆలోచన ఆయన కెన్నడూ తట్టలేదు. ఇరవైఏండ్లు ఏక ధాటిగా శవంపై కూచుని తపస్సు సలిపినా, మృత్యువు అనే దాన్నిగురించి ఆయన తలపోయలేదు. థాయిస్ మృత్యువాత పడుతుందని అనుకోలేదు. ఇప్పుడా విషయం మనస్సులోకివచ్చే సరికి మనిషి ఉక్కిరిబిక్కిరి అయిపోయినాడు.

"థాయిస్ చనిపోతున్నది! థాయిస్ చనిపోతున్నది! ఈ మాట ఎంత కొత్తగా ఉంది! ఎంత భయంకరంగా, ఎంత అర్థరహితంగా ఉంది! థాయిస్ పోయిన తరువాత ఇహ ఈ వెచ్చని, పచ్చని సూర్యకాంతి దేనికి? పరిమళభరితము లయిన ఈ పూలు, ఈ చల్లని, మెల్లని సెలయేళ్ళు, ఈ రమణీయమైన సృష్టి, ఇవన్నీ దేనికి? తటాలున లేచి ముందుకు ఉరికాడు. "మళ్ళీ ఆమెను చూస్తానా? ఒక్క మాటు చూస్తానా? అనుకొన్నాడు. కాలికొద్దీ పరుగెత్తడం మొదలుపెట్టాడు. తాను ఎక్కడున్నదీ తనకు తెలియదు. ఎక్కడికి వెడుతున్నదీ తెలియదు. కాని స్వభావసిద్ధమైన జ్ఞానం ఆయన్ను నిర్ణీతస్థలానికి లాక్కొనివెళ్ళింది. నేరుగా నైల్‌నదీ తీరానికి వెళ్ళాడు. నదిలో పడవలు ప్రయాణానికి సిద్ధమై ఉన్నాయి. గభాలున వెళ్ళి ఒక పడవ ఎక్కాడు. ఎక్కడలేని దుఃఖమూ, వెర్రి ఆగ్రహావేశాలూ ముంచుకొచ్చాయి–

"ఓయీ, నీవెంతటిబుద్ధిహీనుడవు! వ్యవధి ఉండగానే వెళ్ళి థాయిస్‌ను చూడగలవా? ఆమెలేని ప్రపంచం ఉన్నదని నీవు నమ్మావా? ఎంత పిచ్చివాడవోయ్!"– అని తనకుతాను బుద్ధి చెప్పుకొన్నాడు– "నేను ఇంతకాలం ఈశ్వరునిగురించి ధ్యానించాను. మోక్షంకోరకు, ఆత్మ సాక్షాత్కారంకోరకు, శాశ్వతమైన జీవితంకొరకు తన్నుకలాడి చచ్చాను. కాని ఇవన్నీ థాయిస్‌కంటె అధికమైనవా? ఆమెను ఒక్కసారి ముద్దాడడంలో నిత్యమైన, సత్యమైన ఆనందం లేదా? ఆమె లేని జీవితం వ్యర్థంకాదా? ఆమెలేని జీవితం ఒక పీడకలకాదా? అయ్యో! నే నెంత బుద్ధిహీనుడనైపోయాను! ఆమెను కళ్ళారా చూచిన తరువాతకూడా వ్యర్థమైన పరలోకాన్ని గురించి పాకులాడాను. అయ్యో! నే నెంత పిరికివాణ్ణి. ఆమె సౌందర్యాన్ని తిలకించిన తరువాతకూడా భగవంతునికి భయపడ్డాను. భగవంతుడు, స్వర్గం! ఏమిటివి? ఆవిడ లేకుండా ఇవన్నీ ఎక్కడున్నాయి. ఆవిడ ప్రసాదించే సుఖాలకంటె రవంత అయినా అధికమైన స్వర్గసుఖాలు ఏమున్నాయి కనుక? అయ్యో! నే నెంత దౌర్భాగ్యుడను! ఎంత మూర్ఖుడను! థాయిస్ అధరామృతంకంటె దివ్యమైన వస్తువుఎక్కడున్నది? దానిని పోగొట్టుకొని వేరే విషయాలకోసం ఎందుకు తపించాను? నాకు ఏంపెద్దమ్మ మునించింది? నా కనులకు ఏపొరలు వచ్చి కమ్మాయి? నే నెందుకు అప్పుడు ఇలా గ్రుడ్డివాడ నయిపోయాను? ఎందుకు చూడలేకపోయాను? ఏపాపాలు, ఏశాపాలు వచ్చి నాకు అడ్డుతగిలాయి? ఒక్క క్షణం చాలు! ఆవిడ పొందు ఎంతప్రియమైనది! ఎంత విలు

గిలు నైనదే! ఛీ, ఛీ! నా అంత దురదృష్టవంతుడు మరొకడు లేడు. ఆవిడ తనకై తాను వచ్చి నాముందు నిలుచున్నది. ఎవరికీ అందని అందచందాలన్నీ నాకు అందించవచ్చింది. మిసమిస లాడే తన సౌందర్యం, తారుణ్యం, లావణ్యం – అన్నీ సమర్పించ సంసిద్ధురాలైంది. మరి నే నేం చేశాను? ఎవరికీ రాని అవకాశం నాకు వస్తే చేజేతులా జారవిడుచుకొన్నాను. ఛీ, ఛీ! నావంటి శుంఠ మరి పుట్టడు! నగ్నంగా ఉన్న ఆవిడ వక్షోజాలలో ఎన్నెన్ని తియ్యని అనుభవాలు, దివ్యమంత్రాలు దాగిఉన్నాయో కదా! వాటిని పొందే భాగ్యం నాకు లేక పోయిందికదా! 'ఆగు, ఆగు!' అంటూ ఒక గొంతుక అప్పుడు నాకు వినిపించింది అది నిలువునా నన్ను మోసం చేసింది! పచ్చిమోసం! అయ్యో! ఎంత అవమానం! ఎంత దారుణం! ఆమధురక్షణాన్ని నేను మరిచిపోలేను. పొంగులెత్తే కాంక్షలను అణచుకొంటూ, ఎప్పటికప్పుడు కోర్కెలను కోసేసుకొంటూ పాపమనీ, పుణ్యమనీ వ్యర్థంగా ఆలోచిస్తూ గడిపాను...అయ్యో! థాయిస్ మరణిస్తున్నది! ప్రభూ! ఈశ్వరా! నీకు తెలియని విషయం లేదే. ముందుగానే ఈవిషయం నాకెందుకు చెప్పలేదు. ఛీ, ఛీ! నీవు మోసగాడివి! నీవు కల్పించిన పాపపుణ్యాలనుచూచి నేను పరిహసిస్తున్నాను. థాయిస్ చనిపోతున్నది. ఇహ ఎన్నటికీ ఆమె నాది కాదు. నాకు దక్కదు, దక్కదు!"

నదిలో పడవ ప్రయాణంచేస్తున్నంతసేపూ ఆయన తల వాల్చుకొని దుఃఖిస్తూనేఉన్నాడు. 'థాయిస్ ఎన్నటికీ నాకు దక్కదు, దక్కదు!' అంటూ పదేపదే వాపోవసాగాడు.

తరువాత ఆమె ఇతరుల అనేకమందిని సుఖపెట్టిందనీ, తనకుమాత్రం ఆసుఖం దక్కలేదనే ఆలోచన ఆయన మనోవీధిలో తళుక్కున మెరిసింది. లోకంలో ఎందరికో ఆమె ప్రేమ వెదజల్లగా తాను ఒక్కడుమాత్రం ఆవిడ అధరామృతంతో పెదవులు తడుపుకోలేదనుకొన్నాడు. వెంటనే ఆయనకు పిచ్చెక్కినట్టయింది. ఎక్కడలేని ద్వేషం, అసూయ, ఆగ్రహం పుట్టుకొచ్చాయి. పుట్టెడుదుఃఖం ముంచుకొచ్చింది. గోళ్ళతో ఎదురొమ్మును చీల్చుకొన్నాడు. ఒళ్ళంతా గిచ్చుకున్నాడు, రక్కుకొన్నాడు, కొరుక్కున్నాడు.- "ఆవిడ ఎవరెవరిని ప్రేమించిందో వారందరినీ ఒక్కమాటుగా నేను చంపిస్తేనా!" అనుకొన్నాడు.

నిషియస్‌ను హత్యచెయ్యాలనుకొన్నాడు. ఎన్నెన్నో భయంకర దృశ్యాలు ఆయన కనులముందు పొడగట్టాయి. ఆవేశంతో, ఆగ్రహంతో అందరినీ చంపుతున్నట్టు ఊహించాడు. కాని అంతలోనే అకస్మాత్తుగా ఆ కోపం చల్లారింది. ఆయన ఎప్పటిలా పిల్లికూనలా అయినాడు, వెక్కి వెక్కి ఏడ్చాడు. ఏదో చల్లని, మెల్లని, గాలితెరలాంటిది వచ్చి ఆయన ఆత్మను సేదతీర్చింది. తన బాల్యస్నేహితుడైన నిషియస్ కనుల ముందు పొడగట్టాడు. పఫ్నూటియస్ రెండుచేతులతో అతని కౌగలించుకొని- "నిషియస్! నేను నిన్ను ప్రేమిస్తున్నాను. ఎందుకంటే నీవు థాయిస్‌ను ప్రేమించావు కనుక. ఏదీ, నాకు చెప్పు. ఆవిడనుగురించి వివరంగా నాకు చెప్పు నిషియస్! ఆవిడ నీతో ఏమన్నది?"- అని అడిగాడు. అయినా ఇంకా ఆయన మనస్సులో భయంకరమైన ఆమాట మెదులుతూనే

ఉంది. వ్రణంలా సెలవేస్తూనే ఉంది-"థాయిస్ మరణిస్తున్నది,
థాయిస్ మరణిస్తున్నది!"-

"ఓ సూర్యభగవానుడా! ఓ చంద్రుడా! ఓ తారకల్లారా! ఓ వృక్షాల్లారా! ఓ వనదేవతలారా! ఓ పక్షులారా! ఓ మృగములారా! తహతహలాడుతున్న ఓ మానవ ఆత్మల్లారా! విన్నారా మీరు? థాయిస్ మరణిస్తున్నది! ఇహ మీరంతా ఎందుకూ పనికిరారు. ఓ, పంచభూతాల్లారా! ఇహ మీరు తప్పుకోండి. గాలి - వెలుగు - పరిమళాలు,- ఇహ మీరంతా ఎందుకూ కొరగారు. సృష్టిలో ఉండే సమస్త జీవరాసుల్లారా! వస్తువుల్లారా! ఇహ మీ అందచందాలు అడుగంటుతాయి. మీ ఆకారాలే మారిపోతాయి. వెళ్ళి ఎక్కడైనా దాక్కోండి. థాయిస్ చనిపోతున్నది! ఆమె ప్రపంచ సౌందర్య దేవత! ఆమె జీవించివుంటేనే మీకీ అంద చందాలన్నీ వచ్చేది. ఆవిడ నీడ సోకి ఇంతకాలం మీరు వెలిగారు. ఇప్పుడామె పోయిన తరువాత మీ ఉనికే లేదు. అలెగ్జాండ్రియాలో జరుగుతున్న విందులో థాయిస్ ప్రక్కన కూచున్న వృద్ధుడు. ఇంకా ఇతర మునులు ఎంత హాయిగా, ఆనందంగా ఉన్నారని! ఎంత అద్భుతంగా కబుర్లాడుకున్నారని! ఇదంతా ఆవిడ చలువ. ఆవిడ సరసన ఉన్నవారికి అన్నీ ఉన్నాయి. థాయిస్ గాలి సోకితే చాలు-వారి జన్మ సార్థకమౌతుంది. వారు సత్యం పలుకుతారు. సౌందర్యాన్ని గురించీ, ప్రేమను గురించి ముచ్చటిస్తారు...అయ్యో! అదంతా ఒక కల. జరిగిపోయింది. ఇప్పుడు థాయిస్ చనిపోతున్నది. ఆవిడ చనిపోతున్నదని తెలిసిన తరువాత, నేను తేలిగ్గా చనిపోగలనని అనిపిస్తున్నది! కాని

ఓ పిచ్చివాడా! నీ చావు చావుకాదు గర్భస్రావం. గర్భంలో పిండం దూసుకపడినట్లుంటుంది నీ చావు. తుక తుక ఉడికే కన్నీళ్ళతోనే నీ చావు. నీవు నిజమైన మృత్యువును రుచిచూడ లేవు. నీవు నిజమైన బ్రతుకును అనుభవిస్తే కదా, నిజమైన చావును అనుభవించ గలిగేది? ఓ వ్యర్థుడా! నీకు అదీ లేదు–ఇదీ లేదు. మృత్యువులో ఆనంద మున్నది. హాయి ఉన్నది. నీకు అదీ ప్రాప్తం లేదు! భగవంతుడనేవా డున్నట్టయితే – ఆయన నన్ను దండించుగాక! నే నా శిక్ష కోరుకుంటున్నాను. నాకదే కావాలి! ఓ, ఈశ్వరుడా! నిన్ను ద్వేషిస్తున్నాను. విన్నావా? నీవంటే నాకు తగని అసహ్యం. నీ శిక్ష ఏమిటో విధించు. ఏమిటో ఆ దండన కానివ్వవయ్యా, కానీ! ఊఁ; ఉపేక్షిస్తే ఊరుకోను. నీ ముఖాన ఉమ్మి వేస్తున్నాను. తెలిసిందా? నేను శాశ్వతమైన నరకంలో ఉండాలి. ఈ నా శాశ్వతమైన పిచ్చికోపం పోవాలంటే నరకమే మందు!"

*        *        *        *

మరుసటిరోజు ప్రొద్దుపొడిచే వేళకు పఫ్నూటియస్ సన్యాసినుల మఠానికి చేరుకొన్నాడు. ఆల్బినా, ఆయనను ఆహ్వానించి తీసుకొని వెళ్ళింది.

"దయచేయండి స్వామీ! మా శాంతి మందిరాలు దర్శించి మమ్మల్ని ధన్యురాండ్రగా చెయ్యండి. తమరు మాకు అప్పగించిన అమ్మాయికి ఆశీస్సులొసగాలని వచ్చిఉంటారు. అవునా స్వామీ? థాయిస్ భగవంతునిలో ఐక్యం కానున్నది. భగవంతు డామెను కరుణించాడు. ఆవిడ కష్టాలు తీరాయి.

కాని ఆవిడ ఇంకా మామధ్య ఉన్నందున, ఆవిడ ప్రవర్తనను గురించి తమతో కొద్దిమాటలు మనవిచెయ్యడం మా విధి. మీరా పిల్లను ఒక కుటీరంలో ఉంచి తలుపులు మూశారు. 'సీలు' కూడా వేసి వెళ్ళారు మీరు వెళ్ళిన తరువాత, నేను ఆమెకు ఆహారంతోపాటు, ఒక మురళికూడా పంపించాను. ఆవిడ ఆటకత్తె, పాటకత్తె కనుక అలా చేశాను. ఆ పిల్ల దిగులు పడకుండా ఉండగలందులకూ, తన ఆటతో పాటతో మానవులను ఆనందింపచేసినట్లే, ఈశ్వర సాన్నిధ్యంలోకూడా ఆనందంగా ఆడుతూ పాడుతూ ఉంటుందని అలాచేశాను. నేను అనుకున్నట్లే జరిగింది. నా ప్రయత్నం వృథాకాలేదు. థాయిస్ రాత్రింబవళ్లు వేణుగానం చేయసాగింది. భగవత్ సంకీర్తనలో మునిగిపోయింది. ఆ గంధర్వ గానం స్వర్గలోకాలను ఊగించింది. దేవకన్యలు వచ్చి ఆలకించారు. 'స్వర్గధామంలోని నందనోద్యానవనాలలో నైటింగేల్ పాట మాకు వినవస్తున్నది. మృతుడవుతున్న జీసస్ రాజహంస పాడేపాట వినిపిస్తున్నది.' అన్నారు దేవకన్యలు. ఆవిధంగా థాయిస్, రెండుమాసాలపాటు కఠోరతపం సలిపింది. తరువాత మీరు తలుపుకు బంకమట్టితో వేసిపోయిన 'సీలు' మానవమాత్రుడెవడూ ముట్టుకోకుండా దానంతట అదే విడిపోయింది! దానివలన మీరు ఆమెకు పెట్టిన కఠినపరీక్ష అంతటితో అయిపోయిందని మేము ఊహించుకోగలిగాం. భగవంతుడామె పాపాలను క్షాళితం కావించాడనీ, ఆమెను క్షమించాడనీ తెలుసుకొన్నాం. ఆరోజులగాయతూ ఆపిల్ల అందరు సన్యాసినులతోపాటు ఉత్తమజీవితాన్ని గడుపుతూవచ్చింది. పనిచేసుకోడం, ప్రార్థ

నలుచేయడం - ఇదీ 'నిత్యకృత్యం - ఆ పిల్ల అందరికీ ఆదర్శ ప్రాయురాలై జీవించింది. వినయ విధేయతలతో ప్రవర్తించింది. మనసా, వాచా, కర్మణా ఏ పాపమూ ఎరుగని పుణ్యవతిగా వెలుగొందింది. సన్యాసినుల మఠానికే ఆపిల్ల ఒక వెలుగు! అప్పుడప్పుడు దిగులుగా, దీనంగా ఉండేది కాని, త్వరలోనే ఆవిషాదచ్ఛాయలు విడి పోయినాయి. ఎప్పుడైతే ఆపిల్ల ఈశ్వరునియందు విశ్వాస ముంచడంలోనేమీ, ఆశతోనూ ప్రేమతోనూ జీవించడం లోనేమీ, పరిపక్వతచెందినదని నాకు నమ్మకం కలిగిందో అప్పుడే ఆఅమ్మాయికి నేను బాధ్యతగల పదవి అప్పచెప్పాను. ఆవిడ సౌందర్యం, ప్రతిభ - నన్ను ఎంతగానో ఆకర్షించాయి. మాఅందరి సమక్షంలోనూ, పూర్వం పుణ్యవతులుగా ఖ్యాతికెక్కిన స్త్రీలపాత్రలు అభినయించమని కోరాను. ఆవిడ, ఈస్తర్, డెబోరా, జుడిత్, లజరస్ సోదరి అగు మేరీ, జీసస్ తల్లి అగు మేరీమాత - ఈపాత్రలన్నీ ఎంతోచక్కగా నటించి చూపింది. ఆవిడ అభినయాన్నిగురించి వర్ణించడం నాకు అలవి కాదు. అది చూచితీరాలి. ఆవిడ ప్రదర్శనాలు ఎంతటి కఠినుల మనస్సునయినా కరిగించివేస్తాయి. మీరుకనుక థాయిస్ అభినయించి చూపిన దృశ్యాలు కళ్ళారా చూచి ఉన్నట్టయితే-కంట తడి పెట్టేవారు. అటువంటి నటనాశక్తి భగ వంతుడా పిల్లకు ప్రసాదించాడంటే నమ్మండి. నేను ఎంతో కాలంబట్టీ, ఈ క్రైస్తవ స్త్రీల మఠాలకు పెద్దగా ఉండి వీటిని అదుపాజ్ఞలలో పెడుతున్నాను. కాని యెన్నడూ ఏ స్త్రీ స్వభా వానికీ విరుద్ధంగా ప్రవర్తించ లేదు. అలా ప్రవర్తించ కూడదని

ఒక నియమం పెట్టుకొన్నానుకూడా. ఏ స్త్రీ ప్రవృత్తి ఎలా ఉంటుందో ఆ ధోరణిలోనే నేను వారికి శిక్షణ ఇచ్చేదాన్ని. చూడండి స్వామీ! ఒక్కొక్క విత్తనం ఒక్కొక్క రకమైన పూవు పూస్తుంది. ఆత్మలన్నీ ఒకే మార్గంలో యెప్పుడూ పరిశుద్ధం కావు. అంతేకాదు; థాయిస్ అంతటి అందకత్తె అయికూడా, యౌవనంలో ఉండీకూడా తన ఆత్మను భగవంతునికి అర్పించింది. యెవరూ చెయ్యని త్యాగం చేసింది. ఇలాంటిది సర్వ సాధారణంగా జరగదు. గడచిన మూడు మాసాలబట్టీ థాయిస్ మంచం పట్టింది. ఒక కే-జ్వరం ఈ జబ్బులోకూడా ఆవిడ సౌందర్యం వరిముల్లువాసి వాడలేదు. ఈ జబ్బులో ఆమె యెప్పుడూ నీలాల వింగని చూస్తూ కూచోవాలని కోరేది. నేనామెను ప్రతిరోజూ ఉదయం వసారాలోనికి తీసుకొని వెళ్ళేదాన్ని. అక్కడొక బావి ఉన్నది. బావి ఒడ్డుననే రావిచెట్టు. ఆ రావిచెట్టునీడలోనే మఠంలోని సన్యాసినులు తమ సమావేశాలు జరుపుకొంటూ ఉంటారు. అదిగో స్వామీ! అక్కడే ఉంది ఆ చెట్టు-కావాలంటే చూడవచ్చు. కాని థాయిస్‌ను దేవుడు పిలుస్తున్నాడు స్వామీ. వ్యవధి లేదు. ఈ రాత్రికే థాయిస్ మనలను వదిలిపోతుంది. లోకానికి జ్ఞానం బోధించి మరీ వెడుతుంది.''

ఆల్బినా చెప్పినదంతా విన్నాడు పఫ్నూటియస్. తరువాత ఆమె వెంటవెళ్ళాడు. వారొక వసారాలోనికి వెళ్ళారు. అక్కడ ఫెళఫెళ ఎండకాస్తున్నది. చూరుకొసన పావురాళ్ళు

తెల్లగా పాలిపోయిఉంది మనిషి. రెండుచేతులూ ఎదురొమ్మున పెట్టుకొని నమస్కరిస్తున్నది. ఆవిడ ప్రక్కన ముసుగులు వేసుకొన్న కొందరు స్త్రీలున్నారు. చనిపోయేవారి ఆత్మశాంతి కోసం పఠించే ప్రార్థనా గీతాలు పఠిస్తున్నారు–

"ఓ, దేవా! నను కపణించరావా!
దేవదేవా! దీనబాంధవా!
కరుణామూర్తీ! కావగరావా!
నాదు అపరాధాలు మన్నించవా!
నాదు పాపాలు త్రుంచెయ్యవా!
ఓ, దేవా! రక్షకుడా! కావరావా!"–
పఫ్నూటియస్ థాయిస్‌దగ్గరికి వెళ్ళి పిలిచాడు–
"థాయిస్!"–

ఆమె కళ్ళెత్తి చూచింది. వెంటనే పాట వినిపిస్తున్న వైపుకు దృష్టి మళ్ళించింది.

అక్కడున్న స్త్రీలను నాలుగడుగులు వెనక్కు ఉండమని ఆల్బినా సైగచేసింది.

"థాయిస్!" మళ్ళీ పిలిచాడు పఫ్నూటియస్.

ఆమె తలఎత్తి చూచింది. పాలిపోయిన ఆమెపెదవుల మధ్యనుంచి మెల్లని శ్వాసవచ్చింది.

మీకు జ్ఞాపకం ఉన్నదా స్వామీ?... ఆరోజే - నా హృదయంలో ప్రేమ అంకురించింది. శాశ్వత జీవితంతాలూకు ప్రేమ"-అన్నది.

ఇలా అని ఊరుకొన్నది. ఆవిడ తల వెనక్కి వాలి పోయింది.

థాయిస్ మృత్యుముఖంలో ఉన్నది. ఆవిడముఖం ప్రేతకళ పడ్డది. మరణయాతన అనుభవిస్తున్నది. అంతటా నిశ్శబ్దం. ఒక పావురాయి శోకస్వరంతో అరిచింది. తరువాత పఫ్నూటియస్ శోకించాడు. ఆయన శోకాలు, క్రైస్తవకన్యలు పాడే ప్రార్థనాగీతాలు ఒకటిఅయి వినిపించాయి.

"నేను కావించిన దుష్కృత్యాలనుంచి నన్ను కాపాడు. నా పాపాలు కడిగివేసి నన్ను పరిశుద్ధుణ్ణి చెయ్యి. నేను నాఅపరాధాలు ఒప్పుకొంటున్నాను. నే చేసిన నేరాలు, ఘోరాలు నాకనులముందు నిరంతరం కనుపిస్తున్నాయి."

హఠాత్తుగా థాయిస్ పక్కమీద లేచి కూర్చున్నది. ఆవిడ నీలికళ్ళు విప్పారాయి. ఆనందంతో మైమరచి తదేకంగా చూస్తూ దూరంగా ఉన్న కొండలవైపు రెండు చేతులూ చాచింది. స్పష్టమైన గంభీరమైన గొంతుతో- "అవిగో, ప్రభాతవేళ పూచిన గులాబీలు-వాటిని అందుకోండి!" అన్నది.

ఆవిడ నేత్రాలు ఉజ్వలితమైనాయి. ముఖం ఎర్రగా పొంగింది. మనిషి తేలుకొన్నది. ఎక్కడలేని సౌందర్యం

ఆవిడ వదనంలో తొణికిసలాడింది. నుదుట చిర
పోశాయి. పఫ్నూటియస్ నేలమీద మోకాళ్ళమీ
న్నాడు. రెండు చేతులతో ఆవిడ నడుమును చుట్టివేశా

-"చచ్చిపోకు థాయిస్!" అని బిగ్గరగా అరచాడు. అదేదో వింత గొంతుక. ఆ గొంతుక అతనే గుర్తించలేక పోయాడు-"థాయిస్! నిన్ను నేను ప్రేమిస్తున్నాను! చచ్చి పోకు; నా మాట విను థాయిస్! నేను నిన్ను మోసంచేశాను. నేను దౌర్భాగ్యుణ్ణి. వట్టి అవివేకిని. భగవంతుడు, స్వర్గలోకం- ఇవన్నీ వట్టివి. ఈ ప్రపంచ జీవితం, మానవుల ప్రేమ, అను రాగం- ఇవే సత్యం-తక్కినవన్నీ శుద్ధ అబద్ధాలు. నేను నిన్ను ప్రేమిస్తున్నాను థాయిస్! చనిపోకు; నీవు చనిపోకూడదు. రా, థాయిస్. నాతో రా. మన మిద్దరం ఎక్కడికో వెళ్ళిపో దామా? ఎంతదూరమైనా సరే నిన్ను నా బుజాలమీద మోసు కొనిపోతాను థాయిస్! రా, ప్రేమించుకొందాం రా! వింటు న్నావా ప్రియురాలా?- ఏదీ, 'నేను బ్రతుకుతాను. నాకు బ్రతకాలని ఉంది' అని ఒక్కమాటచెప్పు. చెప్పు థాయిస్! లే, థాయిస్!"-

ఆయన చెప్పేది థాయిస్ వినిపించుకోలేదు. ఆమె అనంతమైన శూన్యంలోకి తదేకంగా చూస్తున్నది-

"స్వర్గద్వారాలు తెరచుకొన్నాయి. దేవతలు, దేవ కన్యలు, ప్రవక్తలు, పుణ్యాత్ములు - నాకు కనుపిస్తున్నారు...

…, నా పెంపుడుతండ్రి థియోడర్ కూడా, వారి మధ్యన …. ఆయన చేతులలో పూలగుత్తు లున్నాయి. నన్ను చిరునవ్వు నవ్వుతున్నాడు. రమ్మని పిలుస్తున్నాడు… …వ్పుడు దేవకన్యలు నా చెంతకు వస్తున్నారు… అదుగో, …గ్గరికి రానేవచ్చారు…ఎంత అందంగా ఉన్నారు! …… …బ్బ! నాకు భగవంతుడు కనుపిస్తున్నాడు!"–

ఇలా అని థాయిస్, ఆనందంతో నిశ్వసించింది. తరువాత ఆమె తల వెనక్కు దిండుమీద వాలిపోయింది. ఇహ …లనంలేదు. థాయిస్ చనిపోయింది.

పఫ్నూటియస్ ఆక్రోశిస్తూ కడసారి ఆమెను కౌగలించుకొన్నాడు. ఆయన కనులలో కాంతులు పొంగిపోతున్నాయి. …వ్రమైన వాంఛ, కామం – ఎగతట్టి వస్తున్నాయి.

"ఛీ! పాపిష్టివాడా!" అని తిట్టింది ఆల్బినా.

చనిపోయిన ఆ పిల్లపై చేయివేసి మెల్లగా కళ్ళు మూసింది. పఫ్నూటియస్ వెనక్కు తూలాడు. ఆయన కనులు …వ్పులు కక్కుతున్నాయి. కాళ్ళక్రింద నేల తొలుచుకొని …న్నట్లాయనకు అనిపించింది.

…సాయిల్ ప్రభువు – భగవంతుడు ఆశీర్వదించు… …స్వకన్యలు మళ్ళీ ప్రార్థనాగీతాలు

తటాలున వారిపాట ఆగింది. నోళ్ళలో
నోళ్ళలోనే ఉండిపోయాయి. వారు ఆసన్నా
చూచారు. భయవిచలితలయి -

"అమ్మో, దయ్యం! భూతం!" అని బిగ్గరగా అరు
అక్కడనుంచి పరుగెత్తారు.

పఫ్నూటియస్ చాలా అసహ్యంగా, రోతగా తయా
రయినాడు. తనచేత్తో తనముఖాన్నే తడిమి చూచుకొన్నాడు.
తన వికారస్వరూపం, తన భయంకరాకారం ఆయనముం
ప్రత్యక్షమయింది!

—♦ సమాప్తం ♦—





# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA125B112 |
| పుస్తకం పేరు | థాయిస్ |
| తారీఖు | 30/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 311 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | 1to8 |
| తయారు చేసినది | Vedavathi |
| పేజీలు విడదీసినది | Vedavathi |
| స్కాన్ చేసినది | [illegible] |
| పరీక్ష చేసినది | HASEEMA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | GOOD |